

His Highness

Sir Sri Krishna Raja Wadiyar Bahadur,

G. C. S. I. G. B. E.

MAHARAJA OF MYSORE.

శ్రీ

కళువె వీరరాజ ప్రణీత

ఆంధ్ర వచన

# శ్రీమహాభారతము

(17 వ శతాబ్దపు వచనగ్రంథము)

## సభాపర్వము

రాజమహేంద్రవరము గవర్నమెంటు ఆర్ట్సు కాలేజిలో
ఆంగ్లవాఙ్మయ ప్రధానబోధకులగు

ఎన్. కే. వెంకటేశంపంతులుగారిచే

ప్రచురింపబడినది.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము.

వెల రు 2-8-0   వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
292/1 ఎస్ప్లనేడ్, చెన్నపురి.



[మొదటి ముద్రణము
1000 ప్రతులు

# అంకితము

సీ. తొలుత బొబ్బిలిరాజు నలరించి యలరన
వారణాశీవంశ వసువెవండు
సాధుసుబ్రహ్మణ్యస్వామిశేఖరు పూజ్య
పావనచరితుని పౌత్రుఁడెవఁడు



సద్గుణోన్నతుఁ గృష్ణస్వామయ్యకరుదారు
తనయుండుగాఁబుట్టె ధరనెవండు
మాతృభాషలు, దేశమాతఁగొల్చెడివారి
సరసఁ బాయనిదీక్ష నలుపునెవఁడు

గీ. అట్టి, గుణనిధి, ధీనిధి, న్యాయవాది
రామస్వామయ్య, అన్వర్థనామకుండు
నాదుసోదరుఁ డతనికి, నతులొనర్చి,
అంకితముఁ జేతు నీగ్రంథ మమితభక్తి.

ఎస్. కే. వెంకటేశం.



ఎన్. కే. వెంకటేశం పంతులు, ఎం. ఏ., ఎల్. టి.,

ప్రకాశకులు.

# విజ్ఞప్తి

---

ఈ గ్రంథముయొక్క తాళపత్రప్రతి నాగపట్నములోని మా పూర్వీకుల గృహములో 1906 సంవత్సరమున నాకు దొరకినది. సభాపర్వము, భీష్మపర్వము ఈ రెండుపర్వములే నాకు కనిపించినవి. వాటిలో సభాపర్వమును ఇప్పటికి ప్రచురించు వసతిగలిగినది. ముందు భీష్మపర్వముకూడ త్వరలోనే ప్రచురించవలెనని దలచియున్నవాడను. వాఙ్మయాభిమానము, దేశాభిమానము గలిగిన ఆంధ్ర సోదరసోదరీమణులు నా ఉద్యమమునకు తోడ్పడుదురుగాక యని ప్రార్థించుచున్నాడను.

రాజమహేంద్రవరం,
1—7—1928.

ఎస్. కే. వెంకటేశం.

---

# ఉపోద్ఘాతము

---

ఈవచనభారతము క్రీ॥ శ॥ పదునేడవశతాబ్దిని విరచితమైనది. దీనిని రచించిన కవి కళువె వీరరాజు. ఇతండు మైసూరుప్రభువులలో నొక్కండగు చిక్కదేవరాయల కాలమున నుండినవాడు. చిక్కదేవరాయలు మైసూరు సింహాసనమును క్రీ॥ శ॥ ౧౬౭౨ లో నధిష్ఠించి ౧౭౦౪ వ సంవత్సరమువరకు రాజ్యపాలనము చేసెను. కాబట్టి యీ వచన భారతము పదునేడవ శతాబ్దాంతమున రచితమయినదనుట స్పష్టము.

ఆకాలపుం జరిత్ర యిట సంక్షేపముగాం దెలుపవలసియున్నది. విజయనగరరాజ్య మంతరించి అప్పటి కెంతో కాలమయి యుండినది గాదు. విజాపురము విజృంభించు స్థితియందుండలేదు. ఢిల్లీపాదుషాల అధికారము నామమాత్రమయి యుండినది. స్థానిక ప్రభువులు తమ తమ యిష్టానుసారము ప్రభుత్వము నెరపుచుండినారు. మైసూరు ప్రభువులు క్రమక్రమముగా తమ రాజ్యమును విస్తృత మొనర్చుకొని తిరుచినాపల్లి శ్రీరంగములను కూడ చేసకునంతటిసాహసము కలవారై యుండిరి. ఒకవైపున మహారాష్ట్రులకును ఇంకొకవైపున మహమ్మదీయులకును ఎదురొడ్డి నిలుచుచుండిరి. పదునేడవ శతాబ్దాంతమగు నప్పటికి మైసూరు రాజ్యము దక్షిణమున పళని ఆన్నామలలవరకును ఉత్తరమున మిడగేశివరకును తూర్పున కర్ణాటఘురమువరకును పడమట కొడగువరకును వ్యాపించి యుండినది. చిక్కదేవరాయల కాలమున రాజ్యము మిక్కిలి చక్కగా పరిపాలిత మయినది. రాజ్యాంగశాఖలు ఇక్కాలమున పదునెనిమిది యేర్పడ రాజ్యకార్యములు నిరా

ఘాటముగ సాగిపోవుచుండినవి. తపాలావసతులతో సహా మెల్లవసతులును రాజ్యమున నేర్పడి యుండినవి.

ఇట్టి రాజకీయ యుగమున వాఙ్మయాభివృద్ధి యగుట కడుంగడు సహజము. చిక్కదేవరాయలు కర్ణాటకాదికవులను ప్రోత్సాహపరచి వాఙ్మయాభివృద్ధికి తోడ్పడెను. అతడు కర్ణాటక కృతిభర్తలలో నెన్నదగినవాడుగా కానవచ్చుచున్నాడు. అతనికంటె నెక్కుడుగ అతని దండనాథులు కృతికర్తలుగ కృతిభర్తలుగ నున్నట్లు తోచుచున్నది. ఈ వచనభారత కృతికర్తయగు వీరరాజు తండ్రి దళవాయి దొడ్డయమహీపాలుడు చిక్కదేవరాయలమంత్రి. వీరరాజును మంత్రి వర్గములో జేరినవాడే యని యూహింపవలసియున్నది. ఈ వీరరాజు గద్యలో చెప్పుకొనిన రీతిని గీర్వాణాంధ్రకర్ణాటకాదినానాభాషా కావ్యరచనా చతురుడై యుండనోపు. అయిన నితడాయాభాషలలో రచించిన గ్రంథములు మాత్ర మీ తెలుగుభారతమొకటి తప్ప యితరములు తెలియరాలేదు. వీరభూపాలీయమని యితడు కృతినందిన గ్రంథమొకటి మాత్రమున్నది. సుప్రసిద్ధమగు సర్వ భూపాలీయము పోలికను ఇది ఆంధ్రకౌముదికి వ్యాఖ్యగా నొప్పుచున్నది. ఇందాముక్తమాల్యదనుండి మెండుగా నుదాహరణము లుద్ధృతములయి యుండుటం జూడ శ్రీకృష్ణదేవరాయల యాదర్శ మప్పటికి బలవంతముగా నున్నట్లెంచవలసియున్నది. వీరరాజునకంటె వీరరాజు కుమారుడు నంజరాజు మహత్తర ప్రతిభావంతుడై చూపట్టుచున్నాడు. అతడాంధ్రమున హాలాస్య మహాత్మ్యమును వచన భగవద్గీతయును రచించినట్లు కానవచ్చుచున్నది. కర్ణాటకమున రచించిన గ్రంథసముదాయము విస్తారంబై యున్నది. తండ్రి వీరరాజు ఆంధ్రీకరించినట్లే తనయుడు నంజరాజు భారతమును కర్ణాటకమున లిఖించినాడు. రమారమి భారతమంతయును తండ్రి కుమారులు ఆంధ్ర కర్ణాటకముల రచించినట్లు కానవచ్చుచున్నది. ఈ నంజరాజు మంత్రి పదవి

నుండి మైసూరురాజ్యము నాక్రమించుకొని నిజమునకు సర్వాధి కారియై యుండినట్లును తోచుచున్నది.

రెండు మూడు తరములలో నింత మహోత్తమ చరిత్రమును ప్రదర్శించు వీరరాజు వంశవృత్తము నూత్రమేమియు తెలియదు. కృష్ణదేవరాయల వంశవృత్తమువలెనే వీరి వంశవృత్తమును హాలాస్య మహాత్మ్యములో నంజరాజు వ్రాసిన వ్రాతనుబట్టి ముఖ్యమగు మూడుతరముల నట్టుకే స్పష్టపడుచున్నది. ఈవంశము వారిది ఆశ్వ లాయనసూత్రము భారద్వాజగోత్రము. ఇంతవరకు వీరు తమ రచిత గ్రంథములయందలి గద్యలలో వ్రాసికొనిన దానింబట్టి తెలియు చున్నది. ఈ వంశవృత్త మింకను విచారణీయము.

వీరరాజవిరచిత భారతవచనము వ్యాసభారతమునకు సరియైన భాషాంతరీకరణము. ఒక్క విశేషణాంశమైనను వెలివోనీక యీతడు సమగ్రముగా వ్యాసుని యర్థముంగొని తెచ్చినాడు. గద్యవ్రాయుటకు ఆశ్వాసములను విభాగములు చేసినట్లుగా తోచుచున్నదే కాని ఆది పర్వము మొదలు వ్యాసభారతాధ్యాయములు అధ్యాయములుగానే కానవచ్చుచున్నవి. భాషాంతరీకరణమే యని రచన చప్పిడికాలేదు. ఆంధ్రముయొక్క జాతీయశక్తి కొరవడలేదు. గాంభీర్య మవసరమగు చోట రచన గంభీరముగా నడచి వర్ణనాదిక ఘట్టములయందు తత్త ద్విషయమును కండ్లకు గట్టినట్లు గోచరింపజేసినది. సంభాషణ సం బంధమగు ఘట్టములయందా తిక్కన చిన్నవాక్యములు ప్రత్యక్షమయి హృదయమును తన్కరించుచున్నవి. జిగి, బిగి, లాలిత్యము, మాధు ర్యము అన్నియు నీ వచనరచనయందు కానంగ నగును.

---

*



# INTRODUCTION

The manuscripts of the Sabha and the Bhishma Parvas of the Andhra Vachana Bharata of Veeraraja were discovered by me in our ancestral house at Negapatam in April 1906, at the time of our Family Convention. Amongst a heap of old palm leaf manuscripts, which I found there, several had become the property of white ants. These two manuscripts alone were in a fairly good condition. I had the Sabha Parva manuscript copied a few years later, but owing to various circumstances, a speedy publication of the work was not possible. However, I made an attempt to have the book published a few years ago. The attempt became abortive. Only sixteen chapters of the Sabha Parva were published. Thereafter the original palm leaf manuscript was mislaid and lost by a friend of mine and in the copy also a few pages were lost. I made several attempts to recover them but to no purpose. Meanwhile I obtained the kind permission of the Director of Public Instruction to undertake on my own responsibility and at my own expense the publication of this rare literary work in Telugu prose. I also got the Bhishma Parva copied. In August last I republished the first sixteen chapters alone of the Sabha Parva, and the booklet has been approved by the Text Book Committee for the use of libraries. I was persuaded by a few friends to publish the whole of the Sabha Parva and the Bhishma Parva forthwith. I am therefore publishing now the Sabha Parva and I hope to publish, God-willing, the Bhishma Parva also as soon as possible.

Owing to the loss of the original and a portion of the copy of the Sabha Parva manuscript, I have had to insert that portion of the story in the course of this volume. I have marked off the portion so inserted by a dash on page 52 and a dash on page 85. If the original is at any time recovered, that portion will be substituted from the original, but as far as possible, the story has been written in a style as close as possible to that of the author himself; but the beauty and the flow of the author's style must certainly be lacking in that portion.

Owing to the impossibility of comparing the copy with the original, some of the linguistic peculiarities of the work could not be exhibited in entirety in this volume. In publishing the Bhishma Parva, I propose to adopt the exact form of the manuscript, in order to show, to the critical student of the Telugu language and literature, the state of the language when this work was written. However, even as it is, one could find a peculiar rhythm running in the language of this work, which has, I should think, been lost by the omission of the Purna-anusvara in several places, where we now indicate the existence of it by an ardhanusvara in writing, the sound itself having been lost. There are still several Andhras in the south who pronounce the purna-anusvara and their emigration to the south undoubtedly was in the period, when Veeraraja was writing the Mahabharata or before.

The following linguistic peculiarities may be pointed out in this connection:—

(1) The liberal use of the purna-anusvara (ం)

(2) The doubling of the consonant which follows the purna-anusvara If the consonant, however, is an aspirated consonant or if the consonant has a క్రావడి, it is not doubled. There are a few instances where the ordinary consonant also is not doubled. (eg.) గ్రహంబ్బునంగ్గా, కంత్తి; but ఆరంభించ్చు, రాజేంద్ర;

In కంక్క-పత్రంబ్బు the క is doubled; క after ం is sometimes not doubled; The word వాడు appears in three forms, వాండ్డు, sometimes వాండు, rarely వాడు; the words బ్రంహా, సిహ్మ appear as బ్రంహ్మ, సింహ్మ. The form సింహ్వ also appears. So we have the forms జిహ్మ, జింహ్వ for జిహ్వ. There is a whole chapter viz. ch. 100 in the Bhishma Parva where ంబు no ంబ్బు is the rule. The word కూంత్తలు appears in the Bhishma Parva Ms. One could still hear words like వాండు, కూంతలు, అండది among the Andhras in the south cf. అంటది, అటది in the Ms. of Bhishma Parva.

(3) The doubling of an aspirated consonant appears after visarga as in దుఃఖ్ఖ; this word is also written దుఖ్ఖ.

(4) శేయు, శాయు are normally used for చెయు, సేయు.

(5) In the form of address the final consonant has no deergha; except very rarely (eg.) పరంత్తప, రాజేంద్ర are the normal forms.

(6) Invariably ఏత్వం appears short in all consonants, but there are rare examples of ఏ. (eg,) భ్రాతృసమేతుండై

(7) శతృ is the normal form for శత్రు; పౌతృండ్డు for పౌత్రుండ్డు, రుదృని for రుద్రుని.

(8) The letter ఱ does not appear anywhere. Once only in the Bhishma Parva Ms. the word గుఱ్ఱము occurs in ch. 84.

(9) ప్రాగ్జ్యోతిష appears as ప్రాగ్జోతిష and వివత్స్వండు as వివచ్చ్వండు.

These appear to be merely scribal peculiarities.

These linguistic peculiarities go to show that the form of the language was somewhat different when this work was written from what it is to-day.

There are two Gadyas at the end of the Sabha Parva. One of them is written by *Kaluve Veeraraja* and the other by *Tupakula Ananta Bhūpāla*. A few chapters as well as the Gadyas at the end of the Bhishma Parva are lost, but there is one gadya by Kaluve Veeraraja at the end of the Bhagavad Gita Āsvāsa, and a short sentence by Ananta Bhūpāla at the end of chapter 67, in the Bhishma Parva. It is difficult to say what particular portions were written by the one or the other, but that the two worked together at the Mahabharata is certain.

The Gadya of Kaluve Veeraraja at the end of the Sabha Parva as well as at the end of the Bhagavad Gita Āsvāsa in the Bhishma Parva are exactly in the same language.[1] From this we learn that Veeraraja was the son of Dalawai (commander-

---

[1] In the notice of R. 19 on p. 66 in the Triennial Catalogue of Manuscripts of the Government Oriental Manuscripts Library, Madras, Vol. I, Part 3 Telugu, the Bhagavad Gita Manuscript is attributed to Tupākula Ananta Bhūpāla. In the notice of the manuscript in Telugu on p. 68 it is stated that the name of the author is not found in the manuscript itself. I learn from M. R. Ry. Kottapalli Surya Rao Garu of the Telugu Academy, Cocanada, that there are four copies of this Bhagavad Gita in the Academy and that in none of them is the author's name found, but that the author is surmised to be Ananta Bhūpāla. This Bhagavad Gita Vachana was written by Veeraraja and not Ananta Bhūpāla, as is seen from the manuscript in my possession. The dedicatory stanza and the extracts given in the catalogue are exactly the same as in my manuscript, with this difference that the number of each sloka is marked in the copy in the Manuscripts Library. It is not so done in the original manuscript of Veeraraja. The copies of the Bhagavad Gita which are now available must have been made by later people with this addition. It is curious, however, that they failed to copy the Gadya at the end of the āsvāsa. The dedicatory stanzas at the beginning of the Adi Parva, the Sabha Parva, the Bhishma Parva and the Bhagavad Gita Āsvāsa are all addressed to Gopala.

in-chief) [2] Dodda Bhūpāla, that he was a Yādava by birth, that he belonged to Bhāradwāja Gôtra, and Āsvalāyana sūtra (Rig Veda), that his family had great renown for military exploits, and that he was attached to the Karnataka country in the service of Chika Deva Raya, the Karnataka king, who had his capital at Seringapatam. From the history of the Telugu poets by the late Mr. Kandukuri Veeresalingam Pantulu, we find that his son Nanja Raja was also a great scholar and that he was the author of Hālasya Māhātmya in Telugu prose. Literary genius seems to have characterised the Kaluve family and the style of Nanja Raja is similar to that of Veera Raja. Ananta Bhūpāla was the author of Vishnu Purana Vachana and a prose rendering of the Ramayana also. The Telugu Academy has, I understand, the Aranya Kanda etc. of this author. In that period Telugu prose seems to have flourished very well, but we have not got a proper history thereof.

Ananta Bhūpāla has one short Gadya at the end of the Sabha Parva, in which he says that he was the son of Krishna Nripati of Chandragiri and that his mother was Bhāgamāmba. The references made to himself in the Gadya point to his having had some sort of connection with the banks of the Cauvery and the south. („దక్షిణసింహాసన సముద్ధారణా ధురంధర। కావేరకన్యాసదతీర ప్రతిష్ఠాపిత । నిస్తుల దస్తు సమగ్రానేకాగ్రహార సంతోషిత”).

Ananta Bhūpāla gives his house name as Tupakula both in this Gadya and in the short sentence at the end of chapter 67, Bhishma Parva which runs thus:—

„ఇది శ్రీమదుభయభాషాసాహిత్య భోజనకృష్ణనృప తనూజసాంద్రతేజో

---

[2] "This office combined in itself the offices of Prime Minister and Commander-in-chief" (Ancient India by Dr. S. Krishnaswami Ayyangar, P, 287)

వీరాలతుపాకుల అనంతభూపాల ప్రణీతంబైన శ్రీమహాభారత వచనకావ్యమునందలి భీష్మపర్వమునందు అరువైయారో అధ్యాయము "[3]

There is a peculiarity in the manuscript here which requires special notice. This sentence occurs at the end of the second page of palm leaf No. 159 and at the top of leaf 160, and this sentence is followed by 'శుభమస్తు, శ్రీమతేరామానుజాయనమః' In the next chapter the hand-writing changes and the style also changes. A curious mistake also has arisen here. He calls this the 66th chapter, while it is really the 67th chapter, and at the back of leaf 158, where the 66th chapter ends, అరువైయారో seems to have been corrected into అరువదియేడో, while the end of the 65th chapter actually occurs at the back of leaf 156. This mistake makes me think that the 67th chapter was written by Ananta Bhūpāla, while the 68th chapter wrongly marked as the 67th is again in Veeraraja's style. From an examination of the manuscript, I think that the manuscripts, which are in my possession, are the very manuscripts originally written by Veeraraja and Ananta Bhūpāla. It is possible that one of my ancestors was in some way associated with this Ananta Bhūpāla.[4] It fits in with the tradition in my family history that my ancestors were for sometime in an agraharam on the banks of the Cauvery near Kumbakonam and that later on they shifted their family seat to Negapatam.

---

3 Cf. Colophon to Adi Parva, page 353, Triennial Catalogue. 'ఇది శ్రీనందనందన చరణారవింద సేవానుభావభావిత సారస్వతైశ్వర్యధుర్య। చతుర్విధ కవితాసామ్రాజ్యభోజ। చంద్రగిరి కృష్ణభూపాలకతనూజ। సాంద్రతేజోవిలాస తుపాకుల యనంతభూపాలక.........'

4 Ramaraja had for his share the Kannada country with his capital at Srirangapatna; Venkatapati Raya ruled from Chandragiri ......... over the Tonda, Chola and Pandya mandalams." (Ancient India by Dr. S. Krishnaswami Ayyangar P. 273)

I shall just give a few lines from chapter 66 (67) and chapter 67 (68) in the Bhishma Parva for a comparison of the styles of the two writers.

(1) అయ్యెడవిరాటశిఖండులుభీష్ముని ధనంజయుండుబలవంతులునుధనుర్ధరవర్యులునగుకృపాశ్వత్థామవికర్ణాదియోధులను వృకోదరుండుసుయోధనదుష్ప్రహలనుంబ్రాచ్యమాత్స్యదాక్షిణాత్యరధికులు బాంధవామాత్యసమేతుండగు జయద్రధుని సహదేవుండుశకునినిందత్పుత్రుండగునులూకుని నీతనయునిచేనవమానితుండగుయుధిష్ఠిరుండు తక్కునుంగలుగుసైనికులను నకులుండు త్రిగర్తరధికముఖ్యులను నభిమన్యసాత్యకిచేకితానఘటోత్కచదృష్టకేతులను సాళ్వకేకయదేశాధిపతులును నకులాత్మజుండగుశతానీకుండును నీపుత్రులంగొందరిని ధైర్యంబునను మహేంద్రపరాక్రమంబునుంగలిగిసేనాధిపతియగుదృష్టద్యుమ్నుండును ద్రోణాచార్యునిమార్కొని విచిత్రకేతనాన్వితంబులును వివిధరత్నఖచితంబులును వ్యాఘ్రచర్మావృతంబులగురథంబులుమండలాదిచిత్రగతులుమెరయ సింహనాదంబులొనరింపుచు శరాసారంబులచే పూర్వదక్షిణపశ్చిమోత్తరదిగ్భాగంబులను నభోంతరాళంబును భానుమండలంబునుంగనంబడకయంధకారంబుపొదవునట్లు గాగిప్పుచు చంద్రసూర్యాంగారకాదిక్రూరగ్రహంబులకైవడి ఘోరంబులుగా బోరునెడ సాంగధికులకవచకిరీటకటకాంగదాదిభూషణప్రభలను యిందీవరప్రభాభాసమానంబులగు శక్తితోమరనిస్త్రింశాది వివిధాయుధదీప్తులు నొక్కుమ్మడిం గ్రమ్ముకొని యయ్యంధకారంబు విరియింపుచునుండె॥

[అ. 66 (67)]

(2) అప్పుడు శైనేయుండు రణోత్సాహంబు మెరయంగౌరవయోధులందాకొని శరాసనంబు సారింపుచు నర్జునశిక్షితంబులగు దృఢత్వచిత్రత్వకరలాఘవంబులుదనర నాదానసంధాన ప్రయోగోపసంహారంబు లోకులకుం దెలియంబడకయుండునట్లుగా వలాహకంబువర్షించు తెరంగున నాశివిషోపమానంబులగు శాతశిలీముఖంబు లడరించి యాసైన్యంబుల నెల్లం గసిమసంగుటయు సుయోధనుండతనిసంరంభంబు సహింపంజాలక పదివేలమహారధికుల నాసత్యకతనూభవుని పయింబురికొల్పిన వారలమ్మేటిమగనిం గ్రమ్ముకొని బహువిధకాండంబు లొక్కపెల్లునంబరగింపనవ్వీరవర్యుండు దివ్యాస్త్రంబులచే వారలందరిం బీన్గుపెంటలు గావించుటయు గౌరవయశోవివర్ధనుండగు భూరిశ్రవుండు వారలపాటుగనుంగొని కోపోద్దీపితుండై సత్యపరాక్రముండగుసాత్యకి నుద్దవడిందాంకి నిశితవిశిఖంబు లడరింపుచుంద్దోడనెపాండవయోధులంగదిశి ఇంద్రచాపోపమానంబగు చాపంబుసారింపుచు

కరలాఘవంబు మెరయం గ్రూరపన్నగోపమానంబులును వజ్రతుల్యంబులు ను మృత్యుసన్నిభంబులగు వివిధచండవిశిఖంబులు వేలకొలందులు ప్రయోగించుటయు వారలతనికోల్లలకు నిలువంజాలక భయంబున శైనేయుం బరిత్యజించి నలుదిక్కులకుం బరచిరి॥ [అ. 67(68)].

The latter passage, which depends for its rhythm on the doubled consonant much more than the former and, the general run of the style in the latter chapter compared with that of the former chapter makes me think that Veeraraja's style is generally more majestic and rhythmical in its flow than that of Ananta Bhūpāla. There are places in the Sabha Parva where such a distinction is observable between the styles of the two writers, but their collaboration is so perfect that the story is continuous and the break is not easily observable. My general feeling, however, is that the work is primarily Veeraraja's and that Ananta Bhūpāla wrote chapters here and there. The work may, therefore, be called Veeraraja's Bhārata, although Ananta Bhūpāla had a subsidiary hand in it.

Veeraraja was a more erudite scholar than Ananta Bhūpāla. Cf. గీర్వాణాంధ్రకర్ణాటకాది నానాభాషాకావ్యరచనాచతుర in Veeraraja's Gadya with ఉభయభాషాసాహిత్య in Ananta Bhūpāla's Gadya in the Bhishma Parva.

Of the two writers, Veeraraja is more poetic in his language and thought. There is a peculiar balance and rhythm in certain places which reminds me of the style of Macaulay. While his sentences roll on like Clarendon's, Veeraraja sometimes drops from long and involved sentences into a series of short sentences. A very fine example of this may be seen on page 298, where he describes the response of Nature to the highstrung feelings of the Pandavas, when they were subjected to shameful treatment by Duryodhana and his colleagues in the first dice play—

'ఇవ్విధంబున ......... గలంగంబారె'

Sometimes the author compresses wonderfully great many ideas in one sentence even like Carlyle. The best example of this is the sentence on page 258, where he describes the events of a night from sunset to sunrise in one compressed sentence.

ఆపాండుకుమారులును.........ప్రవేశించిరి.

The vocabulary of the author is very extraordinary. In situations where repetitions are bound to cause monotony, Veeraraja by his varied expression and by his artistic distribution of synonymous expressions makes the style attractive and fresh. This is more particularly seen in the descriptions of the battles in the Bhishma Parva than in the Sabha Parva, but a comparison of the fight between Bhima and Jarasandha in chapter 25, between Krishna and Sisupala in chapter 78, and between Indra and Arjuna, in chapter 111, shows the author's mastery of expression. In his profuse use of similes he is like the epic poets Valmiki and Vyāsa, but the similes of Veeraraja have a peculiar freshness of their own as several of them are drawn from the varied life of Man and Nature. For example, Vide

(1) p. 274. పుత్రసహితుండగు...గుండు తేలి బెండుమునింగిన చందంబయ్యె.

(2) వాతపైత్త్యశ్లేష్మంబులు దేహంబు బొదువుకొనడి సాధ్యునిం జుట్టుముట్టె.
(Bh. P. Ch. 78)

(3) ...నతండ్డు వసంత్తకాలంబునంబూచిన యశోకంబు ననుకరింపుచు క్రోధతామ్రాక్షుండై ... ...
[Bh. P. Ch. 97 (98)]

(4) నెత్తుటం జొత్తిల్లి పూచిన మోదుగ తెరంగునం గనుపట్టుచు
[Bh. P. Ch. 104 (105)]

His relation of the stories of the hypocritical swan that preached Dharma without practising it, in chapter 71, and of the birds that spat gold, in chapter 96, is so exquisite, that Veeraraja might claim a place beside Vishnusarma, the author of Hitopadesa or Aesop. He has another wonderful feature of

converting similes into epic metaphors, which are as dignified as the beautiful similes of Milton. Examples of this may be seen on pages 163, 175 and 250. Veeraraja compares an army to a sea in chapter 54, the city of Dwaraka to the phenomena of Nature in chapter 63, and the dice-table to the battle-field in chapter 92. The beautiful sentence uttered by Yudhistira in chapter 105 referring to Karna,

వీని పాదంబులు ... ... ... మన్నించితి'

reminds me of the lines of Lady Macbeth,

Had he not resembled
My father as he slept, I had done 't.'

Such are some of the features of Veeraraja's style, which give him the first rank among the prose writers in Telugu.

He has also some of the best qualities of a poet. His descriptions of the pastoral features of the wonderful life of Sri Krishna in chapters 57 and 58 reminds me of the pastoral atmosphere in Spenser, in Beaumont and Fletcher, and some of the plays of Shakespeare. I give below just one sentence as a perfect example of pastoralism in the style of Veeraraja.

"అంత నా రామకృష్ణులు ... ... ... విహరింపుచుండిరి." (P. 158)

His style is inimitable in his description of the Pandava and the Lokapalaka Sabhas and of the Rajasūya Yāga. Particularly his art may be noted in his description of the presents given to Yudhistira by the various kings, in chapter 87, where the author shows his wide knowledge of the products of India. Similarly also the author goes far beyond Vyasa in his description of the Dig-Vijaya of the Pandavas. The wonderful exploits of Arjuna in the north, described in chapters 28 to 31 are fascinating; to this element of epic fascination is added the beauty of natural description in Veeraraja's relation of the southern expeditions of Sahadeva in chapters 34 and 35. He deviates boldly from Vyāsa and gives a realistic description of the Cauvery and its surroundings and compares this play-

ground of Nature to the grand plains of the Ganges described in the Ramayana. If Valmiki has done wonderful justice to Nature in the description of the Ganges and its surroundings in the north and of the regions from the Godavary to Pampa in the Deccan, Veeraraja has portrayed Nature as she is manifested in the fertile plain of the Cauvery in the south (chapter 34). The description is charming both in point of style and in its realism.

Veeraraja's mastery of epic and puranic literature is shown in his bold deviation from Vyasa in chapters 47 to 68, as well as in his parallel references to the Ramayana in chapters 112, 117 and 118. He builds his wonderful account of the Avataras of Vishnu on the slender basis of Bhishma's referring to the greatness of Sri Krishna, as a retort to the harangue of Sisupala. The description of the avataras in these chapters is like a purana interspersed in the middle of the epic. An atmosphere of piety pervades the whole description. With this beautiful and original description of Sri Krishna and his greatness in this parva, might be compared the exquisite description of Krishna by Bhishma to Duryodhana in chapters 61, 62 and 63, and the touching reference to Bhishma made by Arjuna in Ch. 101 (102) in the Bhishma Parva. In the description of Vāmana Avatara and Narasimha Avatara, we hear a distinct echo of the charming style of Pōtana, the Tennyson of Andhra poetry. Veeraraja, in chapter 112, compares Duryodhana's fear of Arjuna to Maricha's fear of Rama.

'నేని త్రైలింగున ......... తో చకయున్న వాండననిన' (p. 314)

He compares the people's following Yudhisthira, when he was going to the forest, to the similar incident in the Ramayana. Again he compares the occasion which caused Rama's exile to that which caused the exile of the Pandavas in chapter 118 thus:—

పూర్వ్యంబున ......... జనిరొ' (p. 334)

He again compares at the end of chapter 118, the sorrow of the people on both the occasions thus,

'ఆసమయంబున ......... దుఃఖింపుచునుండిరి' (p. 338)

These instances show the strong hold that the great epic of Vālmiki had upon the imagination of Veeraraja. Ananta Bhūpāla the author of Ramayana Vachana could have easily written these portions or influenced Veeraraja in these parallel descriptions.

There are two places in the Sabha Parva where Veeraraja exhibits his partiality for Mysore, the land of his labours.[5] Following Vyasa rather closely, he gives a nice description of the way in which Neela the then king of Māhishmati (Mysore) boldly defied the attack of Sahadeva. He relates in his characteristically charming style the way in which the great God and friend of gods and men, namely Agni, came to be the permanent benefactor of the kingdom and the means by which the ladies of Mysore obtained for themselves special rights and privileges by their heroism (chapter 34). In his description of the avataras, he gives an account of Kārtaveeryārjuna whose heroic acts were associated with Mysore. Not satisfied with this description of Kārtaveeryārjuna in chapter 53, Veeraraja takes a hint from Duryodhana, who, in his great grief at the growing grandeur of the Pandavas, told his father how it would be impossible, by fair means, to conquer the Pandavas as long as there was Arjuna among them, who was as great a hero as Kārtaveeryārjuna himself, and writes a lengthy

---

[5] Dr. S. Krishnaswami Ayyangar refers to the profound influence of the Dalaways in the politics of Mysore and to the short rule of the Dalaways, in his Ancient India (p. 305). He refers to Dodda Raja (Dodda mahipala), his son Kalala Veerajiah (a mistake for Kaluve Veeraraja) and to the all powerful Dalaway brothers, Deva Raja and Nanja Raja, sons of Veeraraja.

episode relating the adventures of Kārtaveeryārjuna in chapters 108 and 109. In the former chapter, Veeraraja, evidently with a feeling of patriotic pride, traces the descent of the ancient kings of Mysore from Chandra, the son of Atri, who was the son of Brahma, the creator of the world, who was born of Narayana, the Prime Cause of the Universe, to use Veeraraja's expression. In chapter 109, he refers to the destruction of the Kshatriyas by Parasu Rama and to the mixture of the Kshatriyas, who escaped his axe, with the Sabaras, the Dravidas, the Kasas and the Kundras, the non-aryan tribes of Southern India. By this mixture, says Veeraraja, the Kshatriyas, who were left undestroyed by Parasu R.ma became Sudras

" అంత నిష్పృథంబునం ........ శూద్రత్వంబు నొందిరి." (p. 308)

These special references to the ancient history of Mysore by Veeraraja afford the most important internal evidence in the Sabha Parva to connect Veeraraja with Mysore. In the Gadya at the end of the Sabha Parva, he refers to his connection with Srirangàpatnam (Seringapatam) and to his distinguished military service under the Karnataka King Chika Deva Rāya. Chika Deva Rāya's rule extended from 1672 to 1704. The collaborator of Veeraraja, Ananta Bhūpāla, speaks of himself as the son of the chieftain of Chandragiri. While Veeraraja refers to his military exploits against certain powerful Maharatta leaders, Ananta Bhūpāla refers to his connection with the regions of the Cauvery. To me, it appears that while they were engaged in writing the Mahabharata in Telugu prose, they were conjointly engaged in a series of expeditions in the south. The description of the regions of the Cauvery and the Tāmraparni, in chapter 34, must have been based upon their observation of Nature in their military marches. The kingdom of Vijianagar practically came to an end with the battle of Tallikota in 1565. The political centre of gravity

shifted to Seringapatam and Chandragiri.[6] The Nāyak kings of Tanjore held their sway from the middle of the sixteenth century to about 1662. The southern expedition of the Mysore chieftains must have taken place somewhere at the end of the 17th and the beginning of the 18th century.[7] The description of the Chôla Desa by Veeraraja (p. 101–102) shows the beautiful condition of the country at the time. Govinda Deekshita the minister of the Tanjore Nāyak kings took great pains to beauty Chola Desa in various ways. This is another piece of evidence to show that the work of Veeraraja must have been written after the close of the rule of the Nayak kings at Tanjore. (Vide my article on Govinda Deekshita in the Journal of the Andhra Historical Research Society Vol. II No. 3 & 4)

In the first padya at the end of the Sabha Parva, Veeraraja states that the work was completed on Mākha Suddha

---

[6] Cf. "When matters quieted down after the battle of Tallikota, the whole empire was nominally under the ruler at Penukonda, but the Viceroys at Madura and Srirangapatna regarded themselves practically as independent." (Ancient India P. 83)

[7] "These Dalaways made a number of conquests and annexations." (Ancient India p. 288); pointed reference is made by the author on page 300 to the exploits mentioned by Veeraraja in his Gadya at the end of the Sabha Parva. "By 1686 Vishnu incarnate as Chika Deva did subdue in Panchavati, Dadoji, Jaitaji and others in the form of Maharattas. ......Ekoji was deserted by all when the mighty Chika Deva Raja having cut off all the limbs and slit the noses of Jaitaji and Jesvata set forth for war."......... "In the west he subdued the Keladi Kings." (p. 299)

Cf. మహారాష్ట్రమదేభ పంచానన, కెళది సంశదావాహన మధురానాథ మర్దన, జయజయఘాటీశిరః కందుకక్రీడన వసంతరాయ నాసాకృంతన, నిమ్మాజీ సమూలోన్మూలన, దాదోజీ దండనప్రతాపశీల విఠలపాలరాయ విదళన in the Gadya of Veeraraja.

Panchami (మాఘశుద్ధపంచమి) of the year Sādhārana (సాధారణ) The year Sādhārana corresponds to 1652, Salivāhana saka, cf. line i.

" వెయ్యిన్నియారునూటయేంబదియు రెంటిమీదటిశకవర్షము పొలమినడచు."

Unfortunately a few letters are missing in this line. The original has, "వెయ్యిన్నియా ...... దియు రెంటిమీదటి" If 1652 is not the date, 1592 or 1712 Salivahana saka must refer to Sādhārana. In that case "వెయిన్నియా ...... ది" cannot be properly understood. So I have put the date as 1652 Salivāhana saka, which comes to the year 1730 A. D. It is quite reasonable to suppose that Veeraraja and Ananta Bhūpāla started writing Andhra Vachana Bharata during the period of their military labours and civil life at the end of the 17th century and completed the Sabha Parva in 1730 A. D. We have no means of knowing when the Adi Parva was finished, since the manuscript in the Oriental Library breaks off in the third āsvāsa (p 350—Triennial Catalogue). The Bhishma Parva manuscript also does not take us to the end.

The style of the work represents the state of Telugu prose at the end of the 17th century and the beginning of the 18th. These two writers of Telugu prose must have designed to write the whole of the Mahabharata and the Ramayana in the middle style of Telugu prose, so as to appeal to the intellect of the common people and to give moral, political, and spiritual lessons to the Andhras of the day, who were distributed far and wide, even up to Cape Comorin in the south. The style used by Veeraraja represents the style of the spoken and written Telugu language of the end of the 17th century, among the western and the southern sections of the Andhras. The service done by Veeraraja and Ananta Bhūpāla to Telugu prose and to the Andhras could be compared to the literary and social

service rendered by Addison and Steele at exactly the same period in England. This unique work, therefore, stands as a literary monument representing Andhra genius as it flourished in the Karnātaka Desa at the end of the 17th and the beginning of the 18th century.

My thanks are due foremost to my wife, herself a Telugu scholar, for her constantly pressing me to publish this rare work. My thanks are also due to Brahmasree Yemmanuru Perayya Sastry Garu of Cuddapah for his rendering me help in various ways in putting the manuscript in print. I also thank M. R. Ry. Jayanti Ramayya Pantulu Garu and M. R. Ry. Tekumalla Rajagopala Rao Garu for their encouraging me to publish this work. My thanks are also due to my colleague Mr. R. Subba Rao Garu and to Brahmasree Bhamīdipati Kameswarasastrulu Garu for the suggestions and help they have given me. I also thank Mr. A. Lakshmanaswami Naidu Garu and his manager Mr. A. Bapiraju Garu for the speedy and neat execution of this work, although unfortunately many errors have crept in, partly owing to the defective condition of the manuscript and partly owing to the speed with which the work had to be gone through. These will be set right in the next edition. I must express my appreciation of the assistance given to me by my student Mr. T. Kodandaramulu B. A., B. Ed. and by my son and student N. V. Venkatasubramaniam. I worship God Srinivasa for His having enabled me to get through the work.

RAJAHMUNDRY
20th June, 1928

N. K. VENKATESAM

[P. S.] My student Mr. M. Lakshminarayana Sarma, B. A, tells me that Padyas 1, 2 and 3 on pages 346 and 347 would better read as follow. The words within the brackets are not in the original manuscript.

# విషయసూచిక

* II జరాసంధోపాఖ్యానంబు (15—26) *



* III దిగ్విజయంబు (27—38) *

* IV రాజసూయంబు (39—46) *



* V శ్రీకృష్ణుని అవతారంబులు (47—68) *

### * VII రాజసూయంబు (79—80) *



### * VIII మొదటిద్యూతంబు (81—107) *

* IX పునర్ద్యూతంబు—పాండవ వనవాసంబు (108—120) *

* చిత్రపటములు *



శ్రీ శ్రీ శ్రీ

శ్రీగురుభ్యోనమః

కళువె వీరరాజ ఆంధ్రవచన

# శ్రీమహాభారతము

## సభాపర్వము

---

### అధ్యాయము 1

కం. శ్రీవనితాస్యదుతిరా
జీవ సుహృన్మృదుల హాసశిశిరజ్యోత్స్నా
భావిత విలోచనోత్పల
సేవకజన గుణవిలోల శ్రీగోపాలా.

అవధరింపుము. భారత కథాశ్రవణ హృదయుండగు జనమేజయుండు వైశంపాయన మునీంద్రుం గనుంగొని, యో మునివరేణ్యా! విజయ శీలుండగు విజయుండు ఖాండవ వనంబునందగ్ని దేవువలన మయునకు భయంబు లేకుండు నటుల వరంబిచ్చి తదనంతరంబున నెయ్యది యాచరించె? సవిస్తరంబుగ నానతిమ్మనిన, వైశంపాయనుం డిట్లను. జనమేజయ మహీవల్లభా! మీ వంశ చరిత్రంబు తెలిపెద; సావధాన చిత్తుండవై వినుము. సర్వాస్త్ర విశారదుండగు నర్జునుం డివ్విధంబున మయునిం గాపాడి కార్ముక శ్రేష్ఠంబగు గాండీవంబును, నక్షయ బాణంబులుగల తూణీరంబులును నితర నరపాల దుర్లభంబులగు దివ్యాస్త్రంబులును, శ్వేతాశ్వయుక్తంబును, ధ్వజ

పతాకాలంకృతంబును నగు దివ్య రథంబును, బావకానుగ్రహంబున బడసి సంతుష్టాంతరంగుం డగుచు నున్న సమయంబున మయుండు తనకుం బాధ్యుం డొనరించిన మేలుదలంపుచు నంజలిగావించి నిలువం బడియుండి వాసుదేవుని చెంతనున్న కిరీటిం గనుం గొని, వీరాగ్రేసరా! ఖాండవ వనం బనలుండు జ్వాలామాలికా భీలుండగుచుం జుట్టినప్పుడు కృష్ణదేవుండు రక్షించ వలదని వారించినను గృపాయత్తచిత్తుండవై నాప్రాణంబులు గాచిన నీకు నేనేమి ప్రత్యుపకారంబు సేయువాడ. ఐనను దానవ విశ్వకర్మనగు నేనితరుల కసాధ్యంబును, విస్మయకరంబును, బ్రియంబును నగు నొక్క సభ నిర్మించి తెచ్చెదనని తలంచినవాడననిన, సవ్యసాచి కొంత తడవు విచారించి మాయావిదుండగు మయుని నాలోకించి మందస్మితాననుం డగుచు నాపన్నున కుపకారంబు చేసి యతని వలనం బ్రత్యుపకారంబు గైకొనమి నావ్రతంబు నీవు సకలంబునొసంగిన వాడవ. మనకు నన్యోన్యంబు సౌహార్దంబు గలిగెడు. నీకు మేలగుంగాక! నిజేచ్ఛం జను మనిన నమ్మయుండు, పురుషశ్రేష్ఠా! నీవు పలికిన యీ వాక్యంబు నీకతగు. నేను దొలుత దానవులకు భోగాస్పదంబులును, రమణీయ దర్శనంబులును, దివ్యంబులునగు ప్రసాదంబులును, విచిత్రంబులగు నుద్యానవనంబులును, ననేక విధంబులగు కమలాకరంబులును, కామ గమనంబులగు విమానంబులును, నానావిధంబులగు నాయుధంబులును, విశాలప్రాకార గోపురంబులుగల పురంబులును, సర్వ లక్షణ సంపన్నంబులగు వాహన ముఖ్యంబులును, విహార యోగ్యంబులగు గుహాగృహంబులును వేల కొలందులుగ నిర్మించిన వాడ. నీకునుం బ్రియంబుగ నొకటి రచియించి యిచ్చెద నని తలంచితిననిన నర్జునుండు నేనుమేలుచేసితినని యూహించి నీవు నాకుం బ్రియంబు సేయం దలంచెదవు గావున నీ వొనరించునది యంగీక

రించుట యనుచితంబు. అయినను నీ తలంపు సఫలంబగుటకు నివ్వాసు దేవుండు కోరిన కార్యంబు నొనర్చితివేని యదియ నాకు నభిమతం బనిన, మయుండు శౌరి నుద్దేశించి, దేవా! మీ కభీష్టం బెయ్యది యని యడిగిన, దేవకీనందనుం డతనితో నీకుం జెప్పందగిన దేదియని యొక్క ముహూర్తంబు విచారించి, త్రైలోక్యంబునం గల వింత లును, సర్వకాలంబులంబుష్ప ఫలాభిరామంబు లగు నారామం బులునుం గలిగి మనుజుల కనుకరింప దుష్కరంబును, నితరులకు విస్మయకరంబును, దివ్యరూపంబునునగు నొక్క సభాభవనంబు ధర్మజు నకు హృద్యంబుగంగావించి తెమ్మనిన నవ్వాక్యంబులకు మయుండు సమ్మోదంబు జెంది దివ్య విమాన సమేతంబుగ నొక సభానికేతనంబు రచియింపం దలంచె. అంతట కృష్ణార్జునులు మయునిందోడ్కొని చని ధర్మజుంగానిపించి తద్వృత్తాంతంబంతయుం దేట పరచిన యుధిష్ఠి రుండు నాతనిం గూర్చుండ నియమించి యథోచితంబుగ సంభా వించినం గైకొని యమ్మయుండు సంతోషించి తొల్లింటి దానవేశ్వ రుల చరిత్రంబులన్నియు విశదంబులుగం దెలుపుచు గొన్ని దినంబు లుండి యొక్క శుభదినంబున నిష్టదేవతా ప్రార్థనంబుచేసి పాయ సాన్నంబుల ననేక భూసురులం బరితృప్తి నొందించి వారలకు బహు విధంబులగు ధనంబు లొసంగి, కృష్ణార్జునుల యభిమతంబున నతండు, పాండవాగ్రజునకు సభా భవనంబు నిర్మింపంబూని నలుదిక్కులం బదివేలు హస్తమ్ముల ప్రమాణంబు గలమహీభాగంబు గొలతం గావించె.

ఇది సభాపర్వంబునం బ్రథమాధ్యాయము.

---

## అధ్యాయము 2

అంతట వైశంపాయనుండు జనమేజయునిం జూచి, కురువంశోత్తమా! జనార్దనుం డింద్రప్రస్థపురంబున సంతుష్టాంతరంగులగుచు పాండునందనులు బహుమాన పురస్సరంబుగ నొసర్చు పూజలం గైకొనుచు గొన్ని దినంబులు సుఖంబున వసియించి వసుదేవునిం గనుం గోను వేడుక ద్వారకా నగరంబునకు నరుగం దలంచి యుధిష్ఠిరార్జునులచేత వీడ్కోలు వడసి యనంతరంబ సర్వలోకవందిత దివ్య శ్రీచరణారవిందుండగు గోవిందుండు తనమేనయత్తయగు కుంతీదేవి పాదంబులకుం బ్రణామం బాచరింప నద్దేవి యతనిం గౌగిలించి శిరంబు మూర్కొని యనిపె. అంత మాధవుండు తన చెలియలైన సుభద్ర సమీపంబునకుం జని ప్రేమాతిశయంబు వలన నానందాశ్రువులు గ్రమ్మకొనం బ్రియంబులగు కొన్ని హితవచనంబులు నెయ్యంబునం బలకరించిన సుభద్ర యన్నియునువిని తలిదండ్రులగు దేవకీ వసుదేవులకును మఱియునుం గలుగు బంధుజనంబులకుం దెలుపం దగిన వచనంబులు మృదుభాషణంబుల నన్నతో విన్నవించి పాదపద్మములకుం బ్రణమిల్లిన నతం డెంతయు సంతసంబు నందుచు వెడలి పాండవ పురోహితుండగు ధౌమ్యుంగనుం గొని యభివాదనం బొనరించి యతని వలన నాశీర్వచనంబులు గైకొని ద్రుపద రాజపుత్రిం జేరంజని యాదరించి సుభద్రం జెప్పి యప్పగించి యర్జునుండునుం దానును ననుజసహితుండగు ధర్మనందనుపాలికింజని వారలేవురుం బరివేష్టింప నప్పరమ పురుషుండు బృందారక బృందపరివేష్టితుండగు పురందరు చందంబున విలసిల్లి యాత్రాకాల యోగ్యంబులగు కృత్యంబులు సేయందలంచి దివ్యంబులగు గంధమాల్యంబుల దేవతలను భూదేవతలను బూజలు గావించి నమస్కరించి యాశీర్వా

దంబు సేయు విప్రోత్తములవలనం గుసుమాక్షతంబులు గైకొని శిరంబునధరియించి యమ్మహీసురులకు మంచి కనకాంబరంబు లొసంగి ప్రదక్షిణంబు గావించి యనుమతి వడసి సకలగుణాన్వితం బగు శుభముహూర్తంబున శంఖచక్రగదా ద్యాయుధ పరివృతంబును సైన్యసుగ్రీవమేఘపుష్ప వలాహక సమేతంబును, గరుడధ్వజాభిరామం బును, రత్నకాంచనశోభితంబును నగు దివ్య స్యందనంబెక్కి వెడలు సమయంబున ధర్మనందనుం డారథంబు నధిరోహించి యరదంబునడు పుదారుకుని వారించి ప్రేమాతిశయంబునందానే సారథ్యంబు సేయుచు, భీముం డతి విశాలంబును, దివ్య మాల్యవిరాజితంబును, సువర్ణమయ కాండంబును నగు పాండుఛత్రంబు వట్టుచు నర్జునుండు సాంద్రచంద్రా తపంబు నల్లసంబులాడు వాలవ్యజనంబు విసరుచు, నకుల సహదేవులు ధవళంబులగు నుభయచామరంబులు వీచుచు బుత్త్విక్పురోహిత సమే తులై వెంబడిం జనుదెంచు నప్పుడు శిష్యపరివేష్టితుండైన గురువు చందంబున నందంబు నొందె, ధౌమ్యుండు వృద్ధజన పరివృతుండగుచు నభిమన్యుని రథంబున నిడికొని యనుసరించె. తదనంతరంబ క్రోశ మాత్రం బరిగి ధర్మజు నతని తమ్ములనుం గౌగిలించుకొని వారి వారిని దగుతెఱంగుల నుపచరించి తనకు మ్రొక్కిన నకులసహదేవు లను గారవించి వారల నంద ఱనింద్ర ప్రస్థపురంబునకు ననిపి, రెండవ యాఖండలుని చందంబున గోవిందుండు ద్వారకా నగరంబునకుం జనియె. అయ్యెడం గౌంతేయులు జనార్దను రథంబు దృష్టి గోచరంబై యున్నంత తడవును గనుంగొనుచును, లోచనంబుల కగోచరంబైన తఱిరాజీవాక్షుని హృదయ కమలంబున నునిచికొని తనివి చనక యతనిం గొనియాడుచు నగరంబుం జేరిరి.

అంత భీమాదులగు ననుజులను, కుమారులను, బౌరజనంబులను దమనివాసంబులకుననిచి ధర్మనందనుండు ద్రుపద రాజనందనయున్న

యంతఃపురంబుం జేరి సుఖంబున నుండె. తదనంతరంబ శ్రీకృష్ణుండు యదుశ్రేష్ఠులగు నుగ్రసేన ప్రముఖులును, మఱియుం దగువారలును నెదురుగ వచ్చి పూజింప ద్వారకా నగరంబుం బ్రవేశించి తలిదండ్రులగు దేవకీ వసుదేవులకును, నుగ్రసేనునకును, బలభద్రునకును నమస్కారంబు గావించి, ప్రద్యుమ్నుండును, సాంబుండును, నిశఠుండును, జారుదేష్ణుండును, ననిరుద్ధుండును, భానుండును, గదుండునను వీరలాదిగాగల కుమారులందఱును వందనంబు లాచరించిన గౌగిలించి వారల గృహంబులకునని చి వృద్ధానుమతంబుం దివ్యంబగు నంతఃపురంబు బ్రవేశించి రుక్మిణీ రమణీసమేతుండై సుఖంబున విహరింపుచుండె.

ఇది సభాపర్వంబున ద్వితీయాధ్యాయము.

---

## అ ధ్యా య ము 3

---

తదనంతరంబున దానవోత్తముండగు మయుండు శౌర్యధుర్యుండగు సవ్యసాచింజూచి కైలాసంబునకు నుత్తరభాగంబునం గల మైనాక పర్వతంబున దైత్యవరులు యజ్ఞంబుసేయుసమయంబున నసురేంద్రుండగు వృషపర్వునకు నొక్కసభ నిర్మింపబూని సమకూర్చిన బహువిధ విచిత్ర రత్నకాంచన మయంబునగు సమస్త వస్తుజాతంబులు బిందు సరోంతరంబునం దాచినాడ. అవి దెచ్చి ధర్మనందనునకుం ద్రైలోక్య విశ్రుతంబును, మనఃప్రియ కరంబును, నగునటుల సభావిశేషంబు నిర్మించుటకు నీచేత ననుమతుండనై పోయివచ్చెద. తొల్లి మాంధాతయను రాజముఖ్యుండు సమరంబున విరోధి వధం బాచరించి యూపాలనియుండ యుంచిన సహస్రభార సమ్మిత లోహంబున

నిర్మింపబడి పరప్రయుక్తంబులగు పర్వతాది భారంబుల సహింపం దగిజాలి సువర్ణబిందు చిత్రయును, సకలశత్రు సంహారిణియునగునొక్క పెనుగద, హుతవహుండు నీకు గాండీవంబు దెచ్చియిచ్చిన విధంబున భీమసేనునకుం దెచ్చియిచ్చెద. మఱియును వరుణ సంబంధమగు దేవదత్తంబను శంఖంబు నీకు నిచ్చెదనని పలికి యతండు పూర్వోత్తర దిశకుంజని యెందేనియు భగీరథుం డనేక సంవత్సరంబులు తపం బాచరించి మందాకిని సందర్శనంబు జెందె, నెందేనియు మహాదేవుండు బహుసహస్ర యాగంబులు గావించి మణికాంచన మయ యూపంబులును, రత్నవిరచితంబులగు చయన వేదికలును, మనోహరంబులగు నటులనిలిపె, నెందేనియు సహస్రలోచనుండు యాగంబు లొనరించి తత్ఫలంబులు జేకొనియె, నెందేనియుం గమలాననుండు నానావిధంబులగు భూతంబుల నుపాసితుండగుచుం దేజరిల్లె, నెందేనియు నరనారాయణులును, జతురాననుండును, యముండును, శంకరుండును, యుగసహస్రంబులు పరమతపం బొనరించిరి, యెందేనియు నారాయణుండు లోకానుగ్రహంబునకుంగా గనకమాలికాలంకృతంబులగు యూపంబులును, జయనవేదికలును వేలకొలందులై సువర్ణదక్షిణలుంగలుగ నపరిమిత యజ్ఞంబు లాచరించె, నట్టిబిందుసరంబుం జేరి యందునిచిన నవరత్నమయంబులగు కాంచన వస్తునిచయంబులు, కింకరులగు రాక్షసవరులు వహించితోడనం జనుదేర, గదా శంఖంబులు గైకొని యింద్రప్రస్థపురంబు ప్రవేశించి వృకోదరునకు గదయును, నర్జునునకు వైరిహృద్భయభీషణంబగు దేవదత్తంబను శంఖంబును, నొసంగి కొన్నిదినంబులు శ్రమంబు దీర వసియించి సభానిర్మాణవైచిత్రిం గొంతతడ వాలోకించి యొక్క శుభ ముహూర్తంబున భూసుర నికరంబులం బరితృప్తులం జేసి మణిమయంబులగు ప్రాకారంబులును, వివిధరత్నఖచిత వేదికలును, మరకతమయంబులగు చంద్ర

శాలాపరంపరలును, జంద్రకాంత శిలామయంబులగు మహీభాగం బును, నిచ్చలపు గరుడపచ్చల నిర్మితంబులగు ద్వారంబులను, ముక్తా కవాటంబులను, లీలాగృహంబులను, ననేక వర్ణవిచిత్ర శయ్యాసనం బులనుల్లసిల్లి, చంద్రాదిత్యుల తేజంబులం దనదీప్తి విశేషంబున నిరసింపంజాలి మేరునగంబు చందంబున మేఘమండలంబు చెన్నున మిన్నందె వివిధ బహుళ రత్న సముదయంబున మనోరమంబగు నట్టుల తననేర్పు మెఱయ విశ్వకర్మచే నిర్మింపబడిన దివ్యంబులగు దాశార్హసుధర్మలం గ్రిందు పరపంజాలి నలుదిక్కులం బదివేల హస్త ముల ప్రమాణంబుగల యట్టి యొక్క దివ్య సభ రచియించి, తన్మధ్య ప్రదేశంబున వైడూర్య మయంబులగు వర్ణంబులును, మరకతమయం బులగు నాళంబులునుం గలిగిన వికసితకనకకమలంబులును, నింద్రనీల ద్యుతుల నల్లంబాడు నల్లకలువలును గాంచనమత్స్యకూర్మంబు లాదిగాగల జలజంతువులును, హంస కారండవ సారసచక్రవాక ప్రము ఖంబులగు జలజ విహంగంబులును, బద్మరాగనిర్మితంబులగు రమ్య సోపానంబులును సమస్తమణిజాలంబులు ప్రతిఫలించుచుండజేసి యిది యును రత్నఖచిత భూభాగంబనియెడు సందేహంబునకు నాస్పదం బును, నగాధంబును, నత్యంత నిర్మలోదకంబును, నగునొక్క కమలా కరంబు నిర్మించి యాసభా సదనంబునకుం జుట్టును శుకబకశారికాది నానావిధ పక్షి బృందంబుల కలకలస్వనంబులు వీనులు విందుగావింప విలసిత శీతల మంజుల నానావిధ సురభిళ కుసుమ వాసనా సమేతం బులును, సకలజన పరిశ్రమ హారంబులునగు మందానిలంబుల నభిరా మంబులగు నారామంబులును నెడనెడ నయనానంద కరంబులగు పద్మాకరంబులునుం గావించి, మహాకాయులును, సత్వసంపన్నులును, వికృతాకారులును, వివిధాయుధ హస్తులును, నంతరిక్ష సంచారులు నగు కింకరులనియెడు నెనిమిదివేల రాక్షసుల నాసభను రక్షింపను

వహింపను నియోగించె. ఇవ్విధంబున నతండు కృష్ణార్జునులకు హృద్యం బగునటులు పదునాలుగు నెలల ననుపమానంబుగ రచియించిన యా సభాభవనంబుం బాండవాగ్రజునకు నొసంగె.

ఇది సభాపర్వంబునందు తృతీయాధ్యాయము.

---

## అధ్యాయము 4

---

అంత ధర్మనందనుం డొక శుభ దినంబున నానా దేశంబుల నుండి వచ్చిన పదివేల బ్రాహ్మణోత్తములకు నపరిమితంబులయిన పరమాన్నంబులును, నానావిధంబులగు భక్ష్యంబులును, బహువిధంబు లగు రసాయనంబులును, మాధుర్య ధుర్యంబులగు పానీయంబులు మనోహరంబులగు ఫల విశేషంబులును సంతృప్తులంగావించి రత్న భూషణ గంధ మాల్యాంబరంబులును వేర్వేఱ గోసహస్రంబుల నొసంగి వారల స్వస్తివాచన ఘోషంబులును భేరీ మృదంగాది తూర్య నాదం బులును దిశలం బిక్కటిల్లుచు నింగి ముట్ట సభా భవనాది దేవతల దిగ్బంధంబులను ధూప దీపనైవేద్యోపచారంబులను, బూజలొనర్చి సుముహూర్తంబున నాదివ్య సభం బ్రవేశించి పేరోలగంబుండి కూర్చున్న సమయంబునం బేరుగల యట్టి బిరుదు జెట్టులును సూత మాగధ నర్తక గాయక జనంబులును నానావిధంబులగు వేణువీణా వాద్యంబులు వాయించి మెప్పింప నేర్పుగలవారును దమతమ విద్యా విశేషంబునం బ్రొద్దుపుచ్చుచు నైదు రెండుదినంబులు నిచ్చలిచ్చలుం గెలువ వారలకు నభిమతంబులగు ధనంబు లొసంగుచు నుండె. ఇట్లా సభాంతరంబున ధర్మతనయుండనుజసహితుండయి సుధర్మ

యను సభామంటపంబున నమరవరులు గొలువం గొలువై యుండు నాఖండలు చందంబున విలసిల్లె.

ఆసమయంబున జితేంద్రియులును బరిశుద్ధాంతః కరణులును బహువిధంబులగు తపోధర్మంబు లాచరించువారును వేదంబులు వేదాంగంబులు నివియనియు నధికరించినట్టివారలును నగు అసితుండును, దేవలుండును, సత్యుండును, సుమాలియను మహామునియును, నంగిరుండును, సర్వావసుండును, సుమిత్రుండును, మైత్రేయుండును, శునకుండును, బలియను మునిశ్రేష్ఠుండును, నాత్రేయుండును, గణ్వుండును, జరకుండును, మౌద్గల్యుండును, హస్తియను మునిపుంగవుండును, గార్గ్యపుండును, దాల్భ్యుండును, స్థూలశిరుండును, కృష్ణద్వైపాయనుండును, శుకుండును, సుమంతుండును, జైమినియును, పైలుండును, వైశంపాయనుండును, తిత్తిరియను మానివర్యుండును, రోమహర్షణుండును, నఘ్నిహోముండును, ధౌమ్యుండును, నత్రియు, మాండవ్యుండును, విశ్వామిత్రుండును, దామోష్ణీషుండును, త్రివణుండును, బర్ణాదుండును, ఘటజానుకుండును, మౌంజాయనుండును, వాయుభక్షణుండును, బరాశరుండును, హారీతుండును, శీలవంతుండును, నతుండును, పారిజాతకుండును, బర్వతుండును, మార్కండేయుండును, మహాభాగుండును, సావర్ణియు, వాలుకియు, గాలవుండును, జంఘాబంధుండును, రైభ్యుండును, వేదశ్రవుండును, భృగువును, బరిబభ్రుండును, కౌండిన్యుండును, బభ్రుమాలియు, సనాతనుండును, కక్షీవంతుండును, నౌశిజుండును, నాచికేతుండును, గౌతముండును, వరాహుండును, శౌనకుండును, శాండిల్యుండును, కుక్కుయుండును, వేణుజంఘుండును, కలాపుండును, కఠుండును, శార్ఙ్గరవుండును, రైలకుంభుండును, బర్ణవల్కుండును నగు వీరలాదిగాగల మునిశ్రేష్ఠులు యుధిష్ఠిరు నాశీర్వదించి నానావిధంబులగు కథా వృత్తాంతంబులం

దెలుపుచున్న యెడను, మహాత్ముండగు ముంజకేతుండును, వివర్ధనుండును, సంగ్రామజిత్తుండను రాజశ్రేష్ఠుండును, దుర్ముఖుండను నృపముఖ్యుండును, నుగ్రసేనుండును, క్షేముండును, వసుధాముండును, మిథిలాధిపతియగు కృతక్షణుండును, కక్షసేనుండను క్షితిపతియును, కాంభోజపతియగు కమటుండును, వజ్రపాణియగు సురేశ్వరుండు కాలకేయుల నుక్కణంచు వితంబున సమరంబున యవనుల గుండెలు తల్లడింపజేయు మహాబలుండగు కంపనుండను రాజును, మద్రదేశాధీశ్వరుండగు శల్యుండును, కిరాతరాజులగు మణిమంతుండును, సుమనుండును, గుణియను వాడును, వంగవంగాధిపతులును, పౌండ్రకేశ్వరుండును, పాండ్యుండును, కేరళపతియును, యవననాథుండును, పాంచాలుండగు ద్రుపదుండును, విరాటుండును, ద్రుముండును, బృహచ్ఛ్రవుండును, సుశర్మయుం జేకితానుండును, ముఖ్యసేనుండును, సువర్మయు, ననిరుద్ధుండును, శ్రుతాయువు, వసురథుండును, సముద్రప్రాంతేశ్వరుండగు దుర్ధరుండును, క్షేమజిత్తను నరపాలుండును, సుదక్షిణుండును, శిశుపాలుండును, దశగ్రీవుండును, నరపాలుండును గరూశదేశాధీశుండును, దేవతలకు సమానరూపులును వృష్ణికుమారులు నగుపృథకుండును, గదుండును, సారణుండును, నక్రూరుండును, కృతవర్మయు, సాత్యకియు, భీష్మకుండును, అంకృతుండును, ద్యుమత్సేనుండును, కేకయులును, యజ్ఞసేనుండును, సోమకుండును, ననువీరలాదిగాగల క్షత్రియశ్రేష్ఠులును నానాదిగంతరంబులవలనం దగురీతులవచ్చి యుధిష్ఠిరుం బొడగాంచి సముచితాసనంబులం గూర్చుండిరి. అంత నట్టిదివ్యసభామధ్యమంబున రుక్మిణీ కుమారుండగు ప్రద్యుమ్నుండును, సత్యాకుమారుండగు యుయుధానుండును, భోజరాజగు చాణూరుండును, భోజుండును, దేవరథియును, శతాయువును, గాళింగుండును, నశ్వసేనుండును, మాగధుండును మొదలుగా మఱియునుం గల యనేక రాజ

పుత్రులును, ధనంజయు సమీపంబున ధనుర్వేదపారాయణులగుచుం గృష్ణాజినోత్తరీయంబులు మెఱయ ధనుర్వేదంబు నభ్యసింపుచుండిరి. అట్టి సవ్యసాచికిం బరమ మిత్రుండగుటం జేసి తుంబురుండను గంధర్వుండు సప్తవింశతి గంధర్వసమేతుండగుచు నతని సంతతంబు నెడబాయకుండె. చిత్రసేనుండును గంధర్వాప్సరోగణంబులతోడ నమాత్యులుం దానును నతని సమీపంబున నుండె. మఱియును గీత వాదిత్ర విద్యావిశారదులును బ్రమాణలయవివేక ప్రవీణులును, శయ్యాతాళ విధానజ్ఞులును, నగు కిన్నర గంధర్వు లనేకులుతుంబురు ననుసరించి దివ్యగానంబుల దివ్యగాథాప్రసంగంబులు నెఱపుచు, సకల మునిజన పరివృతుండగు పాండవాగ్రజుని నెమ్మనంబునకు సంతోషంబుం జేయుచుండిరి. ఇవ్విధంబున సకలరాజలోకంబునుం గొలువ నున్న నయ్యుధిష్ఠిరుండు నిఖిలదేవగణ సమేతుండగు మహేంద్రుని చందంబునం దేజరిల్లుచుండె.

ఇది సభాపర్వంబునందు నాల్గవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 5

---

అట్టి సమయంబున వేదవేదాంగ పారంగుండును, దేవగణ పూజితుండును నిఖిల పురాణ కథా ప్రవీణుండును, సకల సత్కర్మ కల్పవిశేషజ్ఞుండును, న్యాయశాస్త్రనిపుణుండును, ధర్మతత్వజ్ఞుండును, యోగశాస్త్ర విశారదుండును, నద్వైత విద్యావిచక్షణుండునుం బ్రపంచ పరిజ్ఞాన శీలుండును బూర్వకల్పవృత్తాంత పరిజ్ఞాతయగుచు నదియంతయునుం దెలుప సమర్థుండును, గల్ప సూత్రార్థంబులు వివ రించు చతురుండును, సభారంజనంబు సేయునెడ నతిప్రౌఢుండును,




మయనిర్మితంబైన పాండవసభకు నారదుం డేతెంచుట.

జతురవచోనిధియును, ప్రతిభాసమన్వితుండును, బ్రహ్మజ్ఞుండును, జీవాత్మ పరమాత్మల భేదంబెఱింగిన మహానుభావుండును, ప్రత్యక్షాది ప్రమాణంబులయందు నభిజ్ఞుండును, సూక్ష్మము, సంఖ్యయు, క్రమంబును, నిర్ణయంబును, ప్రయోజనంబునునను బంచావయవంబులతోడ యుక్తంబులగు వాక్యంబుల గుణదోషంబు లెఱుంగ సమర్థుండును, నతిచతుర వాగ్వైచిత్రివలన బృహస్పతిం గడవం జాలుబుద్ధి సంపన్నుండును, ధర్మార్థ కామ మోక్షంబుల యెడం గృతనిశ్చయుండును, త్రిలోకంబులం గల రహస్యంబులు ప్రత్యక్షంబుగం దెలియు విజ్ఞాననిధియును, సాంఖ్య యోగవిభేద పరిజ్ఞాతయు, సంధియును, విగ్రహంబును, యానంబును, నాసనంబును, ద్వైధీభావంబును, సమాశ్రయంబును ననుషడ్గుణంబులను వాని ప్రయోగ సమయంబులను దెలిసిన వివేకశాలియు, సర్వశాస్త్రకుశలుండును, నృత్తగీత విశేషంబు లెఱుంగు రసికుండును, దేజోధురంధరుండును, సద్వ్రతీయుండును మఱియునుం గల సకల గుణంబులం బరిపూర్ణుండును నగు నారదమహామునీంద్రుండు, పారిజాత, రైవత, సుముఖ, ధౌమ్యప్రముఖులైన మునిజనంబులతోడ సకల లోకంబులు సంచరింపుచు మహనీయ సభా మధ్యంబున విలసిల్లుచున్న పాండవేయులం జూడవలయునను సంతోషంబున మనోవేగంబునం జనుదేర నామహామునిం గనుంగొని వినయ భూషితుండును సఖిల ధర్మవిధిజ్ఞుండును నగు పాండవాగ్రజుం డఖిల పరిజన సమేతంబుగ నతనికిం బ్రత్యుత్థానంబు గావించి యెదుర్కొని దండప్రణామంబు లాచరించిన, దేవర్షి ముఖ్యుండును విజయాశీర్వాద వచనంబుల నభినందించు నంత నజాతశత్రుం డమ్మునిశ్రేష్ఠుని దర్భసహితంబగు సౌవర్ణ మహోన్నతాసనంబున నునిచి యర్ఘ్యపాద్యంబు లొసంగి యనర్ఘ్యంబులగు రత్నంబుల సముచిత ప్రకారంబులగు పూజల సంతుష్టునిం గావించిన సకల

వేదవిశారదుండగు నన్నారదమునీంద్రుండు ముదితహృదయుం డగుచుం గౌంతేయాగ్రజునిం గనుంగొని ధర్మకామార్థ సహితంబుగ నిట్లను. ధర్మనందనా! అపరిమితంబులగు ధనంబు లార్జించుటవలన మనోరథంబు సఫలంబు గావింపుచు వివిధభోగంబులందనిసియుం జిత్తంబు ధర్మంబునందె నిలుపుచుం బ్రవర్తిల్లెదవే? నిఖిల భూజనంబుల యెడ మీ కులవృద్ధులగు మహీపతులు నడచిన తెఱంగున నర్థధర్మంబుల కనుగుణంబుగ నడచుచున్నవాడవే? ధర్మంబువలన నర్థంబును నర్థంబువలన ధర్మంబును గామంబువలన ధర్మార్థంబులును బాధితంబులు గానీక నడపుచు నాయాకాలంబు లెఱింగి వాని నార్జించెదవె?

షడ్గుణ సంపన్నుండవగుచు సామంబును, దానంబును, భేదంబును, దండంబును, మంత్రంబును, ఔషధంబును, ఇంద్రజాలంబునను నీసప్తోపాయంబులను, స్వశక్తి పరశక్తులను దెలిసి మెలంగుదువుగదా? దుష్టనిగ్రహంబును, శిష్టపరిపాలనంబును, దూతనంపుటయు, గూఢచారులం బనుపుటయు, బలరంజనంబును, రాష్ట్రరంజనంబును, ధర్మపరిపాలనంబును, నర్థార్జనంబును, నిజసైన్యంబునకు జీతం బొసంగుటయు, నిత్యకర్మాచరణంబును నను నీపది కార్యంబుల నాదరింతువే? ఎదిరిందన్ను నెఱింగి యాయా తెరంగునం గార్యంబు నడపుచు గృషియును, వాణిజ్యంబును, దుర్గంబులను నిర్మించుటయు, సేతువులం గట్టుటయును, నేనుంగు కొట్టంబులు సవరించుటయును, నవరత్నఖనులను శోధించుటయు, నానానృపాలురవలనం గప్పంబులు గొనుటయును, బీడుబైళ్ళ నూళ్ళుగల్పించుటయునను నీ యష్టవర్గంబును బరామర్శించెదవె? పురోహితుండును, దౌవారికుండును, నంతఃపుర ద్వారపాలకుండును, జనార్థనంబుల యెడ నియుక్తులగు నధికారపురుషులును, సకల కార్య నియామకులును, ధర్మాధికారులునను నియా

ర్వారు మంత్రులును, లోభరహితులు, నవ్యసనులును, గుళీనులును, స్వామికార్య పరులునై సంచరింపుదురు గదా?

నీవు మంత్రి సహితుండవై కావించు నాలోచనంబులు పరుల కెఱుంగం బడనియట్లు గుప్తంబులై యుండునె? సంధివిగ్రహంబులు సమయంబులెఱింగి నడపింపుచున్న వాడవె? మధ్యమ పురుషుండగు వాని మధ్యస్థంబగు కార్యంబు నంద వినియోగింపుదువె? బుద్ధి మార్గంబున నీకు సమానులును, ధనంబులయందు బరిశుద్ధులును, గార్యంబులయందు నప్రమత్తులను, సుహాకుల సంభవులును, నీయెడ ననురాగంబు గలవారును నగుమంత్రుల సంతరించి వారల సన్మానంబునం బరిపాలింపుదువె? బహుజనంబులనుం గూర్పక, యొక్క రుండవై యుండక తగిన వారలంగూర్చి పరపక్షంబువార లెఱుంగకుండం గార్యాలోచనంబు సేయుదె? శాస్త్రజ్ఞులును, మంత్రకళా ప్రవీణులునునగు మంత్రులతోడం గావించిన మంతనంబునకును విజయంబులకును నెల్లమూలం బనందగు ప్రభాత కాలంబునకుం దొలుత నిదురమేల్కాని నానావిధంబులగు కృత్యంబులకు తగు నుపాయంబులు చింతింతువుగదా? సులభంబగు ప్రయత్నంబున బహుఫలంబులు ప్రాప్తించునట్లుగా నేర్పునం గార్యంబులు సంఘటింపుదువె? స్వల్పంబులగు పనుల మెలంగు జనంబుల నలక్ష్యంబుచేసి సంభాషింపక వారల మిగుల సర్వారీతి మధ్యమ ప్రకారంబున నడపుచున్నవాడవె?

క్రియం గనుంగొనినం పిమ్మటం దెలియుటయేకాని నీతలంచిన తలంపు తొలుత నెవ్వరికి నెఱుంగం బడకుండునె? సకల విద్యా సంపన్నులగు శిక్షకులును, నీకుంబరమ మిత్రులగు యోధవరులును నాయా విద్యా విషయంబుల నిపుణులగు నట్లశిక్షింపుచున్న వారే? అప్రయోజకులగు పదివేవు రేటికి? సకలాంశంబుల సమర్థుండగునితం డొక్కండె చాలుననందగు వాడును, శూరుండును, బుద్ధిసంపన్నుం

డును, సుప్రశాంతుండును, మహీపాలునకు నతని కుమారులకును, మేలొనంగూర్పం జాలువాడును, దేవ్వరంబులగు పనులందీర్ప నేర్పరి యును నగు నమాత్యముఖ్యుని నేలెదవు గదా? బలదుర్గంబులును, గిరిదుర్గంబులును, మొదలుగాఁగల దుర్గస్థానంబుల ధన ధాన్య ముఖ్య వస్తువులను నాయుధ ప్రముఖంబులగు యుద్ధసాధనంబులను బరి పూర్ణంబులు గావించి యందుండగిన వీరభటుల నుండనియమించి పరామర్శించెదవుగదా? పరరాజపురంబునం గలిగిన మంత్రియును, పురోహితుండును, యువరాజును, దౌవారికుండును, నంతఃపుర ద్వార పాలకుండగు కంచుకియును, గారా గృహాధ్యక్షుండును, ధనాధి కారియును, గార్య నియామకుండును, ధర్మాధికారియు, సేనాధిపతి యును, పురాధ్యక్షుండును, శిల్పకనియామకుండును, గ్రామాంతికుం డును, సభ్య ధర్మాధ్యక్షుండును, దండపాలకుండును, దుర్గపాలకుం డును, రాష్ట్రపాలకుండునను నష్టాదశ స్థానంబులంగల ప్రముఖ జనం బుల సమీపంబులకును నన్యోన్యంబు నొకరి నొకరెఱుంగకుండ మువ్వురుమువ్వురు చారులం బనిచి వారి వారి హృదయాభిప్రాయం బులు పరామర్శించెదవు గదా? విరోధి రాజుల ప్రయత్నంబులం బరా మర్శింపుచు నీవు సేయు కార్యంబులు వారల కెఱుంగ గాకుండ మెలంగె దవు గదా? వినయ సంపన్నుండును సత్కుల ప్రభవుండును వేద శాస్త్ర పారంగుడును నిర్మత్సరుండును ధర్మాధర్మ విదుండును నగు నీపురోహితునిం బ్రతిదినంబును సన్మానించెదవె? త్రేతాగ్ని రక్షణ నియుక్తుండును నగ్నిహోత్రాదిక్రియా విధిజ్ఞుండును బుద్ధిసంపన్నుం డును, లలిత హృదయుండును నగు నీఋత్విజుండును హోమంబు గావించుటయు నాచరింపందగిన తెఱంగును నాయా సమయంబుల నీ కెఱింగించుం గదా? శిక్షాకల్పంబులు మొదలయిన వేదాంగంబుల నీకెఱింగిన జ్యోతిశ్శాస్త్ర విధిజ్ఞుండు రాగల శుభాశుభంబుల నిమి

త్తంబులు దెలిసి నానాంట దెలుపుచుండునే? ఉత్తమ మధ్యమాధమ
ములగు సేవకజనమ్ముల తారతమ్యంబెఱింగి వారివారి నుచితంబులగు
కార్యంబులయెడల నియోగింతువుగదా? కపటోపాయమ్ములకు లోను
గాక పరిశుద్ధ హృదయులగుచుం గులక్రమాగతులును మహాకార్య
నియుక్తులును నగు నీ మంత్రులుగ్రదండంబునం బ్రజలనొంచక
రాజ్యంబు బరామర్శింతురే? కాంతలు బలాత్కారంబునం గలయ
గమకించు కాముకుని నిరసించు తెఱంగునం బెద్దలగువారు పతితుని
నిందించునట్లు వడి ఋత్విజులు నిన్ను నవమానింపక పూజ్యునింగా దలం
పుదురే? శూరుండును, బుద్ధిసంపన్నుండును, ధైర్యశాలియుం బరి
శుద్ధుండును, సత్కులజాతుండును, నగు సేనానాయకుండు నీయెడ
ననురక్తుండై యుండునే? ఒక్కొక్క యుద్ధసమయంబున శౌర్యధురం
ధరులగుచు బరాక్రమంబు మెఱయించిన వీర భటులకుం దగుబహు
మానంబులు సేయుదువుగదా? నిజసైన్యంబులకు సమయంబుదప్పక
భృత్యంబును, జీతంబు నొసంగి వారలవలన బొగడొందుదువే? సైని
కుల మనంబు నొచ్చిన సకలకార్యహాని సంఘటిల్లుంసుమీ? నీయందు
ననురక్తులగుచు సైనికులు సంగ్రామ రంగంబుల దేహంబులు తృణీ
కరించి కార్యంబులొనరింతురే? బహుప్రయోజనాపేక్షకులగుటం జేసి
నీతిందప్పి తగినవారితో విచారింపక స్వేచ్ఛావిహారంబున సమరంబు
సేయం దలంపవుగదా? విశేషప్రయోజనంబులు సంఘటించిన పురు
షుని భృత్యుండని నిరసింపక యుచితసత్కారంబుల గారవింతువే?
సకలవిద్యాపారంగతులును వివేక సంపన్నులునగు విబుధులయెడ వినీ
తుండవగుచు నుచితంబులగు సన్మానంబుల నొసంగుదువే? యుద్ధ
రంగంబున నీకార్యార్థంబుగం దెగిన వీరభటుల భార్యలకును, నాపత్స
మయంబున సహాయంబొనరించువారి కాంతలకును జీతంబొసంగి
రక్షించెదవే? భీతిజెందివచ్చిన వానిని బుత్రులతోడివారిగామన్నించి

పోషించెదవె? సకల మహీజనులయెడ సముచితుండవగుచుం దల్లి దండ్రులమాడ్కిం బాలించెదవె? శత్రుమహీపాలుండు హీనబలుం డగు సమయంబు విచారించి త్రివిధంబగు బలంబునకు గ్రాసంబొసంగి పిలిచిందిదేనసున్న విరోధిననలని భయంబు నిజపురంబునకుం గలుగకుండ నుండం దగువారి నియమించి యతివేగంబునం బరుల జయింతువు గదా? పరపక్షంబునం గలుగు మంత్రిప్రముఖులకు రత్న కాంచ నాంబరాదులొసంగి నీకు నధీనుల గావించుకొందువే? తొలుత నీవు సకలాంశంబులయెడ నేకాగ్రచిత్తుండవగుచు మదోన్మత్తులై ప్రవర్తి ల్లెడు వైరులం జయింతువుగదా? చతురుపాయంబులతోడ సమన్వి తుండవగుచు శత్రురాజుల జయింపుచు వారల రాజ్యంబు నీయధీ నంబు గావించుకొని పరిపాలింపుచున్న వాడవే? గజంబులును, తురంగంబులును, రథంబులును, బదాతులును, యోధులును, కర్మ కారకులును, రథికులును, దైశికులును, ననందగునీయష్టాంగంబుల తోడ సమేతంబగు మూలబలంబును, నాటవికబలంబును, శ్రేణీబలం బును, నాయుధబలంబును నను నీచతుర్విధబలంబు విరోధులజయిం పుచు నున్నయదియె? పరరాష్ట్రంబులు తొలుతంతృణజల రహితం బులు గావించి మఱి నీవు విజయ యాత్ర వెడలి పరబలంబులు జయిం తువుగదా? స్వరాష్ట్ర పరరాష్ట్రంబుల యందు నీచేత నియుక్తులగు నధికార పురుషులన్యోన్యసహాయులయి మెలంగుదురె? ప్రతిదినం బును, భోజ్యంబులు జలంబులును పరిమళ ద్రవ్యంబులును బుష్పమాలి కలును, హితులనం బరంగు వైద్యులు పరామర్శింతురుగదా? ధన ధాన్యా గారంబులును, కోశంబులు, నాయుధ శాలలును, ధనాగమ స్థానంబులు, దగినవారలనియమించి పరామర్శించెదవె? అభ్యంతర బహిర్జనంబులవలనంగపటంబులు రాకయుండ నిన్ను రక్షణంబు గావిం చుకొని వారలనన్యోన్యంబు కలహింపనీయక రక్షించెదవె? ద్యూతం

బును, పానంబును, మృగయా వినోదంబును, స్త్రీవ్యవహారంబును నను నిది మొదలుగాఁగల క్రీడలకై పూర్వాహ్ణంబున ధన వ్యయంబు సేయవుగదా? నానా ముఖంబులుగ నీ వార్జించు ధనంబులు నాలుగు భాగంబులు గావించి భాగత్రయంబేనియు నర్ధ భాగంబేనియుం దుది నేకభాగంబేనియు బొక్కసంబున నిలుపక సర్వంబును వ్యయంబు గాఁపింపవు గదా? గురుజనంబులను వయోవృద్ధులను, నాశ్రితులను, దరిద్రులను, జ్ఞాతివర్గంబులను, నుచితప్రకారంబున ధన ధాన్యంబు లొసంగి పోషింతువె? ధనాగమ వ్యయ స్థానంబుల నియుక్తులగు గణకులను బూర్వాహ్ణంబున రావించియాయవ్యయ వృత్తాంతంబులు బరామర్శింతువుగదా? గార్యంబులయందు సమర్థులును నీకుహితంబె కోరువారును, నగు జనంబుల యెడం దొలుత గుణదోషంబులన్నింటి నెఱింగి యనురూప కార్యంబులవారిని నియోగింతువె? చోరులను, వృద్ధులను, వైరులను, నసమర్థులను, లుబ్ధులను, నధికారంబుల నియోగింపవుగదా? నీవును నీకుమారవర్గంబును, లుబ్ధులగు ప్రధాన పురుషులును, జోరులును రాష్ట్రంబునుంగల ప్రజలం బీడింపరుగదా? ఉచితంబుగా నాఁడువపాలుగైకొనిక్రృషీవరులనరయుదువె? వలయునెడం జెఱువులుద్రవ్వింపుచుం గాల్వలు దీర్పుచు, సేతువులుగట్టించుచు, దేవమాతృకంబగు రాజ్యంబంతయు నదీమాతృకంబుగావించితివిగదా? పేదపడిన కాంపులకు, శతభాగంబునకు యోగభాగంబు వృద్ధిగా ధనధాన్యంబు నొసంగి పాలింతువుగదా? వైశ్యుల యెడం బ్రీతిసేయుచు, బేరసారంబులు నడుపుచు, సుంకంబు సూత్రంబుల తెరంగునుంబరామర్శింపుచు, దక్కుంగలవ్యాపార జనంబుల రక్షింపుచు మెలంగుదువుగదా? పరిశుద్ధులును బ్రజ్ఞావంతులునునగు నీమంత్రులు కర్మారంభోపాయంబును, బురుషద్రవ్యసంపత్తియు, దేశకాల విభాగంబులును, వినిపాత ప్రతీకారంబును, గార్యసిద్ధియు నను మంత్రాంగ పంచకంబు రీతి

మెఱింగియొక్కొక్క కార్యంబునకు, నైదుగురుకూడియోచన గావిం పుచు, నీరాష్ట్రంబునకు మేలొనరింపుదు రే? నగర సంరక్షణార్థముగా నలుదిక్కుల శాఖానగరంబులు గ్రామంబులు ఘోషంబులు సంరక్షిం చుటకుం దగిన వీరభటుల నియమించి యున్నవాడవె? నీచే నియుక్తు లగుచుంజని సమవిషమస్థలంబులనక, సకలభూములందిరిగి విశేషంబు లెఱింగివచ్చు చారపురుషుల పుత్రకళత్రంబులు, నీనగరంబుననే వసిం చుదురుగదా! స్త్రీజనంబులను విశ్వసించి యంతరంగంబులగు కార్యం బులు నెఱింగింపక వారలకు మనఃప్రియంబు గావింపుచు, రాత్రి నీవు శయనించు సమయంబునం జారుల రావించి సకలకార్యంబుల బరామర్శింపుచు, మఱియు నంతఃపురంబునం గలవిశేషంబు లెఱుం గుచు భోగాధికంబున సంతుష్టుండవై యుందువుగదా? ఉదయకాలం బున మేల్కొని సకలభూషణ భూషితుండవగుచు మంత్రి జన సమే తుండవై పురజనంబులకు మనఃప్రియంబుగా నగరంబున నీవు సంచ రించుతఱి రక్తాంబర ధారులును గుండలాది భూషణాలంకృతులును నగు నీ వీరభటులు ఖడ్గహస్తులై నిన్ను బరివేష్టించి నడతురుగదా? పూజ్యులును దండనార్హులును నగు జనంబులయెడ సమవర్తి రూపం బునం బ్రవర్తిల్లెదవె? సజ్జనసేవ వలన మనోరోగంబులును, నౌషధ సేవవలన శరీరరోగంబులును, దొలంగ మెలంగెదవె? కాయంబును, బాలగ్రహంబును, నూర్ధ్వంబును, శల్యంబును, దంష్ట్రియును, జరయును, వృషయును ననియెడు నీయష్టాంగంబులు నుంగల యాయుర్వేదంబున విశారదులును ననురక్తులునగు వైద్యులు నీశరీరంబునకు హితమాచ రింపుదురే? కామమోహాసక్తుండవగుచు గృహాగతులగు నర్థిజనంబులను వైరివర్గంబులను నిరసించక సత్కరింతువుగదా? లోభంబును ద్వేషం బును విశ్రంభంబును బ్రణయంబును నను నీగుణంబు లంగీక రించిజనంబుల జీవనంబులకు నుపద్రవంబు సేయవుగదా? ధనసం

పదవలనను మంత్రిబలంబు వలననుసమర్థులగు నీవైరులనన్యో న్యంబు కలహించునెడ నీవు మధ్యస్థుండవై యూరకుండుదువే? విద్యాసంపన్నులగు బ్రాహ్మణులను, జ్ఞానసంపన్నులగు పూజ్యులను సన్మానింతువె? అదియ సకల శుభంబులకుం గారణంబగు. కులవృద్ధు లగు మీ పెద్దలాచరించిన వేదోక్తంబగు ధర్మమార్గంబు తప్పక ప్రవ ర్తిల్లదవె? వేదశాస్త్ర పారంగతులగు మహీసురులకు నీగృహంబునం బ్రతిదినంబును షడ్రసోపేతంబుగ నన్నంబు పెట్టింతువుగదా? వాజ పేయపౌండరీక ప్రముఖంబులగుయజ్ఞంబుల భక్తిసంపన్నుండవై యేకా గ్రచిత్తంబున నాచరించెదవె? బ్రాహ్మణులను, గురు జనంబులను, వృద్ధులను, దేవతలను, మహర్షులను, జనులకు నివాసయోగ్యంబులై శుభప్రదంబులగు చైత్యవృక్షంబులను, బ్రతిదినంబును బూజంగావించు నతనికి నాయు రభివృద్ధియును, సత్కీర్తియును, ధర్మార్థంబులును, విజయలాభంబును, ననేకరాజ్యాధిపత్యంబునుం గలుగుంగావున నీవును నట్లు భక్తియుక్తుండవై మెలంగెదవె? సజ్జనుండును, నిర్మలచిత్తుండును నగు పురుషునియెడ నొకండు శౌర్యారోపణంబు సేసినతతి నీతిశాస్త్ర విశారదుల రప్పించి విచారించికాని తొలుతనే దండింపవుగదా! ఇరువు రన్యోన్యంబు కలహించి వచ్చినతఱి ధనికుండగు వానిచే లంచంబుగై కొని మంత్రులు పక్షపాతంబొనరింపక నీతినడుపుదురే? నాస్తిక్యం బును, ననృతంబును, గ్రోధంబును, బ్రమాదంబును, దీర్ఘసూత్రత యును, నేకాలోచనంబును, ననభిజ్ఞులతోడ నాలోచించుటయు, నిశ్చి తంబగు కార్యంబు చేయకుండుటయు, నాలస్యంబును, జలచిత్తతయు, మంత్రంబు బయలు పరచుటయును, శుభ కార్యంబు లొనరింపకుం డుటయును, విషయాసక్తియు, జ్ఞానవంతులను జూడకుండుటయు, నను నీచతుర్దశ రాజదోషంబులును వర్జించి మెలంగుదువుగదా? నీవు చదివిన వేదంబులును,నార్జించినధనంబులును, నీభార్యాజనంబును,నీజ్ఞానంబును,

సఫలంబగుగదా?యనిన ధర్మనందనుండు, మునీంద్రా! వేదంబులు మొదలుగానివి నాలుగును, సఫలంబులుగదా యని యడిగితిరి. ఈయర్థంబునకు ఫలంబెయ్యది? విశదంబుగా దెలుపవలయు నని నతండిట్లను. అగ్నిహోత్రంబు లాచరించుటయే వేదంబులు చదువుటకు ఫలంబు, సత్పాత్రదానంబె ధనంబునకు ఫలంబు, రతిక్రీడ సలుపుటయును బుత్రులంగాంచుటయును భార్యలుగలుగుటకు ఫలంబు,సద్వృత్తియును సదాచారంబును గలుగుటయె జ్ఞానంబులభించుటకు ఫలము, అని మరల నిట్లను. దేశాంతరంబులనుండి లాభార్థంబుగా మీా నగరంబునకువచ్చి బేరసారంబునడపు వర్తకులయెడసుంక సూత్రంబులయందుం దొలుతంజేసినమర్యాదం దప్పక నీమంత్రులు నీతిమార్గంబున వారి వ్యాపారంబుల కనుగుణంబుగ మెలంగెదరే? కృషి తంత్రంబులను గోస్థానంబులను, నుద్యానవనంబులను నియుక్తులగు జనంబులుమధుఘృత సమేతంబుగా బ్రాహ్మణభోజనంబు గావింతురే! నీనగరంబునం గల శిల్పిజనంబులకు ద్రవ్యంబును వలయు సాధనంబులును నాలుగు నెలలకు సమగ్రంబుగ నిప్పింతువె? ప్రశస్తశిల్పంబొనరించిన వానిని సభామధ్యంబునం గొనియాడుచు నతని నుచితంబుగ సత్కరింతువె? అశ్వశిక్షయు, గజశిక్షయు, నాయుధశిక్షయు, ధనుర్వేదశిక్షయు, నాగ్నేయాది దివ్యాయుధంబులును యంత్రంబులును శత్రు మారకంబులగు విషసంయోజన ప్రకారంబులును దెలిసి యుండుదువె? అగ్ని వలనను సింహాదిమృగంబులవలనను సర్పాది విషజంతువుల వలనను రక్షోగణంబులవలనను బొటిల్లుభయంబు గలుగకుండ రాష్ట్రంబుంబరిపాలింతువె? నీరాజ్యంబునం గలుగునంధజనంబులను,మూగవారగునజనంబులను,బంగులను, నంగహీనులను, దేశాంతరంబులకు నేగిన జనంబుల పుత్రమిత్రకళత్రజనంబులను, దలిదండ్రులమాడ్కిం బోషించెదవె?" అని యివ్విధంబునంబల్కు నమ్మహర్షిశ్రేష్ఠుని వాక్యంబులాకర్ణించి ధర్మ

నందనుండు వినయావనతుండగుచు నతని పాదంబులకుం బ్రణమిల్లి, మహాత్మా! మీరలానతిచ్చిన వాక్యంబువలన మిగులం బ్రజ్ఞావంతుడ నైతి. ఇత్తెఱంగుననడచువాడ, అని యతని వచనప్రకారంబునం బ్రవర్తిల్లుచుం జతుస్సముద్ర పరివేష్టితంబగు రాష్ట్రంబు బరిపాలించె.

కావున నెవ్వండేనియు నిట్టి నీతిప్రకారంబు లెఱింగి రాజ్యం బేలునతండు సకల సౌఖ్యంబులుం జెంది మహేంద్రుని యర్ధాసనంబున నుండగలం డని వైశంపాయనుండు మఱియు నిట్లనియె.

ఇది సభాపర్వంబునం బంచమాధ్యాయము.

---

## అధ్యాయము 6

---

ఇత్తెఱంగున బహువిధంబులగు నృపనీతి క్రమంబు లుపన్యసించు నారద మునీంద్రు వాక్యంబు లాకర్ణించి యుధిష్ఠిరుండు సంతుష్టాంతరంగుండగుచు, మహాత్మా! మీరు నాయందలి యనుగ్రహంబునం జేసి యానతిచ్చిన యీ రాజనీతి ప్రకారంబులు నియతాత్ములు సకలశాస్త్రవిశారదులు నగు పూర్వమహీపతులకుంగాని మముబోట్లకు నాచరింపసాధ్యంబులగునె? అయినను వారల మార్గంబు ననుసరించి యేనును నాచేయోపినంతయును నడపెద నని సవినయంబుగ మఱియు నిట్లను. బ్రహ్మనిర్మితంబులగు చతుర్దశ భువనంబులందు నీవు గనుంగొననిలోకంబులేదుగదా? ఎందేనియు నీ సభా భవనంబునకు సమానంబేనియు నధికంబేనియును నగు సభాసదనంబుగన్నది గలదే? యనిన ధర్మనందనుం గనుంగొని మందస్మితముఖారవిందుండగుచు మధుర వచనంబుల నమ్మునీంద్రుండిట్లను. పాండవాగ్రజా! ఇమ్మహీ మండలంబున నవరత్నవిచిత్రితంబును నానావిధమహామాభి

రామంబును నగు నిట్టిసభామందిరంబుంజూచి మెచ్చుంగను. బ్రహ్మ సభయు, నింద్రసభయు, కైలాస నివాసుండగు కుబేరుని సభయును, యమునిసభయును, గనుంగొనియుండుదు. ఆయా మొదలం గల విశేషంబుల నాకర్ణింపం బ్రియంబు గలదేని చెప్పెద. సావధానచిత్తుండవై యాకర్ణింపు మనిన నజాతశత్రుండు కౌతూహలసహితంబుగా గృతాంజలి యగుచు మునీంద్రా! చతురాననుండు మొదలుగా, గల లోకపాలకుల సభాస్థలంబు లెట్టిద్రవ్యమ్ములచేత నిర్మితంబులై యుండు, ఎంతవిస్తారంబు ఎంతధైర్యమ్మునం గలిగియుండు, మహేంద్ర ప్రముఖులగునట్టి సభాధిపతుల నెవ్వ రెవ్వరు సేవింపుచుందురు, ఇంతయును వినంగోరెద. సవిస్తరంబుగ నానతీయవలయు ననిన నారదుం డిట్లను.

ఇది సభాపర్వంబునం దాఱవయధ్యాయము.

---

## అ ధ్యా య ము 7

---

పాండవాగ్రజా! నూఱుయోజనంబుల వెడల్పును, నూటయేబదియోజనంబుల నిడుపును, నైదుయోజనంబుల యౌన్నత్యంబును, గామగమనంబునుం గలిగి, కల్పభూరుహంబులును, రత్నసింహాసనంబులును, విచిత్రభవనంబులుందనగుచు, సకలభువన మనోహరంబై తనయందు వసియించువారలకును, రాజలోకంబులకును, భయశ్రమంబులను దొలంగింపుచు, నిరంతరసుఖావహంబును, బహుశుభప్రదంబును నగు దివ్యసభాసదనంబునందుఁ జిత్రమాల్యాంబర ధరుండును, గిరీటాంగద ప్రముఖ నానాభూషణ భూషితుండును, దివ్యదేహ విరాజమానుండును నగుచు మహేంద్రుండు, శ్రీయును, గీర్తియును,

క్రీయును, శశియును, మరీచియుంగలసిద్ధులును, సాధ్యులును, దేవర్షులును, మరుద్గణమ్ములును, దేవసంఘమ్ములునుం గొలువం గాంచన రత్నమయంబగు దివ్యసింహాసనంబునందు మహనీయవైభవంబునం గొలువైయుండ, మఱియుం బరాశరుండును, బర్వతుండును, సావర్ణియు, గాలవుండును, హవిష్మంతుండును, హవిష్యుండును, హరిశ్చంద్రుండును,హృద్యుండును, నుదరశాండిల్యుండును, గవిష్ఠుండును, జాబాలియు, వాసుదేవుండును, శక్తియును,గార్గ్యుండును, వామనుండును, హతస్కంధుండును, విశాఖుండును, విధాతయును, గాలుండును, ననంతదత్తుండును, ద్వష్టయును,విశ్వకర్మయును,దుంబురుండును, మరుత్తుండును,మఱియును మరీచియు, స్థాణుండును, నత్రియును,మహీతవుండును, గక్షీవంతుండును, గౌతముండును, దార్క్ష్యుండును, వైశ్వానరుండును, నతనిం గొలిచియుండ, రంభయును, నూర్వశియును, మేనకయును, ఘృతాచియును, విప్రజిత్తియును, బంచచూడయును మొదలగు నప్సరోగణంబును, విశ్వావసుండును, జిత్రసేనుండును, బర్వతుండును, దుంబురుండును మొదలుగా గల గంధర్వులును, విద్యాధరుండును, మనోహరంబులగు నృత్తగీతవాద్య విశేషంబులును, హావభావంబుల నతనికి మనోరంజనంబు గావింపుచు, శుభప్రదమ్ములగు స్తుతి పఠనమ్ములవృత్రాసుర సంహారంబు మొదలుగా గల విజయంబులు, బిరుదుగాథాకథనంబులుం బ్రస్తుతింపుచుండ, మఱియును బ్రహ్మర్షులును, రాజర్షులును, దేవర్షులును, దివ్యమాల్యాంబరాభరణాలంకృతులగుచు నానారత్న దేదీప్యమానంబులగు విమానంబులెక్కి వచ్చుచుం బోవుచునుండువారునునై సందడింప జలసహితంబులగుచు గర్జింపుచునున్న మేఘంబులును, మందమారుతంబులును, బృహస్పతియును, శుక్రుండును, మఱియునుం గల సుకృతశాలురును, దేజోవిరాజమానులును, బ్రహ్మనియుక్తులునగు సప్తర్షులును నతని

చెంతనే పరివేష్టించియుండఁ బ్రవేశింపుచు నేతాదృశమహిమోజ్జ్వలంబగు నమ్మహేంద్రు సభాస్థానంబు నిరీక్షించితి.

ఇది సభాపర్వంబునందు సప్తమాధ్యాయము.

---

## అ ధ్యా య ము 8

---

ఇంక దివ్యంబును, విశ్వకర్మనిర్మితంబును నగు యముని సభయందుం గల విశేషంబులు వివరించెద నాకర్ణింపుము. ఆదియును, శతయోజనంబుల దైర్ఘ్యంబును, నంతియ విస్తారంబునుం గలిగి మిగుల నున్నతం బగుచు భాస్కరప్రభాభాసమానంబై యత్యుష్ణంబును, నతి శీతంబునుం గాక హృదయాహ్లాదకారి యగుచుం దనయందు వసియించు దివ్యమానవులకు క్షుత్పిపాసలును, శోకదైన్యంబులును, జరాకార్పణ్యంబులును, బ్రతికూలత్వమ్మును దొలంగించుచు రసయుక్తంబులగు బహు భక్ష్యభోజ్యంబులును, దివ్యగంధమాల్యంబులును, బుష్పఫలరమ్యంబులగు నానావిధవృక్షంబులును బరిమళసమేతంబు లగు శీతోదకంబులును, నుష్ణోదకంబులునుం గలిగి దనరారుచు నుండు సభాస్థానంబున యయాతియును, నహుషుండును, బూరుండును, మాంధాతయును, సోమకుండును, భృగుండును, నసదస్యుండును, జైత్రరథుండును, గృతవీర్యుండును, శ్రుతశ్రవుండును, నరిపుత్రుండును, సునిఘ్నుండును, గృతవేగుండును, గృతాకృతియును బ్రతర్దనుండును, శిబియును, మాత్స్యుండును, బృథుపక్షుండును, బృహద్రథుండును, నైలుండును, మరుత్తుండును, సునిధుండును, నలుండును, దివోదాసుండును, సుమనసుండును, నంబరీషుండును, భగీరథుండును, వ్యశ్వుండును, సదశ్వుండును, దాధ్రస్వుండును, బంచ

హస్తుండును, బృహచ్ఛ్రవుండును, ఋషకుండును, వృషసేనుండును, గృపుండును, మహాబలుండును, వృషదశ్వుండును, వసుమనసుండును, గురుత్సుండును, ధ్వజియును, రథియును, నారిష్టషేణుండును, దిలీపుండును, సుసీనరుండును, దశరథుండును, గకుత్థ్సుండును, ప్రవర్థనుండును, నౌసీనరుండును, బుండరీకుండును, శర్యాతియును, భరతుండును, శుచియును, అంగుండును, సరిష్టుండును, దేవాశ్వుండును, దుష్టంతుండును, సంజయుండును, జయుండును, భాగస్వరియును, సునీధుండును, నిషధుండును, గరందముండును, బాహ్లికుండును, సుద్యుమ్నుండును, మధువును, గపోతరోముండును, దృణకుండును, సహదేవుండును, సర్జునుండును, దాశరథి యగు రాముండును, లక్ష్మణుండును, ప్రదర్శనుండును, నలర్కుండును, గక్షసేనుండును, గయుండును, గౌరాశ్వుండును, భార్గవరాముండును, నాభాగుండును, నగరుండును, భూరిద్యుమ్నుండును, పృథాశ్వుండును, జనకుండును, వైశ్యుండును, బారిషేణుండును, బూరుజుండును, జనమేజయుండును, బ్రహ్మదత్తుండును, ద్రిగర్తుండును, నింద్రద్యుమ్నుండును, నుపరిచరుండును, భీమజానుండును, గౌరవృష్ఠుండును, నళుండును, బద్మ్నుండును, భూరిద్యుమ్నుండును, బౌండ్యుండును, ముచికుందుండును, బ్రసేనజిత్తును, నరిష్టనేమియును, బ్రద్యుమ్నుండును, పృథుకుండును, జనకుండును, మఱియును మత్స్యదేశాధీశ్వరులగు రాజులు నూర్వురును, నీపవంశసంభవులగు నరేంద్రులు నూర్వురును, గయాన్వయజాతు లగు మానవాధీశ్వరులు నూర్వురును, ధృతరాష్ట్రవంశు లగు ధరణీపతులు నూర్వురును, నశీతిసంఖ్యుందనరు జనమేజయకులజులగు భూపతులును, బ్రహ్మదత్తవంశసంభవులగు రాజులు నూర్వురును, వైరులును నవైరులును నను నామధేయంబులం బఱంగువారలు నూర్వురును, శతంసుండును, మిూతంద్రియుగు పాండుపుహీపాలుండును, ఉశజ్గవుండును, శతరథుండును, దేవరాతుం

డును, వృషాదర్భియును, ధౌముండును, సమృద్ధియును, భూరిదక్షిణా న్వితంబులుగా నశ్వమేధశతంబు లొనరించి కీర్తిసుకృతంబులం గాంచి యనేక సహస్రసంఖ్యలం దనరు శతబిందుమహీపతులును మొదలు గాగల రాజర్షిశ్రేష్ఠులును, మఱియును నగస్త్యుండును, మతంగుం డును, గాలుండును, మృత్యువును, యజ్ఞంబు లాచరించినవారును, సిద్ధులును, యోగీశ్వరులును, ఫేనపులును, నూష్మపులును, స్వధావం తులును, బర్హిషదులును, మూర్తిమంతులును, నమూర్తిమంతులును, నగ్నిష్వాత్తు మొదలుగాగల పితృదేవతలును, మఱియును దక్షిణాయ నంబున మృతులగు కలుషాత్ములం గొని తెచ్చుటకు నియుక్తులగు కింకరు లును, హవ్యవాహనుండును, నయ్యముని నుపాసించుచుండుదురు. మఱి యుమూర్తిమంతంబు లగుంగాలచక్రంబులును, సమిత్పలాశకుశాదులు ను, దివ్యతేజంబులతోడ నిరామయంబు లగుచు నుపాసించుచుండు. వెం డియు ననేకసహస్రసంఖ్యలం గల దివ్యపురుషులకు నివాసం బగుచు మహాతపస్వి యగు విశ్వకర్మవలన నిర్మితంబైనట్టి యముని దివ్య సభా రత్నంబు దనరారు. మఱియు నది సత్యవ్రతులును, తపోనిష్ఠులును, శాంతులును, బరివ్రాజకులును, మొదలుగాగల సుకృతశాలులకుం బ్రాప్యస్థానంబైయుండు. ఆ సభామధ్యంబున వసియించువార లంద ఱును, దివ్యమాల్యాంబరాలంకృతులును, మణికుండలకిరీటాంగనాది నానాభూషణభూషితులును, సత్కర్మనిరతులును, తేజోవిరాజమాన శరీరులును, నగుచుం బ్రకాశించుచుండుదురు. మఱియును, మహాత్ము లగు గంధర్వులును, ననేక సంఖ్యలం గల యప్సరోగణంబులును నృత్త వాద్యంబుల, హాస్యలాస్యంబులం బ్రొద్దుకడపుచుండ దివ్యమాల్యాం బులను, దివ్యగంధంబులను, దివ్యశబ్దంబులను, హృదయాహ్లాదంబు గావించి దివ్యవైభవ విరాజమానుండగు వైవస్వతుండు కొలువై యుండు. ఇంక వరుణ సభామహత్వంబు నాకర్ణింపుము.

ఇది సభాపర్వంబునం దష్టమాధ్యాయము.

---

## అధ్యాయము 9

---

అదియును యమసభాపరిమాణంబును, శుభ్రప్రాకార తోరణా లంకృతంబును, సలిలమధ్యనిర్మితంబును, దివ్యంబును, దివ్యరత్న ఫలస మన్వితంబు లగు మహీరుహంబులవలన నభిరామంబును, సితాసితంబు లును, బీతరోహితంబులును, బహుపుష్పఫలయుక్తంబులును, నగు పూబొదలవలనను, గలకలస్వనంబులును విచిత్రగాత్రంబులునుం గలు గుం బక్షికులంబులవలనను, రమణీయంబును నగుచు, నతిశీతంబును, నత్యుష్ణంబునుంగాక బహుసుఖప్రదంబగుచు, రత్నకలితంబు లగు స్వర్ణ సింహాసనంబులందనరి, చంద్రప్రభా భాసమానంబును నగుచు, నలరారు నానభారత్నంబున దివ్యమాల్యాంబరధరయును, దివ్యభూషణాలంకృత యును నగుచు గౌరియు వారుణియు ననునామధేయంబుల విఖ్యాతయగు నిజకాంతతోం గూడ సుఖానుభవంబున సంతుష్టుండగుచు వరుణుండు పేరోలగంబుననుండు. మఱియును, దివ్యమాల్యాంబరధరులును, దివ్యా లంకారభూషితులును నగు ద్వాదశాదిత్యులును, వాసుకియును, దక్ష కుండును, నైరావంతుండును, గృష్ణుండును, రోహితుండును, బద్మం డును, చిత్రుండును, గంబళుండును, నశ్వతరుండును, ధృతరాష్ట్రుండును, వలాహకుండును, మణియును, మణినాగుండును, శంఖనఖుండును, గౌరవ్యుండును, స్వస్తికుండును, నేలాపుత్రుండును, సువామనుండును, నపరాజితుండును, దోషుండును, నందకుండును, బూరణుండును, నహికుండును, సింహికుండును, శ్వేతుండును, భద్రముం డును, భద్రేశ్వరుండును, మణిమంతుండును, భిండికుండును, సారుం డును, గార్కోటకుండును, ధనంజయుండును, బ్రహ్లాదుండును, మూష కాదుండును, జనమేజయుండు నను నామధేయంబులం గల యురగ శ్రేష్ఠులును, బతాకాసమన్వితులును, మండలాకారులును, ఫణాలంకృతు

లును నగుచు నలుగడలంబరి వేష్టించి యావరుణుని సేవించుచుండుదురు. మఱియును, ననంతుండు వరుణపూజితుం డగుచు నందుల వసియించి యుండు శేషునివలన నియుక్తులగు వాసుకి ప్రముఖులు నుచితాసనో పవిష్టులై యంజలిం గావించుచుం గొలిచి యుండుదురు. వినతా కుమారుండగు గరుడుండును నతని పరిజనంబులగు పక్షికులంబులును మూర్తిమంతంబులగు ధర్మార్థకామంబులును, వసువును, గపిలుండును, విరోచనకుమారుం డగు బలియును, ధరణీతనయుం డగు నరకాసురుం డును, ప్రహ్లాదుండును, విప్రచిత్తియును, గాలకేయులును, సుముఖుం డును, దుర్ముఖుండును, శంఖుండును, సుమనసుండును, సుమతియును, స్వనుండును, ఘటోదరుండును, మహాపార్శ్వుండును, రథుండును, విశ్వ రూపుండును, సురూపుండును, విరూపుండును, మహాశిరుండును, దశ గ్రీవుండును, వాలియును, మేఘవాసుండును, దోదుహాుండును, విగదూ హాుండును, ప్రభవుండును, నింద్రతాపసుండును, మొదలుగాగల శూరాగ్రగణ్యులగు రాక్షసాధిపతులును, దివ్యమాల్యాంబరధరు లును, రత్నకిరీటకుండలాంగదాలంకృతులును, లబ్ధవరప్రసాదులును, జితక్రోధులును, జరితవ్రతులును, ధర్మాయత్తచిత్తులును నగుచు నందు వసియింతురు. మఱియును బిత్రుదేవతలును, జతుస్సముద్రంబు లును, భాగీరథియును, యమునయును, విదిశయును, వెన్నయును, నర్మదయును, వేగవాహినియును, విపాసయును, శతద్రువును, జంద్ర భాగయును, సరస్వతియును, నిరావతియును, వితస్తయును, సింధు వసు దేవనదంబును, గోదావరియును, కృష్ణవేణియును, గావేరియును, గంబు కయును, విశల్యయును, గౌశికయును, గోమతియును, దేవకియును, గండకియును, వైతరణియును, జ్యేష్ఠిలయును, శోణనదంబును, జర్మ ణ్వతియును, శ్వేతనదియును, ఫల్గుతీర్థంబు గల మహానదియును, సర యువును, జిరవల్కలయునుం మొదలుగాగల మహానదులును, సరిత్తు

లును, గుల్మలును, దీర్ఘంబులును, సరస్సులును, హ్రదంబులును, గూపంబులును, బహిస్రవణంబులును, బల్వలంబులును, దటాకంబులును, దిక్కులును, భూమియును, రత్నంబులును, రసవంతంబు లగు మహీరుహంబులును, జలచరంబులును, మూర్తిమంతంబు లగుచు సేవించుచుండ, గోనాముండును, బుష్కరుండును నను పుత్రులతోంగూడి యిష్టభృత్యామాత్యపరివృతుం డగుచు సునాభుం డను మంత్రివరుండు సేవించుచుండ గీతవాదిత్రి నృత్యంబులు సలుపుచు గంధర్వాప్సరోగణంబులు గొలిచియుండ వరుణుండు తేజరిల్లుచుండు. ఇట్టి దివ్యసభ నేం గనుగొంటి. ఇంకం గుబేర సభామహత్వంబు వివరించెద నాకర్ణింపుము.

ఇది సభాపర్వంబునందు నవమాధ్యాయము.

---

## అధ్యాయము 10

---

అదియును, నూఱు యోజనంబుల నిడివియును, డెబ్బది యోజనంబుల వరపునుం గలిగి కైలాసశిఖరంబు మాడ్కి రమణీయంబగుచు గుహ్యకులవలన భరింపం బడి నభోమధ్యంబునం దేజరిల్లు. కుబేరుండు చిరకాలంబు తపం బొనర్చి పదంపడి దాని నిర్మించె. అది మఱియును సువర్ణమయంబులును, నత్యున్నతంబులును, దివ్యంబులును నగు మహీరుహంబులవలన నతిరమ్యంబును, ప్రభాభాసమానంబును దివ్యవాసనావాసితంబును, నగుచు శుభ్రాభ్రపటలంబు మాడ్కి నభంబునం దోంచుచుండు. అట్టి సభామధ్యంబున విచిత్రాంబరభూషణాలంకృతుండును, నమరగణ పరివేష్టితుండును, నవరత్నకిరీటకుండల మండితుండును, నగుచుం గుబేరుండు

సర్వాభరణభూషితయుం బుష్పమాల్యాలంకృతయు, బుద్ధి యను నిజ కాంతసమీపంబునం బ్రకాశింప సూర్యసంఘాంశంబును, దివ్యాస్త్రణ శోభితంబును, దివ్యపాదోపధానయుక్తంబును దివ్యంబును నగు రత్నసింహాసనంబున సుఖాసీనుండై యుండు. కల్పవృక్షంబులను, సౌగంధికంబులను, కమలాకరంబులను, జందనమహీరుహంబులనుం గల దివ్యగంధంబులచే హృదయాహ్లాదం బొనరించుచు వాయు దేవుం డతనిం గొలిచియుండు. మఱియు నప్సరోగణ సమన్వితంబు లగుచు దేవగంధర్వసంఘంబులు దివ్యగానంబులును, దివ్యగీతంబులును విని పించుచుండు. మిశ్రకేశియును, రంభయును, జిత్రసేనయును, జారు ధేష్ణయును, ఘృతాచియును, మేనకయును, బుంజికస్థలయును, విశ్వాచియును, సహజన్యయును, ప్రమ్లోచయును, నూర్వశియును, దివ్యయును, సౌరభేయియును, దేవియును, మనోరమయును, గోపాలియును, బంచచూడయును, విద్యుద్వర్ణయును, సులోచనయును, జిత్రదేవియును, నీలయును, నమ్యయును, లలితయును నను పేరులం గల యప్సరోవనితలు నృత్తగీతంబుల మనోరంజనంబు గావించుచు నాధనేశ్వరునిం గొలిచియుండుదురు. మఱియును విశ్వావసుండును, హాహాహూహూలును, దుంబురుండును, బర్వతుండును, శైలూషుండును, నారదుండును, జిత్రసేనుండును, జిత్రరథుండును, మఱియునుం గల గంధర్వపతులును, విద్యాధరులును, ననుజసమేతుండగు జంద్రాపీడుండును, భగదత్తుండు మొదలుగా ననేకసంఖ్యలం గల కిన్నరులను, ద్రుపద నామధేయుం డగు కింపురుషపతియును, సకలరాక్షసపరివృతుండును, ధర్మశీలుండును నగు విభీషణుండును, మఱియునుం గొందఱు రాక్షసులును, సకలనిధిసమేతంబు లగుచు, నిధిముఖ్యంబు లగు శంఖపద్మంబులును, మాణిభద్రుండును, శ్వేతభద్రుండును, గుహ్యాకుండును, స్థాణుండును, సూర్యభానుండును, వేణుకుండును, దిందుకుండును,

గుభేరళుండును, గండపిండుండును, వృషాదుండును, మహాబలుండును, ద్రుముండును, హేమచంద్రుండును, బుష్పాననుండును, బింగళాక్షుండును, శోణితోదుండును, బ్రవాలకుండును, వృకపార్శ్వదుండును, జిత్రవాసుండును, మొదలుగా ననేకసంఖ్యలుం గల యక్షులును, మఱియు శ్రీయును, నళకూబరుండును, హిమవంతంబును, బారియాత్రంబును, వింధ్యంబును, గైలాసంబును, మందరంబును, మలయంబును, దర్దురంబును, మహేంద్రంబును, గంధమాదనంబును, నింద్రనీలంబును, సునాభంబును, మేరువును, మొదలుగాంగల పర్వతశ్రేష్ఠంబులును నాధనపతినిం గొలిచియుండు. దేవర్షి గణంబులతోడ నేను నతని నుపాసించుచుండుదు. మఱియు నొక్కొక్కసమయంబున నందీశ్వరుండును, మహాకాళుండును, శంకుకర్ణప్రముఖులగు పారిషదులును, గాష్ఠకూటుండును, సోమనందనుండును, విజయుండును, దపోధికుండును, మహారవంబు గావించుచు నుండు శ్వేతవృషభంబును, వామనులును, వికృతాంగులును, కుబ్జులును, రక్తాక్షులును, మహాధ్వని సేయువారును, మాంసమేదోవసాహారులును, వికృతదర్శనులును, ఘోరకర్ణులును, నానావిధాయుధధారులును, భయంకరాకారులును, వాయువేగమనోవేగసంపన్నులును నగు ప్రమథగణంబులుం బరివేష్టింప భగవంతుండును, నుమాపతియును, బశుపతియును, శూలధరుండును, భగనేత్రహరుండును, త్రైలోక్యభావనుండును, త్ర్యంబకుండును, విశ్వరూపుండును, శివుండును నను నివిమొదలుగాంగల యనేకదివ్యనామంబులం బ్రవర్తిల్లు అమ్మహేశ్వరుండు గౌరీసమేతుం డగుచుం జనుదేర నతనికిం గుబేరుండు బ్రత్యుత్థానంబు గావించుచు వినయావనతుండై యనేకదండప్రణామంబు లాచరించి రత్నసింహాసనంబున నునిచి తా నతని యనుమతంబున నిజాసనాసీనుండై యుండు. ఇట్లు మహనీయమహిమాస్పదం బగు ధనేశ్వరుసభాభవనంబు గనుంగొంటి.

ఇది సభాపర్వంబునందు దశమాధ్యాయము.

---

## అ ధ్యా య ము 11

ఇంక బ్రహ్మసభామహాత్వంబు వివరించెద. సావధానచిత్తుం డవై యాకర్ణింపుము. తొలుత దేవయుగంబున భగవంతుం డగు మార్తాండుండు భూలోకంబు గనుంగొనవలయునను తలంపున దివంబున నుండి మనుష్యరూపంబునం జనుదెంచి యతండు బ్రహ్మసభనుం గనుంగొనినవాం డగుటం జేసియపరిమిత ప్రభాభాసమానంబును, ననంతమహిమాస్పదంబును, సర్వభూత మనోహరంబును, బితామహ సంకల్పనిర్మితంబునునై విలసిల్లు ననుచు నాసభామహాత్త్వంబంతయు యథాప్రకారంబుగ నెఱింగించె. నేను దానిం గనుంగొనవలయునను తలంపున నాభాస్కరుం గనుంగొని, మహాత్మా! పితామహుసభ నిరీక్షింపవలయు నను వేడుక మనంబునం బెనంగొనుచున్నయది. ఏతపంబున నేసుకృతవిశేషంబున నేయామధసామర్థ్యంబున దానిం గనుంగొనం గల్గు? కాదేని యేమాయవలనం దిలకింపనలవి యగు? అంతయు నెఱింగింపు, మనవుండు నాప్రభాకరుండు, వేయిసంవత్సరంబులు నియతాత్ముండ వగుచు బ్రహ్మవ్రతంబు గావించితి వేని నాసభను గనుంగొన యోగ్యుండ వయ్యెద, వనిన నేనును హిమవంతంబున కేంగి యుట్టితపంబు జరిపింపుచున్న సమయంబున దివాకరుం డేంగుదెంచి యతివినిర్మలంబును, ననిర్వచనీయంబును నగు నాబ్రహ్మసభకు నన్నుందోడ్కొని చనియె. అదియును క్షణంబున కొక్కొక్కరూపంబై తోంచుచు నింతిం తన రానిపరపును నిడివియునుం గలిగియుండు. అత్యుష్ణంబును, నతిశీతలంబును గాక యతిసౌఖ్యావహంబగుచుం దనయందు వసియించు వారలకు క్షుత్పిపాసలును బడలికనుం దొలంగించుచుం దనరారు. మఱియును వేర్వేర నానారూపంబులై విచిత్రవర్ణంబులు గలిగి దివ్యంబులగు బహువిధ

మణులవలనం దేజరిల్లు చిత్రంబులవలనను, నిర్మితంబైన తెఱంగునం దోంచుచు నుండు. సూర్యచంద్రాగ్నులకంటె నధికం బగు తేజంబు గలిగి నిజప్రభావిశేషంబున వారలనుం బ్రకాశింపం జేయంజాలి శాశ్వతంబును, స్తంభాదిపరియత్నవిరహితంబును నై యుండు నట్టి దివ్యసభాభవనంబు మున్నెన్నండును గన్నదియు విన్నదియునుం గాదు. అయ్యెడ వసియించి చతురాననుండు దేవమాయచేతను జతుర్దశభువనంబులు నిర్మించుచుండు. మఱియు దక్షుండును, బ్రచేతుండును, బులస్త్యుండును, బులహుండును, మరీచియును, గాశ్యపుండును, మొదలగు నవబ్రహ్మలును, గ్రతువును, బ్రహ్లాదుండును, గర్దముండును, భృగువును, నత్రియును, వసిష్ఠుండును, గౌతముండును, అంగిరసుండును, వాలఖిల్యులును, మరీచియును మొదలగు మహర్షులును, ద్వాదశాదిత్యులును, నేకాదశరుద్రులును, నష్టవసువులును, సప్తమరుత్తులును, విశ్వసంజ్ఞులగు దేవతలును, నాశ్వినేయులును, మహేంద్రుండును, యముండును, వరుణుండును, ధనదుండును, బర్వకాలంబుల నేతెంచు మహాదేవుండును, మఱియు నగస్త్యుండును, మార్కండేయుండును, జమదగ్నియును, భరద్వాజుండును, సంవర్తుండును, చ్యవనుండును, దూర్వాసుండును, ఋశ్యశృంగుండును, యోగాచార్యుండును, సనత్కుమారుండును, నసితుండును, దేవలుండును, దత్త్వవిదుం డగు జైనిషవ్యుండును, ఋషభుండును, నజాతశత్రుండును, మహావీరుం డగు నారుణియును మొదలగు మునిశ్రేష్ఠులును, నదితియును, దితియును, దనువును, వినతయును, సురసయును, గాలకయును, సురభిదేవియును, సరమయును, గౌతమియును, బృథయును, గద్రువయును నను వీర లాదిగాంగల దేవమాతలును, రుద్రాణియును, శ్రీదేవియును, లక్ష్మియును, భద్రయును, జరయును, బృథివియును, దుర్గయును, హ్రీదేవియును, స్వాహాదేవియును, గీర్తియును, సురా

దేవియును, శచీదేవియును, నరుంధతియును, సంపత్తియును, నాశయు, నియతియును, బుష్టియును, రతీదేవియును మొదలుగాంగల దివ్య స్త్రీ జనంబులును, మహాభాగులును, వేరాజులును, భూలోకంబునం జాతుర్వర్ణ్యంబుచే నాచరింపంబడిన స్వధాకారంబునం దృప్తులగుచు సోమునికిం దృప్తింగావించు నగ్నిష్వాత్తాదిపితృదేవతలును, మూర్తిమంతంబులును నమూర్తిమంతంబులును నగు సప్తవిధపితృగణంబులును, లోకపాలకులును, శుక్రుండును, బృహస్పతియును, బుధుండును, నంగారకుండును, శనైశ్చరుండును, రాహువును, జంద్రుండును, సూర్యుండును, గేతువును నను నవగ్రహంబులును, నారాయణుండును, మహాసేనుండును, విశ్వకర్మయు, దేవర్షులును, నష్టాశీతిసహస్రసంఖ్యలుం గలుగు యతీశ్వరులును, బంచాశత్సహస్రసంఖ్యలగు బ్రాజాపత్యగణంబులును, బంచాశత్సహస్రసంఖ్యలం దనరు ఋషులును, నాలోకేశ్వరు సమ్ముఖంబునకుం జనుదెంచి యథేచ్ఛంబుగా విహరించుచుండుదురు. మఱియును మనంబును, విద్యయు, నంతరిక్షంబును, వాయువును, దేజంబును, బలంబును, మహిమయును, శబ్దస్పర్శరూపరసగంధంబులును, బ్రకృతియును, వికారంబులును, భూమియందుంగల కారణంబులును, క్షమయును, ధ్వనియును, శుచియును, బ్రజయును, శుద్ధియును, స్మృతియును, దర్కయుక్తంబులగు భాష్యంబులును, క్షణంబులును, లవంబులును, ముహూర్తంబులును, నహోరాత్రంబులును, బక్షంబులును, మాసంబులును, షడృతువులును, సంవత్సరంబును, బరివత్సరంబును, నిదావత్సరంబును, నిద్వత్సరంబును, నిదువత్సరంబును నని బంచవిధంబుల బఱంగు వత్సరంబును, గ్రేతాదియుగంబులును, జతుర్విధంబులగు సమరాత్రులును, దివ్యంబును, నిత్యంబును, నవ్యయంబును, ధ్రువంబును నగుం గాలచక్రంబును, నరణియును, నష్టాంగయుక్తంబగు నాయుర్వేదంబును, వేదంబులును, యజ్ఞంబులును, వాయువులును, బ్రాణంబులును

సర్థంబును, ధర్మంబును, గామంబును, సంకల్పంబును, హర్షంబును, దపంబును, దమంబును, రథంతరసామంబును, హరిమంతంబును, వసు మంతంబును నను సామంబులును, స్తుతులును, గీతంబులును, నానావిధ గాథలును, ఋగ్వేదంబును, యజుర్వేదంబును, సామవేదంబును, నథ ర్వణవేదంబును,నుపవేదంబులును,నితిహాసంబులును, వేదాంగంబులును, గృహాయజ్ఞంబులును, సోమలతలును, సంసారంబు తరింపం జేయంజాలు గాయత్రి మొదలగు సప్తఛందంబులం దనరువాణియును, సావిత్రి యును, కులాచలంబులును, మఱియును లోకంబునంగల స్థావరజంగ మంబు లన్నియును, యథోచితంబులుగాం గొలిచియుండు. ఇత్తెఱం గునం దన సమ్ముఖంబున కనుదెంచు దేవదానవ యక్ష రక్ష స్సువర్ణ కాలేయ గంధర్వాప్సర ప్రముఖులగు మహాభాగులను, దయాళుండగు లోకపితామహుం డుచితసత్కారంబులసంతుష్టాంతరంగులంగావించుం గావున నిట్లు ప్రతిదినంబును యాతాయాతంబులు సల్పుచుండు సకల దేవదానవ మునిసంఘంబులవలన నిబిడంబును,దివ్యంబును, బహుసుఖ ప్రదంబును, బ్రహ్మతేజోవిరాజితంబును నగు నా హిరణ్యగర్భునిసభ నే కనుఁగొంటి. ఈ భూలోకంబున నీ సభ యెట్లో యట్లన దేవలోకం బున నది యద్వితీయంబై యుండు.

ఇది సభాపర్వంబునం దేకాదశాధ్యాయము.

---

## అధ్యాయము 12

---

అని యిట్లు వల్కు నారదమహామునీంద్రునిం గనుంగొని ధర్మ నందనుండు, మహాత్మా! యముని సభామధ్యంబున ననేక రాజ లోకంబులు వసియించు ననియు, వరుణసభాస్థానంబున నాగేంద్ర

లును, దైత్యులును, సముద్రాదిదేవతలుం గల రనియును, గుబేరసభా భవనంబున యక్షరాక్షసగుహ్యకులును, గంధర్వాప్సరోగణంబులును, భగవంతుం డగు శంకరుండును నెలకొనియుండుదు రనియును, బితామహుని సభారత్నంబున మహర్షిశ్రేష్ఠులును, సర్వగీర్వాణులును, నిఖిలవేదశాస్త్రాధిదేవతలును, నివసించియున్నవా రనియును, మహేంద్రుని సభాసదనంబున దేవగంధర్వులును, మునిజనంబులును, రాజర్షిలోచనుం డగు హరిశ్చంద్రుం డొక్కరుండును, నెలకొనియుండుదు రనియును నానతిచ్చితిరి. సకలరాజన్యలోకంబును యమునిసభయందు వసింప నీహరిశ్చంద్రుం డొక్కరుండును, నేసుకృతంబువలన, నేతపంబువలన, నేనియమంబువలన సకలమహీపతులకంటె నధికుం డగుచు నింద్రునిసభయందు వసియించి యతనితోం గూడం బ్రమోదించుటకు నర్హుం డయ్యె. అట్లే వైవస్వతసభయందు వసియించు మజ్జనకుం డగు పాండుమహీపాలుని మీరు కనుంగొని యతనితో సంభాషించితిరె? అతండు మాకు నెయ్యది యెఱింగింపు మనియె? అది వివరింపవలయు. త్రికాలజ్ఞానసంపన్నుండ వగు నీవలన సకలవిశేషంబుల నెఱుంగుటకుం గుతూహలం బయ్యెడు నని యడిగిన నారదుండు, పాండునందనా! హరిశ్చంద్రుం డేసుకృతవిశేషంబువలన నింద్రసభనున్నవాం డని తొలుత నడిగితివిగదా? అతని మాహాత్మ్యంబు దేటపడం దెలిపెద నాకర్ణింపుము. తొలుత విశ్వామిత్రసంరక్షితుండును, నిక్ష్వాకుకులసంభవుండును నగు త్రిశంకుమహీపాలుం డయోధ్యానగరంబు పరిపాలించుచుం గైకయవంశజాత యగు సత్యవతి యను నిజధర్మపత్నియెడ సత్యసంధుం డగు హరిశ్చంద్రునిం గాంచె. త్రిశంకుపుత్రుం డగు నాహరిశ్చంద్రుండు బలవీర్యధురంధరుండై సకలమహీపాలలోకంబును నిజశాసనంబునం బ్రవర్తిల్లం జక్రవర్తియనం బ్రసిద్ధి గాంచి, నిజభుజబలంబున సప్తద్వీపంబులును, శైలకాననసమేతం

బగు మహీమండలంబును జయించి, రాజసూయం బను యాగంబు గావించునెడ నిఖిలమహీపతులు నానావస్తువిశేషంబులును సమకట్టి సకలమహీసురసహితులై తనకుం దోడుగా నింప యజ్ఞంబు సమాప్తం బగుటయు, నవభృథస్నానం బొనర్చి శాస్త్రోక్తంబునకు నైదు గుణంబు లధికంబుగ ఋత్విజులకు దక్షిణ లొసంగి, మఱియు నానాదేశాగతు లగు బ్రాహ్మణులయభీష్టభోజనంబులవలనను ధన కనక రత్న భూషణాంబరదానంబులవలనను సంతుష్టులం గావింప, వారలు కీర్తి తేజోవిశేషంబులవలన సకల మహీపతులకంటె నధికుండ వగు నని దీవించుటం జేసి హరిశ్చంద్రునకు నంతటిమహత్త్వంబు గలిగె గావున రాజసూయయాగంబుగావించు వారలును, మఱియు సముఖంబున వెనుదీయక నిహతులగు వారును, నతిఘోరతపోనిష్ఠులై దేహంబులు దొఱంగువారును, నింద్ర సమానులై యాసభాభవనంబున ననేకకాలంబు సుఖించుచుందురు. కావున నాహరిశ్చంద్రునియందు గలమహత్త్వంబుం బరికించి విస్మి తుం డగుచు మీ తండ్రి యగు పాండుమహీపతి నన్ను గనుంగొని ధర్మనందనుని తోడ, భుజబలధురంధరు లగు తమ్ములు నీపనిచిన పనుపు చేయుచుండ నీచేం గాని కార్యంబు గలదె! సకలమహీపతుల నిర్జించి రాజసూయాధ్వరంబు గావింపు మని తెలుపు మనియె. నీవును నతనిశాసనం బంగీకరించి యట్లు సేసితివేని పితృపితామహసమేతం బుగం బాండుమహీపాలుం డింద్రసభాభవనంబున సకలసౌఖ్యం బను భవింపం గలండు. నీకును నట్టి శ్రేయోలాభంబు గలుగు. ఐనను నీ యజ్ఞంబువలన నిఖిలక్షత్రియవినాశకారణంబగు యుద్ధంబు వాటిల్లు. అదియునుం గాక బ్రహ్మరాక్షసగణంబు విఘ్నంబు గావించుటకై రంధ్రాన్వేషణంబు సేయుచుండు. అట్లగుట నీయాగంబు బహు విఘ్నంబులకు నాస్పదంబై యుండు. ఇంతియకాని దీనివలనం గలుగు

శుభంబు లపారంబులై యుండు. నే నెఱింగింపం దగినదంతయు నెఱింగించితి. ఇంక నీ కభిమతం బగు విధంబునం బ్రవర్తిల్లుము. అఖిల మహీసురుల దానంబుల సంతుష్టులం గావించుచు, మఱియును సకల జనంబుల సంరక్షించుచు సుఖంబున వర్ధిల్లుము. నేను కృష్ణసందర్శనంబునకై ద్వారకానగరంబునకుం జనియెద నని ధర్మజానుమతంబున రైవతప్రముఖఋషివర్గంబుతో యథేచ్ఛంబుగాం జనియె. అంత ధర్మనందనుండు నిజానుజసహితుం డగుచు నతిదుర్లభం బగు రాజసూయంబు గావించు తెఱంగు విచారించుచుండె.

ఇది సభాపర్వంబునందు ద్వాదశాధ్యాయము.

---

## అ ధ్యా య ము 13

---

ఇవ్విధంబున ధర్మనందనుండు నారదముని వాక్యంబుల మనంబునం దలంచుచు, యాగంబులవలనం గలిగెడు పుణ్యలోకంబులును, పూర్వరాజర్షుల మహాత్వంబులును, వీర లిద్దఱికంటె విశేషం బగు ప్రభావంబు గాంచిన హరిశ్చంద్రుని మహిమంబునుం దలంచి, యెంతయును దుర్లభం బగు రాజసూయం బేవిధంబునం జేకూరు నని నిట్టూర్పు నిగుడించుచు, డోలాయమానహృదయుండై సభాసదుల బహుమానపూర్వకంబుగ నవలోకించి తన తలంచిన తలం పంతయు నెఱింగించి యెల్ల భంగుల రాజసూయం బొనరింపవలయు నని కృతనిశ్చయుం డగుచుం బరాక్రమవంతుం డగు నాపాండునందనుండు సకలజనహితంబుగ ధర్మంబె పరిపాలించుచు మఱియునుం బరిజనంబులం గనుంగొని, కోపంబును, బలాత్కారంబును, నుపద్రవంబును వలదనియును, నర్థిజనంబులకు వలయువస్తువు లొసంగుం డనియును

సకలజనంబులను సంతృప్తులం జేయుం డనియు ననుటయె కాని వేఱొండు వలుకకయుండు. అమ్మహాత్మునిం బ్రజలందఱు దల్లిదండ్రులవలెం దలంచుటం జేసి లోకంబున నతనికి విరోధి యగువాం డొక్కరుండు లేండయ్యెం గావున నజాతశత్రుం డను నామధేయం బతనికి యథార్థంబయ్యె. మఱియును సవ్యసాచియగు ధనంజయుండు నిఖిలశత్రుసంహారంబు గావింప కీర్తిధురంధరుం డగు నకులుండు సకల రాజలోకంబువలనం గప్పంబులు గొని తేఱ, బుద్ధిసంపన్నుం డగు సహదేవుండు ధర్మాధికారియై ప్రవర్తింప ధర్మనందనుండు నీతిమార్గంబు దప్పక ప్రజాపరిపాలనంబు గావించుటం జేసి యతనిరాష్ట్రంబునం గల జనులు కలహం బనుపేరెఱుంగక భయరహితు లగుచు సుఖంబున నుండిరి. యాగసంతానంబును, వాణిజ్యంబును, గోరక్షణంబును, కృషియును, వృద్ధిజీవనంబును, నను నివి మొదలుగాంగల స్వధర్మంబులు దప్పక యాచరించువణిజుండు, సర్వవర్ణంబులయందు వికసించి రాజునకు నర్థసంపాదకుం డగుచుం బ్రవర్తిల్లె. మఱియు నాధర్మపుత్రుని రాజ్యంబున నతివృష్టియును ననావృష్టియును, రోగంబులును, జోరాగ్నిభయంబులును, రాజభయంబును, బరరాష్ట్రంబుల వారలవలన బాటిల్లెడుభయంబును, నన్యోన్యకలహభయంబును, రాజప్రధానులవలన నగు భయంబును లేశమాత్రంబైనను లేదయ్యె. అమ్మహీపాలునకు వస్తువిశేషంబు లొసంగుటకు, గప్పంబు లిచ్చుటకు నతనివిభవంబు గనుంగొనుటకు నై సమ్ముఖంబునకుం జనువారలె కాని నీరాష్ట్రంబున ననీతివాటిల్లె నని యెఱింగింప నరిగెడువాం డొక్కరుండును లేండయ్యె. ఇట్లజాతశత్రుండు ధర్మపరిపాలనంబు గావించుతఱి జనంబులు తమంతనె తెచ్చియిచ్చు ద్రవ్యంబులవలన నతని ధనాగారంబులు పరిపూర్ణంబులై యుండె. అంత ధర్మనందనుండు నిజసహోదరమంత్రిప్రముఖుల రావించి రాజసూయంబు

గావింపవలయు నని పలు తెఱంగులం బలుక వారలయ్యాగంబు సేయు టకుం గృతనిశ్చయుండైయున్న యన్నరేంద్రునిం గనుంగొని బహు కీర్తి ప్రదంబును, సర్వయజ్ఞగుణసమన్వితంబును, యాగశ్రేష్ఠంబును నగు నీరాజసూయంబు సకలరాజలోకంబునుం జయింప సామర్థ్యంబు గలుగు సమ్రాట్టల్లజుం డగు మహీపాలునకె కాని యితరులచే నవ రింప నలవిగాదు. ఈయజ్ఞతంత్రంబు నడపు ఋత్విజులు మాతృపితృ వంశంబులు పదితరంబులనుండియును, సాంగంబుగా వేదంబు జదివి యుండవలయు. మఱియును, సకలధరాధిపులు నిజశాసనంబునం బ్రవ ర్తిల్ల నియతవ్రతుం డగుచు సామమంత్రంబుల షడగ్నిచయంబు గావించి, దర్విహోమంబులును సకలక్రతుసంస్థలు నొనరించి, తనకుం గల సర్వధనంబులును దక్షిణగా నొసంగి, యవభృథస్నానం బొనర్చు మహీపాలునకు వరుణలోకంబు గలుగు. అట్లగుటం జేసి సకలక్షత్రి యులును దమకు నసాధ్యంబయ్యును నీయాగంబు గావింపనే కోరు చుందురు. అట్టియెడ నిఖిల సామ్రాజ్యంబునకు నర్హుండ వగు నీవు రాజసూయంబు గావించుటకు సంశయం బేటికి ? ధరాతలంబునం గలుగు సకలరాజలోకంబును, నేమును, నీపనుపు సేయుచుండ నిప్పుడె యీయధ్వరం బొనరింపు మని వారలందఱేకవాక్యంబుగం బలికి మఱియు వేర్వేరం బలుక నయ్యజాతశత్రుండు ధర్మయుక్తంబులును, హితంబులును, శుభప్రదంబులును, యోగ్యంబులును నగు వారల వచనంబు లాకర్ణించి యాగంబునకుం గృతనిశ్చయుండై యుండె.

ఇది సభాపర్వంబునందు త్రయోదశాధ్యాయము.

---

## అధ్యాయము 14

మఱియును భీమసేనాదు లగు సహోదరులును, బ్రాజ్ఞులగు మంత్రిజనంబులును, మహాత్ము లగు ఋత్విజులును, కృష్ణద్వైపాయన ధౌమ్యప్రభృతులును, బుద్ధిసంపన్నుం డగు దృష్టద్యుమ్నుండును, రాజ ధర్మవిదు లగు విరాటద్రుపదులును, బ్రజ్ఞావంతుండగు సాత్యకియును, సుభద్రానందనుం డగు నభిమన్యుండును, నుత్తమౌజుండును, యుధామన్యుండును, శౌర్యధురంధరు లగు ద్రౌపదేయులును మొదలగు నిజాప్తజనంబులం గనుంగొని కౌరవశ్రేష్ఠుం డగు ధర్మనందనుండు, సకల సామ్రాజ్యాధిపతి యగు సార్వభౌముండు సేయ నర్హ్వం బగు నీరాజసూయం బొనర్ప నాదుమనంబు గోరుచున్నది. దీనికిం దగిన తెఱం గెఱింగింపుం డనిన వారలందఱు నతనిం గనుంగొని, నీసామర్థ్యయోగంబును, దేశకాలంబులను, ధనాగమవ్యయంబులును, పలుదెఱంగులం బరికింప నెల్లభంగుల రాజసూయాధ్వరంబు గావింప నీవే యర్హ్వుండ వని మున్నె నిశ్చయించియున్నవార మని పలుక, విని ధర్మనందనుండు తనమనంబున సకలలోకంబులకును దనకును, హితం బగు తెఱం గెయ్యది యని పలుమఱుం దలపోయుచు, సర్వలోకోత్తరుండును, నప్రమేయుండును, బరమపురుషుండును, నాద్యంతరహితుండును, నజుండును, ననం దగి లీలార్థంబుగా మహీతలంబున నవతరించిన శ్రీకృష్ణుం డీకార్యంబును నిర్వహింప సమర్థుండు, అతండెఱుంగని కార్యంబును, నతం డొనరింపనికృత్యంబును, నతనికి నసాధ్యంబును, జతుర్దశభువనంబులయందును లేదు. అట్లు యగుటంజేసి యెల్లభంగుల నతని రావింపవలయు నని నిశ్చయించి యాజగదీశ్వరుని సమ్ముఖంబునకు, నింద్రసేనుం డనువానిం బనిచె. అతండును వాయువేగంబు లగు తురంగంబులబూన్చిన యరదం బెక్కి ద్వారకానగ

రంబునకుం జని సకలయాదవపరివృతుండై యున్న వాసుదేవునిం గనుంగొని దండప్రణామంబు లాచరించి వినయావనతుం డగుచు నంజలి గావించి, మహాత్మా! వ్యాసధౌమ్యాదిమహర్షి యుక్తుం డును, సకలబంధుమిత్ర సహోదరసహితుండును నగుచు ధర్మనంద నుండు నీదర్శనంబ పేక్షించియున్న వాం డని విన్నవింప,యదుకులాగ్ర గణ్యుం డగు నాకృష్ణుండు వసుదేవబలరాములచే ననుజ్ఞాతుండై పాండునందనులం గనుంగొనవలయు నను వేడ్క నెమ్మనంబునం దళు కొత్త నింద్రసేనసహితుం డగుచు నతిత్వరితగమనంబున నానాదేశం బులం గడచి యింద్రప్రస్థపురంబు చేరి, యనంతరంబ ధర్మనందనుండు తన్ను సహోదరభావంబునం బూజింప, భీమసేనుండు సౌహార్దంబు నెఱప, ధనంజయుండు సఖభావం బొనరింప, మాద్రినందనులు దనకు శిష్యకృత్యంబు వాటింప, నిజసహోదరి యగు సుభద్ర నెంతయు గౌర వించి యర్జునసహితుం డగుచు సుఖోపవిష్టుండై యుండ, నాయదువల్ల భునిం గనుంగొని యాయజాతశత్రుండు, ఉపేంద్రా! రాజసూయం బొనరింపవలయు నని తలంచితి; అది తలంచినంతనే లభించునది యునుం గాదు; ఆయజ్ఞంబు చేకూరు నుపాయం బెయ్యది? దాని వివ రింప నీవే సమర్థుండవు; సకలవస్తుసమృద్ధియును, నఖండభూమండలాధి పత్యంబును, నేసమయంబున నెవ్వరికిం గలిగియుండు? ఆసమయంబున నతండు గావింపందగిన యట్టి రాజసూయాధ్వరంబు నీ వొనరింపు మనుచు బంధుజనంబులు నాతోడం బల్కెదరు; నీవును నట్లన నియ మించితివేని పదంపడి సేయనగు నని నిశ్చయించి యున్నవాండ. అది యెట్లంటేని లోకంబున స్నేహాతిశయంబునం గొందఱు, ధనా పేక్షవలన మఱికొందఱు, నింతయును విచారింపమింజేసి కార్యంబున్న రూపం బెఱింగింపరు. కావున జనవాదం బిట్లు బహువిధంబుల బ్రవ ర్తిల్లు. నీవు సర్వజ్ఞుండవును, మాకు హితుండవు నగుటంజేసి యాచ రింపందగిన తెఱం గెఱింగింపు మనిన.

ఇది సభాపర్వంబునందుం జతుర్దశాధ్యాయము.

---

## అధ్యాయము 15

కృష్ణుండు ధర్మనందనుం గనుంగొని, నిఖిలసద్గుణగణంబుల సామ్రాజ్యంబున కర్హుండవు; అట్లగుటంజేసి నీయెఱుంగని కార్యంబునుం గలదే?, అయినను విశదంబుగం దెల్పెద నాకర్ణింపుము. పూర్వకాలంబున జమదగ్నినందనుం డగు భార్గవరాముండు సకలక్షత్రసంహారంబు గావించుటంజేసి భూలోకం బరాజకంబై యున్నతఱి దేవఋషిగణంబుల యనుగ్రహంబున నిప్పుడీయున్న రాజవంశంబు గలుగుట నీవును వినియుండుదు. ఐలుండును, నిక్ష్వాకుండును, గారణంబుగ నేకశతక్షత్రియ కులంబులు మహీతలంబునం బ్రసిద్ధిగాంచె. అందు యయాతి వంశంబు చతుర్విధంబునై నలుదిక్కులం బఱంగె. సర్వక్షత్రియజాలంబును, నీయయాతికులసంభవు లగు మహీపతుల నాశ్రయించి ప్రవర్తించుచుండుదురు. ఇట్లుండ నన్యోన్యంబును మిత్రభేదంబు గావించి జరాసంధుండు చతుస్సముద్రపరివేష్టితంబగు మహీమండలంబంతయును నేకఛత్రంబుగం బరిపాలించు చున్నవాండు. ఈయేకశతవంశసంభవులగు క్షత్రియులందఱును, నతని శాసనంబు శిరసావహించి మెలంగెదరు. మఱియును, బరాక్రమ ధురంధరుం డగు శిశుపాల మహీపాలుం డతనికి సేనానాయకుండై యుండు. మాయాబల సమన్వితుండును, గరూశ దేశాధీశ్వరుండును నగు దంతవక్త్రుం డతనికిం బరమభృత్యుండై యుండు. బాహాబలసంపన్ను లగు హంస డింభకులను నామధేయంబులు గల యిరువురు రాజన్యు లతనిని గొలిచియుండుదురు. మఱియు దంతవక్త్రుండును, గరూశుండును, గరభుండును, దివ్యరత్నంబు శిరంబునం గలుగుటంజేసిభూతమణి యనంబ్రసిద్ధి గాంచిన మేఘవాహనుండును నాజరాసంధుని సేవింపుదురు. మురుండును, యవనుండును నను

యవనదేశాధీశ్వరులు దన్ను నుపాశ్రయింపం బశ్చిమదిగ్భాగంబున వరుణదేవుని మాట్కిం దేజరిల్లు నతిలోకపరాక్రమధుర్యుండును, బాండు మహీపాలునకు సఖుండును, ననం బ్రసిద్ధుం డగు భగదత్తుం డును నతనికి విధేయుండై యుండు. అట్లుండియును నీయందు మిగుల ననురక్తుం డగుటం జేసి నీవు నతనియెడం బితృభావంబు గావింప వలయు. మఱియు దక్షిణదిగ్భాగంబునం బశ్చిమదేశంబునం గల నృపాలురందఱును, భయభ్రాంతు లగుచు నామగధవల్లభు ననుస రింపుదురు. కుంతీదేశాధీశ్వరుండును, శూరాగ్రేసరుండును, శత్రు భయంకరుండును నగుపురుజిత్తుండును, జరాసంధునిం గలసి మున్ను నాపై సమరంబునకు వచ్చినతెఱి నీకు మాతులుం డగుటం దలంచి నే నతని సమయింపనైతి. ఆపురుజిత్తుం డొక్కరుండ నీయం దెం తయు ననురక్తుండై యుండు. మఱియును, బుండ్రవంగకిరాతచేదికై శికదేశంబులం గల జనంబుల నిజభుజాబలంబున సంరక్షించుచు మహేంద్రసమానభోగంబు లనుభవించుచు లోకంబునం బురుషోత్త ముండు నేన కాని వేఱొక్కరుండు కలండే యని నన్ను నెంతయు నవమానించి మదాంధుండై నాచిహ్నంబు లగు, శంఖచక్రాదిసాధ నంబులు దనచతుర్భుజంబుల ధరియించి పౌండ్రకవాసుదేవుం డను నామంబున లోకంబునం బ్రవర్తిల్లుచుం బరాక్రమంబునం బరశు రామసమానుం డగు నాహ్వృతి యను నిజసహోదరుండును దాను నాజరాసంధునకుం బరమమిత్రులై యుండుదురు. మఱియును, రుక్మిణీజనకుం డగు భీష్మకుండు గులంబును, బలంబును, దనయాభి జాత్యంబును, గీర్తిప్రతాపంబులును, లేశమాత్రంబేనియు మనంబు నం దలంపక, వినీతుల భజియింపవలదని బహువిధంబులం బ్రార్థించు మమ్మును మాప్రభుత్వంబును జీరికింగొనక యవమానించుచు నామగ ధేశ్వరునకు వశవర్తియై మెలంగెడు. మేమును జరాసంధభయంబునం

జేసి పదునెనిమిది కులంబులవారలతోం గూడ నుత్తరదేశంబు వర్జించి యీ పశ్చిమదిగ్భాగంబునం జేరియున్నారము. అదియునుంగాక శూరసేన, భద్రక, సాల్వ, పటచ్చర, సుస్థల, శకట, దాశ, కుళింద కుంతిదేశాధీశ్వరులు నిప్పుడీదక్షిణదేశంబున నున్న పాంచాలురును, పూర్వదిగ్భాగంబున నున్నకూశవులును, బశ్చిమదేశంబునవసియించు మాత్స్యులును, మొదలుగాంగలమహీపతులు జరాసంధునివలని భయంబున నుత్తరదిగ్భాగంబుంబరిత్యజించి మెలంగెదరు. మఱియుగిరివ్రజపు రాధ్యక్షుండగు మగధుండు విజయయాత్ర వెడలకమున్నె పాంచాలురు భయభ్రాంతులై చెదరి నలుదిక్కులం జేరిరి. ఉగ్రసేనతనూభవుండగు కంసుండు నస్తియు ప్రాప్తియు నను నామధేయంబులుగల జరాసంధుని కన్యకల వరించుటం జేసి గర్వోద్దీపితుం డగుచు సకలమహీపాలురనవమానింప, వారలందఱును, నన్నుం బ్రార్థించుకతన నాహుకుని పుత్రిని నక్రూరుని గొనంగి నేను బలరామసహితుండనగుచుం గంసుని, నతని సహోదరుం డగు సునామునిం బరిమార్చి బంధుహితంబు గావించితి. అంతం గంసుని నిధనం బెఱింగి జరాసంధుండు సకల సేనాసమేతంబుగం గదలి మధురానగరంబును జుట్టుముట్టి యతిఘోరంబగు సంగ్రామం బొనర్ప, నేమును యాదవభోజాంధకప్రముఖుల బలంబులం గూర్చుకొని యనేక సస్త్రాస్త్రంబుల నానావిధాయుధంబుల సమరం బతిఘోరంబుగ సంవత్సరత్రయంబు గావించి యతని సేనాసముదయంబు నిరవశేషంబు గావించితిమి. జరాసంధునకు హంస డింభకులను మహీపతులు పరమమిత్రులై ప్రవర్తిల్లెద రని మున్నె యెఱింగించి యుండుదుంగదా! అమ్మువ్వురు నొక్కముఖంబున నడచిరేని భువనత్రయంబు నిమిషమాత్రంబున హరింపజాలుదు రని లోకంబునం గల మహీపతు లాడుకొనుమాత్రంబె కాదు. నాహృదయంబున సట్లతోంచుచున్నయది. ఇతనితోం బదునెనిమిదివరుసల నతి

ఘోరంబగు సంగ్రామం బొనర్చియుండియును శౌర్యాటోపసమన్వి తుండగు మగధేశ్వరుండు నిహతుండు గాండయ్యె. అతిఘోరంబగు సమరంబున హంసుండు తెగటారె నని డింభకుని కెఱింగింపం దనకుం బరమమిత్రుం డగు హంసుండులేని యీ లోకంబున నెట్లు నిలువరించ నేర్తు నని యతండు యమునాప్రవాహంబున నుఱికి మృతుం డయ్యె. పదంపడి యీవృత్తాంతం బంతయు హంసుం డెఱింగి తానును నానదీజలంబుల మునింగి హతుం డయ్యె. అంతయు విశదంబుగం దెలిసి జరాసంధుండు శూరసేన దేశంబులం బరిత్యజించి గిరిప్రజనగరంబునకుం జనియె. అంత నేమును మధురానగర ప్రవే శంబు గావించి సంతుష్టాంతరంగుల మగుచు సుఖంబునం బ్రవర్తిల్లి తిమి. కంసభార్య లగు నాజరాసంధకన్యకలు పతివియోగదుఃఖిత లగుచు మాతోడి సమరంబునకు నమ్మగధేశ్వరు నిప్పుడుం బురికొ ల్పెదరు. అంత నేమును నాజరాసంధునియెడం గావించిన మహాప కారంబు మనంబునం దలంచి యొండొరు నెఱుంగకుండ నలుదిక్కులం బరచి వైభవంబు ప్రకాశంబు గానీక యడంకువలై మెలంగుచుం బశ్చిమదిగ్భాగంబునం దొలుత రైవతుం డనుమహీపాలుండు నెలకొని యుండినం గుశస్థలీనగరంబు శూన్యంబై యుండుటం జేసి మేమంద ఱము నంద వసియించి యున్నవారము. అమ్మహాదుర్గంబు దేవదాన వులకు నసాధ్యంబై యుండు. అయ్యెడ వసియించి యున్న యబలాజనంబునకేనియును సమరం బొనర్ప సామర్థ్యంబు గల దనునెడ నింక యాదవవీరులం జెప్పనేల? ఇట్లసా ధ్యంబగు ద్వారకానగరంబు సమీపంబునంగల రైవతకపర్వతంబును మాధవీతీర్థంబునుం బ్రాపుగాం జేరి వసియించుట కతన నిర్భయం బుగ సుఖించెదము. ఇటుల జరాసంధునితో మహావిరోధంబు ప్రాప్తం బయ్యెం గావున బలవంతులును బాంధవులును నగు మిమ్ము నుపాశ్ర

యించెదము. మఱియు నా ద్వారకానగరంబు మూఁడుయోజనంబుల పరపును నాలుగు యోజనంబుల నిడివియును నతి విచిత్రపురద్వారంబును నష్టాదశకులక్షత్రియకుల సమన్వితంబును నై తనరారుచుండు. ఆనగరంబున నష్టాదశసహస్రసంఖ్యం జెలంగెడు నానసహోదరవర్గంబును, మహేంద్రసమానులై శతసంఖ్యం దనరు నాహుకపుత్రులును, జారుదేష్ణుండును, నతని సహోదరుండగు వక్రదేవుండును, సాత్యకియును, నేనును, బలరాముండును, సాంబుండును, బలపరాక్రమసమన్వితులమై యుండుదుము. మఱియునుం దెలిపెద కృతవర్మయు, సనాదృష్టియు, సమీకుండును, సమితింజయుండును, గంపాలుండును, శంఖుండును, నిరాదుండును, బ్రద్యుమ్నుండును, ననిరుద్ధుండును, భానుండును, నక్రూరుండును, సారణుండును, శరుండును, గదుండును, నను నీ పదునలుగురుమహారథులును, వితంద్రుండును, ఝల్లియును, బభ్రువును, సుప్తవుండును, విదూరథుండును, వసుదేవుండును, నుగ్రసేనుండును, నను సప్తమంత్రిజనంబులును బ్రతిదినంబును బహుసువర్ణంబు గురియుచుండు శమంతకరత్నం బెవ్వరికింగల దట్టిప్రసేనుండును, నతనికుమారదశకంబును, మహారథికులును, భుజవీర్యధురంధరులు నగునట్టి వృష్ణివీరుల మందఱము మాపూర్వనివాసం బగు మధ్యదేశంబు సంస్మరించుచుం బాండునందనులగు మిమ్ము దొరలుగా నెంచి యాశ్రయించి యున్నవారము.

ఇది సభాపర్వంబునందు పంచదశాధ్యాయము.

---

## అ ధ్యా య ము 16

అని కృష్ణుండు మఱియు ధర్మనందను నుద్దేశించి యిట్లు జరాసంధుండు బలసంపదలం బెంపువహించి సుఖంబున నుండ నీకు సామ్రాజ్యం బెవ్విధంబునం జేకూరనేర్చు? మఱియు దుర్యోధనుండును, భీష్ముండును, ద్రోణుండును, నశ్వత్థామయు, గృపుండును, గర్ణుండును, శిశుపాలుండును, రుక్మియును, నేకలవ్యుండును, ద్రుముండును, శ్వేతుండును, శల్యుండును, శకునియు నను నీయతిరథశ్రేష్ఠుల సమరంబున నిర్జింపక రాజసూయం బెట్లుగావించెదవు? అయినను వీరలందఱు నీయందలి గౌరవంబు పాటించి మైత్రిసేయుదురుగాని సమరంబునకు జేరరు. అర్జునియును, భుజాబలోన్మత్తుండును, దివ్యాస్త్రకోవిదుండును, వైకర్తనుండును నగు కర్ణుం డొక్కరుం డెప్పుడును మీతో మత్సరించియుండుటంజేసి యతండు సంగ్రామంబు సేయక మానండు. ఇది యట్లుండె. అట్లు శౌర్యధుర్యుం డగుజరాసంధుండు ప్రాణంబులతో నుండ నీకు రాజసూయం బెట్లులభించు? సింహంబు కరికలభంబులం గొనిపోయి గిరిగుహామధ్యంబున నిడికొన్నకైవడి సకలరాజన్యలోకంబునుంబట్టి బంధించి యతండు కారాగృహంబున నిడియె. అదేమిటి కంటేను, నాజరాసంధుండు మూర్ధావసిక్తులగు నష్టసహస్రరాజన్యులం బశువులుగ నొనర్చి యజనంబు గావింపవలయునని తలంచినవాండగుటం జేసి మహాదేవు నుద్దేశించి తపం బొనరించి యతని ప్రసాదంబువలన సమరముఖంబు నమూర్ధాభిషిక్తులగు నరపతులం జయించి తెచ్చి గిరివ్రజంబు గావించియున్నవాండు. నేమును నతనివలన వాటిల్లుభయంబునం మధురానగరంబువిడిచి పుత్రమిత్రసహితంబుగ ద్వారకానగరంబునం గదా యిపుడు నెలకొనియున్నవారము, మాకు నిట్టిబలవద్విరోధంబునకుం గంససంహారంబే మూలకారణంబయ్యె. అది యిట్లుండె.

నీకు నియ్యాగం బొనర్చుట యభిమతంబేని యెల్ల భంగుల నతని సమరంబున నోర్చి కారాగృహంబుననున్న నరపాలుర విడిపింపుము. నీకు నివ్విధంబునం బలుమఱు దెలుపనేటికి? ఎన్ని విధంబుల జరాసంధుని వధియించుటయ యియ్యాగంబునకుం బ్రధమారంభంబు. కావున దీనికిం దగిన యుపాయంబు జింతింపుము. అతనిం జయించుటయె సకలరాజలోకంబునుం జయించుటగా నెఱుంగుము. నాకుం దోంచినంతయు నెఱింగించితి. ఇంక నీచిత్తంబున నెయ్యది నిశ్చయించితివి అది నాకు వివరింపు మనియె.

ఇది సభాపర్వంబునందు షోడశాధ్యాయము.

---

## అధ్యాయము 17

---

వాసుదేవుని గనుంగొని ధర్మనందనుండు తెలుపందగినదంతయు నీవ తెల్లంబుగ నెఱింగించితివి. ఇంత యెఱుంగ సామర్థ్యంబింక నెవ్వరికిం గలదు? ఇట్లు సకల సంశయంబులు తీర్చి రక్షింప మాకు నీకంటెం బ్రాణబంధుం డెవ్వండు? అతిప్రయాసంబున సాధింపందగిన సామ్రాజ్యపదంబు గృహంబున సుఖంబున వసియించి యపేక్షించువానికి నెవ్విధంబున సమకూరు? బుద్ధిబలసమన్వితుం డగు మహాత్ముని సహాయంబు లేక నేర్పరి యగువాండు కార్యం బారంభించునె? నానారత్న పరిపూర్ణంబును నతివిశాలంబును నగు మహీతలంబంతయు నేక ఛత్రంబుగం బరిపాలింపక రాజసూయం బాచరింప సామర్థ్యం బెవ్విధంబునంగలుగు? పూర్వంబున ననేక యాగంబులు గావించి మాంధాతృమహీపాలుండును, నిఖిలధరాచక్రంబులు పరిపాలించి భగీరథుండును, మహనీయతపోమహత్వంబున గార్తవీర్యం

డును, నిజభుజాబలమహిమంబున భరతుండును, మహత్తరం బగు నైశ్వర్యంబున మరుత్తుండును, సామ్రాజ్యాభిషిక్తులై ప్రవర్తిల్లిరని విందుము. అట్టి మహనీయమహానాభిరాము లగు తొలుతటి మహీపతులకైనను బహు ప్రయత్నసాధ్యం బగుననిన నిప్పుడు మన మీయాగంబు గోరుట కంటె నీచింతఁ దక్కి యూరకుండుట మేలని తోఁచుచున్నయది అనునెడ, భీమసేనుండు వాసుదేవునిం గనుంగొని, యుత్తమం బగు నీయాగం బారంభించిన నెఱవేరుటకు సందియంబు లేదని నామనంబునం దోఁచుచున్నయది. న్యాయధురంధరుండ వగు నీవును జయశీలుండగు పార్థుండును, భుజాబలసంపన్నుండనగు నేనునుం గూడిన నగ్నిత్రయంబు మూఁటికిం దేజరిల్లుదుము. మేము నీకటాక్షంబునం జేసి యామగధాధమునిం జయించెదము. అంత ధర్మనందనుని యభీష్టంబును నెరవేరెదు. జగదీశ్వరుండ వగు నీవు మాకధీశ్వరుండవై యుండ జయలాభంబులు జేకూరుటకు సంశయంబునుం గలదె, అనిన గోవిందుండు వాయునందను నుపలక్షించి, బాలుండగు వాండు మీఁదువిచారింపక తనపూనిన కార్యంబె ప్రధానంబుగం దలంచిచేసెనేని తుదినసర్థంబు వాటిల్లు టం జేసి నీవుధర్మార్థమార్గంబున మనశక్తియును నతని బలసంపదయును, విచారింపుము. బృహద్రధనందనుం డగు నాజరాసంధునితోడ నూటయొక్క కులంబులం గల రాజవర్యులలో నింతకాలంబును నెవ్వండేనియు సమరంబునకు నెదిరించినదియునుం గలదె? అట్టి బలశౌర్యధుర్యుండగుటం జేసి యతండు,—మూర్ధాభిషిక్తులందరును వారి వారి యోగ్యతానుసారంబుగా శ్రేష్ఠంబులైన వజ్రవైడూర్యగోమేధికపుష్యరాగమరకతమాణిక్యాది రత్నవిశేషంబులను రథగజతురగంబులను సువర్ణంబును వేలకొలది ద్రవ్యంబును కానుకలుగా నిచ్చుచున్నను అజ్ఞానంబు గలవాడై దుష్టతనంబున యారాజన్యపుంగవుల విడువక బాధించుచు

తప్పు సేయనివారలైనప్పటికిని ఆరాజులనందర యించుమించు నూరు గురువరకు బలాత్కారంబునం బట్టితెచ్చి చెరయందుంచి తానే శ్రేష్ఠుండై గర్వాతిశయంబున యెట్టి వారలను లక్ష్యపెట్టక సంచరించు చున్నాడు. గనుక ఓధర్మరాజా! సత్వహీనుండును, ధర్మరహితుం డును, యుద్ధనైపుణ్యంబు లేనివాడును నగు వాండు అతనిని జయిం చుట అతికష్టంబు గనుకనే చెరయందుంచిన రాజులనందరిని తండుల ప్రస్థకమునందు తాను చేయుచున్న శివపూజాకాలంబున ఈశ్వరుని ప్రీతి కొరకు దినంబున కొక్కరునిగా బలియిచ్చుచు నుండుటచేత ఆరాజు లందరు దేహాభిమానంబు వదలుకొని జీవితవాంఛ లేక యుండిన వారవుచుండగా మదాంధుండగు ఆజరాసంధుండు మిగిలిన రాజుల చెరబట్టు నిశ్శేషంబుగా శతసంఖ్యను బూర్తి చేసుకొని భూత పతికి విధానపూర్వకంబుగా బలియిచ్చి వ్రిత సమాప్తినొందించిన వాడైన అతనిని జయించుట యెట్టివారికైనను సాధ్యంబుగానేరదు. గావున ఓపాండునందనా! యీలోపున వ్రత భంగంబు గావించి యుద్ధంబున జరాసంధుని నిర్జించినవాడు కీర్తియును రాజ్యాధిపత్యం బును రాజబంధమోక్షణంబును నగు ఫలంబును పొందును.

ఇది సభాపర్వంబు నందు పదునేడవ అధ్యాయము.

---

## అధ్యాయము 18

---

ఇవ్విధంబున బలికిన కృష్ణభగవానుల మాటలు విని ధర్మ జుండు నివ్వెరపడి తత్తరంబగు మనంబుగలవాండై కృష్ణునుం జూచి నారాయణా, నేను చేయుకార్యంబునందు వాంఛగలవాండనై సాహ సంబు గలిగి దుష్టవర్తనుం డగు ఆమాగధునివద్దకు యెవ్విధంబునం

బంపగలుగుదును. నాకు భీమార్జునులు కన్నులు వంటివారు నీవు మనసు వంటివాడవు. నేత్రంబులు, మనంబును, లేనివానికి బ్రతుకు యెందుకు? భయంకరంబగు పరాక్రమంబు గలిగి లెక్కపెట్టుట కసాధ్యమగు మాగధసైన్యంబును జయించుట యమునికైనను అసాధ్యంబగు చుండగా మీరు మార్గాని యేమి చేయగలుగుదురు? యికార్యంబున మనకు కీడును అపకీర్తియు యజ్ఞవిఘ్నంబును గలుగును గాన రాజసూయాధ్వరంబు చేయుట మనకు కష్టమని దోచుచున్నది. మాధవా! నామనసున యోచించిన విషయము చెప్పెద నాలకింపుము. రాజసూయంబు దిగ్విజయంబుతో కూడినదియు గాన యీ రాజుల నందర జయించి యాగంబు పరిసమాప్తి చేయుట కష్టము గనుక భయంబుగలవాండనైన నేను యజ్ఞంబు నిలుపుట మంచిది యని నాకుం దోచుచున్నది, అని ధర్మజుండు పలికిన ఇంద్రాత్మజుండు వినినవాండై శ్వేతాశ్వయుక్తంబును హనుమత్కేతనంబునుంగా రథంబాయితంబు గావించి. అక్షయతూణీరంబులును గాండీవంబును ధరించి అగ్రజుం గాంచి, మహారాజా! యితరులకుం బొందరాని విల్లును, అక్షయతూణీరంబులుం గల పొదయును దివ్యాస్త్రంబులును, అనేక శస్త్రంబులును, పరాక్రమంబును, సహాయంబును, భూములను, యశస్సును, బలమును ఇంకను గోరినవెల్లను బొందియు శత్రువులను జయించుటకుం భయపడుచున్నవాండవు. ధనుర్విద్యావిశారదులగు పండితులు శౌర్యవంతమైన కులంబులో పుట్టుట అరుదని పెద్దలు చెప్పుదురు. గాన బలవీర్యంబులతో సమానమైన గుణంబు మరొకటిలేదు. బలములేనివాడు బలవంతులయందుద్భవించినను యేమి చేయగలడు. బలవంతుండు బలహీనునియందు గలిగినను యశస్సును కీర్తిని బొందును. సద్గుణంబులు విశేషించి [illegible]యునను శత్రువుల గెల్చుటయందు వుత్సాహంబు బొందు

ధీరుడు తప్పక జయంబు పొందును. శిష్టగుణంబు లెన్నియున్నను బలహీనుండు ఏమి చేయగలండు, గావున వీర్యవంతుని యందు సమస్త సద్గుణంబులును ధర్మంబును కీర్తియు సౌఖ్యంబును మొదలయినవి గలిగియున్నవి. దలంచిన కార్యంబు నెరవేరుటయే జయంబునకుం గారణంబు. జయంబు దైవాధీనంబు. పౌరుషంబు గలిగి ప్రయత్నంబు జేసిన, దైవానుకూలం బుండిన యెడల శత్రుజయంబు గలుగును. పౌరుషంబు గలిగి ప్రయత్నంబు జేసినను దైవసహాయంబు లేనిదియయిన కార్యంబు నెరవేరక బలవంతుండైనను శత్రువులకుం జిక్కువడును. శత్రుజయంబుగోరిన పండితుండు బలవంతునకు జడియుటయు వెనుదియ్యుటయు ననునివి రెండును విసర్జించవలయును. ఇదియునుంగాక యమ్మాగధుని విదళించి చెరసాలయం దున్న మహారాజుల విడిపించినయెడ అంతకన్న కీర్తియు సుగుణంబులును క్షత్రియునకుంగలవె? యజ్ఞంబునకు యింతకన్న కావలసినదేమియున్నది? ఈసమయంబున మనమూరకయుండిన మనబలంబును ధైర్యంబును బహుపరాక్రమంబును రథగజతురగపదాతిచమూసముదయంబును గాండీవాదియుద్ధపరికరంబును నిందనీయంబులు. జనులుపరాక్రమహీనులని మనలను దూషించెదరు. జయంబు పొందుటకు తగినంత యుద్ధసాధనంబులు గలిగియు సాధనంబులు లేనివారిగను బలహీనులగను నేల తలంచుకొనెదవు? శాంతిని బొందదలంచిన యోగీశ్వరులు కావివస్త్రములు గట్టియుండుట తగును గాని క్షత్రియులమై పరాక్రమవంతులమైన మనము శాంతిని వహించియుండుట తగవగునె? మనము శత్రులతో బోరిన వారలను జయించుదుము. దానం సామ్రాజ్యంబును శ్రేయస్సును తప్పక నీకు సిద్ధించును.

ఇది సభాపర్వంబునందు పదునెనిమిదవ అధ్యాయము.

## అ ధ్యా య ము 19

అనిన విని ధర్మజుండు జరాసంధుని జన్మక్రమంబు దెలుసుకొన నిశ్చయించి కృష్ణునింజూచి, పుండరీకాక్షా! జరాసంధుని జన్మక్రమంబు దెలుపుమని యడుగుటయు కృష్ణుండు పాండవాగ్రజుంజూచి ధర్మపుత్రా, మనసవ్యసాచి భరతవంశంబున కుంతీమహాదేవికిం బుట్టినందుకు తగినమాటయె జెప్పియున్నాడు. మృత్యువు పగటియందో లేక రాత్రియందైనను యెపుడో యేవేళనో మనకుం దెలియదు. యుద్ధమునకు వెళ్ళనివారందరును బ్రతికియుందురని మనము విన్నదియు లేదు. న్యాయశాస్త్రంబున వచించినరీతిగ ధీరుండగుటకు ఫలంబు శత్రువులను జయించి కప్పంబు గొనుటయె. ఇది పరాక్రమంబుగల పండితులకు యిష్టమైనది. న్యాయవేదియగువాండు దైవసహాయంబు గలవాండు నంగలసిన నెక్కువ మేలుగలుగు. అట్టివారి కూడికచేత భేదంబు గలుగునుగాని పోలిక గలుగదు. న్యాయ మెఱుంగనివాడును ఉపాయంబులులేనివాడును గలిసిన నిక్కిలి చెఱుపుగలుగును. ఋద్ధగును మూర్ఖులగుటవలన వారు బ్రహ్మవిషయములయందైనను సందేహంబులు గలిగి అపజయంబు బొందుదురు. కాబట్టి మనము న్యాయంబుం దెలిసి యుపాయంబులు బొంది శత్రువులం జేరంజని సంపూర్ణప్రవాహంబు గల నదీతీరంబుననున్న వృక్షంబులు ప్రవాహాయువడిచే వేళ్ళతోడి బెకలించివైచినపగిది వాని నక్కడగింతుము. తమ లోపంబులు సవరించుకొనక శత్రువుల లోపంబుల గనిపెట్టి వారి పైకింగలియు రాజులు బలవంతులును బరాక్రమంబులు గల సైనికుల నిల్పిన దుర్మార్గులైన పగతురతోడి గయ్యంబు సేయరాదని బుధులు చెప్పుదురుగాన నిప్పుడు నాకును నదియె తగినదని దోచుచున్నది. మెలుకువగల వారమై శత్రుల కగమ్యగోచరులమునై జరాసంధునింటికిం జని శత్రు

ప్రదేశంబు నాక్రమించి కార్యానుకూలంబు నెరవేర్చుకొందము. జీవాత్మయందు సకలభూతంబులందు వ్యాపించునట్లు వొక పురుషుడే భూమండలంబంతయును నేలునుగాన కావలిసినంత సహాయసంపత్తు గలిగియున్న మాకు జయంబు స్థిరంబు. అదియునుంగాక యతనిం దెగ్గర్చగనె యతని బంధువులు చెలరేగి రోషంబు గలవారలై బంధువులను సంరక్షించుటయందు ఆసక్తిగలిగిన మనలను జంపిరేని మనము వీరస్వర్గమును బొందగలుగుదుము, అని చెప్పిన విని ధర్మజుండు వాసుదేవునింజూచి, నారాయణా! అగ్నియందుబడిన నిడుతదగ్ధంబుగాక బ్రదికినట్లుండి. నిన్నెదురించియుం జావక బ్రతికియుండుట నాకుంజూడ ఆశ్చర్యంబునుం గలుగుచున్నయది. వా డెంతటి శూరుండో వాని పరాక్రమం బెంతటిదియో నాకుం దెలియంజెప్పుమని యడిగిన, కృష్ణుండు ధర్మజునకుం జెప్పందొడంగె. ధర్మాత్మజా! జరాసంధుని బలంబును, పరాక్రమంబును, స్థైర్యంబును మాకుం జేసిన యపకారంబులును యింతకాలంబు అతనినిం దెగ్గర్చకయుపేక్షించిన విధంబును మొదలుగాంగల సర్వంబునుం దెలియంజెప్పెద వినుమని చెప్పందొడంగె. పూర్వంబున బృహద్రధుం డను రాజు మూడక్షౌహిణుల సైన్యంబుతో యుద్ధంబులయందు శత్రుజయంబు గలిగి పరాక్రమవంతుండై సౌందర్యంబును, రూపంబును, ధైర్యంబును, సంపదలును గలిగి విడువనినియమంబుగలవాడై భూలోక దేవేంద్రుండో యనందగి కాంతియందు సూర్యుని, శాంతియందు భూమిని, కోపంబున దండధరుని, సంపదలయందుం గుబేరునిం బోలినవాండై గిరివ్రజపురంబునుం దనకు రాజధానిగా జేసుకొని మగధదేశంబునుం బరిపాలించుచునుండె. సూర్యుండు దనకిరణంబుల భూమియం దంతయుం బ్రసరింపంజేయునటుల దనపరాక్రమాదిగుణంబుల వ్యాపింపంజేసి సౌందర్యాదిగుణంబులయందు ప్రశస్తవంతులగు కాశీరాజు కూతుం

ద్రను నిద్దరినిం బెండ్లియాడి తన రాజధానియందు సౌఖ్యంబుగా గాలంబుం గడుపుచుండ, ఒకనాడు పత్నులనిద్దరనుం బిలిచి మీయిష్టానుసారంబుగా యిద్దరకు నొక్కరీతిగా పక్షపాతంబుంజేయక మెలంగుదునని బలికి వారికిం సంతసంబు గలుగంజేసినవాఁడై రెండు ఆడుయేనుగులనుంగూడి విహరింపుచున్న గజేంద్రునిమాడ్కి దన ప్రియపత్నులతో విహరించుచునుండ విషయాది ఇంద్రియసుఖంబులచే యౌవనం బతిక్రమించెంగాని వంశోద్ధారకం బగు సంతానంబు గలుగందయ్యె. సంతానార్థంబు అశ్వమేధంబులునుం బుత్రకామేష్టియును బలుతెరంగులైన కార్యంబులునుంజేసియు వ్యర్థంబులయిన యాబృహద్రథుండు తనభార్యలతోఁడిగదలి తనరాజధానికి సమీపంబుననున్న తపోవనంబునకుం జని అందు గౌతమవంశజుండును గాక్షీవంతుని పుత్రుండును నుదారుండును తపోనిధియును వృక్షమూలంబున నాసీనుండునునగు చండకౌశికుండను మునీంద్రునింజూచి షోడశోపచారంబులచేతను సమ్మానంబులచేతను గురుభావంబునం బరిచర్య జేయుచున్న యారాజదంపతులం జూచి దయగలిగినవాఁడై సత్యవాక్యంబును, తపోమహిమంబునుంగల యాఋషిశ్రేష్ఠుండు మహారాజా! నేను నీచేతంజేయబడిన శుశ్రూషాదిపరిచర్యలచేతను నీగురుబుద్ధికినిం జాల సంతోషించినవాండ, నీకుం గావలసిన వరంబువేడుమిచ్చెదననిన వెంటనే యారాజశ్రేష్ఠుండు భార్యలతోఁడి లేచి నిలువంబడి కృతాంజలులై యామునీంద్రునకు సాష్టాంగదండప్రణామంబులాచరించి సంతానంబు లేకుండుటంజేసి చాలావ్యథగలవాడై కన్నీళ్లు వరదలై పార, మహానుభావా, సకలవ్రతంబులాచరించియు సమస్తయజ్ఞంబులుంజేసియు సర్వతీర్థంబులం గ్రుంకియు సంతానలాభంబు బొందనేరక వృద్ధాప్యంబు చేతంజిక్కువడి తపంబునకై వచ్చియున్న నాకు

వరంబులేల రాజ్యాదిభోగైశ్వర్యంబులేల యనియునుం బలుక, నప్పు డమ్మునీంద్రుండు విని జాలినొందిన మనంబుగలవాండై యామామిడి చెట్టుక్రింద గూర్చుండి తపంబు నేయుందొడంగె. ఇవ్విధంబున తపంబు జేయుచుండగా వృక్షాగ్రంబున నుండి పక్వంబైన ఫలంబు తొడ మీాదంబడిన చండకౌశికుండు ఆఫలంబును అభిమంత్రించి సంతాన కారణరూపం బగు యాయపరూపంబైన మామిడిఫలంబును బృహా ద్రథుని జేతంబెట్టి మహారాజా! నీవు కృతార్థుండవైతివి. శీఘ్రంబు నంపత్తిణంబునకుం జనుమనిన యారాజశ్రేష్ఠుండు చండకౌశికునకుం బ్రిణామంబు లొనరించి గృతార్థుండనైతినని సంతసంబు నొందుచు గృతాంజలియై మునీంద్రునామంత్రణంబువడసి తనరాజధానిం బ్రవే శించి, పూర్వకాలంబునం దా నొనరించిన శపథంబును మరువనివాండై యాఫలంబును యిద్దరుం భుజింపుమని యిచ్చిన యాకాశిరాజు కుమా ర్తెలు తమకు సంతానంబు లేకపోవుటచేతను మునీంద్రుని యందలి గౌరవంబువలనను సంతోషంబుగలవారలై యాఫలంబును రెండు ఖండంబులుగా జేసి చెరివకముక్కను భక్షించినవారలైరి. వెంటనే కొన్నిదినంబులకు మునీంద్రుని తపోమహిమంబుచే యిద్దరుం గర్భి ణులై యున్న భార్యలం జూచి బృహాద్రథుండు అపరిమితాను రాగంబైన సంతోషంబునుం బొంది యుండగా వారలకు నవ మాసంబులుం బరిపూర్ణంబులై ప్రసవసమయంబు రాగానే యా రాజపత్ను లిద్దరును నొక్కచెవియును, సగముముక్కును, యొక్క కన్నును, నొక చేయియును, నొక కాలును, సగముమొగమును, సగము యుదరంబును అర్థపిరుదునుం గలిగిన రెండు ఖండము లనుంగా గనిరి. అట్లు గలిగి కదలుచున్న యాఖండంబులనుం జూచి వారు భయభ్రాంతులై ఆశ్చర్యంబు నొంది, చెలికత్తెనుం జూచి యీావికారరూపంబులగు యీాగర్భపిండంబుల నవలంబార వేయుమని

చెప్పిన, దాసియు నట్లనే యాఖండంబుల నొక్క గుడ్డయందు ముడిచి యితరులకుం గానరాకుండగ అంతఃపురంబు దాటి నాలుగు దోవలు కలియు కోటవాకిలి ప్రక్కన పరుండబెట్టి రాణివాసంబు జేరినవారై జరిగిన విషయంబును రాణీలకుం జెప్పినవారై యుండగా, ధర్మనందనా! ఆగ్రామంబున రాత్రికాలంబునందు మాంసంబును రక్తంబును నాహారంబుగా గల జర యను రాక్షసి సంచరించుచు పడి దొరలుచున్న ఆ రెండుఖండంబులకుం జూచి యారెంటిని సంధించిన యెడల మోసుకొనిపోవుటకు సులభముగా నుండుననను యుద్దేశ్యము గలిగిదై వాధీనము చేత యా రెండుఖండంబులనునొక్కటిగాచేర్చి అదుమగా మునీంద్రునితపోమాహాత్మ్యము చే రూపవంతుండును, బలవంతుండును, శూరుండును నగు బాలుం డయ్యెను. ధర్మనందనా! అంతట యా రాక్షసి ఆశ్చర్యముగలదియై కన్నులుచక్కగా విచ్చిచూచి పిడుగువలె భారవంతుండైయున్న యా బాలునిం మోయంజాలక విసుగుకొనుచున్న సమయంబున ఆ బాలుండు యరచేతితో గూడిన పిడికిలి మోమునననిడి కొని యురుముసమానంబైన ధ్వని చేత నేడ్చుచున్న బృహద్రథుండు అంతఃపురంబునం గళవళంబునొంది రాణివాసజనంబులతోడ వెలుపలికి వచ్చిరి. అప్పుడు రాజభార్యలు యింక సంతానము గలుగదను చింత గలిగినవారలై యేడ్చుచున్న బాలకునిం జూడగనె స్తన్యము వరదలై పారందొడంగె. అంతట జరాదేవియు సంతానము లేక చాలకాలమునుండి పరితాపంబు నొందుచు వ్యధనుంబొంది దీనులై యున్న యారాజదంపతులకుం జూచి యిట్లని చింతింపందొడంగె. ఆబృహద్రథుండు, ధర్మవంతుండును, పుణ్యాత్ముండును, బుత్రులం గోరుచుండువాడునుం గావున యిట్టి వాని దేశంబున సుఖంబుగా గాలంబుంగడపుచున్న నేను బలవంతుండును సౌందర్యవంతుండును రాజలక్షణాన్వితుండును నగు యీకుమారుని రాజున కొసంగుదునని

యుందలంచి మేఘమధ్యంబునం బ్రకాశింపుచున్న మెరుపుతీవెచందం బున సౌందర్యఖనియై యొప్పుచు భానుసమాన తేజుండగు కాంతిగల యాబాలుం జేకొని రాజునుండటికిం జని బృహద్రథునిం జూచి ఓరాజా! యీబాలుండు చండకౌశికుని యనుగ్రహంబున నీయిద్దరి భార్యలకుం గలిగిన మాంసపుఖండంబుల దాదులుబాఱవేయ నాఖం డంబుల నే గాపాడి యిటుదెచ్చియున్నం దాన నని చెప్పి ఆజర యను రక్కసి రాజుచేతియం దుంచఁగా బృహద్రథుండు తనభార్యలచేతి కందిచ్చిన వారలు ఆనందబాష్పంబులుగురియ సంతసంబు నొంది యుండిరి. అంత బృహద్రథుండు సంతసించి కమలములవంటి విశాలమైన నేత్రంబులు గలిగి బ్రహ్మతేజంబుతో సమానంబైన వర్చస్సు గలిగి కామరూపిణియైయున్న జరాదేవినిం జూచి, బ్రహ్మ తేజంబు గల ఓతల్లీ! నీవెవరవు, నాకు బుత్రదానంబు జేయవచ్చిన బరదేవతవలె గనబడుచున్నదానవు.' కల్యాణీ! అబద్ధంబు జెప్పక సత్యంబుగా నీనిజస్వరూపంబు నాకుం దేటపడంబలుకుమనియె.

ఇది సభాపర్వంబునందు పందొమ్మిదవ అధ్యాయము.

---

## అధ్యాయము 20

---

అనిన విని యాజరాదేవి బృహద్రథునిం జూచి, రాజేంద్రా, నీకు శుభంబుం గలుగుగాక! నేను జర యను రక్కసిని. కామరూపం బుచే యెట్టి సౌందర్యంబునైనను గలదానసవుదు. నీవంశంబునందు ఆదిరాజులవల్ల నుండి క్రమంబుగా నీయింట బూజింపబడుచుండు దానను. నేను రక్కసినైనను మనుజుల యిండ్లయందు ప్రతిచోటను

నెల్లప్పుడు నుండ గలదానను. విధాత నన్ను యీనగరంబునందలి ప్రతిగృహంబునకును గృహదేవతా రూపకంబుగా నుండు లాగున నిర్మించుటచే, రాక్షసనాశంబు కొరకు దివ్యరూపంబుగల దానను గా సృజియించె. పుత్రులు గలదానను వయసుదానను నైననన్ను గోడ యందు జిత్తర్వు వ్రాయించుకొని పూజించు మనుజు నింట సంపద విస్తరిల్లును. అటుచేయని గృహంబునందు మనుజులు నశించెదరుం గావున మీగృహమందు నన్నును నాకొడుకులను మనుమలను జిత్తర్వులు వ్రాయించుకొని మీపెద్దల కాలంబునుండి నీపర్యంతంబు నెల్లపుడును నన్నుం బూజించుటచేతను శ్రద్ధగలవాడవుట చేతను మీకెద్దియునైన ప్రియంబు చేయంగలదాన నై సమయంబుం జూచు చుండిన నేను, యీరాత్రికాలంబునందు నీపుత్రుని శరీరభాగంబుల రెండింటినిం జూచి వాని రెంటిని నొకటిగా గదియించిన నెత్తుక పోవుటకు సులభంబగు నని యెంచి భగవంతుని ప్రేరణవలన నా రెండు ఖండంబుల నొకటిగా జేర్చ నవి బాలుండయ్యెం గాన, మహారాజా, నీభాగ్యంబు కతన దీనికి నేను గారణభూతురాలనయితిని. నేను మేరు పర్వతంబు నైననుం బ్రమింగంగలను, అట్లుండ నీబాలుండనంగ నెంత? మీరు నన్నుం గులదేవతగా జూచుకొని పూజించుటచే కృతజ్ఞతా భావంబు బొందం దలంచి యీబిడ్డను మీకు నొసంగితిని, యిక మీదట నీబాలుండు నా పేరు చేతం బ్రసిద్ధి నొందునని పలికి రాజు చేత ననుజ్ఞం గైకొని యంతర్ధానంబు నొందెం గాన నోధర్మనందనా, అనంతరంబా బృహద్రథుండు బాలుని నింటికినిం గొంపోయి శాస్త్ర విధానంబున జాతకర్మ నామకరణంబులు జేయించి జరాదేవికి తన రాష్ట్రంబునబలివిధానంబులును వుత్సవంబులును నేటేటం జేయులాగున ఆజ్ఞను గావించినవాండై, బ్రహ్మసమానుండగు యాబృహద్రథుండు తనకుమారుండు జరాదేవిచేత సంధింపబడుటచేత వానికిజరాసంధుం

డను బేరుపెట్టి పెంచుచుండగా నాబాలుండు ఆజ్యధారచేత ప్రవృద్ధమానంబగు అగ్నిహోత్రుని వడువునను శుక్లపక్షచంద్రుని మాడ్కిం దినదినప్రవర్ధమానుండై రూపంబునందును బలంబునందును తేజంబునందునుం మాతాపితరులకు నెక్కువ సంతసంబు గలుగం జేయుచు వృద్ధిం బొందుచుండెను.

ఇది సభాపర్వంబునందు ఇరవయ్యో అధ్యాయము.

---

## అధ్యాయము. 21.

---

ఇవ్విధంబునం గొంతకాలంబు గడచినపిమ్మట త్రికాలవేదియును తపస్వికుండును మహానుభావుండును నగు చండకౌశికుండను మునీంద్రుండు మగధదేశంబునకు రాగానే బృహద్రథుండు చాలా సంతసంబునొంది మిత్రులతోడను అమాత్యులతోడను కళత్రంబులతోడనుం గూడి కొడుకునుంబిలుచుకొని నెదురుగా గానంజని అర్ఘ్యపాద్యాది మధుపర్కంబులచే నమ్మునిం బూజించి చేతులుంజోడించుకొని నమ్రుఁడైయుండ, మహానుభావుండగు నమ్మునీంద్రుండు రాజుయొక్క పూజలం గైకొని సంతసంబుగల మనంబుగలవాండై యారాజుంజూచి బృహద్రథా, నేను యిచ్చట జరిగిన యుదంతంబంతయు దివ్యజ్ఞానంబునంజేసి దెలుసుకొన్నవాండ, నీ పుత్రునకు భావికాల స్థితి నెరింగించెద, సావధానుండవై వినుమని చెప్పందొడంగె. నీతండు రూపవంతుండును బలవంతుండును మంచిస్వభావంబుగలవాండును దేహదృఢంబు గలవాండును నగు. ఇదియునుంగాక నిరంతరంబు సర్వసంపదల గూడినవాండై యుండు. ఇందున సంశయంబులేదు. ఇతనిని

శౌర్య ధైర్య సాహసంబులయందు నెవ్వరును సరిబోలరు. గరుడుని వే గంబును యితరంబులైన పక్షిసంఘంబులు అనుసరించనివిధంబున యీ జరాసంధుని రణంబులయందును శత్రురాజులెవ్వరయినను మార్కొ నంజాలరు. ఇతని పేరు విన్నమాత్రంబుననే శత్రువులు భయంబు నొంది పరుగెత్తంగలరు. నదీప్రవాహంబుపర్వతంబున భేదించుటయం దుసామర్థ్యంబులేనివిధంబున దేవతలయస్త్రశస్త్రంబులును యితనిం జెనకంజాలవు. సహస్రకిరణుండు యితరంబైనవెలుంగుల నడంచినరీతి రాజులయొక్క తేజస్సును హరించు. అన్యరాజులకు యెంత బలగంబు గలిగినను యీజరాసంధునితోడం బురుడించలేక అగ్నియందుదుమి కిన మిడుతల చందంబున భస్మంబులై పోవుదురు. వర్షాకాలంబున సం పూర్ణంబులైన ప్రవాహంబులుగల నదులు సముద్రునియందుం బ్రవే శించి లీనంబులైనవిధంబున ప్రతాపంబుంగల రాజులందరు యీ జరాసంధునికి లోబడి పరాక్రమించలేక అరిపెట్టుచునుందురు. మరి యును సర్వసంపత్పూరితంబైన యీ భూమండలంబునంతయు ధర్మా నుసారంబుగా ప్రజలం బాలించుచు వారలచేత నాలుగవవంతు కప్పం బుగొనుచు చతుర్వర్ణంబులవారిని వారి ధర్మంబులను చతురాశ్రమం బులనుం గాపాడుచునుండు, సమస్తభూతసంఘంబులును ప్రభువైన ఆత్మయందు లీనంబులైనవిధంబున రాజులందరును యీ జరాసంధున కుం లోబడియుందురు. మూడులోకంబులయందును బలవంతుండగు యీ జరాసంధుండు తపోమాహాత్మ్యంబున బలవంతులైయుండు త్రిపురాసురులను సంహరించిన మహానుభావుండగు యీశ్వరునింగూ ర్చి తపంబుచేసి అతని కరుణకుం బాత్రుండై వరంబులం బొందునని చెప్పుచున్నవాండై, ధర్మసంపన్నా, యమ్మునీంద్రుండు ఆత్మధ్యానం బు జ్ఞప్తికిం దెచ్చుకొన్నవాండై అంతర్ధానంబుం జెందె. అనంతరంబ బృహద్రథుండు బంధుమిత్రాదులతోడ నగరున కేతెంచి యీ జరా

సంఘునకు పట్టంబు గట్టినవాండై తన యిద్దరిభార్యలతోడం గూడి నిర్గమవాండై తపోవనంబునకుంజనియె. తదనంతరంబ జరాసంధుండు దిగ్విజయంబుచేసి రాజులనందర లోబరచుకొని రాజ్యపరిపాలనంబుం జేయుచుండగా, కొంతకాలంబునకు యిద్దరుభార్యలతోడి బృహద్రథుండు తపంబుజేయుచు శరీరత్యాగంబుంజేసి స్వర్గంబునకుం జనియె. జరాసంధుండును మునీంద్రుండు వచించినరీతి తపంబుజేసి వరంబులు నుంబొంది మదాంధుండై యుండునెడ, హరి హంసడింభకులను కంసునిం జంపగనె నా జరాసంధుని కుమార్తెలు తమ తండ్రివద్దకుంజని తమ కష్టంబు జెప్పుకొనగా కోపంబున జరాసంధుండు కృష్ణునిపై నీర్ష్యవహించినవాండాయెనని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పినవిని అనంతరంబునం 'జరిగిన వృత్తాంతంబు నడుగుటయు యివ్విధంబున జెప్పందొడంగె. భరతవంశాగ్రేసరా, యీ జరాసంధుండు వొక్క సమయంబునందు బలువైన తన గదం బట్టి వకటి తక్కువగా నూరు పర్యాయంబులు గిరగిరం ద్రిప్పి బలంబున వైవ మధురాపట్టణంబునం దలి ప్రజలు ఆశ్చర్యబునం జూచుచునుండ, గిరివ్రజపురంబుననుండి మధురాపురికి కించిద్దూరమునం బడియెనని చూచుచుండిన జనులు చెప్పగా విన్నవాండ. బుద్ధిమంతులును యోచనలయందు ననుభవంబుగలవారును నీతిశాస్త్రంబునందు ప్రజ్ఞగలవారును అస్త్రపాతంబులకు లొంగనివారునునయిన హంసుండును డింభకుండును నను యీయిద్దరితోడంగూడి జరాసంధుండు మూడులోకంబులనైనను జయించుటకు సామర్థ్యండు అని నా అభిప్రాయంబు. ఇవ్విధంబున బలవంతుండై జరాసంధుండు యెన్నితప్పులుం జేసినను సహించుకొని కుకురాంధకవృష్ణి వంశంబులవారలమైన మేము న్యాయంబును ధర్మంబు నుంబొంది అతనినిం దెగ్వర్చక యుపేక్షించినవారలమైతిమని కృష్ణుండు ధర్మజునకుం జెప్పెను.

ఇది సభాపర్వంబునందు,యిరవై యొక్క అధ్యాయము.

---

## అ ధ్యా య ము 22

---

ధర్మనందనా, హంసుండును డింభకుండును పరివారంబుతోఁ గూడిన కంసుండునుం బొలిసిరి. జరాసంధుండు నిర్వైరపడి చచ్చుటకు సిద్ధంబయి యున్నవాఁడు. దేవరాక్షసులు యేకీభవించి వచ్చినను నాయుధంబులచేతం దెగ్వర్పంజాలరు. వానిని మల్లయుద్ధంబునం సులభంబుగ దెగ్వపఁగవచ్చు భీమునియందు బలంబుండుటచేతను నాయందుపాయంబులు నుండుటచేతను మయ్యిద్దరిని గాపాడుటకు యర్జునుం డుండుటచేతను, మేము ముగ్గురము త్రేతాగ్నులు యజ్ఞంబును సాధించు లాగున వానిం దెగ్వర్చెదము. మేము ముగ్గురము గదిసిన యడల మాయందు నొక్కరునితోనైననుబోట్లాడునుగాని రాకమానడు. అవమానంబుచేత గాని లేక గర్వంబునంగాని బాహుబలంబుచేతనైనను భీమునితోడం బోరుటకు దప్పక రాగలండు. నిడుదలైన బాహువులు గలవాండను విశాలవక్షస్థలంబుం గలవాండునునగు భీముం డొక్కరుండె వానిం దెగ్వచుఁగాని లోకంబులన్నియు నొక్కటి యయినను సాధింపంజాలరు. భీముండు యమసమానుండై మూడులోకంబులనైనం జయింపంజాలు వాఁడు గాన, ధర్మనందనా, నామాటలయందు నమ్మకంబు గలిగెనేని భీముని బాహుబలం బెరుంగుదువేని అర్జునుని ధనుర్విద్యాపాండిత్యంబు విశ్వసించితివేని యీభీమార్జునులను నాస్వాధీనంబు గావింపుము, అని బలికినం గృష్ణు మాటలాలకించి ధర్మజుండు చిరునగవునం బ్రకాశించు మోములు గల భీమార్జునులం జూచి నారాయణు నుద్దేశించి, నాశరహితుడా, శత్రుసంహారకుండవగు నీవు యిటులం బలుకం జెల్లునే, నీఆశ్రయణంబునం మేము సుఖంబులనుం బొందుచున్నవారము, మాపరిచర్యలచేత నీవు సంతోషించం దగినవాడవు, జగ

ద్రష్టకా, నీవాక్యంబులు వేదతుల్యంబులు. అదృష్టవంతుల ముందర భాగంబునందు నీవు నిలుతువు. నేను నీవాక్యానుసారంబుగా నడచితి నేని జరాసంధుం డీల్గినవాడు యగును. రాజు లందరు మోక్షితులు కాబడుదురు. రాజసూయాధ్వరంబు నెర వేరినదగును. త్రిలోకరక్షకుం డవైన నీవు యెవ్విధంబున రాజసూయంబు నెర వేరునో యామార్గం బున నాజ్ఞాపించుము. ధర్మార్థకామంబులు మూడును లేక విచారిం చు జడునిచందంబున నేను మిమ్ముల నెడబాసి నిమిషంబైనను బ్రతు కం జాల. అర్జునునెడ బాసి నీవును నిన్నెడబాసి యర్జునుండును నుండరు గాన మీరిద్దరుం గూడిన త్రిలోకంబులు సులభసాధకం బులు. భీముండును పరాక్రమంబును ధైర్యంబును తేజంబును సాహ సంబునుం గలవాండు గనుక మీసహాయంబుచే నితం డెంత పని యైనను సాధించంగలఁడని నమ్ముదును. నీతిజ్ఞుండు నడపిన సైన్యవ్యూ హంబు యుద్ధంబునందు జయంబు నొందును గాన గ్రుడ్డివాడైనను పిరికివాడైనను సైన్యంబును నడపించవలయునని పెద్దలు చెప్పు దురు. జనులు పల్లముండు చోటికి నుదకంబులం గోపోవునట్లును జాలరులు తరిగిన నుదకంబులమత్స్యంబుల బట్టుటకు బ్రయత్నంబు చేయునట్లును యోచనీయుండవై కార్యంబులు సాధించుటయందు నేర్ప రివైన నిన్ను మేమాశ్రయించి కార్యంబు నెర వేర్చుకొనవలె నని యుండువారము గాన, కృష్ణా, కార్యంబులు నడిపించుటయందు శక్తి వంతుండ వగు నిన్ను నర్జునుం డాశ్రయించియుండు, యర్జునుని భీముం డాశ్రయించు, నీతిచేతను, బలముచేతను, జయోత్సాహంబుచేతను సులభంబుగా శత్రువు జయించునట్లు మీముగ్గురుంగూడిన శత్రుసంహా రంబు సుకరంబు. అని యివ్విధంబున ధర్మజుండును, భీముండును, అర్జునుండును, నకులుండును, సహదేవుండునుంగాబలికిన,కృష్ణుండు సంత సంబు నొంది భీమార్జునుల తోడంగూడి స్నాతకవ్రతంబు గావించిన

బ్రహ్మచారులవలె వేషంబులనుం బొంది త్రేతాగ్నుల చందంబునం బ్రకాశింపుచు మగధ దేశంబునకుం జనియెడు నెడ బంధువుల రక్షింపం బూని శత్రువుపైని కోపంబున పశ్చాత్తాపంబు నొందువారును, సూర్యుండును, జంద్రుండును, అగ్ని దేవుండునుం బ్రకాశించునటుల మహాతేజంబుగలిగి ప్రకాశించువారును, సమర్థులును ప్రజలమేలు గోరువారును, మహాత్ములును, ధర్మార్థకామంబుల నడుపువారును, నొచ్చినవారిని రక్షించువారును, యుద్ధంబులయందు జయంబునొందు వారును, తలంచిన కార్యంబు సాధించువరకు విడువనివారును నగు కృష్ణార్జునభీములు సంతసంబునం బొదలుచు జరాసంధుం దెగ్వర్చిన వారు గాదలంచుకొని పోవుచుండుసమయంబున వారు మువ్వురు దర్భాసనంబులుతోడను నారబట్టలతోడను బ్రకాశింపుచు కురు జాంగలంబుల నడుమనంబోయి యందమయిన పద్మసరంబును కాల కూటపర్వతంబును గండకి మహాశోణము భ్రావాద మొదలయిన నదు లనుందాట పూర్వకోసల దేశంబులనుం మిథిలాపురంబునుం అతిక్ర మించి మాలచర్మణ్వతి గంగా మొదలయిన నదులను గడచి మగధ దేశంబుం జేరి గోవులచేతను శుభ్రమైన జలంబుచేతను రమణీయంబు లైన వృక్షంబులతోడను ప్రకాశింపుచున్న గోరధపర్వతంబునం వెల యుంచు గిరివ్రజం బను పట్టణంబునుం జేరినవారైరి.

ఇది సభాపర్వంబునందు యిరవైరెండో అధ్యాయము.

---

## అధ్యాయము 23

---

ఇవ్విధంబునం గిరివ్రజంబు చేరి కృష్ణుం డర్జునిం జూచి పార్థా! యిప్పట్టణంబునుం జూచితివా పశుగణంబులతోడను, జలసమృద్ధిగలి

గిన కొలంకులతోడనుగూడి తేజోవంతంబై గొప్పహర్మ్యంబులుగలిగి బహువిశాలంబయి ప్రకాశించుచున్నయది. మరియును కమ్మని సువాసనలు గల బుష్పగుచ్ఛంబులతోఁగూడిన వృక్షంబులును యువ జనుల కత్యంత ప్రీతికరం బగు లొద్దుగచెట్లతో ఆచ్ఛాదింపబడినది యును భానుకిరణంబులు ప్రసరించుటకైనను సాధ్యంబు లేకుండ దట్టం బుగా వ్యాపించియుండు వృక్షపంక్తులచేతనుం గూడి ప్రకాశింపుచున్న వైహారము వారాహంబును వృషభంబును ఋషిగిరియును చైత్యకం బును నను అయిదుపర్వతంబులును ఒకదానిం నొక్కటి గలిసి యిప్పట్టణంబునుం గాపాడుచుంటంజేసి యిప్పురంబునకు గిరివ్రజంబను నామంబుగలిగె. ఇదియునుం గాక యిందున కఠినంబైన వ్రతంబు జేయుచు గౌతముం డను మునీంద్రుండు యౌశీనరియను శూద్రవనిత యందు గాక్షీవుండు మొదలుగాంగల పుత్రులం బడసి యాతపస్వి కుండు ప్రేమాతిశయంబుచే మగధదేశపు రాజశ్రేష్ఠుల నాశ్రయించి యున్నవాండు. పూర్వంబునందు అంగ వంగ కళింగ కాశ్మీర దేశంబుల రాజులు యిమ్మహాత్ముని ఆశ్రమంబునందు విహరించుచు నుండువారు. అర్జునా! ఈసమీపంబున నావరించియుండు రావిచెట్లును, లొద్దుగ చెట్లనుం జూడుము. శత్రువులను బాధించుచుండునట్టి యర్బుదం బును శుక్రవాపంబును నను సంజ్ఞలుగల సర్పంబులు రెండు గౌతమా శ్రమంబున నున్న యవి. మరియును స్వస్తికుండును మణినాగకుండును నను సంజ్ఞలుగల వారిగృహంబులునుం గూడ యిచ్చటనే ప్రకాశిం చుచున్నవి. ఇమ్మగధదేశంబున కోరినపుడు వర్షంబులు కురియునట్లు మనువనువాడు ప్రసాదించె. కౌశికుండును మణిమానుండును నను వారలు యిమ్మగధరాజునుం బ్రేమింతురు. ఇవ్విధంబున బెట్టనికోట వలె దృఢవంతమై పరులుచొచ్చుటకు అసాధ్యంబైయుండు యిప్పురం బునం దుండి జరాసంధుండు గర్వించి, నన్నుం జయించువారలు లేరని

మదోన్మత్తుండై మెలంగుచున్న వాండు, మనము యిప్పుడే ప్రవేశించి అతనిం జుట్టుముట్టి నుక్కడంగింతము, అని యివ్విధంబున బలికి కృష్ణుండు భీమార్జునులకు నుత్సాహంబు గల్గించి, వారు ముప్వురును సంతోషంబుతో నుండువారును ధనంబుగలవారును ధర్మాచరణంబు గల చాతుర్వర్ణంబులవారితోడంగూడి లెక్కించుటకు అసాధ్యంబైన వేడుకలు గలిగి మగధదేశంబునకు రాజధాని యగు గిరివ్రజం బను పురంబునకుం బోవుచు, కోటయొక్క ద్వారంబునందుం బ్రవేశించక, బృహద్రథునివంశంబు వారిచేతను బ్రజలచేతనుం గౌరవింపంబడుచు మగధదేశంబునందు చాలా ఔన్నత్యంబుగలిగిన చైత్యకంబను పర్వతంబుం జేరి, పూర్వంబునందు మనుష్యుల నాశంబు జేయుచు మనుష్యమాంసంబుం దినుచు భయంకరుం డగు ఋషభుం డను రాక్షసువిదళించి వాని చర్మంబుతో చేయించి దలవాకిటం గట్టింపబడి, ఒకతడవ వాయించిన అదే మోతగా ఒకమాసంబువరకును మ్రోగుచుండు మూడు భేరులకు జుట్టియుండు పువ్వులదండల నుగ్గు నుగ్గు చేసి భేరులం బగులగొట్టి, ప్రాకారంబు నెక్కి చైత్యకంబను బర్వతంబుయొక్క ఉన్నతంబైన శిఖరంబును తమ బాహుబలంబుననే బెకలించివైచి పురంబునుంజొచ్చి సంతసంబుంగలవారలై వచ్చుచుండగా, వేదవేదాంగవిదులగు బ్రాహ్మణోత్తములు జరుగుచుండిన దుశ్శకునంబులం గని పెట్టి రాజునుజేరంజని దుశ్శకుననివారణార్థంబుగా హోమంబును, అగ్నిప్రదక్షిణంబును మొదలుగాంగల కార్యంబులు జేయవలయునని చెప్పిన, పరితాపవంతుం డగు జరాసంధుండు దుశ్శకుననివారణార్థంబు నియమవంతుండై వ్రతంబుం బూని దీక్షవహించి యుపవాసంబు జేసినవాండై హోమార్థంబు బ్రయత్నంబు జేయుచుండగా, స్నాతకబ్రహ్మచారుల రూపంబులు దాల్చినవారును బాహుబలంబుననే నెట్టివారినైననుం జయించు

సామర్థ్యంబు గలవారును నిరాయుధులును నగు శ్రీకృష్ణార్జునభీములు పురంబు జేరి రాజమార్గంబునం బోవుచు, సమస్తంబులైన దుకాణం బులుం గనుంగొనుచు ఆయా దుకాణంబుల యందుండిన వస్తువులనుం బలాత్కారంబునం గైకొనుచు రాజగృహంబునకుం గొంపోవు పూల దండలనుం గైకొని సర్వాలంకారశోభితులై, హిమవంతంబుననుండి గోవులమందలోనికి ప్రవేశించు సింగంబువిధంబున రాజగృహంబునుం బ్రవేశించి హజారంబులుం దాంటి బోవుచుండ, మద్దిమ్రాకుల స్తంభ ములమాడ్కి నల్లనివియు పొడుగాటి బాహువులుగలిగియు యేనుం గులమాడ్కి అగాధంబగు గాంభీర్యంబును సాలవృక్షపు బోదెలపగిది పొడవుగలవారును విశాలంబగు వక్షంబుగలవారునునయిన యీ ముువ్వురిని ఆశ్చర్యంబుగా జనులు కన్నుల గరవుదీరం జూచుచుండ, ద్వారంబులు దాటి నిర్భయులై చిరునవ్వుగల మోములుగలవారలై జరాసంధునిం జేరినవారవుచుండగా, తనవద్దకు వచ్చుచున్న యమ్మ హానీయులం జూచి యెదురేగి తోడ్కొనివచ్చి వారినర్ఘ్యపాద్యాదుల చేతం బూజించి శాస్త్రవిధానంబుగా గోదానంబులు మొదలయిన వాంటిచే గౌరవించి, వేదవేదాంగవిదులగు బ్రాహ్మణశ్రేష్ఠులారా ! స్వాగతమా యని యడుగ, భీమార్జును లామాటకుం బ్రత్యుత్తరం బియ్యక మానంబుననుండిన, వాక్యచాతుర్యంబు గలిగిన శ్రీకృష్ణుండు, రాజేంద్రా, వీరు నియమంబుం బూనినవారు గనుక నిప్పుడు మాట లాడరు, మూడవజామున మానంబు విడిచి మాటలాడంగలరు, అని చెప్పిన విని యా జరాసంధుండు వారలం యజ్ఞశాలకుంబనిచి తా నంతిపురంబుననుండె. నిత్యంబును అర్ధరాత్రంబునందైనను స్నాతకు లగు బ్రాహ్మణులు వచ్చిరని విన్నమాత్రంబుననే యెదురేగి పూజించు స్వభావంబుగలవాడగుటచేత అర్ధరాత్రంబున కృష్ణాదులనుం బూజిం చుటకునై యజ్ఞశాలకుం జేరి అపురూపంబగు వేషభాషాదులు గల

యమున్నవ్వారనుం జూచి ఆశ్చర్యంబుతో గనుంగొనుచుండ, మహనీయు లగు యాముప్వురును రాజుం జూచి, రాజేంద్రా ! నీకు శుభంబగుం గాత యని యాశీర్వదించి ఒకరినొకరుం గనుంగొనుచు నవ్వుకొను చుండిరి. జరాసంధుండును మాయవేషంబులుదాల్చిన వారలం గనకా సనంబులం గూర్చుండుండని ప్రార్థింపగా, యజ్ఞంబునందు దక్షిణాగ్ని యును గార్హపత్యంబును ఆహవనీయంబును ననుసంజ్ఞలుగల అగ్నుల మూడింటిం ప్రకాశింపుచుం గూర్చుండియున్న సమయంబున, జరా సంధుండు కపటవేషధారు లగు కృష్ణపార్థులం జూచి చిరునగవు నవ్వుచు హాస్యంబు దోప బలుకందొడంగె మహనీయులారా! స్నాతకవ్రతస్థులు బూలకండలు దురుపురనియును గంధంబు బూయ రనియునుం వినియుందు. మీారలు క్షాత్రతేజంబునం ప్రకాశింపుచు బ్రాహ్మణవేషధరులై బ్రాహ్మణులమని చెప్పుచున్నవారలు. యెఱ్ఱని వస్త్రంబులు ధరించడము గంధపుష్పాక్షతలచే నలంకరించుకొనుట నునువి యీలోకంబున క్షత్రియులు చేయు పనులనియు విన్న వాండ. మీారెవ్వరో నిజంబెరింగింపుడు. క్షత్రియులకు సత్యంబుభూషణంబు వంటిదిగదా యనియునుం బలికినవాండై, మరియును అందరు నడచు ద్వారంబునం రాక చైత్యక పర్వతశిఖరంబుం బగులగొట్టి రాజసై న్యంబునకుం వెరవక ప్రాకారంబు దుమికి లోపలం ప్రవేశించితిరి. మీామాటలుం జూడ బ్రాహ్మణవాక్యంబులకరణి నెమ్మదిగ నున్నవి. మీాకార్యంబులు క్షాత్రసంబంధమయిన శౌర్యంబునుం ప్రకటించు చున్నయవి నాయింటికి ఆతిథ్యంబుకొరకు వచ్చిన మీారలు నేనిచ్చు పూజల నేలం గైకొనరు, యిచ్చటి కరుదెంచుపనియేమియో తెలుప వలయునని వేడిన, శ్రీకృష్ణుండు మేఘనినాదం బగు కంఠధ్వని గల వాండై జరాసంధుం జూచి యుక్తియుక్తంబుగా చెప్పందొడంగె. నరేంద్రా! మేము స్నాతకులగు ద్విజులము. బ్రాహ్మణ క్షత్రియ

వైశ్యులలో స్నాతకవ్రతంబు గలవారుంగలరు. వీరికందరికిని గొన్ని సమాననియమంబులును, గొన్ని విశేషనియమంబులునుం గలిగి యున్నవి. అందున క్షత్రియస్నాతకులకు విశేషనియమంబు గలిగి యుండుటవలన సంపద్విశేషంబులుం బొందుంగాన మేమునుం బుష్పం బులనుం ధరించితిమి. బాహుబలంబుగల క్షత్రియుండు మాటలవలన దన ప్రభావంబునుం జూపడు. గాన మేమును నెమ్మదిగా మాట లాడంగలిగితిమి. బ్రహ్మక్షత్రియులకు స్వవీర్యంబు బాహువులయందే యుండుటవల్ల జూడంగోరుదువేని నిమిషమాత్రంబులో జూడం గలవు. ప్రశస్తంబయిన మార్గంబున స్నేహితునింటికిని దప్పుదారిన శత్రుగృహంబునకుం బోవలసినట్టు న్యాయంబున్నది గాన మేమును పండిత మార్గంబు ననుసరించి వచ్చిన వారము. కార్యార్థంబుగా శత్రువుండవైన నీయింటికివచ్చి నీవలనఅతిథిపూజలంగైకొనము. యి వ్విధంబునంమాకునిత్యవ్రతంబుగలదని శ్రీకృష్ణుండు జరాసంధునితో చెప్పినవాండాయెను.

ఇది సభాపర్వంబునందు యిరవైమూడో అధ్యాయము

---

## అధ్యాయము 24

---

అనంతరంబ జరాసంధుండు వారలంజూచి, విప్రులారా, మీరు నాకపకారంబుజేయలేదు నేనును మీకపకారంబుం జేసినట్టు గనుపట్ట లేదు. అయినను ప్రమాదంబున తప్పులుజేసియుండిన మన్నించదగిన మీరలు శత్రుత్వంబునొంది పగతునిగా దలంచుటయేగాక నాతో మందలించుట ధర్మంబగునా? తప్పులులేనివారిని దండించు క్షత్రియుండు ధర్మార్థంబులు రెండును తనకు లోభించుటవల్ల పిదప పశ్చాత్తాపం

బుంబొందు. ధర్మంబు తెలిసినవాండు ధర్మార్థకామంబులకు విరుద్ధం
బుగా బ్రవర్తించినయెడల నరకంబుంబొంది దుఃఖంబు లనుభవించును.
న్యాయంబుదప్పక నుండు క్షత్రియుండు మూడులోకంబులయందును
బ్రశస్తనీయుండని బుధులు పల్కుదురు. న్యాయంబగు క్షత్రధర్మంబు
తో సమానంబైనది మరి యితరధర్మంబు లెవ్వియునుం గాజాలవనియు
నుం ధర్మవేత్తలు చెప్పుచునుందురు గాన ధర్మంబుదప్పక న్యాయ
మార్గంబునం బ్రజలం బాలించు నన్ను శత్రుండని పల్కుట మీవంటి
వారలకుం దగినయదికాదు అని పలికిన జరాసంధు వాక్యంబులు విని
కృష్ణుండు, నిడుపైన చేతులంగలవాడా, కులంబునకుం బెద్దవాండైన
వాండొక్కరుండు కులసంబంధంబులయిన కార్యంబులం జూచుకొనును.
అట్టికులంబునందు గురుండైనవాని యాజ్ఞచేత మేము నిన్ను జంపం
గోరివచ్చితిమి. జరాసంధా, నీవు యీభూమియందున్న రాజశ్రేష్ఠుల
ననేకులం జెరంబట్టి కారాగృహంబున నుంచి దినదినంబును భూత
పతికిం బలియివ్వ నుద్యమించియు నాయం దేమియు దప్పులేదనియు
నుం బలుకుచున్నవాండవు. యోగ్యుండగురాజు సాధువులును ధర్మ
ప్రవర్తకులును నగు మూర్ధాభిషిక్తులం దెచ్చి చంపం దలంచునే?
నీవు దయాంతఃకరణంబులు లేక చేయుచున్న యీపాపంబునకు
మేముంగూడ అనుభవింపదగినవారము గాన ధర్మంబు తప్పక నడచు
కొనుమేము ధర్మసంరక్షణతాత్పర్యంబుచే అధర్మంబును నిరాకరించు
బుద్ధిగలవారమై యున్నాము. అదియునుంగాక ఏకాలంబునందైనను
మనుజుం డెవ్వండైన సమానులగు రాజులంబట్టి తెచ్చి బలియిచ్చుట
చూచియుండలేదు. మనుజుండై యుండి మనుష్యులనే బలియిచ్చు
చున్నవాండు నీవొక్కండవు దక్క నితరుం డెవడైన నిట్టి ఘోరకృత్యం
బులుం జేయు వాండులేడు. మనుజుండు యేవేళల యేకార్యంబు
లాచరించునో యాకార్యంబుల ఫలంబులుం దప్పక ననుభవించం

గలఁడు. దీనసంరక్షకులమైన మేము నిన్ను యుద్ధంబునం జంపి నీయొక్క కారాగృహంబున బంధితులై యుండు రాజుల సంరక్షణ చేయఁగోరి యిటు వచ్చియున్నవారము. ఇదియునుంగాక నాకన్న సమర్థుఁడు లేఁడని గర్వించి యుండువాఁడవు. తనబంధువులు కష్టంబులనుభవించుచుండ తెలుసుకొని బాధలు దొలంగించుకొరకు యుద్ధంబునందు జచ్చినను స్వర్గంబుగలుగు. క్షత్రియులు స్వర్గంబుంగోరి రణంబను యజ్ఞంబున దీక్షవహించి లోకంబులం జయింతురు. తత్వవిచారంబును లోకంబులందు గీర్తిని బొందుటయును ఉగ్రంబైన తపంబుం జేయుటయును యుద్ధంబున హతుండగుటయును యివి అన్నియు స్వర్గప్రాప్తికి కారణంబులు. అందున రణంబునందు దేహత్యాగంబు జేసి సులభంబుగా స్వర్గంబునుం బొందవచ్చును. ఇతండు గుణంబులందు గొప్పవాండైన ఇంద్రుని అపత్యంబగు జయంతునితో సమానుండు, యతని సహాయంబున ఇంద్రుండు మదాంధులైన దుష్టరాక్షసుల సంహరించి సుఖంబుగా స్వర్గరాజ్యంబునుం బరిపాలించుచున్నవాండు. జరాసంధా, నీవలె సైన్యంబుగలవాండననియును యెక్కువ బలవంతుండనని యును గర్వించి రాజుల కవమానంబుం గలుగజేయుచు స్వర్గంబు కొరకుం గలహింపుచు నుండువాండవు. నీకుండక్కువవాండును నీకన్న నధికుండునుం గలుగవచ్చుంగాని సమానుండు లేడని గర్వించి అవమానంబుం గలుగజేయుట భావ్యంబుగాదు. నీగర్వంబు నెంతవరకు మాకుం దెలియకుండెనో అంతవరకు సాగినది, యికమీదట జెల్లనేరదు, గాన నీకొక్కహితం బుపదేశించెద. అది యేమన నీ గర్వంబును నీసమానులయందు చూపుదువుగాని నీకన్నం దక్కువవారియందు విజృంభించినయడల అమాత్యవర్గంబుతోడ యమలోకంబునకుం బోయెదవు. పూర్వకాలంబున దంబోద్భవుండును కార్తవీర్యుండును ఉత్తరుండును బృహద్రథుండును మొదలుగాంగల రాజులు గర్వంబున

తమమేలుంగానక నాశంబునుం బొందిరి. మేము నిన్ను నాశంబుం జేయంగోరి స్నాతక బ్రాహ్మణ వేషధారులమై వచ్చియున్న వారము. నేను కంససంహారకుండగు కృష్ణుండను. వీరలు పాండుతనయులగు భీమార్జునులు. మేము నీతో యుద్ధంబుజేసి నిన్నుందెగ్వార్పం గలము. మాతోడ యుద్ధంబుజేయంజాలని వాడవైతేని కారాగృహంబున బంధితులగురాజుల విడిపింపుము. ఇది నిశ్చయంబనిన విని జరాసంధుండు కృష్ణుంజూచి, గోపాలా, నేను జయింపని రాజులందేలేదు, ఇచ్చటనుండువారిలో నాచేజయింపబడని రాజు నొక్కరుండును లేడు. పరాక్రమంబునంజయించి బట్టితెచ్చిన రాజుల నాయిష్టానుసారంబుగా జేయంగలుగుదును. ఇది రాజధర్మంబే యగుంగాని అధర్మంబు గానేరదు. నేను క్షత్రియుండనైయుండి వ్రతంబుకొరకు యుద్ధంబునం జయించి తెచ్చిన రాజులను విడువుమన్న విడుచువాండనగుదునే? మీకు భయంపడి ప్రాణునకుం బలియిచ్చ్యక వ్రతభంగంబు జేసుకొనునంతటి వెర్రివాండంగాను. కాబట్టి నేనుమీయిచ్ఛానుసారంబుగా ముగ్గురితోడ నొకమాటునంగాని ప్రత్యేకముగాగాని నొకరొకరితోడనైనంగాని ఆయుధంబులు ధరించియైనను సైన్యంబుతో గూడియైనను యుద్ధంబు జేయంగలవాండ నని చెప్పి, తనకుమారుండగు సహదేవునకుంబట్టంబు గట్టి యుద్ధంబునం దాసక్తిగలవాండై భీమాదులతో యుద్ధంబుజేయం దలంచి, పూర్వంబున తనకు సేనానాయకులును లోకంబునం బ్రఖ్యాతి నొందినవారునుం బరాక్రమవంతులునగు హంసడింభకులనుం దలంచుచున్న జరాసంధునిం జంపదలంచుకొన్నవాండై కృష్ణుండు తనమనంబున నిట్లనియోచింపందొడంగె. యాదవులమైన మాచేతిలో జావనివాండును బ్రహ్మవరంబునంజేసి ఆయుధంబుల జావనివాండును నయిన యితనిని బాహుయుద్ధంబున జయింపవలెననియెంచి భీముని చేత జంపింపదలంచుకొన్నవాండైయుండెను.

ఇది సభాపర్వంబునందు యిరవైనాలుగో అధ్యాయము.

---

## అధ్యాయము 25

ఇవ్విధంబున యుద్ధంబుసేయ సమకట్టియున్న జరాసంధుం జూచి వాక్యవిశారదుం డగు గోవిందుండు బలుకం దొడంగె. జరాసంధా, మాముువ్వర లోపల నెవ్వనితో యుద్ధంబుజేయం గోరెదవో వాడు నీతో రణం బొనర్చుటకు శక్తివంతుండయి యుండును, అని చెప్పగా ప్రతాపవంతుండును శౌర్యవంతుండును నగు జరాసంధుండు శ్రీకృష్ణునిం జూచి, నీవు గొల్లవాండవు, యిదివరకు పదునెనిమిది మారులు యుద్ధంబు చేసి యోడినవాడవును గనుక నీతోడిరణంబుం జేయ నొల్ల, యీయర్జునుండు నాకంటెం బిన్న గావున నీతనితో రణం బొనర్చుట ధర్మంబు గాదు, యీవాయు నందనుండుం బలవంతుండును నాతో సమానంబుగా బోరువాడును క్షత్రియవంశజాతుండును నాకు సమానంబైన యీడుంగలవా డగుటం జేసి యీతనితో రణం బొనరించెదనని యత్నంబుం జేయు చుండగా, వేదవేదాంగవిదుండగు పురోహితుండు జయంబు గోరి మంగళకరంబు లగు బుష్పంబులను అక్షతలునుం సంజీవిని మొదలగు ఔషధంబులను, దుఃఖంబును మూర్ఛయునుం గలిగినప్పుడు తన్ని వారకంబగు నిర్వృత్తి యను వేదమంత్రంబులును యింకనుం గొన్ని ఔషధంబులునుం దెచ్చి యిచ్చి నంగైకొని, జరాసంధుండు బ్రాహ్మణాశీర్వాదంబులనుం గైకొని, వందిమాగధులకై వార స్తోత్రంబులు వినుచు, క్షత్రియ ధర్మంబుం దలంచినవాండై గిరీటం బునుం దీసిపెట్టి జుట్టు ముడిం బిగించినవాండై చల్లడంబును లంగో పాయునుం బిగియం గట్టుకొన్నవాండై నడుమునకు దట్టిని బిగించి పుష్పాంగి చెలియలికట్టనుం ద్రోచుకొని వచ్చు సముద్రంబు వడువు నం బైకెగరిగంతులిడి భయంకరుం డగు భీమునిం జూచి, యోరీ

నీతోడ నేను మల్లయుద్ధంబు గావించ నున్నవాండ, నాయదృష్టం బున నాదారిం బడితివి, నిన్ను దెగవ్రచ్చెదరమ్మని వృత్రాసురుండు దేవేంద్రునిపై దుమికినట్లు భీమునిపై దుమికిన నతండును మాధవు నితోడ యోచించినవాండై ఆశీర్వాదంబులుం బొంది, బాహువులే ఆయుధంబులుగాం గలవారును ఒకరినొకరు జయించు కోర్కెం గల వారును శూరాగ్రేసరులునగుయాభీమజరాసంధులుగదియనడిచినవా రై,తొలుతాకునహస్తంబులు దాచికరలాఘవంబులుంగనుంగొని,నుట్టి చరచుకొని. కరతాళధ్వనులునుం భుజాస్ఫోటనంబులుం గావించి యొకరి భుజంబుల నొకరు బట్టుకొని త్రోయుచు, యొకరి దేహంబు నొకరు గట్టిగ పట్టుకొన్నవారై మిణుంగురులురాల పిడిగుద్దులంతోడను ముష్టిఘాతంబులతోడనుం బొడుచుకొనుచు చెంపలుం జరచుకొనుచు గాళ్ళం దన్నుకొనుచు వక్షంబునం బొడుచుచు హస్తంబులచే శిరం బునుం గ్రిందికి లాగుకొనుచు ఘీంకారంబులు జేయుచుం బోరాడు మదపుటేనుంగులమాడ్కి గరపీడనంబులుం జేయుచు, వానకాలం బునం గర్జించు మేఘంబుమాడ్కి సింహనాదంబులుం జేయుచు సింహంబులపగిది రౌద్రంబుగా బోరుచు నడుములనుం దన్ను కొనుచు పాదంబులం ద్రొక్కుచు పిడికిళ్లం బొడుచుచు ప్రక్కలు ద్రక్కలించుచు అనేకవిధంబులం బోరుచు నుండ, యమ్మల్లయుద్ధంబు జూడ వేడుకగలవారలై పురంబునందుండుజనులు స్త్రీలును పురుషు లునుం బాలురును వృద్ధులును గాదొడంగిన ఆప్రదేశంబు జనసంకు లం బై నిలుచుటకు స్థలంబులేక యుండుసమయంబున ఆభీమజరాసంధులు వకరినొకరు త్రోసుకొనుటచేతను కాళ్లకుంగాళ్లు పెనంగవేసుకొనుటయును చప్పటలు చరచుటచేతను వకరిబలంబు నొకరు కనుంగొను వేడుకచేత గట్టిగా మోదుకొనుచును దేవేంద్ర వృత్రాసురులమాడ్కిం భయంకరంబుగాబోరుచు విశాలంబగు వక్షం

బులుగలవారును నిష్కంపైన బాహువులుంగలవారును మల్లయుద్ధంబు నందు నేర్పరులగువారునునయిన యాభీమజరాసంధులు కార్తీక శుద్ధ పాడ్యమి మొదలుకొని త్రియోదశిరోజువరకును నిద్రయును ఆహారంబును విశ్రాంతియునులేక రాత్రింబవళ్లు నొక్కరీతిగా సమా నంబుగా బోరుచునుండ, చతుర్దశినాటియుద్ధంబున జరాసంధుండు బడలుటయును భీముండు రణోత్సాహంబున బలవంతుండై నుండు టయుం జూచి, కృష్ణుండు, వాయునందనా, యీజరాసంధుండు మిగుల అలసి బలంబుతగ్గి వుత్సాహంబులేకరిచ్చంబడియున్నవాడు, యీసమ యంబుననే వాయువుసంతటి బలంబుగలిగి వుత్సాహంబును విడువకం బోరినయెడల నీతండు క్షణమాత్రంబుననుడియు, తదనంతరంబున జయంబునుం గీర్తియునుం బొందగలవని బలుకుటయు, భీముండు రౌద్రాకారుండై బలంబుదక్కి వెనుకంజవేయుచు భయంబునుం బొందియున్న జరాసంధునిం దెగ్వర్చుటయందు పట్టుదలగలవాండై యుండెను.

ఇది సభాపర్వంబునందు యిరవై అయిదో అధ్యాయము.

---

## అధ్యాయము 26

---

ఇవ్విధంబున భీమజరాసంధుల మల్లయుద్ధనైపుణ్యంబును వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పిన విని, తదనంతరవృత్తాంతం బడుగుటయు నమ్మహానుభావుండు జెప్పందొడంగె. ఆవిధంబుగా భీముండు రణోత్సాహంబుంగలవాండై కృష్ణుంజూచి, మహానుభావా, యదువంశోద్ధారకా, నీకు బంధువులగు రాజులం జెరిచి నొప్పించి యున్న యిప్పాపాత్ముని నుపేక్షింపందగదు, అని నుడువుటయునుం

గృష్ణుండు యింకను వుత్సాహంబు గలిగించువాండై, పాండవమధ్యమా
నీదైవంబెవరో వారిని స్మరించి నీకుం దండ్రియగు వాయుదేవునిం
బ్రార్థించి వారిసహాయంబుం గలవాండవై యాతనిం దెగ్వేర్పుమనిన
భీముండు తనకు దైవసమానుండును బంధువుండుననగు శ్రీకృష్ణపర
మాత్మ నుద్దేశించి ధ్యానంబుంగావించి మనంబునందు నమస్కారం
బులు గావించినవాండై సంతసంబునం గౌంగిలించుకొని ఆదరణంబు
వడసి దనకుం దండ్రియైన వాయుదేవుని మెప్పించి యాతనిబలంబు
నుం బొందినవాండై పూర్వంబునకన్న మిగిలిన బలంబును తేజంబు
నుం బొంది వుత్సాంగి సంతోషంబునం బ్రేమాస్పదంబులగు దృష్టుల
నర్జును నీక్షింపుచు జరాసంధునిం గదియంబట్ట గ్రిందం బడద్రోంచి
పాదంబులు బట్టుకొని మింటనె నూరుపర్యాయంబులుగా గిరగిరం
ద్రిప్పి భూమియందుం బడవైచి యెముకలు విరుగదన్ని నతనిపాదం
బులం బట్టి నడుముకు పక్షంబులుగా జీల్చివైచిన, నతండు రక్తంబు
గార వికృతనాదంబు గావించుచుం భూమింబడి తన్నుకొని ప్రాణం
బులుం విడువ, నాసమయంబునం బుట్టిన జరాసంధుని మరణసంబంధ
మయిన ఘురఘురమనుధ్వనియును సంతోషంబునం జేయుచున్న
భీముని సిమ్హనాదంబులును వుత్సాహంబునం బొదలు కృష్ణార్జునుల
వాక్యంబులచేతనుం భూమ్యాకాశంబులు తూటుగుట్ట దిక్కులు
బీటలు వారగలిగిన నమ్మహాశబ్దంబున స్త్రీలగర్భంబులలిసి సర్వజనంబులు
భయంబునొందుచుండ, ఆ జరాసంధుని శరీరఖండంబుల యజ్ఞశాల
యందుం బడవైచి ఆయర్ధరాత్రంబుననె శత్రుసంహారకులగు నమువ్వు
రునుం బయలుదేరి జరాసంధుని రథంబునకుం గుఱ్ఱంబులం బన్నించి
భీమార్జునులం దనప్రక్కనం గూర్చుండంబెట్టుకొని కారాగృహంబు
దరియంజొచ్చి అందు బంధితులైన తనకుం బంధువులగు రాజులనుం
విడుపించిన, సర్వాలంకారశోభితులగు అమ్మహారాజులు వస్త్రంబుల

చేతను ఆభరణంబులచేతను మాల్యంబులచేతనుం బూజించినవారై యుండగా నారాయణుండు సహదేవునూరార్చి అభయంబిడి భీమార్జునులం గూడికొని రాజులు వెంబడిం జనుదేర రథారోహణంబుగావించి ఇంద్రప్రస్థపురంబునకుం బయలుదేరి దానుసారథ్యంబుజేయ భీమార్జునులు గార్ముకపాణులై చుట్టనున్న సైన్యంబులను దూరంబుగా జెదరగొట్టి పటుత్వవంతులై తేజోవంతులై తారకాసురసంహారంబునందు ఇంద్రుండును వుపేంద్రుండునుం బ్రకాశించినరీతి శోభిల్లుచుండిరి. పూర్వకాలంబునఇంద్రుండు దాను యేదివ్యస్యందనంబునం గూర్చుండినూరుమంది రాక్షసులనుం జంపెనో అట్టిరథంబును వసువనురాజున కిచ్చెను. అతండు స్నేహంబున బృహద్రథున కిచ్చెను. జరాసంధుండు యతనికొమారుండగుటచే యీస్యందనంబునుం బొంది ప్రతాపవంతుండై ప్రకాశించుచుండెను. ఆయుధంబులచే విరుగనిదియును యోజనదూరంబువరకును గనంబడు యెత్తైన ధ్వజంబుగలదియును దివ్యాశ్వంబులుగలదియును నయిన రథంబుపైనం గూర్చుండి కృష్ణుండు, మనంబునందు దలంచగనే కిలకిలార్భటులు జేయుచు నోరుదెరచుకొని భయంకరంబుగా గరుడుండేతెంచి మాధవు ననుజ్ఞచే ధ్వజాగ్రంబునందుం బ్రకాశించుచుండ, గిరివ్రజపురంబు వెడలి విశాలంబగు బయలప్రదేశంబున రథంబునునిలిపి యుండగా, యప్పురంబున నుండెడు చాతుర్వర్ణంబుల వారును కృష్ణార్జున భీములను గంధపుష్పాదులం బూజించి అర్ఘ్యపాద్యాదుల నొసంగి మధుపర్కంబు లిచ్చి గౌరవించిరి. కృష్ణునిచేత విడుపించంబడిన రాజు లందరును గృష్ణుం జూచి పరమాత్ముండా యనియును దీనబంధోయనియును భక్తశరణ్యాయనియును నానావిధంబుల స్తోత్రించినవారై, మహానుభావా, జరాసంధుని కారాగృహం బనెడు మహాగ్రాహపంకిలం బగు మడుంగున మునింగినట్టియును భయంకరంబును యితరుల కసాధ్యంబును నగు

గిరివ్రజంబను యీపురంబునం జిక్కువడియున్న మమ్ముల నుద్ధరించినట్టివాడవు, ధర్మపరిపాలనంబు కొఱకు దేవకీగర్భంబున నవతరించిన ఆదినారాయణుండవు, యిట్టి నీకసాధ్యంబైనది యేదియును లేదు. జగత్పతే, నీదాసులము, నీయాజ్ఞను శిరసావహించి నెరవేర్తుము శెలవిండనిన, వాక్యంబులయందు నేర్పుగలవాండును మోహనకరంబులగు చూపులు గలిగిన కృష్ణుండు యమ్మహారాజులనుం జూచి, ధర్మాత్ముం డగు యుధిష్ఠిరుండు రాజసూయాధ్వరంబను కార్యంబుం జేయనున్నవాండు, మీరందరు క్రతువునకుం దోడ్పడి నిర్విఘ్నంబుగా నెరవేర్చుదురని బలికిన, రాజులందరు సమ్మతించి ధనకనకరత్నంబులం కృష్ణునకు గానుకగా నొసంగిన నతండు గైకొనక వలవదని యెంత చెప్పినను విననందున భక్తిభావంబుల నిచ్చుచున్న యావస్తువులనుం దయగలవాండై గైకొనియె. తదనంతరంబున జరాసంధ సుతుం డగు సహదేవుండు అమాత్యవర్గంబుల తోడంగూడి వినయంబున కృష్ణునకు అనర్ఘంబులగు రత్నంబులను మణులను బంగారంబును నాణ్యంబులగు పీతాంబరంబులను గానుకగా నిచ్చినం గైకొని, ఆతని భయంబు దీర్చి యమ్మగధదేశంబునకుం బట్టాభిషిక్తునిం జేసి, అనంతరంబ భీమార్జున శ్రీకృష్ణులు అక్కడికి వచ్చి యుండు వారల నందరికి సమ్మానంబుం గావించి అనుజ్ఞ యొసంగిన రాజు లందరును తమతమ భూములకుం జనిరి. సహదేవుండును మంత్రులతోడం గూడినవాండై యమ్మహానుభావుల ననుజ్ఞం బొంది పురంబు జేరుకొనియెను. తదనంతరంబున మువ్వురును రథంబుం దోలుకొని త్రేతాగ్నులచందంబునం దేజోవంతులై ప్రకాశింపుచు కతిపయ ప్రయాణంబుల ఇంద్రప్రస్థపురంబుం జేరి సంతసంబునం ధర్మజుం గాంచి వినయంబుదోప దాము దెచ్చిన గానుకలు సమర్పించి, ధర్మనందనా, భీముండు దైవవశంబుచేత జరాసంధునిం దెగ్వచి కారా

గృహంబునందు బాధలం బొందుచున్న రాజుల విడిపించి సుఖంబుగా నీసాన్నిధ్యంమునకు యోగానుకలుం గై కొనివచ్చిచేరినవా రైరని జెప్పగా సంతసించి కృష్ణుం బూజించి భీమార్జునుల నాలింగనంబులు గావించి స్వర్గతుల్యంబగుఆనందంబునొంది, శ్రీధరుని వెంబడివచ్చిన రాజులనుసత్కరించిఆతిథ్యంబిచ్చినవాండై అనుజ్ఞనొసంగ వారలు తగిన వాహనంబుల నెక్కి తమతమ దేశంబులకుం జనిరి. ఇవ్విధంబున లోక సంరక్షకుండగు నారాయణుండు భీమునిచేత జరాసంధునిం జంపించి కారాగృహంబునందు బంధింపంబడిన రాజులను విడుపించినవాండై, ఇంద్రప్రస్థంబున పాండవుల కైదుగురికిని కుంతీదేవికిని ద్రౌపదీసుభద్రలకును సంతోషంబుగలుగ కొన్ని దినంబులుండి వారల యనుజ్ఞం బడసి యావన్మందియు వెంటనంట జవనాశ్వంబులం గట్టినరథంబునం గూర్చుండి దారుకసామర్థ్యంబు మెరయం బ్రయాణంబు జేయుచు అందరిని నిలువంబనిచి కొన్ని దినంబులకుం ద్వారకానగరంబుం జేరుకొనియె. అనంతరంబ పాండవులు ద్రౌపదీసమన్వితులై ధర్మార్థకామంబుల కొరంత పడకుండగా ధర్మంబుగను న్యాయమార్గంబునను బ్రజలం బాలింపుచునుండిరి.

ఇది సభాపర్వంబునందు యిరవైయారో అధ్యాయము

---

## అధ్యాయము 27

---

ఇవ్విధంబున జరాసంధుని వధించిన వృత్తాంతంబు జనమేజయుండువిని అనంతరవృత్తాంతంబు వినంగోరినవాండై యడుగుటయు వైశంపాయనుండు జెప్పందొడంగె. అనంతరంబున అగ్ని దేవుని సాహాయ్యంబున దివ్యరథంబును అక్షయతూణీరంబులును గాండివంబును

ధనుస్సును శ్వేతాశ్వంబులును భయంకరనినాదంబుగల శంఖంబును చిత్రవిచిత్రంబగురూపంబులుగల మయసభయునుం గలిగినవీరుండును పరాక్రమవంతుండునునగు నర్జునుండు అన్నయగు ధర్మజుంగాంచి, మహారాజా, బరాక్రమవంతులును శస్త్రాస్త్రపారగులును వీర్యవంతులునునయిన నలుగురు తమ్ములు నీకుగలిగినందుకుగాను బొక్కసంబు వృద్ధింబొందుటయ ఫలంబు. ఇప్పుడు మంచిముహూర్తంబునుంజూచి నన్ను దిగ్విజయార్థంబుకొరకు నియోగింపుమనిబలికిన, ధర్మజుండు తమ్ముని మాటలకు సంతసించి మృదుత్వంబులగు మాటల నర్జునుంజూచి, పార్థా, నీవుం జెప్పిన విషయంబు యుత్తమంబు, శత్రువులు మాయుటకును స్నేహితులకు సంతసంబు గలుగుటకును పండితోత్తములగు బ్రాహ్మణజనంబునకు శాస్త్రీయముగా పూజనంబులుగావించి వారలయాశీర్వాదంబులనొంది బయనంబైన జయంబుగలుగుంగాన నట్లంజేయుమని జెప్పుటయు, నర్జునుండట్లనె గావించి అగ్రజునను మతినిబొంది తల్లియగు కుంతీదేవి ఆశీర్వాదంబునుంబొంది అగ్నిప్రదక్షిణంబుజేసి ఖాండవంబుదహించుకాలంబున అగ్నిదేవుం డిచ్చిన శ్వేతాశ్వయుక్తంబగు దివ్యరథంబునెక్కి గాండీవంబుధరించి అక్షయతూణీరంబులగు పొదనుం గైకొని చతురంగబల పరివృతుండయి సంతసంబునం బొదలుచు కుబేరసంబంధమయిన నుత్తరదిక్కునకుం జనియె. పురుషశ్రేష్ఠులును తేజోవంతులును నగు భీమనకులసహదేవులునుం ధర్మజునను జ్ఞనుం గొని, భీముండు తూర్పు దిక్కునకును, సహదేవుండు దక్షిణదిక్కునకును, నకులుండు పశ్చిమ దిక్కునకుంజనిరి. ధర్మజుండు ఇంద్రప్రస్థపురంబున ధర్మంబుగా ప్రజలం బాలించుచు, వేదాంతగోష్ఠి సేయుచు ధర్మంబులునుం దెలుసుకొనుచు మహావైభవంబుతోడం బ్రకాశింపుచునుండె.

ఇది సభాపర్వంబునందు యిరవైయేడో అధ్యాయము.

---

## అధ్యాయము 28

ఇవ్విధంబునం బలికిన వైశంపాయనుంజూచి జనమేజయుండు, మునీంద్రా, యశోధనులగు మాపెద్దలచారిత్రంబు లెంతవినినను దనివిం దీరకయున్నదిగాన సవిస్తరంబుగా దెలుపుమని యడిగిన వైశంపాయనుండు చెప్పందొడంగె. జనమేజయ మహారాజా, ముందుగా నర్జునుండు నుత్తరపుదిక్కును జయించిన వృత్తాంతంబు జెప్పెదనువినుము. అట్లు అర్జునుండు పయనంబై నుత్తరదిశకుం జని సులభంబుగానే కుళింద దేశపు రాజులనుం జయించి ఆరాజులవెంబడిం దీసుకొని సాళ్వ నగరంబునకుం జని ఆదేశాధిపతియగు ద్యుమత్సేనునిం జయించి ఆరాజునుం దనసైన్యంబునకు సేనానిగానేర్పరుచుకొని, కటక దేశంబునకుంబోయి ఆదేశంబునుం బాలించుచున్న సునాభుండనురాజును దనప్రతాపంబుచే జయించి యతనినింగూడ దనకు నుపసేనానాయకునింగాబిలిచి యతండనుసరింప శాకలద్వీపాధిపతియైన బ్రతివింధ్య మహీపాలునినిర్జించి మఱియు నటచని సప్తద్వీపంబులంగల నరపతుల శౌర్యంబు సమయించి యీశానదిగ్భాగంబు బ్రవేశించి యయ్యెడం గల ధరాధిపతుల నోడించి, పరమ కాంభోజహృషీక దేశాధిపతులకు గర్వభంగంబుగావించి, యుత్తరహృషీక దేశంబు జుట్టుముట్టి యతిఘోర సంగ్రామంబునంగల రాజుల నందఱంబరాజితుల నొనర్చి, యటకడచి ప్రాగ్జ్యోతిష పురంబుపై నడరిన, కిరాత సేనలను మఱియు సముద్రతీర నివాసులగు నానాయోధ వీరులంగూడి భగదత్తుండు, ప్రతిమానంబును నాశ్చర్యకరంబును నతిఘోరంబునునగు యుద్ధం బెనిమిది దివసంబులుగావించి, యించుకయును శ్రమంబు నొందని విజయుంగనుంగొని మందహాసంబు నేయుచు, నీవు వాసవనందనుండ వగుట నిట్టి పరాక్రమశక్తి నీకేతగు. నేను మహేంద్రుని మిత్రుండ

నగుటం జేసి నేను యుద్ధంబునం బురందర సమానుండ నయ్యెను నింక నీతోడ నాయోధనంబు సలుపంజాల. నీపనిచినపంపు సేసెద. ఎఱుంగింపు మనిన భగదత్తునిం దిలకించి పార్థుండు, కురువంశ శ్రేష్ఠుండగు ధర్మనందనుండు రాజసూయ యాగంబుగావింప సమకట్టి యున్నవాండు. నీ వతనికిం గప్పంబొసంగవలయు. మాకుం బితృసఖుండవు గావున నిన్ను నియోగింప నోడుదు. నీవొసంగినది గైకొనంగలవాండ ననిన భూపౌత్రుండు సంతసింపుచు, నీవు మాకు నెట్లు అట్లన ధర్మనందనుండు గావున రాజసూయంబునకు వలయు వస్తువుల నొసంగెద. మఱియు నీకభీష్టంబగు కార్యంబునుం గావించెద నని సాంత్వన వచనంబులాడుచు నయ్యర్జునుని బురంబునకుం దోట్కొని చనిన, నతండును నొక్కమాసంబు ప్రాగ్జ్యోతిష నగరంబున వసియించి భగదత్తుండొసంగు వస్తువాహనంబులు గైకొని వెడలి కామపురంబు జయించి మగిరి నోడించి, భువనపర్వతంబునకుంజని యనావిలుండను మహీపాలుని గెలిచి.

ఈకథ సభాపర్వంబునందిరువదియెనిమిదవ యధ్యాయము.

---

## అధ్యాయము 29

---

మఱియును బరాక్రమధురంధరుండగు ధనంజయుండు కుబేర పరిపాలితంబగు నుత్తరదిశకుంజని అంతరగిరియును, బహిర్గిరియును, నుపరిగిరియును, ననియెడి దుర్గంబుల కధిపతులగు యవనులం జయించి రత్నకాంచన ప్రముఖంబులగు కప్పంబులు గైకొని వారలనువర్తులగుచు వెంబడిం జను దేరం జతుర్విధవాద్యనినాదంబులును, రథనేమిని స్వనంబులును, హయహేషారవంబులును, గరిబృంహితంబులును, ధరణీ

చక్రంబు ఘూర్ణిల్లుచు నుండ నటం గదలి బాలుండును నులూకనగ
రాధిపతియును నగు బృహంతుండు చతురంగబలసమేతుండై చనుదెంచి
యతివిస్మయకరంబగు సమరంబు గావించిన నతనిం బరాజితుంజేసి
యర్బుదకుంజరంబులు, న్యర్బుదహయంబులును, మఱియు ననేకకోటి
ధనంబులును, బృహంత మహీపాలుండు కానుక నొసంగి తాను
వెంబడి నేంగుదేర, సేనాబిందుని రాజ్యంబుదాంటి మోదాపురం
బుజేరి యచ్చోటంగల వామదేవ, సుదామ బహ్కల దేశ
నృపాలకులను, నుత్తరఉలూకదేశంబులంగల భూపతులను నిర్జించి
వారలు దన్ను ననుసరింప నచ్చోటంగల ప్రధానదేశంబుల నైదింటి
నాక్రమించి సేనాబిందు భూవరుండేలు దేవప్రస్థపురంబున సైన్యంబు
విడియించి యటవోయి విష్వగశ్వుండను రాజు నోడించి యంతం
బార్వతీయ సేనాసమేతుండగు పౌరవుని నోర్చి, యన్యోన్యసహా
యతం బ్రవర్తిల్లెడు సప్తదస్యుల నుక్కణంచి కాశ్మీరదేశాధీశ్వరులగు
క్షత్రియులం గెలిచి దశమండలాధిపతియగు లోహితు నతిక్రమించి,
పదంపడి త్రిగర్త, దార్వక, కొంకణాభిసారదేశాధీశ్వరులగు క్షత్రి
యుల యుబ్బడంచి కరూశాధీశ్వరుండగు రోచమానునిం జయించి
సింహపురపతియగు చిత్రాయుధునిం దెగటార్చి, వంగోత్తరచోళాధి
పతులం గీటణంచి సంతుష్టాంతరంగుం డగుచు, బాహ్లికంబునకుంజని,
యందు తగువారలం దోడ్కొని దరదకాంభోజదేశాధినాథులగు
యవన, శక, కిరాత,ఖర్వ,కాచ,హూహుక,తిరోపాసిక ప్రభృతి మ్లేచ్ఛ
వర్గంబుల ననర్గళపరాక్రమంబున నిగ్రహించి, మఱియును నీశానది
శాభిముఖ్యంబుగా నరిగి యచ్చోటంగల యాటవికదేశాధిపతుల
మర్దించి మఱియు నిత్తెఱంగున ననేక భూవిభుల గర్వభంగంబు గావిం
పుచు, ఋషికదేశంబునకుంజేరి యందుం దారకాసురసంగ్రామసదృశం
బగు యుద్ధంబున నచ్చోటంగల నరేంద్రుల నోటువరచి యతివేగవం

తంబులగు శుకవర్ణతురంగంబు లెనిమిదియును, మయూరవర్ణహయం బులు గొన్నియును, గైకొని యుత్తెఱంగున భారతవర్షం బంతయునుం జయించి, మఱియును దివ్యవర్షంబులంగల కులశైలాధినాథులం బ్రాదా క్రాంతులం గావించెదనని వైశంపాయనుం గనుంగొని జనమేజయుండు, మునిశ్రేష్ఠా, పార్థుండు, దివ్యవర్షంబుల నయ్యెడంగల కులశైలా ధీశ్వరుల నోడించిన వృత్తాంతంబును వారల నామధేయంబులను వేర్వేఱ వివరింపవలయు ననిన వైశంపాయనుం డతని కిట్లను నిత్తె ఱంగున భారతవర్షం బంతయు జయించి హిమవత్పర్వత నివాసుల మదం బడంచి యట కదలి శ్వేతపర్వతంబున సైన్యంబు విడియించె.

ఇది సభాపర్వంబునం దిరువదితొమ్మిదవ యధ్యాయము

---

## అ ధ్యా య ము 30

---

మఱియును నట చని ద్రుమపుత్ర పరిపాలితంబగు కింపురు ష దేశంబు జుట్టుముట్టి సకల క్షత్రియభయంకరంబగు సంగ్రామం బొనర్చి వారలవలనం గరంబు గైకొని గుహ్యక రక్షితంబగు హాటక దేశంబు జొచ్చి వారల స్వవశులం గావించి మానస సరోవరంబున కేంగి యతిరమ్యంబగు ఋషికుల్యతీర్థంబు కనుంగొని యచ్చటం గల హాటకులను గంధర్వులం జయించి తీతువవన్నెలును, మండూక సమానంబులగు నేత్రంబులు గల గుఱ్ఱంబుల నపారంబుగం గైకొని హేమకూటపర్వతంబు దాంటి బహు సేనాసమేతంబుగా నడచి హరి వర్షంబు బ్రవేశించి యయ్యెడ నతివినోదంబులగు నగరంబులును, నత్యున్నతంబులగు వృక్షంబులును, నమృతోపమానజలంబులు గల నదులును దేవతా సమానులగు పురుషులును, సకల సౌందర్య సమే

తలగు కాంతలం గనుంగొని సంతసింపుచు వార లొసంగెడు కప్పం బులు గైకొని యతివిస్తృతంబగు నిషధపర్వతంబునం గలవారల గ్రుక్కించి యచ్చట నుండియును, నిలావృతవర్షంబునకుంజని యు య్యెడ దేవసంకాశులును, నపూర్వదర్శనులును, సకల వైభవాభి రాములునగు దివ్యపురుషులును, నవరత్నకనకమయంబులను, నప్సర స్త్రీ సమానంబులగు నారీజనంబులను తిలకించి యందుం గల దివ్య పురుషులం గెలిచి, వారలచే దివ్యరత్నభూషణాంబరాదులం గైకొని మఱియునుదఙ్ముఖంబుగా సువర్ణమయంబును, దుర్గమంబును, లక్ష యోజన పరిమితంబును జాజ్వల్యమానంబును, నుత్తమోత్తమంబును, దివ్యంబును, దేవగంధర్వ సిద్ధచారణ సేవితంబును, నిత్య పుష్పఫల సమేతంబును, నపారమహిమాస్పదంబును, నజేయంబును, సుకృతి జనప్రాప్యస్థానంబును, నానామృగ సంకీర్ణంబును, దివ్యౌషధభాసమా నంబును, బహు విహంగనినాద భరితంబునునై, ననరారుచుం గనక శృంగంబుల సూర్యుని తేజంబు తిరస్కరింపుచున్న మేరుమహీధరం బుగనుంగొని ప్రమోదమానమానసుండగుచు, సురగిరి దక్షిణభాగం బున నున్న యిలావృతవర్ష మధ్యంబున, నిత్యకుసుమ ఫలాకీర్ణంబును, దేవగణసేవితంబును, నభ్రంకష శాఖాశిఖాసమేతంబునునగుచు నే వృక్షంబు పేర నీద్వీపంబునకు జంబూద్వీపంబను నామధేయంబు గలిగె నట్టి జంబూమహీరుహరత్నంబు కనుంగొని యయ్యిలావృత వర్షంబునం గల సిద్ధ సాధ్య కిన్నర కింపురుష ప్రముఖులచే ననేక వస్తువాహనంబులం గైకొని మేరుధరాధరంబునకుం బ్రదక్షిణంబుగా నడచి చనునెడ స్వర్ణమయ పక్షిజాలంబును, సువర్ణకమలంబులును, హేమపంకంబులును, గనకజలంబును, జాంబూనదసైకతంబును, హిర ణ్యకువలయంబులు గలిగి యుభయతీరంబుల నున్న చామీకరవృక్షం బుల వలన మనోహరంబగుచు రత్నఖచిత సోపానంబులు గల రేవు

లుం దనరారుచు గంధర్వాప్సరోజనంబుల నృత్తగీతంబులవలనను, నానావితానవిచిత్ర సంతానంబులవలనను, శోభితంబగుచుం గనుపట్టు రత్నమంటపంబుల నలరారెడు, తీరప్రదేశంబులుం గల జంబూనదిం గనుంగొని దాని మహత్త్వంబు గొనియాడుచుం దత్ప్రాంత నివాసులును, మనోహరాకారులును, జంబూరసాహారులును, దివ్య స్త్రీ సమేతులును, నిత్యసుభోజ్జ్వలులును నగు దివ్య పురుషుల వలన దివ్యరత్న భూషణ జాంబూనద ప్రముఖంబులగు కానుకలు గైకొని మఱియుం బశ్చిమ దిగ్భాగంబునకుం గదలి నాగాధిపతులవలనం బరిరక్షితంబగు దేశంబు నొర్చి మఱియు నట కదలి గంధమాదనపర్వత నివాసుల నోడించి నిఖిలరత్న పరిపూర్ణంబగు కేతుమాల వర్షంబునంగల దివ్య పురుషుల నుక్కణంచి దుర్లభంబులగు వస్తువిశేషంబులు గైకొని యచ్చటనుండి మగుడి యిలావృత మధ్యదేశంబు సొచ్చి మేరుమందర మధ్యంబునం గల శైమోద నదీప్రాంతంబున నిబిడంబగు, వెదుఱుటడవి నెలకొనియుండెడు పశుపకుణిందటంకణపరటంకణ దీర్ఘవేణిక ప్రముఖుల బలంబుల నోటువరచి కప్పంబులు గైకొని పర్వత శ్రేష్ఠంబగు మాల్యవంతం బతిక్రమించి భద్రాశ్వవర్షంబున కేంగి యయ్యెడం గల దివ్యమానవుల నిజాధీనులం గావించి రత్న కాంచనంబులు గైకొని నీయిలాపర్వత నివాసుల భంగపరచి యట కదలి రమ్యకవర్షంబు ప్రవేశించి తద్దేశనివాసుల నుఱ్ఱణంచి, గుహ్యక దేశంబున కరిగి యచ్చట బహువిచిత్రంబులగు సువర్ణ మృగపక్షి కులంబులం గైకొని, యటతరలి శ్వేతపర్వత నివాసుల పుదంబడంచి, హిరణ్యకవర్షంబు ప్రవేశించి చనునప్పుడు, తద్దేశ మధ్యంబున నానా రత్నఖచితంబులగు సౌధంబులపై నిలిచి తత్పురకాంతలు సర్వాభరణభూషితుండును, నతిమనోహరాకారుండును, మహారాజ చిహ్నాలంకృతుండును, వీరాగ్రేసరుండును, సుకుమారుండును,

దేజోవిరాజమానుండును, మహేంద్రసమానుండును, శత్రుభయంకరుండును నగు నింద్రనందనుం గనుంగొని కార్తికేయునిగాం దలంచుచు, నీపరాక్రమకంఠీరవుని నెదురించువైరులుంగలరే యని పలుదెఱంగులం బొగడుచుం బుష్పవర్షంబులం గురియుచుండ నచ్చటి మహీపతులవలన మణిహేమప్రవాళవస్త్రాభరణంబులు మొదలగు కానుకలుగైకొని యటం జని శృంగవంత పర్వతంబునకుం జేరె.

ఇది సభాపర్వంబునందు ముప్పదవ యధ్యాయము.

---

## అధ్యాయము 31

---

మఱియును శృంగవంతంబునకు నుత్తరదిశాభాగంబునం గల హరివర్షంబుజేరి యచ్చోట వసియించియుండు విద్యాధర యక్షప్రముఖుల జయించి వారలచే బహుద్రవ్యంబులును, రత్నభూషణాంబరంబులును, యజ్ఞార్హంబులగు కృష్ణాజినంబులును, విచిత్రంబులగు వల్కలంబులునుం గైకొని, యచ్చటనుండియును సకలసైన్యపరివృతుండగుచు నుత్తరకురుభూముల నోడింపవలయునను తలంపునం జనుచుండ మహాబలపరాక్రమ సంపన్నులును,పర్వతోపమాన దేహులును, నగు ద్వారపాలకులు చనుదెంచి యతనిం గనుంగొని ఇంద్రనందనా! ఈదివ్యపురంబు నీచే గెలువనలవిగాదు. మనుష్యులకు నిది దురవగాహంబై యుండు. ఇది యుత్తరకురుభూమి యనందగు, ఈయెడ సమరంబు ప్రవర్తిల్లనేరదు. ఇచ్చటం గల దివ్యపురుషులు మానవుల కదృశ్యాకారులై యుండుదురు. ఈదిశకుం జనియెడ వేని పునరాగమనంబు దుర్ఘటంబు. నీకు దిగ్విజయంబు సిద్ధించె. ఇక మఱలుము. నీప్రతాపంబునకు సంతసించితిమి. సమరంబున నీదేశంబు సాధించెదనను

తలంపు దక్క వేఱొండు కార్యంబు గలదేని దెల్పుము. ఏమునట్ల కావించెదము, అనిన నర్జునుండు వారల నుపలక్షించి, ధర్మనందనుండు వాసుదేవానుమతంబున రాజసూయం బొనరింప సమకట్టి పార్థివత్వంబు గోరియున్నవాండు. పార్థివత్వంబు సిద్ధింపంజేయవలయునని యరుగుదెంచితి. మానవుల కదృశ్యాకారులగుదురయేని మాకు నీదేశంబు ప్రవేశింప నేటికి ? పాండవాగ్రజునకుం గప్పంబు నొసంగిన మఱలి చనియెద. కాదేని కృష్ణసహితంబుగా నేంగుదెంచి మీతోడం దొడరి విజయంబు గైకొనియెదనని పలుకు నప్పార్థుని వచనంబు లాకర్ణించి యాప్రతీహారులు దివ్యాంబరంబులును, దివ్యాభరణంబులును, నతిధవళంబులగు నారచీరలును, నొసంగినం గనియె. ఇవ్విధంబున ననేక రాజవర్యులను వర్షాధిపతులను నిర్జించి యుత్తర దిగ్విజయంబు సేకొని సహస్రసంఖ్యలం గల ధనంబులును, నపరిమిత నవరత్నరాసులును, తిత్తిరికల్మాషంబులును, శుకపత్రనిభంబులును, మయూరసమానచ్ఛాయాకాయంబులును, వాయువేగసంపన్నంబులగు బహుతురంగంబులును, ను ఱి యు యాగార్హంబులగు వస్తునిచయంబులును గైకొని చతురంగ బలసమేతుండగుచు, మహావైభవంబు మెఱయ నింద్రప్రస్థపురంబునకుం జని నానామహీపతుల నోటుపరచి తెచ్చిన కానుకలన్నియునుం గొంతేయాగ్రజు సన్నిధానంబున నిడి యతనిచే ననుజ్ఞాతుండై నిజసదనంబున కేంగి సుఖంబునం బ్రవర్తిల్లె.

ఇది సభాపర్వంబునందు ఋుప్పదియొకటవ యధ్యాయము.

---

## అధ్యాయము 32

ఇంక భీమసేనుని విజయంబు సెప్పెద నాకర్ణింపుము. అట్లు యుధిష్ఠిరునిచే ననుమతి వడసి పవననందనుండు చతురంగ బలసమేతంబుగ శత్రుభయంకరుండగుచు నడచి రోచమానుండను మహీపతి ననుజసమేతంబుగ సులభంబున జయించి యచట నుండి పాంచాల పురంబునకుం జని సాంత్వవచనంబుల వారలచేం గొన్ని కానుకలు గైకొని యట కదలి విదేహపురంబునకుం జేరి యయ్యెడం గల ధరాధిపుల సత్వరంబుగ నోర్చి యట వెడలి దశార్ణదేశాధీశ్వరుండగు సువర్ణమయ నరేంద్రుని పయిం దొడరిన నతండును పవననందనుం దాకి యాయుధంబు కరంబున ధరియించక యద్భుతంబగు యుద్ధంబు గావించిన నతని పరాక్రమంబునకు విస్మితంబగుచు, భీమసేనుండతని బలంబును, బురంబును, జుట్టుముట్టి భగ్నంబు గావించి యతిదుష్కరంబగు యుద్ధంబున నిర్జించి యతండు వశవర్తియై మెలంగ నిజసేనాధిపత్యం బొసంగి యట నిర్గమించి రథ గజతురగపదాతులవలన భూమి కంపింప నడచి యశ్వమేధ నగరాధిపతిని సోదర సహితంబుగ నోడించి యచట నుండి దక్షిణంబుగ నేంగి పుళింద నగరాధ్యక్షులగు సుకుమార సుమిత్రుల భుజాటోపంబు మాయించి మఱియు నా కౌరవశ్రేష్ఠుండగు మారుతాత్మజుండు చేదిదేశంబు ప్రవేశించి నిజాగమనంబునకు సంతుష్టుండగుచు నెదుర్కొను శిశుపాలమహీపాలుని సంధించి యన్యోన్యంబు కుశల ప్రశ్నంబు గావించిన యనంతరంబ సునీథుండు భీమసేనుం గనుంగొని చిఱునవ్వు నవ్వుచు, మహాబలనందనా! నా రాజ్యంబంతయును నీయధీనంబు గాదె! నీరాకకుం గారణంబేమి యెఱింగింపు మనిన వృకోదరుండు ధర్మనందనుండు రాజసూయాగం బొనర్చు వృత్తాం

తం బెఱింగింపం బ్రీతుండగుచు, నతని పురంబునకుం దోడ్కొని చనియె. అంత బకాంతకుం డయ్యెడ నొక్కమాసంబు వసియించి యతం డొసంగు సత్కారంబులు గైకొని సేనా సమన్వితుండగుచు మఱియుం బ్రాగ్భాగంబునకుం జని.

ఈకథ సభాపర్వంబున ముప్పదిరెండవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 33

---

కుళిందదేశాధీశ్వరుండగు శ్రేణిమంతుని గర్వం బణంచి, కోసలదేశంబున కేంగి కౌసల్యనృపాలుని దర్పం బడంచి యయోధ్యాపురంబునకుం జని పటుభుజాబలధురంధరుండును, యజ్ఞశీలుండును నగు దీర్ఘప్రజ్ఞుం డను భూవరునిం జయించి యందులకు నుత్తరభాగంబున వసియించి యున్న గోపాలకుండును నంతపాలకుండును మల్లాధిపతియును, నను నరేంద్రుల భంగపరచి భుజాబలశాలియగు నాభీముండు హిమవత్పర్వతప్రాంత నివాసులగు ననేక దేశాధీశ్వరులను, సులభంబుగ గెలిచి యంతం గుంతలదేశంబు సొచ్చి కుక్షిమంతంబను పర్వతం బెక్కి కాశీరాజ్యంబునకుం బోయి సుబంధునిం దనకు నధీనుగా నొనర్చి యవ్వలం గదలి సుపార్శ్వనగరాధిపతియగు క్రంథనుండను జగపతిని ఘోరసమరంబున నిర్జించి మఱియును మత్స్యమాళవగయ పశుభూమి మొదలగు దేశంబులను, నాటవీయంబను పర్వతంబునంగల గోప తేయుల మర్దించి కప్పంబులు గైకొని యుత్తరాభిముఖుం డగుచు, వత్సభూమింగల ధరాధిపతులను నిషాదవల్లభులను, మఱియును, మణిమంతుండు మొదలగు రాజులను నోడించి యచ్చోటు వదలి దక్షిణాభిముఖంబుగాం దిరిగి దక్షిణమద్రదేశంబు స్వవశంబు గావించి,

శర్మవర్మగపురాధీశ్వరుల సాంత్వవచనంబుల నధీనులం జేసి, విదేహ నగరాధిపతియగు జనకనృపాలుని జయించి, యింద్రపర్వతసమీప వర్తులగు సప్తకిరాతపతుల నిర్జించి సుహ్మప్రసుహ్మసమక్షదేశవల్లభుల నోటుపరచి మగధదేశంబునకు నేంగి దంతుండును దండధారుండును, నను నృపతుల నోడించి గిరివ్రజపురంబునకుం జని జరాసంధనందనుం డగు సహదేవు నెంతయును గారవించి కరంబు గైకొని యతండు సహాయంబుగం జనుదేర నట నడిచి చతురంగబలసమేతుండును బరభయంకరుండును, నగు కర్ణునిం దాంకి యతిఘోరసంగ్రామంబున నుక్కణంచి పర్వతాధ్యక్షుండును దేజోధురీణుండును నగు మోదుం డను నృపాలునిం గెలిచి మఱియును శైలనివాసులగు ననేక రాజన్యలం గీటణంచి, యటం గదలి, పుండ్రదేశవల్లభుండును మహాబలపరాక్రమశాలియును నగు వాసుదేవుని సమగ్రాహవరంగంబున నిగ్రహించి కచ్ఛదేశాధీశ్వరుండగు కౌశికనృపాలుని నతిక్రూరసమరంబున మర్దించి, వంగరాజ్యంబున కరిగి తద్దేశాధిపతులగు సముద్రసేన చంద్రసేనులం బాదాక్రాంతులం జేసి, తామ్రలిప్తుండును, కౌచుండును నను మనుజాధిపతుల ప్రతాపంబు లడంచి యట వెడలి సింహదేశంబు బ్రవేశించి సముద్రతీరనిలయులగు మ్లేచ్ఛకిరాతులను, మనుష్యమాంసభక్షకులగు కర్ణప్రావరణకాకముఖప్రముఖులగు రాక్షసకులసంభవులును మఱియు ననేక దేశంబుల జయించి ధనకనకవస్తువాహనంబులు గైకొని లోహిత్యనగరంబు జేరి యయ్యెడ వసియించి యుండెడు మ్లేచ్ఛసైన్యాధిపతుల స్రుక్కించి చందనాగరుప్రముఖ సుగంధద్రవ్యంబులును, ముక్తామణిప్రవాళవజ్రప్రముఖంబులగు రత్నంబులును, శతకోటిసంఖ్యలం గల ధనంబులును, రజతకాంచనరాసులునుం గైకొని మఱలి యింద్రప్రస్థంబునకు వచ్చి ధర్మనందనుని సముఖంబున నిడియె. ఇంక సహదేవుని విజయం బెఱింగించెద.

ఇది సభాపర్వంబునందు ముప్పదిమూండవ యధ్యాయము

---

## అధ్యాయము 34

అని మఱియు వైశంపాయనుండు జనమేజయుం గనుంగొని, యత్తఱంగున జనమేజయుండు పాండవాగ్రజు ననుజ్ఞవడసి చతురంగబల సమేతంబుగ దక్షిణ దిగ్భాగంబునకుంజని తొలుం తొలుత శూరసేనాధీశ్వరులను మర్దించి మత్స్యదేశవల్లభుని స్వాధీనునింజేసి యటగదల దంతవక్త్రుని పరాక్రమంబు మాయించి యతనివలనం గప్పంబుగొని యవ్వలంజని సుకుమార సుమిత్రులను ధాత్రీపతుల వినతులంగావించుకొని యపరమత్స్య దేశంబునకేంగి పటచ్చరమహీవరులనోర్చి నిషాదభూమిం బ్రవేశించి గోశృంగపర్వత నిలయుండగు శ్రేణిమంతుండను క్షోణినాథుని సంగ్రామంబున నుక్కణంచి, యట వెడలి పరాక్రమ ధురీణుండగుచు నాసమీపవర్తులగు నవరాష్ట్రాధిపతులనోర్చి, యటంజని కుంతిభోజునిరాజ్యంబుంజేర నరిగిన నతండు ప్రియుండగుచు ననేక రత్నకాంచన ప్రముఖంబు లొసంగినం గైకొని చర్మణ్వతియను నదీతీరంబుననున్న జంభకుమారుండు తొలుత వాసుదేవునిం దొడరి యతనిచేతం బ్రాణావశిష్టుండగుచు విడువంబడియున్న వాండు కావున నట్టి పూర్వవైరంబునలంచి సహదేవుని దాంకిన నతండతని నాయోధనంబున నిర్జించి మఱియును దక్షిణంబుగ నరిగి మోకులును, బలమోకులును ననువారలకు గర్వభంగంబుగావించి రత్నకాంచనాదులగు కప్పంబులుగైకొని నర్మదాతీరంబున కరిగి యవంతిదేశాధీశ్వరులగు విందానువిందుల ఘోరయుద్ధంబునం బరాజితులంజేసి రత్నప్రముఖంబులు గైకొని భోజకటంబను నగరంబున కరిగి భీష్మకుండను నృపతితోడ రెండుదినంబులు కయ్యంబుగావించి యతనిచేం గప్పంబుగొని మఱియు నడిచి కోసలాధీశ్వరునినోర్చి వేణ్వాతటంబు బరిపాలించు మహీపతినోడించి మఱియు నటవెడలి,

ప్రాక్కోసలులును, నాటకేయులును, ధర్మగ్రామనివాసులును, తిరులును నను వీరలు మొదలుగాంగల కాంతార నివాసులగు శబరుల విధేయులం గావించి, చక్రపురాధ్యక్షుండగు సారంగమేయుండను భూవిభుని నిగ్రహించి మఱియు ననేకపుళిందుల దర్పంబడంచి మఱియు నట దక్షిణంబుగాంజని, పట్టనంబగు నగరంబు బాలించు మానవేంద్రునితో రెండుదినంబులు కయ్యంబొనర్చి నిర్జించి యటనని పూర్వంబున సుగ్రీవపరిపాలితంబగుచు జగత్ప్రసిద్ధింగాంచిన కిష్కింధానగరంబుచుట్టుముట్టి మైందద్వివిదులను వానరపతులతోడ సప్తదినంబులు సమరంబునడపి వారలు తనప్రతాపంబునకుమెచ్చి ధర్మపుత్రుని యజ్ఞంబు నిర్విఘ్నంబుగ నెరవేరెడునని పలుకుచుం గొన్నిరత్నంబులొసంగినం గైకొని సకల సేనాసమేతంబుగ మాహిష్మతీ పురంబుపై నడరిన శూరాగ్రేసరుండగు నీలుండు చతురంగబలసమేతుం డగుచు వైరిభయంకరుండగు సహదేవునిపైం దాఁకినంత సముద్రంబులు దారసిల్లిన చందంబున నుభయసైన్యంబులు లోకభయంకరంబగు సమరంబుగావింపుచుండం దేజో ధురంధరుండగు నగ్నిదేవుండు జాజ్వల్యమానుండగుచు సహదేవుని సైన్యంబులందుంగల గజంబులను, దురంగంబులను, రథపదాతి సమూహంబులను, మఱియును దక్కనుంగల యుద్ధసాధనంబులన్నియును, దహింపుచుం జనుదేర భయభ్రాంతుండై యేమియు ననంజాలక సహదేవుం డూరక నిలిచె. అనిన వైశంపాయనుంగనుంగొని జనమేజయుండు, విప్రోత్తమా! యజ్ఞకార్యార్థంబుగాం జనుదెంచిన సహదేవునెడ మహానుభావుండగు నగ్నిదేవుండు విరోధంబువాటించుటకుం గతంబెయ్యది యని యడిగిన వైశంపాయనుండతని కిట్లను. తొలుత మహానుభావుండగు నగ్నిదేవుండు మాహిష్మతీ పురంబునం బరదారా సక్తుండగుటంజేసి నిగ్రహింపంబడియెనని వినంబడుచున్నయది. అది నీకెఱింగించెద.

మాహిష్మతీపురాధ్యక్షుండగు నీలుండు నగ్నిదేవు నుపాసింప నమ కట్టియున్నతఁటి నతిసౌందర్యవతియగు సుదర్శనయను నతని కన్యకా రత్నం బగ్ని ప్రజ్వలింపం జేయవలయునను తలంపున వీవనల విసరి విసరి వేసరి వినమ్రముఖియగుచు పూత్కారంబు గావింప హుతాశ నుండును దానియధరపల్లవా స్వాదంబుగావించి యదిమొదలు దాని యం దనురక్తుండై ప్రవర్తిల్లుచు, మఱియును బ్రాహ్మణవేషధారియై యప్పురంబున జారుండై సంచరింపుచుండం దలవరుల నతనింబట్టి తెచ్చి రాజసన్నిధానంబున నునిచిన నీలుండును, శాస్త్రోక్తప్రకారంబున నతనిశిక్షింపం దలంచునంతం గోపోద్దీపితుండగుచు భగ్గునం దఱికొన్న పావకునింగనుంగొని విస్మితుండై భయకంపితగాత్రుండగుచు నమ్మహీ వల్లభుండు సాష్టాంగంబుగా నమస్కరించి యనేకవిధంబులం బ్రార్థింప సంతుష్టుండగుచు వీతిహోత్రుండు,నలయు వరంబొసంగెద, నీయభీష్టం బువివరింపుమనిన నీలుండును విరోధివర్గంబువలన భయంబులేకుండం దనకు నభయంబొసంగి రక్షింపవలయుననిన, నాండాదిగ నగ్నిదేవుం డప్పురంబున వసియించి యెఱుంగక యందరుగు దెంచిన శాత్రవ సైన్యంబులందహింపుచుండు. నాంటనుండి యానగరంబునంగల వని తలు వైశ్వానరుని యనుగ్రహంబున నిచ్ఛావిహారంబునం బ్రవర్తిల్లి యు దండనంబునకు నర్హులుగాకయుండుదురు. అనిన వైశంపాయ నుండు మఱియు నతనికిట్లను, నట్లు నిజసైన్యంబుదహింపుచుం జనుదెంచు హుతవహుంగనుంగొని ధర్మశీలుండగు సహదేవుం డగ్ని భరంబునం బరితపించు నిజసైన్యంబుగనుంగొనియు ధైర్యంబవలం బించి పర్వతంబు కైవడి సుస్థిరుండగుచు నిలిచి ప్రక్షాళితపాణిపాదుం డగుచు నగ్నిదేవు నుద్దేశించి, "మహాపురుషా! మేముగావించు యారంభంబంతయును నీకు సంతుష్టిసేయంగదా! నీవు నిఖిలదేవ గణంబులకు ముఖంబనంబరంగుచు యజ్ఞస్వరూపంబునం బ్రవర్తిల్లె

వవు. హవ్యంబులు వహించుటవలన హవ్యవాహనుండ వైతివి. లోకంబులన్నియును పావనంబుగావించుటవలనం బావకుండనంబరం గెదవు. వేదంబులు నిర్మితంబులుగలుగుటంజేసి జాతవేదుండునాఁబవరిల్లెదవు. మఱియును భవదీయ మహత్త్వంబుగొనియాడ నెవ్వరికి శక్యంబగు? చిత్రభానుండును, సురేశ్వరుండును, ననలుండును, విభావసుండును, నగ్నియును, నితరదుస్సహుండును, హుతాశనుండును, జ్వలనుండును, శిఖియును, వైశ్వానరుండును, బిశంగవర్ణుండును, బహుతేజోవిరాజమానుండును, బ్రవంగముండును, గుమారజనకుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, హిరణ్యగర్భుండును నను ననేక దివ్యనామంబులుగల నీకు నమస్కరించెద. ఇట్టి మహానుభావుండవగు నీవు యజ్ఞవిఘ్నంబు గావించుట యుక్తంబుగాదని భూతలంబునం బరచిన దర్భాస్తరణంబుపై శాస్త్రోక్త ప్రకారంబున బ్రాయోపవేశంబు గావించిన నతని యెడం బ్రీతుండగుచు వేలాతిక్రమంబు సేయని సాగరంబు చందంబున నతని నతిక్రమింపంజాలక చిత్రభానుండు మందమంద గమనంబునం దత్సమీపంబునకుం జేరి, మాద్రినందనా! నీయభిప్రాయం బెఱుంగుటకై యింతచేసితి. ధర్మనందనుండు దేవదేవుం డగు దేవకీనందనుండైన కృష్ణదేవుని భుజాబలంబవలంబించి యజ్ఞంబు గావింపఁ దలంచియున్నవాండని యెఱుంగుదు గావున దీనికి విఘ్నం బాచరింపనోడెద. ఇప్పురంబుం బరిపాలింపుచుండెదనని తొలుతనే వరం బొసంగినవాండ. అది యట్లుండె. నీయభీష్టం బెయ్యది వివరింపుమనిన దిగ్గన లేచి కరకమలంబులు మొగుడ్చుచుం బ్రణామంబు గావించి బహువిధంబులం బ్రశంసింప జ్వలనుండు సంతుష్టుండై తొలంగె. అంత నింతయునుం గనుంగొని నీలుండు పాండవేయుని సమ్ముఖంబున కేంగి సాంత్వవచనంబు లాడుచు సత్కారంబు గావింప నతండును నంగీకరించి

కప్పం బొనంగుమని నియోగించి మఱియు దక్షిణంబుగాం జని త్రిపుర నగరాధీశ్వరుం డగు నమితౌజసుండను నృపాలుని నివేశవర్తిగా నొన రించి, పోతన పురాధ్యక్షుని శిక్షించి సురాష్ట్రంబున కరిగి యాహుతి కౌశికాచార్యులను రాజుల శౌర్యం బడంచి యచటనుండియును, మహేంద్రసఖుండును, ప్రజ్ఞాశాలియును నగు, భీష్మకుని సమీపంబు నకు దూతలం బనిచి యతండు రుక్మిణీ ప్రభృతి కుమారవర్గంబుతో నరుగుదెంచి కృష్ణదేవుని మహాత్వంబు దలంపుచు సహదేవుని శాస నం బంగీకరించి ప్రియపూర్వకంబుగా రత్నభూషణాంబరాదు లొసం గినం గైకొని శూర్పకరుండును, దండకుండును, నక్రకర్ణుండును ననువారలకు గర్వభంగంబు గావించి, కాళగిరియును మరచి పట్టణం బును, దామ్రాశయద్వీపంబును, రామకపర్వతంబును నిర్జించి, తిమిహాన్నృపాలునిం గెలిచి సంజయంతీనగరంబున కేంగి, పిచ్ఛికంబును, నరాటంబును, నేలెడుమహీవరుల సమీపంబునకు దూతలం బనిచి, కానుకలు గైకొని భృగుకచ్ఛపురంబుపై విడిసి, బర్బరులను, శారసు లను, మఱియునుం గల సకలద్వీపనివాసులను దర్పంబడంచి వారల వలనం గప్పంబులు గైకొని కుళకులును, దరదులును, సింధూ రులును, నశ్మకులును, మూలకులును, మహాబలసమేతులగు విద ర్భులును, ననియెడు వనదుర్గాధిపతులం జారముఖంబున వశీకృతులం గావించి, చోళ, పాండ్య, ద్రవిడ, కేరళభూపతుల దూతలవలనం దనకు నధీనులం గావించి సింహళద్వీపనివాసుల సులభంబుగా గెలిచి యాంధ్రులను, దాళవనులను, గళింగులను, నాటవికులం గెలిచి, పురోత్త మనివాసియగు రోచమానుండు సమరంబునకుం గడంగ నతని ముఖంబునం గప్పంబు గైకొని మఱియును, గానన ద్వీపవాసిసుల నాయోధనంబున నిర్జించి యట కదలి తామ్రపర్ణీతీరంబున కరిగి, కన్యాతీర్థంబు దాంటి యివ్విధంబున దక్షిణ దిగ్విజయంబు నేకొని

సముద్రతీరంబున నిలిచి బుద్ధిసంపన్నులగు మంత్రులం గొండొక తడవు విచారించి, భీమనందనుం డగు ఘటోత్కచునిం దలంచినంత నత్యున్నతగాత్రుండును, నాజాను దీర్ఘబాహుండును, సర్వాలంకారశోభితుండును నగు, ఘటోత్కచుండు తత్క్షణంబ సన్నిహితుం డగుచు, వినయ వినమితోత్తమాంగుండై యంజలిం గావించి, నన్నుం దలంచుటకుం గారణం బెయ్యది యని యడిగిన సహదేవుండు మేరుశిఖాకారుం డగు నతని విభీషణ సన్నిధానంబునకు బంచిన నతండు నసింబూని చనిపౌలస్త్యుని కెఱింగించిన నాధర్మశీలుండగు నావిభీషణుండును, నింతయును కృష్ణకృతంబని తలంచుచు సహదేవుని శాసనం బంగీకరించి, నానావిధరత్నంబులును చందనాగరుప్రముఖంబులగు సుగంధిద్రవ్యంబులునుం గనకాంబరంబులును నొసంగినం గొని తెచ్చె. అనిన వైశంపాయనునుం గనుంగొని జనమేజయుండు, విప్రోత్తమా! హిడింబానందనుని రాకయును, నతండు లంక కరిగి విభీషణుం గనుంగొనుటయును, సహదేవుండు కావేరీదర్శనంబు గావించుటయును, నయ్యెడంగల రాజుల నిర్జించుటయును, సవిస్తరంబుగ నానతీయవలయు ననిన నతండు జనమేజయు నుద్దేశించి, సహదేవుండు గావించిన సాహసంబు నీకెఱింగించెద. ఆకర్ణింపుము. అట్లు కాననద్వీపనివాసుల నోర్చి చోళరాజ్యంబు బ్రవేశించి యయ్యెడ సాలమోధ్ర యర్జున బిల్వంబులును, జంబూశాల్మలీకింశుకంబులును, సప్తపర్ణకాశ్మర్యామలకన్యగ్రోధప్లక్షోదుంబరశమీపలాశంబులును, నశ్వత్థఖదిరబదర్యశ్వకర్ణఖరంజితింత్రిణీతాలశిరీషకుటజంబులును, నింబమధూకపున్నాగక్షీరకవకుళకుంద చంపకప్రియాళు శోకతిలకంబులును, నతిముక్తకకర్ణికారనాగకేతక కురవకజాతీకందళయూధికాంకోలకరవీరంబులును, బాటలక్రముకనారికేళపనసామ్రచూతపుండ్రకకదళ్యాడకనీపవేతసంబులును, మొదలగు మహీ

రుహంబులచేం దనరారెడు నుభయతీరంబులవలనను, హంసకారండవ కురరసారసశుకచక్రవాకప్లవజలవాయస సముద్రకాకక్రౌంచజలకుక్కుటప్రముఖంబులగు జలవిహంగసందోహంబులవలనను, వేదవేదాంగ పారగులగు మహీసురులవలనను పుణ్యాశ్రమస్థానంబులవలనను జైత్య వృక్షంబులవలనను, నభిరామం బగుచు నుభయతటంబుల గనుపట్టు తరుశ్రేణులవలనను, ప్రసూనమాలికాలంకృతయగు బాలిక చందంబునం బ్రకాశమాన యగుచు నానాపుష్పసమన్వితంబులగు లతానికుంజంబులవలన నవరత్నభూషణాలంకృతయగు కాంతాలలామంబు కైవడిం దోంచుచుం గమలోత్పలకల్హారప్రముఖ పుష్పరజోగణంబుల వలనం జందనపరాగశోభితయగు చంచలాక్షి తెఱంగు నంగీకరింపుచు హృద్యంబును, నప్సరోగణసేవితంబును, బరమపావన తీర్థసమేతంబును, ద్రిజగత్పావనంబును, గలుషరహితంబును, సకలజనాధారంబును, నతివిస్తారంబును, సైకతద్వీపశోభితంబును, స్వాదూదక పరిపూర్ణంబును, బుణ్యస్వరూపంబును, గల కావేరిం గనుంగొని ప్రహృష్టాంతరంగుండగుచు, మనరాజ్యంబునం గంగానది చందంబున నీరాష్ట్రంబునం గావేరి ప్రకాశింపుచున్నయది, అని యనుచరులతోడ నన్నదీమహత్త్వంబు పలుతెఱంగులం గొనియాడుచు సకల సేనాసమేతంబుగా నమ్మహానదిం గడచి దక్షిణతీరంబునం జనుచుండ నతనియాగమనంబు విని యతనిం గనుంగొనవలయునను వేడుకమనంబునం దళుకొత్తం జోళరాష్ట్రంబునంగల ద్రవిడజనంబులు కార్తికేయ సదృశుండును, సుకుమారుండును, నతివిశాలలోచనుండును, మహేంద్రసన్నిభుండునువగు సహదేవునిం గనుంగొని నానావిధంబులగు కానుకలొసంగి రెప్పలార్పక వీక్షింపుచు, బహువిధంబులును శుభగీతసమేతంబులును నగు స్తోత్రంబులు గావింపుచునుండ వారలనందఱం గృపాకటాక్షంబునం జూచి గారవింపుచు, నటకదలి చోళేంద్రుని సన్నిధానంబునకు

దూతలంబనిచి కప్పంబుగైకొని పాండ్యదేశంబు బ్రవేశించి కుంజరంబులును, వ్యాఘ్రంబులును, కృష్ణమృగంబులును, మొదలగు నానావిధ మృగంబులవలనను, శుకంబులును, మయూరంబులును, మొదలగు పక్షిగణంబులవలనను, నభిరామంబగు విపినమార్గంబులు కడచి పాండ్యరాజ్యంబునకరిగి తమమామయగు మలయధ్వజ మహీపతి సముఖంబునకు దూతలంబనిచిన, నతండును సహదేవుని శాసనం బంగీకరించి యనేక వస్తువాహనంబు లొసంగె. పాండ్యరాజ తనూజయును, నత్యంత సౌందర్యవతియును, ద్రవిడ కాంతారత్నంబును, ధనంజయ పత్నియునునగుచిత్రాంగదసహదేవాగమనంబువిని, తానును, ముక్తామణిభూషణాంబరాదు లనేకంబుగాం బనిచినముదంబునం గైకొని భ్రాతృపుత్రుండగు, బభ్రువాహనునకు వివిధరత్నాంబరాదులు పారితోషంబుగా నొసంగి కుమారవాత్సల్యంబున నెంతయు గారవించి పనిచి, మణులూరేశ్వరుని సమీపంబునకు దూతలంబనిచి యతనిచేం గప్పంబులుగైకొని నిఖిలద్రావిడ జనంబులు పరివేష్టింపనరిగి యగస్త్యముని నివాసంబును స్వర్గదర్శనంబుననగు మలయ మహీధరంబునకుం బ్రదక్షిణంబుగనరిగి నిర్మలంబును, శీతలంబును, మనోరథంబును నగు స్వాదుజలంబులుగల తామ్రపర్ణి నదిందాంటి సముద్రతీరంబున సైన్యంబువిడిచి

ఇది సభాపర్వంబునందు ముప్పదినాల్గవ అధ్యాయము.

---

## అధ్యాయము 35

---

అంతనమ్మాద్రిపుత్రుండు ప్రజ్ఞావంతులగు నిజమంత్రులతోడం గొండొక తడవు మంతనంబుగావించి భీమసేననందనుండగు ఘటో

త్కుచునిందలంచినంత నత్యున్న తాకారుండును, నాజానుదీర్ఘ బాహుండును, నీలాంబుద ప్రతిభానుండును, గరాళదంష్ట్రిండును, దామ్ర కేశుండును, హరితశ్మశ్రుండును, వికృతావయవుండును, మహాబలసంపన్నుండును, దప్తకాంచనకుండలుండును, విచిత్రకిరీట హారకేయూరకింకిణీమణిభూషణ భూషితుండును, మృదులాంబర ధరుండును, గటినిబద్ధకత్తుండును, రక్తచందన లిప్తాంగుండును, నగుచుం దక్షిణంబ చనుదెంచి మహీతలంబు కంపింప ముంగలని లిచిన యాపర్వతాకారునిం గనుంగొని సకలజనంబులు భయభ్రాంతులై మృగంబులకైవడి నలుదిక్కులంబరచిరి. అంతబులస్త్యునకు నమస్కరించు రావణుని చందంబున వృకోదరానుజుండగు సహదేవునకుం బ్రణామంబులాచరించి వినయ సంపన్నుండగుచు నంజలి బంధంబు గావించి, మహాత్మా! నన్నుందలంచుటకుం గతంబెయ్యదియని యడిగిన నమ్మాద్రినందనుండును నాభ్రాతృనందనుం గౌంగిటంజేర్చి సంతోషాతిశయంబున శిరంబాఘ్రాణింపుచు, నతని దయావిలోకనంబున నిరీక్షించి, భీమనందనా! నీవు లంకాద్వీపంబున కేంగి మహాత్ముకుం డును, రాక్షసేశ్వరుండునునగు విభీషణునితోడ నారాక యెఱింగించి వివిధంబులగు కానుకలుగైకొనిరమ్ము, అతండు కప్పంబొసంగునని, కృష్ణసాహాయ్యంబున ధర్మనందనుండు సహోదరసహితంబుగ రాజసూయంబొనరింపుచున్నవాండు, ఇంతయును నీవెఱుంగుము, సుఖంబున నుండుము, పోయివచ్చెదనని మనమహత్త్వం బెఱుంగం బలికి మగుడి రమ్మనిన నతండును సహదేవుని శాసనంబు శిరసావహించి ప్రమోదిత హృదయుండగుచు నతనికిం బ్రదక్షిణంబు గావించి లంకాభిముఖంబుగా నడచి కూర్మ గ్రాహమీనాది జలజంతు సంకులంబును, ననేక శుక్తిశంఖభరితంబును నగు సముద్రతీరంబున నిలిచి రామసేతువు నిరీక్షింపుచుం

గోదండ దీక్షాగురుండగు రఘునందనుని దివ్యమాహాత్మ్యం బభి నందింపుచు దక్షిణ తటంబు జేరి స్వర్ణప్రాకార సమావృతంబగుచు, శుభకరంబులగు పురద్వారంబుల వలనను, శతసహస్రసంఖ్యలం గల్గు ముక్తామణి సౌధంబుల వలనను, హేమరజత దంతనిర్మితంబులును నానారత్నవిచిత్రితంబులగు గవాక్షుల జాలంబులవలనను, గాంచన తోరణంబులవలనను, వివిధరత్న ఖచితంబులగు రాజమార్గంబుల వలనను, సకల సమయంబులం బుష్పఫలసమే తంబులగుచు దివ్యగంధపరిపూర్ణంబగు వృక్షంబులం దనరారెడు నుద్యానవనంబులవలనను, దివ్యదుందుభినినాదంబులవల నను, నతిమనోహరం బగుచు, మహేంద్రుని యమరావతీ నగరంబు చందంబునం బ్రకాశింపుచు నున్న లంకాపురంబు బ్రవేశించి శూల పాశిసాయుధధరులును, నానా వేషభూషితులును, సకల కార్యవిశార దులును, నగు రక్షోముఖ్యులను, దివ్యమాల్యాంబరభూషణాలంకృత లును, మధుమదరక్తలోచనాంచలలును, నలఘుశ్రోణిపయోధరలును, దర్శనీయాకారలును నగు వనితాజనంబులం గనుంగొనిన వారలును, నాశ్చర్యభరితులై తన్ను నిరీక్షింపుచుండ మహేంద్రభవనోపమానం బగు విభీషణసదనంబున కేంగి ప్రతీహారునిం బిలిచి కురుకులాగ్ర గణ్యుండైన పాండు మహీపతినందనుండగు సహదేవుండు, కృష్ణ సఖుండును నిజాగ్రజుండును నగు ధర్మనందనుండు పనుప నతని రాజ సూయార్థంబుగ దక్షిణ దిగ్విజయంబునకు నరుగుదెంచి, అతని పంపునం గప్పంబు గొనుటకై నేను నియ్యెడకుం జనుదెంచితి, నాయా గమనంబు శీఘ్రంబుగ మీరాజున కెఱింగింపు మనిన ద్వారపాలకుం డును, నట్లకాక యని రాజసన్నిధానంబునకు సత్వరంబుగా నేంగి వినతుం డగుచు నంజలి గావింపుచు దూతవచనంబులంతయు విన్న వించిన, ధర్మవర్తనుం డగు విభీషణుండు దూతవాక్యంబు లెల్ల

నాకర్ణించి తన సమీపంబున కతనిం దోడి తెమ్మనిన, దార్వారికులం దరుగుదెంచి మహాత్మా! రాక్షసేంద్రుం డగు విభీషణుండు నిన్నుం దోడి తెమ్మనుచున్నా వాండు, అరుగుదెమ్మని పిలుచుటయు, ఘటోత్కచుండును నతని వెంబడిం జని, కైలాసశిఖర సంకాశం బును, గాంచన తోరణాలంకృతంబును, హైమప్రాకార సమావృతం బును, నానారత్నఖచిత గోపురహర్మ్య సమేతంబును నగుచు రజత కాంచనవజ్రవైడూర్యస్ఫటిక నిర్మితంబులగు స్తంభంబులవలన నభి రామంబగుచు సువర్ణదండమండితంబులగు, నానాధ్వజపతాకా నిక రంబులవలన శోభితంబగుచు విచిత్ర మాల్యావృతంబును, గాంచన వేదికాలం కృతంబును, నగుచు నసమానవైభవంబునం దనరారు నతని మందిరంబు ప్రవేశించి, తంత్రీనినాద మేదురంబును, సమతాళ మితాక్షరంబును, నిబిడ వాదిత్రసంకులంబును, నగు మధురస్వరంబు లాకర్ణింపుచు, ననేక కక్ష్యాంతరంబులు గడచి, దివ్యభూషణాలంకృత గాత్రుండును, దివ్యగంధమాల్యాంబరధరుండును, దివ్యరత్నవిరాజ మాన కిరీటకుండలుండును, సూర్యానల ప్రభాభాసమానుండును నై చెలంగుచు, సువర్ణమయంబును మహనీయంబును, భాస్కరసంకా శంబును, ముక్తామణిశోభితంబును నగు సింహాసనంబున సుఖాసీనుం డగుచు, నలుగడలమంత్రివర్గంబు సేవింప దేవగణపరివృతుం డగు దేవేంద్రుని చందంబునం దేజరిల్లుచు, యక్షరక్షోగణంబులును, సౌం దర్యసమేతులగు నారీజనంబులును బరివేష్టించియుండ, స్తుతిపాఠకులు పలుదెఱంగుల బ్రశంసింప, సకలాలంకారలగు యువతులు తన యిరు గడల నిలిచి సువర్ణరత్నదండంబులుగల వింజామరంబులు వీవం దేజో రాశియగుచుం గుబేరవరుణ సమానుండును, ధర్మ నిరతుండును, రాక్షసేశ్వరుండును నగు విభీషణుం గనుంగొని వందనం బాచరించి కృతాంజలియగుచు, దేవేంద్రుని సమ్ముఖంబున జిత్రరథుండు వోలె

నిలిచిన హిడింబానందనుం జూచి యారక్షోగణాధ్యక్షుండు నతని యథోచితంబుగ సాంత్వవచనంబుల నాదరింపుచు, నిన్నుం గప్పంబు గొని తెమ్మని నాసన్నిధానంబునకుం బనిచిన మీరాజువంశంబును నతని నామధేయంబును, నతని సహోదరుల తెఱంగును, నతని పురంబును, నతని దేశంబును, నిన్నును, నీవచ్చిన కార్యంబును, నవిస్తరంబుగ వేర్వేఱ నెఱింగింపుమనిన.

ఈకథ సభాపర్వమందు ముప్పదియైదవ యధ్యాయము.

---

## అధ్యాయము 36

---

భీమనందనుం డగు ఘటోత్కచుం డతనిం గనుంగొని రాక్షసేశ్వరా! చంద్రవంశంబున భరతకులశ్రేష్ఠుండగు పాండుమహీపాలుండు గలండు. అతనికి మహేంద్రసమానపరాక్రములగు నేవురుకుమారులుద్భవించిరి. వారల లోనగ్రజుండగు నతండు ధర్మపుత్రుండును నజాతశత్రుండును ననునామధేయంబులం బరంగుచు ధర్మనందనుండు, ధర్మంబు సాక్షాత్కరించెనో యని తన్ను సకలజనంబులు ప్రస్తుతింప, నఖర్వపరాక్రమధురీణులగు ననుజన్ములుం దానును మహీచక్రం బంతయు భుజావిక్రమంబున నిర్జించి గంగాయమునల మధ్యప్రదేశంబునం గరినగరంబును, నింద్రప్రస్థపురంబును నను రెండు పురంబులు గలవు, అందు గంగాదక్షిణతీరంబునం గల కరినగరంబను ప్రధానపురంబు పితృజ్యేష్ఠుండగు ధృతరాష్ట్రునకు నతని కుమారవర్గంబునకు నొసంగి తాను సహోదరసహితంబుగ నింద్రప్రస్థపురంబున ధర్మనిరతుండై రాజ్యంబు పరిపాలింపుచు సుఖంబున నుండి రాజసూయయాగంబు గావింపవలయునని మానసంబునం దలంచి, కంఠీరవపరాక్రముండును, దశ

సహస్రదంతావళ సమానశరీరబలుండును, మహనీయ తేజోధనుండును, నప్రమేయవిక్రముండును, నాజానులంబమాన బాహుండును, నిజానుజుండును నగు భీమసేనుని బూర్వదిశాభాగంబునకుం బనిచె. సుకుమారుండును, మహాశౌర్యధుర్యుండును, జగద్విఖ్యాతపరాక్రముండును, గార్తవీర్యసమానవీర్యుండును, నపారబలశాలియును, దివ్యాస్త్రమహిమంబున జామదగ్ని సమానుండును, సంగరాంగణంబున దశరథనందనోపమానుండును, సౌందర్యంబున మహేంద్రసదృశుండును, దేజోవిశేషంబున మర్తాండ సన్నిభుండును, దేవదానవగంధర్వపిశాచోరగగుహ్యరాక్షస మనుష్యగణంబులవలన నజేయుండును, మఱియు నమరగణపరివృతుండగు నాఖండలుని సమరతలంబున నిర్జించి ఖాండవం బగ్నిదేవునకు నాహుతిగ నొసంగి యావైశ్వానరునివలన గాండీవశ్వేతాశ్వముఖ్యంబులును, నమరదుర్లభంబులగు దివ్యాస్త్రంబులును వడసి, మహానుభావుండును, నిఖిల లోకేశ్వరుండునునైన కృష్ణునికి సహోదరియును, గాంతాశిరోరత్నంబునునగు సుభద్రాదేవినిం గైకొని, కృష్ణుండు తమయెడంగల స్నేహవాత్సల్యంబున సంతతంబు నెడబాయక యుండందనరారు గుణగరిష్ఠుండును దన రెండవ సోదరుండునునగు ధనంజయుని నుత్తర దిగ్విజయంబునకుంబనిచె. అయ్యగ్రజునునకు ననుజుండును సాక్షాత్కరించిన మన్మథుని తెఱంగున రూపరేఖా విరాజమానమూర్తియును, జగత్ప్రసిద్ధుండును, నగు నకులుని పశ్చిమదిశకునని చె. అతనికి సోదరుండగు సహదేవుని దక్షిణదేశంబునకుంబనిచె. ఆ నకులానుజుండు వసుప నే నిచ్చటికిం జనుదెంచితి. భీమసేనునకు హిడింబయను రాక్షసవనితవలనంజనియించి మహాబల సంపన్నుండునగుచుం బాండునందనుల కార్యార్థినై చరింపుచునుండుదు. నేను ఘటోత్కచుండను నామధేయంబునం బ్రసిద్ధిగాంచిన వాండ. ఇది యిట్లుండె. ఇవ్విధంబున నుత్తరదిశకుంజనిన ధనంజయుం

డనేక సహస్రయోజన పరిమితంబగు భూమండలంబునం జరించి నిఖిల మహీపతులనిర్జించి స్వర్గద్వారపర్యంతంబునుజని దివ్యరత్న భూష ణాంబర ధన కనక ప్రముఖంబులగు కప్పంబులుగొని తెచ్చి ధర్మరాజు నకు నొసంగె. భీముండును, నకులుండును, ప్రాక్పశ్చిమదిశలు నిర్జించి బహురత్న కాంచనాదులు గైకొని తెచ్చి యుధిష్ఠిరునకు నొసంగిరి. అతండును రాజసూయ యాగంబునకు సముద్యుక్తుండై యున్నవాండు. సహదేవుండు దక్షిణదిగ్భాగంబంతయు నోడించి నన్నిటకుం గప్పంబు దెమ్మని పనిచినం జనుదెంచితి. ఇపుడు నీకుం బాండునందనుల మహి మంబు సంక్షేపంబుగ నెఱింగించితి. ఇదియిట్లుండె. ధర్మనందనుని మాహాత్మ్యంబును భీమాదిసోదరుల పరాక్రమంబును, నిఖిల జగదీశ్వ రుండును, కృష్ణదేవుని మహత్త్వంబును, రాజసూయయాగాతిశయం బును నీమనంబున విచారించి కప్పంబొసంగి పనుపుమనిన.

ఇది సభాపర్వంబునందు ముప్పదియాఱవ యధ్యాయము.

---

## అధ్యాయము 37

---

అతని వచనంబు లన్నియును నాకర్ణించి, ధార్మికశ్రేష్ఠుండును రక్షోగణాధ్యక్షుండును, విశేష జ్ఞానసంపన్నుండును నగు విభీషణుండు సంతుష్టహృదయుండును, మంత్రిసమేతుండును నగుచుం గొండొక తడవు విచారించి యీ యాగారంభంబునకుం గారణంబు కృష్ణుం డనియును, నతండు జగదీశ్వరుం డనియును, హృదయంబున నిశ్చ యించితి. అతని శాసనంబు ప్రియపూర్వకంబుగ నంగీకరించి, విచి త్రంబులగు రత్నకంబళంబులును, నానారత్న సువర్ణఖచితంబులగు దంతపర్యంకంబులును, ననర్ఘ్యంబులు నపారంబులును నగు భూష

ణంబులును, నసంఖ్యాకంబులగు ముక్తామణి ప్రవాళంబులును, బహు విధంబులగు కనకరజితపాత్రంబులును, గాంచనమయంబులగు వస్త్రం బులును, యజ్ఞతోరణార్హంబులును, మౌక్తికమాలికావిరాజమానం బులును నగు చతుర్దశహేమతాళవృక్షంబులును, హాటకపంకజంబు లును, నవరత్నఖచితంబులగు శిబికాందోళికలును, మహారాజార్హంబు లగు కిరీటకుండలంబులును, మఱియును జాంబూనదపుష్పమాల్యంబు లును, జంద్రసంకాశంబులును, శతావర్తంబులును నగు శంఖంబులును, మనోహారంబులగు దివ్యచందనంబులును, మఱియు ననేక ధనరత్న రాసులును నొసంగి యున్న, యన్నియును భరించికొని పోవుటకు నష్టాశీతిసంఖ్యలం గల రక్షోవీరుల నియమించి పంచిన, హైడింబుం డును నావిభీషణునికిం బ్రదక్షిణంబు గావించి వినతుం డగుచు నతని వీడ్కొని సాగరం బతిక్రమించి సహదేవుని సన్నిధానంబునకు నరిగె. అప్పు డతిభయంకరాకారులును ఘటోత్కచముఖ్యులు నగు రాక్ష సులంగనుంగొని ద్రవిడసైన్యంబు నలుదిక్కులం జెదరిపరచె. అనంతరంబ భీమసేననందనుండు మాద్రినందనునకు నభివాదంబు గావించి విభీష ణుం డొసంగిన కానుక లన్నియును సమ్ముఖంబున నునిచినం జూచి సంతసింపుచు ద్రవిడ సైన్యంబును నిజస్థానంబునంద యుండం బనిచి తానునుగమనోన్ముఖుండై కదలె. ఇవ్విధంబున సహదేవుండు దక్షిణదిగ్విజయంబు గైకొని విభీషణనియుక్తులగు రాక్షసులు సంభా రంబును మోచి వెంబడిం జనుదేర సకల సైన్య సమేతంబుగ నడిచి యింద్రప్రస్థపురంబున కేంగి రత్నకాంచన ప్రముఖంబులగు నాన్నృపా లుర జయించిన కానుకలన్నియును యుధిష్ఠిరున కొసంగిన నతండు విభీషణదత్తంబులగు మహార్హవస్తు విశేషంబులు గనుంగొని ప్రియం బందె. ఇట్లు సహస్రకోటి సంఖ్యలగు రత్నకాంచన రాసులుగొని తెచ్చిన తనదు కూర్మితమ్ముని నెంతయును గారవంబున సన్మానంబు గావించె.

ఇది సభాపర్వంబునందు ముప్పదియేడవ యధ్యాయము

---

## అధ్యాయము 38

అని వైశంపాయనుండు జనమేజయుంగనుం గొని మఱియు నిట్లను. మున్ను వాసుదేవునిచే వినిర్జితంబగు పశ్చిమ దిగ్భాగంబు జయించిన నకులునిమహాత్త్వంబు వివరించెద. ఆకర్ణింపుము. అట్లు ధర్మనందనునిచే నియుక్తుండై రథనేమీ నిస్వనంబులును, కరిబృంహితంబులును, వీరభట సింహనాదంబులును, భూనభోంతరంబుల నానరింపం జతురంగ బలసమేతంబుగా నింద్రప్రస్థపురంబు వెడలి పశ్చిమ దిశాభిముఖుండై నడిచి ధనధాన్యసమేతంబును, నతిమనోహరంబును గార్తికేయునకుం బ్రియస్థానంబును నగు రౌహితక పురంబున విడిసి తత్పుర నివాసులగు మత్తమయూరులను శూద్ర జాతి సంభవుల నిర్జించి, మరుదేశంబునకుం జని బహుధాన్యకశిరీషక హైమకనామంబులం దనరుప్రదేశంబులం గెలిచి, మఱియు నటకదలి శిలింధ్రకపారదుల దూతముఖంబున వశీకృతులం గావించి త్రిగర్తులం డీలుపరచి మాళవుల మర్దించి యంబష్ఠుల యహంకారంబు మాయించి, కర్పటుల దర్పం బడచి మధ్యదేశనివాసుల యుద్ధంబున నోర్చి, యూపాగణవృతుల కోపంబడంచి, యచ్చట నుండియును బుష్కరారణ్యంబునకు మఱలి వచ్చి యచ్చటం గల యుత్సవసంకేతంబులను గణంబులం గెలిచి, మఱియు నట కదలి సింధుకూల నివాసులగు గ్రామణీయుల నాభీరుల, సరస్వతీనదీ తీరవాసుల, మత్స్యోపజీవులం బర్వత నిలయులభంగపఱచి, పంచనదంబును, మిత్రభోగంబును, సింహానదంబును, మఱియును నపరవంతంబులను, జారముఖంబునం దనవశంబుజేసి, యుత్తరజ్యోతికంబును, బణ్ణకటంబును, ద్వారపాలంబులు ననుపురంబుల స్వవశంబులు గావించి, మరియుం బశ్చిమదేశంబులందుహారదామంబులం దాల్చి క్రీడాపర్వతంబునం బొదలు

రాజులను, హారహూణులను, నిజాధీనులం గావించి, యరణరోమ యవనస్థానంబులం గెలిచి, లంబక దేశకబంధక ప్రభృతులగు మహీపతులచే దూతముఖంబునం గప్పంబులు గైకొని, యచ్చట నుండి యును కృష్ణదేవుని సన్నిధానంబునకుం దగు వారలం బనిచిన, నతండును బంధుసహితంబుగం దనశాసనం బంగీకరింపనట వెడలి మద్రదేశంబునకుం జని శాలకపురాధ్యక్షుండును నిజమాతృసహోదరుండును నగు శల్యునివలన ననేక రత్నకాంచనంబులగు సత్కారంబులు వడసి, యనంతరంబ సాగరమధ్య ద్వీపవాసులును, నతిక్రూరులును, మ్లేచ్ఛులును నగు బాహ్లికబర్బరాదుల దోర్బలం బడంచి కప్పంబులు గైకొని, యివ్విధంబునం బశ్చిమ దిశాభాగంబంతయును జయించి నానానృపాలురవలనం గైకొనిన కానుకలు దశసహస్ర సంఖ్యలం గల యుష్ట్రంబులు ప్రయత్నంబున మోచికొని తేర నింద్రప్రస్థపురంబున కేంగె. సకల ధనంబులును ధర్మనందనున కొసంగిన నతండును సంతుష్టుం డయ్యె.

ఇది సభాపర్వంబునందు ముప్పదెనిమిదవ యధ్యాయము

---

## అ ధ్యా య ము 39

---

ఇత్తెఱంగున నలుదెసలుం జయించి వచ్చిన భీమసేన ప్రభృతులగు తమ్ములం గూడి ధర్మ నిరతుండగు ధర్మనందనుండు ప్రజల యెడ ననురాగంబు గలిగి యెల్లవారలకును హితంబుగ నీతిమార్గంబున రాజ్యంబు పరిపాలింపుచు, యాచకుల కొసంగు నెడం గోపంబు వలదనియును, నొకనిచేం బనింగొనుపట్ల బలిమిసేయవలదనియును, ధర్మంబు దప్పక నడువుండనియును బలుకుచుం గాని వేఱొండు వలు

కరే ప్రవర్తిల్ల భూజనంబు లందఱును దల్లిదండ్రులకై వడిం దలం చుకతన నతనికి లోకంబున విరోధియగు వాండొక్కరుండును లేం డయ్యెం గాన నతం డజాతశత్రుండను నామధేయమునం బరంగె. అట్లు ధర్మపుత్రుండు ధర్మంబు దప్పక ప్రజలం బరిపాలించుటవల నను, దుష్టనిగ్రహంబు సేయుటవలనను, శిష్టపరిపాలనం బొనరించుట వలనను, మేర దప్పక కప్పంబు గైకొనుటవలనను జతుర్వర్ణంబుల వారును స్వధర్మ నిరతులై ప్రవర్తిల్లుచుండిరి. మఱియును బర్జన్యుండు సమయంబు దప్పక వర్షంబులు కురియం దొడంగె. దానంజేసి జన పదంబులు సమృద్ధంబులై యుండె. సకల జనంబులును నుపద్రవం బుల నెఱుంగక యారోగ్యంబు గలిగి నిర్విఘ్నంబుగ సమస్త కర్మం బుల నాచరింపుచుండిరి. భూమండలంబు సస్యాభివృద్ధిం బొదలె. భూరుహంబులు పుష్పఫల సమన్వితంబులగుచుం దనరె. బ్రాహ్మ ణులు యజ్ఞసంతతులనం బరంగిరి. వణిగ్జనంబులు కృషి గోరక్షణాది కంబుల వెలయుచుండిరి. చాతుర్వర్ణంబును ధర్మనందనుం డాచ రించు కార్యంబుల యెడ మిగుల నుత్సవంబులం బొదలుచుండె. మఱియు నతని రాజ్యంబునందు చోరులవలననేనియును వంచకుల వలననేనియును, రాజునకుం జనవరులగు వారల వలననేనియును, బరస్పరవైరంబువలననేనియును, ధర్మవిరుద్ధంబులగు కార్యంబులు బ్రవ ర్తిల్లవయ్యె. అతివృష్టియును, ననావృష్టియును, రోగపీడనంబును, నగ్నిభయంబును నెఱుంగక, వాడజనంబు లీయజాతశత్రునకుం దమ యెడ నెవ్విధంబున మనఃప్రమోదంబగునోయని యతనికిం బ్రియంబు లగు కార్యంబులె యాచరింపుచు నుండిరి. ఇట్లు న్యాయంబు దప్పక యార్జించు విత్తంబువలన నతని ధనాగారంబులు శతసహస్రసంవత్సరం బులు వ్యయంబులు గావించిరేనియుం దరగని ద్రవ్యంబువలనం బరి

పూర్ణంబులై యుండె. తనంత నయ్యుధిష్ఠిరుం డపారంబులగు ధేను గణంబులును, ననేకంబులగు సువర్ణ గ్రాసులుం గలుగుట విచారించి రాజసూయయాగంబు గావింపవలయునని తలంచిన నతని గనుంగొని నిఖిలసుహృజ్జనంబులు, ఇది యజ్ఞం బొనరించుటకు సమయంబు. అట్లన గావింపు మనియును, సభాస్థానంబున రహస్యగోష్ఠియందును, వేర్వేఱ నెఱింగించిన నతండును నట్లకావింప సమకట్టియున్న యంతం ద్రికాలజ్ఞానసంపన్నుండును, ననాదిపురుషుండును, వేద వేదాంత వేద్యుం డును, యోగీశ్వర దర్శనీయుండును, జగత్కారణంబును, సర్వవ్యాప కుండును, నాశరహితుండును, సర్వేశ్వరుండును, కేశిసూదనుండును, కేశవుండును, యదువృష్ణివంశసంరక్షకుండును, నాపద్బాంధవుండును, వైరిభంజనుండును నగు కృష్ణదేవుండు ద్వారకాపరిపాలనంబునకు నిజ జనకుండగు వసుదేవుని నియమించి ధర్మనందనునకుం గానుకలు గైకొని సకలసేనాసమేతుం డగుచు రథనేమీనిస్వనంబుల భూనభోంత రంబులు ఘూర్ణింపం జేయుచు, నింద్రప్రస్థపురంబు బ్రవేశించి సూ ర్యుండులేని స్థానంబున నుదయించు సూర్యుని చందంబున ననిల రహిత ప్రదేశంబునకుం జనుదెంచు మలయానిలంబుపోలికెం బౌర లోకంబునకుం బ్రమోదంబు గావింపుచుం జనుదెంచు వాసుదేవు నెదుర్కొని ధర్మనందనుండు నిజమందిరంబునకుం దోడితెచ్చి యుచి తాసనంబున నునిచి, భీమార్జున ప్రభృతులగు తమ్ములును, వ్యాస ధౌమ్యప్రముఖులగు మునిజనంబులును, దన్నుం బరివేష్టింపం గుశలప్రశ్నంబు గావించి మాధవు నుద్దేశించి యిట్లను, మధుసూద నా! నీదయావిశేషంబునం జేసి నిఖిలధరాతలంబు నిర్జించి స్వవశంబు గావించితి. నపారంబగు ధనం బార్జింపబడియె. ఇట్టి ద్రవ్యంబువలన శాస్త్రోక్తప్రకారంబున రాజసూయం బొనరించి బ్రాహ్మణసంతర్ప ణంబు సేయవలయునని తలంచితి. గావున నీవును నీభీమాదులగు నా

సహోదరులును, యాగారంభంబునకు ననుజ్ఞ యొసంగవలయు. నేను దీక్షితుండనై యజ్ఞంబుం బరిసమాప్తంబుగా నొనరించి సకలకలుషంబుల విముక్తుండ నయ్యెద. కాదేని యీ సకలధనంబులుం గైకొని నీవయాగంబు గావించిన నేనును కృతార్థుండ నయ్యెద. ఇది నీకు సమ్మతంబు గానియెడ నన్ను దీక్షవహింపం బనుపుమనినం గొంతేయాగ్రజునిం గనుంగొని, గోవిందుం డతని సద్గుణంబులు పలుదెఱంగులం బ్రశంసింపుచు రాజశ్రేష్ఠుండవగు నీవయీక్రతువుం గావించి సామ్రాజ్యంబు వహించుటకు నర్హుండవు. అట్లు నిర్వహించితివేని మేమందఱమును కృతార్థుల మయ్యెదము. ఎల్లభంగుల నీశ్రేయోలాభంబులం గోరియుండెడు నన్ను వలయు కార్యంబులకు నియమించి నీమనోభీష్టంబగు నీయజ్ఞంబు నిర్విఘ్నంబుగ నెరవేర్పుమనిన, మందరధరునిం గనుంగొని ధర్మనందనుండు నామనోరథంబు, నెరవేర్చుటకుం గడంగి నీయంతటి మహానుభావుం డుండునెడ నాయభీష్టంబులు సఫలంబులగుటకు సకలకార్యంబులు సిద్ధించుటకు సందియంబునుం గలదే? నీయనుమతి వడసి సహోదరసమేతుండ నగుచు రాజసూయంబునకు వలయు సాధనవిశేషంబులు సంపాదించుటకు నుద్యుక్తుండై ధౌమ్యప్రభృతి మహీసురవర్గంబు వచనప్రకారంబున శుభకరంబులగు క్రతుసంభారంబుల సవరింపుమనియును, రసగంధసమేతంబులగు భక్ష్యభోజ్యాదివస్తువుల లోన భూసురులకు నేసమయంబున నెయ్యది వలసియుండునది సంఘటింపుమని యింద్రసేనుండును, విశోకుండును, రుక్మండును, సమీకుండును, ధ్వజసేనుండును నను సారథుల నియోగించుమనియును, మంత్రిసమేతుండగు సహదేవున కెఱింగించిన, నతండును మీర లానతిచ్చిన ప్రకారంబున నిఖిలయజ్ఞసంభారంబులును సంపాదితంబులై యున్నవని యెఱింగించె. అట్టియెడ సాత్యవతేయుండు మూర్తివంతంబులగు వేదంబులుం బోలెం దేజరిల్లుచు నున్న ఋత్వి

జుల రావించి వేదవేదాంగపారగుండును, ధనంజయులను మునుల లోనముఖ్యుండును, సామవేదస్వరూపుండును, సుసామనామధేయుం డును నగు బ్రాహ్మణోత్తముండుద్గాతయును, యాజ్ఞవల్క్యమునీం ద్రుండధ్వర్యుండును, వసుకుమారుండగు పైలమహాముని౦ద్రుండు హోతయు, రేభ్యుండు బ్రహ్మయునై మెలంగిరి. వీరల పుత్రులును శిష్యులును, తక్కిన ఋత్విజులై యుండిరి. ఇత్తెఱంగున మహానుభా వుండగు వ్యాసమునీంద్రుండు శిష్యగణపరివృతుండై సదస్యంబు నిర్వ హించె. అంత.దృఢవ్రతులగు ఋత్విజులు పుణ్యాహవాచనంబు గావించి శాస్త్రోక్తప్రకారంబున యాగశాల నిర్మించి, యందు నింద్రాదిదేవత లకు నతివిశాలంబులును రత్నఖచితంబులును నగు గృహంబుల శిల్ప కులు నిర్మించునట్లు గావించి.

ఈకథ సభాపర్వంబునందు ముప్పదితొమ్మిదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 40

తదనంతరంబ యుధిష్ఠిరుండు సకల మహీపతుల రావించుటకు దూతలం బనుపుమని సహదేవుని నియమించె. అతండును నానా దేశంబులం గల చతుర్వర్ణ్యంబుల వారల నందఱిం దోడితెమ్మని చారులం బనిచిన, వారలును వేగవంతంబులగు వాహనంబుల నధి రోహించి మాద్రినందనుని శాసనంబున సకలరాష్ట్రంబులకుం జనిరి. మఱియును బాండవాగ్రజుండు నకులుని రావించి, నీవు కరిపురంబున కేంగి భీష్ముండును, ద్రోణుండును, ధృతరాష్ట్రుండును, కృపా చార్యుండును, విదురుండును, బాహ్లీకసోమదత్తభూరిశ్రవులును, దుర్యోధన ప్రభృతి సహోదర వర్గంబును, మఱియునుం గల మిత్ర

జనంబులు మొదలుగాంగల వారలం దోడితెమ్మని పనిచె. తద నంతరంబ భూసుర శ్రేష్ఠులు జ్యేష్ఠానక్షత్రయూలంబున నమావాస్యా దినంబున నయ్యుధిష్ఠిరుని రాజసూయదీక్ష గావింపుమని 'నియమింప నతండును కృష్ణాజినధరుండును, నవనీతాను లిప్తదేహుండును నగుచు దీక్ష వహించి బ్రాహ్మణోత్తములును, నిజానుజులును, నమాత్యులును, నిఖిల సుహృజ్జనంబులును, నానాదేశసమాగతులగు క్షత్రియప్రముఖులును, బరివేష్టించి చనుదేర, సాక్షాత్కరించిన ధర్మదేవత చందంబున యాగశాలాప్రవేశంబు గావించె. మఱియుం జతుర్వేద విశారదులును, నఖిలశాస్త్రార్థకోవిదులును నగు నశేష దేశాగతులగు విప్రవరేణ్యులు తమకు నన్నపానంబులును, శయనాసనంబులును మొదలగు సను స్తవస్తువులవలనం బరిపూర్ణంబులగు మందిరంబులు తొలుతనే శిల్పకులవలన నిర్మించియుండుటం జేసి, యా సదనంబులం బ్రవేశించి యిష్టోపభోగంబుల ననుభవింపుచు, నట నర్తకాదుల విద్యావిశేషంబులు గనుంగొనుచు,నితిహాసంబు లొంకురుల కెఱింగించుకొనుచు సంతుష్టహృదయులై యుండిరి. బ్రాహ్మణులు భోజనంబు గావించు నెడ నభీష్టంబులగు వస్తువు లొసంగుండొసంగుం డనియును, "భుజింపుండు భుజింపుం" డనియును నివ్విధంబున వచనంబుల విరళంబులుగా వినంబడుచు నుండె. అంత కౌంతేయాగ్రజుండు దశ లక్షలు గోదానంబులును, ననేకంబులగు శయ్యాసువర్ణ కన్యకా ప్రముఖదానంబులును, విప్రపుంగవుల కొసంగుచుం ద్రిదివంబునం దనరు మహేంద్రుని యజ్ఞంబు చందంబున నిజాధ్వరంబు ప్రసిద్ధంబై మెఱయుచుం దేజరిల్లుచుండె.

ఇది సభాపర్వంబున నలువదియవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 41

---

ఆ సమయంబున నిఖలదేశాధీశ్వరులును నానావిధంబులగు కానుకలుగైకొని మహనీయ రథంబుల నధిరోహించి విమానారూఢులైయరుగుదెంచు దేవతల తెఱంగున ధర్మనందనుండుగావించు రాజసూయాధ్వరంబును, నతని దివ్యసభాభవనంబునుం గనుంగొన వలయునను వేడుకలం జనుదెంచిరి. అటంగరిపురంబునకుంజని నకులుండు పిలువ భీష్ముండును, ద్రోణుండును, నశ్వత్థామయును, ధృతరాష్ట్రుండును, విదురుండును, దుర్యోధన ప్రముఖులగు సహోదరులును, మఱియునుం దక్కినవారలును, నింద్రప్రస్థపురంబునకు నేంగిరి. గాంధారదేశాధీశ్వరుండగు సుబలుండును,నతని కుమారుండగు శకునియును, నచలుండును, వృషకుండును, వదాన్యశేఖరుండగు కర్ణుండును వృకుండును, మద్రాధిపతియగు శల్యుండును, మహారథులగు బాహ్లిక సోమదత్తభూరిశ్రవులును, శల్యుండును, సింధుదేశనాయకుండగు జయద్రథుండును, యజ్ఞసేనుండును, నితని కుమారులును, సాళ్వుండును, ప్రాగ్జ్యోతిషాధ్యక్షుండగు భగదత్తుండును, బృహద్బలుండును, పౌండ్రక వాసుదేవుండును, వంగ, కళింగ, కాశ్మీర, కుంతల, ద్రవిడ, సింహళ, పాండ్యదేశ వల్లభులును, గుంతిభోజుండును, వానవాస్యుండును, సుభ్రువుండును, బాహ్లిక దేశపరిపాలకులును శూరులును నగు రాజన్యులును, విరాటుండును, నతని తనూభవులును, మహారథికులగు పాంచాలరాజులును, మఱియును నానాదేశాధీశ్వరులగు నరేంద్రులును, వారలనందనులును, మహాశౌర్యసంపన్నుండగు శిశుపాలుండును, సంగ్రామదుర్జయుండగు బలరాముండును, ననిరుద్ధుండును, బభ్రుండును, సారణుండును, గదుండును, ప్రద్యుమ్నుండును, సాంబుండును, చారుదేష్ణుండును, నిశఠుండును, నులూకుండును, నను

నామధేయంబులుగల మహారథికులగు వృష్ణివీరులును, మఱియును మధ్యదేశ నివాసులగు మహీపతులును, సాగరతీరంబులం బర్వతంబుల వసియించు మ్లేచ్ఛకిరాతులును, ధర్మనందనుని యాగసందర్శనార్థంబుగ నింద్రప్రస్థపురంబునకు నరుగుదెంచిన వారలకు సువర్ణమయంబులగు గవాక్షమార్గంబులును, నానారత్నఖచితంబులగు కుట్టిమస్థలంబులును, మనోహరంబులగు సోపానంబులును, రాజార్హంబులగు సింహాసనంబులును, రత్నకంబళంబులును, ప్రసూనదామంబులును, జందనాగరుధూమంబులును, హంసతూలికా తల్పంబులును, మణిమయంబులగు బర్యంకంబులునుంగలిగి నానాధాతు విచిత్రంబులగు హిమశైల శృంగంబులకైవడి దర్శనీయంబులగు సౌధంబులం దనరారుచు ననేక కక్ష్యాంతరంబులవలనను, గోలంకులవలనను, బూందోటలవలనను, నభిరామంబులగుచుం గైలాస శిఖరాకారంబులును నత్యున్నతంబులునై కన్నులపండువు గావించు సదనంబులు వారలకందఱికిని వేర్వేఱనియమించె. ఇట్లు నానాదేశాగతులగు మహీపతులవలనను, మహాత్ములగు భూసురులవలనను, యుధిష్ఠిరుని సభాభవనంబు నిఖిల బృందారక బృందంబులనాసనం దనరారెడు త్రిదివంబు విధంబునం దేజరిల్లె.

ఈకథ సభాపర్వంబున నలువదియొకటవ యధ్యాయము.

---

## అధ్యాయము 42

---

ఇట్లు యాగంబు నడచు సమయంబున సహదేవుండును నింద్రసేన ప్రభృతులగు సారథులును, ధర్మనందనుండు తొలుతం దమకు నియమించిన కార్యంబుల నొడంగడమువడకుండం బ్రవర్తించుచుం

డిరి. అంతం గరినగరంబున నుండి నకులప్రేరణంబునం జనుదెంచిన భీష్మద్రోణప్రముఖుల యుధిష్ఠిరుం డెదుర్కొని యభివాదనంబు గావించి, యనేక రత్నధనరాసులు సంతరించియున్నవాండ. నిఖిల ద్రవ్యంబును మీ యధీనంబ. ఈ యజ్ఞంబున మీకు వలయు తెఱంగున వ్యయంబొనరించి నన్నుం గృతార్థుని గావింపుఁడని పలుకుచు, భక్ష్య భోజ్యాధికారంబునకు యుయుత్సుని, బంక్తులమర్చుటయును, భోజ నంబు పరామర్శించుటయును, నుచ్ఛిష్టంబు తొలంగం ద్రోయించి స్థలశుద్ధిం గావించుటయును మొదలగు కృత్యంబులకు దుశ్శాస నుని, మధుశర్కరాఘృతప్రముఖంబగు మధురద్రవ్యంబు లుచితంబుగ వ్యయంబు సేయుటకు విదురుని, బ్రాహ్మణపూజం గావించుటకు నశ్వత్థాముని, మహీపతులకు సపర్య యొనర్చుటకు సంజయుని, వీరల కు బహుమానంబు లొసంగిరనియును, వీరలకునొసంగవలయుననియును బరామర్శించుటకు భీష్మద్రోణులను రత్నకాంచనద్రవ్యంబు మొదలగు దక్షిణలొసంగుటకు గృపాచార్యుని, నిన్నియునుం బరామర్శింపుచు నానాదేశాగతులగు జనంబులు దెచ్చు నుపాయనంబులు గైకొనుటకు దుర్యోధనుని, మఱియునుం దగువారలం గొంకఱినిం దగు కార్యమ్ము లకును నియోగించి, కుంతిగాంధారులు కోడండ్రునుం దాగును నిఖిల వనితాజనంబులం బూజించుటకు నియుక్తులం గావించి, కృష్ణుండు వనిచినపనులు సేయుటకై ధనంజయునినియోగించె. బాహ్లిక ధార్తరాష్ట్రి సోమదత్త జయద్రథులు ప్రభుత్వంబున సర్వస్వతం త్రులై ప్రవర్తిల్లిరి. అట్టి సమయంబున నఖిలభూములనుండి వచ్చు మహీపతులు, నేనొసంగు ధనంబువలనన యాగంబు నెరవేరవలయు ననియును, ధర్మరాజునకు నాయందు ప్రమదంబు జనియింపవలయు ననియును, పరస్పరస్పర్ధం జేసి యొకరికంటె నొకరధికంబుగ ధనంబు తెచ్చి యొసంగువారలలో నెంత ధనహీనునుం డేనియును సహస్ర

సంఖ్యకుం దక్కువగా ధనంబు తెచ్చివాం డొక్కండును లేండయ్యె. మఱియును రాజార్హంబు లగు విచిత్రవిమానంబులవలనను, నానా రత్నఖచితంబులగు రాజసదనంబులవలనను, స్వర్ణనిర్మితంబులును, జలాశయ సమన్వితంబులును, వివిధావరణ సమావృతంబులును, నిఖిలవస్తు పరిపూర్ణంబులును, మనోహరంబులునునగు బ్రాహ్మణగృహంబులవలనను నిఖిలభూపాలకులు తెచ్చునుపాయనంబుల వలనను నతని యాగంబు మిగులం బ్రకాశించె. ఇట్లు మహావైభవంబున ధర్మసూనుండు వరుణదేవుని చందంబునం దేజరిల్లుచు, గార్హాపత్యంబును, నాహవనీయంబును, దక్షిణాగ్నియును, సభ్యంబును, నావసథ్యంబును, నౌపాసనాగ్నియును ననుమడగ్నులనుం బోలుచు యాగంబు గావింపుచు బహుదక్షిణలను, నిఖిలమనోభీష్ట వస్తుప్రదానంబులను, సకలజనంబులకు సంతుష్టి గావించె. ఆసమయంబున సకలజనంబులును, భక్ష్యభోజ్యంబులు భుజియించి గంధమాల్యభూషణాలంకృతులగుచు హితసమేతంబుగం బ్రమోదంబునం బొదలిరి. అంత శిక్షాసమర్థులగు మహర్షిశ్రేష్ఠులు గావించు నిడాజ్యసోమాహుతులవలనను నాయజ్ఞంబున నిఖిలదేవగణంబులకు సంతుష్టి వాటిల్లె. మఱియు దక్షిణలవలన బ్రాహ్మణులును రత్నకాంచనప్రదానంబులవలన సర్వవర్ణంబులవారలును బరితుష్టులగుచుం జెలంగిరి.

ఈకథ సభాపర్వంబునందు నలువదిరెండవ యధ్యాయము.

---

## అధ్యాయము 43

---

అంత సుత్యాహంబున నిఖిలరాజన్యసమేతులగు నారదాది మునీంద్రులు బ్రహ్మసభామధ్యంబున దేవగణపరివృతులగు బ్రహ్మర్షుల

చందంబున యజ్ఞవేదికామధ్యంబునం దేజరిల్లుచు సదస్యులై యుండ నందుం గొందఱు కర్మమధ్యంబు ప్రాతస్సవనంబు నాచరించి యూర కుండెడు సమయంబునం దమతమ విద్యాసామర్థ్యంబు మెఱయిం చుటకై యెనది కాదనియును, గానిని యౌననియును, నిది యట్లన కాక వేఱె కాదనియును, బహువిధంబుల వితండావాదంబు సేయు వారును, శాస్త్రనిశ్చితంబులగు యుక్తులవలన నీషదర్థంబు బహుళం బుగాం బ్రతిపాదించువారును, బహుళంబులగు నర్థంబుల సంక్షేపంబు లుగ జేయువారును, బ్రతివాది యుపన్యసించిన యనేకార్థంబులు మాంసఖండంబు తుత్తునుకలు గావించు శ్యేనంబు కైవడి హేతువచ నంబుల ఖండించువారును, మఱియుం గొందఱు ధర్మార్థకామసమే తంబులగు నితిహాసంబులం బ్రౌఢ్దుగడపువారును నగుచు నుండునెడ, మహర్షులును, మహీసురులును, మానవేంద్రులును మొదలగువారల వలన యాగవేదిక నక్షత్రబృందంబులం దేజరిల్లు నభోభాగంబు ననుక రించె. మఱియు నా వేదిమధ్యంబున వ్రతహీనుండును, శూద్రుండును నగువాం డొక్కరుండు లేండయ్యె. ఆసమయంబున నారదమునీంద్రుండు ధర్మనందనుని మహావైభవంబును నతని యజ్ఞంబునందుగల సమృద్ధియు ను నిరీక్షించిసంతసింపుచు నచటికిం జనుదెంచియున్న నృపాలురంగనుం గొని, పూర్వంబున బ్రహ్మసభాభవనంబున నుండెడు నారాయణుండు, నేను మహీతలంబున నవతరించి భూభారంబు దీర్చెద, మీరలంద ఱును ధరాతలంబున రాజులై జనియించి పరస్పర కలహంబున నిహతులై స్వర్గంబు చేరుండని దేవతల నుద్దేశించి పలికిన వాక్యం బులు మనంబునం దలంచి, జగదీశ్వరుం డగు పుండరీకాక్షుని సంస్మ రింపుచు, నాంటి ప్రతిజ్ఞాపరిపాలనంబు గావింప యదువంశంబున నవ తరించిన యావిష్ణుదేవుండె కదా యీకృష్ణుండు, ఆయమరులే కదా యీమహీగమణులు, ఇపుడు నీయఖిల రాజమధ్యంబునం

దారా గణపరివృతుండగు పూర్ణచంద్రుని విధంబునం దేజరిల్లు నీయదువల్లభుని భుజాబలంబు నాశ్రయించి కదా మహేంద్ర ప్రముఖులగు నిర్జరులు సుఖంబున నున్నవారలు. ఇట్టి పరమపురుషుండు తమ యజ్ఞంబునకు వచ్చి పూజ లంగీకరించుటకుం గాం తేయాగ్రజుం డెట్టి పుణ్యంబు గావించెనో? అటుమీంద నీజగత్కారణభూతుం డగు మాధవుండె కదా సకల క్షత్రియ సంహారంబు గావింప నున్నవాండని లోకేశ్వరుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును, సర్వలోక సంరక్షకుండును, యోగారాధ్యుండును, విశ్వవ్యాపకుండును, బురాణ పురుషుండును నగు జనార్దనుని హృదయకమలంబునం జింతించి సంతోషభరితుండై యుండె.

ఈకథ సభాపర్వంబున నలువదిమూండవ యధ్యాయము.

---

## అధ్యాయము 44

---

అని వైశంపాయనుండు జనమేజయునిం గనుంగొని మఱియు నిట్లను. పాంచాలమహీపతులును, యదువృష్ణిభూపాలురును, బుత్రమిత్రసమేతులగుచు ధర్మనందనున కపారంబులగు వస్తువిశేషంబులు కానుకలు గైకొని, విశేషించియును, వియ్యంపువారలు గావునం బాండవు లాచరించు రాజసూయాధ్వరంబు కార్యంబుగాం దలంచి ప్రమోదంబునం బొదలుచు,దూరదేశనివాసులగుటను నపారంబులగు ధనంబులు తెచ్చువారలగుటనుం జేసి యవభృథస్నానంబునకు నరుగుదెంచిరి. అంత యాదవశ్రేష్ఠుండును, జక్రాయుధధరుండును, వైరి భంజనుండును నగు కృష్ణుండు నిజమందిరంబు వెడలి దివ్యస్యందనారూఢుండై సమస్తజనంబులుబరివేష్టించి కొలువ రథనేమీనిస్వనంబులు

దిగంతంబుల నిండారుచుండం జనుదెంచి యుధిష్ఠిరుని యాగశాలకుం జనుదెంచి బలశౌర్యధుర్యులును కంఠీరవపరాక్రములును నగు శిశుపాలదంతవక్త్రప్రభృతులగు పార్థివులు నానావిభూషణభూషితగాత్రులగుచు మెఱుపుందీంగెలం దురంగలించు మేఘంబు తెఱంగు ననుకరింపంగనుంగొనుచుం గాంగేయాగ్రజప్రముఖులు ప్రత్యుత్థానంబు గావించి యథార్హపూజలు గావింప సుఖోపవిష్టుండై యున్న యనంతరంబ గంగాతనూభవుం డజాతశత్రుంగనుంగొని, పూజ్యులగు రాజన్యులు నిఖిలదేశంబులవలనం జనుదెంచి బహుదినంబుల నుండియు నిచ్చట వసియించియున్న వారతౌట పీరలర్చనీయులు. ఆచార్యుండును, ఋత్విజుండును, స్నాతకవ్రతదీక్షితుండును, బరమమిత్రుండును, బట్టాభిషిక్తుండగు రాజును, సంబంధియును నను నీయార్వురును సంవత్సరానంతరంబ వచ్చిరేని యర్ఘ్యార్హులని శాస్త్రంబులు తెలుపుచున్నయవి. కావున వీరిందఱిలోన జ్యేష్ఠ కనిష్ఠభావంబులును, గుణాగుణంబులును విచారించి యథాక్రమంబున నందఱకును బూజ గావింపు మనిన గాంగేయు నుద్దేశించి కుంతీతనయుండు, మహాత్మా పీరల మహత్త్వం బంతయుం దెలిసి యగ్రపూజకు యోగ్యుం డితం డని మీరలెవ్వరిని నియమించితిరిఅతనిం బూజించెద ననిన శాంతనవుం డగ్రపూజకు నర్హుండు వాసుదేవుండని మనంబున నిశ్చయించి, పాండవాగ్రజు నాలోకించి, తేజోనిధానుండును, త్రికాలజ్ఞానసంపన్నుండును, సర్వవ్యాపకుండును, యోగీశ్వరధ్యానగమ్యుండును, శీలజ్ఞానవయోవృద్ధులకు నారాధనీయుండును, సృష్టిస్థితిలయకారణభూతుండును, నాపన్నివారకుండును, నచ్యుతుండును, జగదాత్మకుండును, ననంత కల్యాణగుణాభిరాముండును నగు నీబలరామ సహోదరుండు, గ్రహతారకాగణ మధ్యంబున మార్తాండుని కరణి, నీమహీపతులలోనం దేజోబలపరాక్రమంబులచే నధికుండై



రాజసూయంబున శ్రీకృష్ణునికి నగ్రపూజగావించిన
శిశుపాలుం డాక్షేపించుట.

తానే ప్రకాశింపుచు నున్నవాఁడు. కావున నిప్పుండరీకాక్షుండే యగ్రపూజార్హుండని పలికి సహదేవునిం బిలిచి యీమాధవునకు సపర్య గావింపుమనిన నతండును, ధేనువును, నర్ఘ్యంబును, మధుపర్కంబును, నామధువైరికి నొసంగి యతని పాదంబులు స్పృశింపుచు వందనం బాచరించిన, గోవిందుండును నానకులానుజునిం గౌఁగిటం జేర్చి శిరంబాఘ్రాణంబు సేయుచు నతని కుశల ప్రశ్నంబు గావింప, మాద్రీసుతుండును మీకటాక్షంబువలన సర్వంబును కుశల సంపన్నంబని పలుకు సమయంబున సకలః భూవల్లభులును బరస్పర ముఖావలోకనంబు గావింపుచు నొండేమియు ననక యూరకుండు నెడ, శిశుపాలుండు గర్వోద్దీపితుం డగుచు నతనిం బూజించుటకు సహింపంజాలక ధర్మజదేవవ్రతుల నిందింపుచు సభాసదుల నిరీక్షించి, యెవ్వని బూజింతునని యడిగెడు వాఁడొక విజాతి సంభవుండును, నితని బూజించుమని నియమించు వాఁడొక నదీ సుతుండును, నర్చ గైకొను వాఁడొక గోపాలకుండును, సపర్యగావించు వాఁడొక జాత్యంతరంబునం బ్రభవించినవాండునై కూడిరి. ఇది యెంత యొప్పిదంబై యున్న యది. మహాకులసంభవులగు నీమనుజాధీశ్వరులు నూరకెయున్నవారని హాస్యంబుగాం బలుకుచు, మఱియు ధర్మనందను నుద్దేశించి, మహానుభావులగు నిట్టి ధాత్రీవిభు లిందఱు నిట్లుండ, నీ రాజన్యుల మహత్వం బెఱుంగనేరకయో లేక యెఱింగియు నుపేక్షించియో యియ్యాదవునిం బూజించితివి? లోకంబునం బూజ్యుల మహత్త్వం బెఱుంగకుండుటయును, నెఱింగియు నుపేక్షించుటయును ననునివి వినాశనంబునకుం గారణంబులు. ఈరెంటి లోనెయ్యది గుఱించి యిట్లు కావించితివి?

ఈకథ సభాపర్వంబున నలువదినాల్గవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 45

అనిపలికి చైద్యుండు మఱియు నిట్లను. ఇంతటి మహానుభావులగు రాజులుండ రాజార్హంబులగు పూజలకు రాజభావరహితుండగు గోవిందుం డెవ్విధంబున నర్హుండగు? మైత్రివాటించిగదా యాదవునికింగావించితివి? ఇది పాండుపుత్రులగుమీకు నుచితంబగు. మీరు బాలురుగావున ధర్మసూక్ష్మంబెఱుంగరైతిరి. ఈ శాంతనవుండు నల్పబుద్ధియును, వృద్ధుండును నగుటంజేసి కృష్ణుండు మీకుం జెలికాండనియును నతని నర్చించుట మీకుం బ్రియంబనియును వివరించెంగాని రాజధర్మంబెఱింగి తెలుపలేండయ్యె. ఇతండు వయోవృద్ధుండని పూజించితివేని, వసుదేవుండుండ నతనిపుత్రుండగు నితండెట్లు పూజార్హుండగు? కాక మిత్రమహాత్వంబువలన నితండు పూజ్యుండని తలంచితివేని, నిఖిలగుణగరిష్ఠుండగు ద్రుపదునిం బూజింపరాదే? గురువని దలంచితివేని యాచార్యుండగు ద్రోణుండుండ కృష్ణుండు పూజనీయుండగుటెట్లు? లేక ఋత్విజుండని విచారించితివేని, బ్రహ్మనిష్ఠుండగు సాత్యవతేయుండు లేండయ్యెనె? స్వచ్ఛందమరణుండును, వృద్ధుండును బురుషశ్రేష్ఠుండును నగు శంతననందనుండుండ నితని నెవ్విధంబున నర్చించితివి? మఱియును భరతవంశంబునకుం జాపవిద్యాగురుండగు కృపాచార్యుండును, నిఖిలశస్త్రాస్త్ర విశారదుండగు నశ్వత్థామయును, గింపురుషాచార్యుండగు ద్రుముండును, ధనుర్విద్యాకౌశలంబున బరాక్రమంబున ధనంజయ సమానుండునునగు నేకలవ్యుండును, బటుశౌర్యధుర్యుండగు కృపాచార్యుండును, భగదత్తుండును, రాజ్యాధీశ్వరుండగు జయత్సేనుండును, గిరిధురంధరుండగు కాళింగుండును, బూర్వకోసలేశ్వరుండగు బృహద్బలుండును, మహావీరుండగు విరాటుండును, శూరాగ్రేసరుండగు దరదుం

డును, వైరిదుస్సహుండగు భీష్మకుండును, బాండ్యభూవల్లభుండగు కృతధన్వుండును, రాజశ్రేష్ఠుండగు రుక్మియును, మహారాజేశ్వరుండగు దంతవక్త్రుండును, మద్రదేశాధ్యక్షుండగు శల్యుండును, వీరుండగు సురాష్ట్రాధిపతియును, గంభీరవసమానుండగు మాళవుండును, సుజ్ఞానశీలుండగు వైదేహుండునునను మహాత్ములగు వీరలిందఱు నిటుండ నీగోపాలబాలుండు నీకు నర్చనీయుండయ్యెనె? మఱియును పరశురామ ప్రియశిష్యుండును, భుజాబలశాలియును, వినిర్జిత జరాసంధుండును నగు కర్ణుండును, నవంతి దేశాధీశ్వరులగు విందానువిందులును, గాంభోజపతియగు సుదక్షిణుండును, రాజేంద్రుండగు సాల్వుండును, నర్జున సఖుండగు గంధర్వ నాయకుండును నగు చిత్రరథుండును, నతిరథశ్రేష్ఠులును గురువంశదీపకులును నగు బాహ్లికసోమదత్తభూరిశ్రవులును, సుబలనందనుండగు శకునియును, మహాబలుండగు సైంధవుండును నిజతేజోవిజృంభణంబు నం బ్రకాశింపుచునుండ వీరల నిరాకరించి కృష్ణుని బూజించితి వేమిటికి? లోకంబున ఋత్విజుండును, నాచార్యుండును, మూర్ధాభిషిక్తుండును, స్నాతకుండును, జామాతయును, వీరలలోనొక్కరుండును గాని యితని నెవ్విధంబునం బూజించితివి? లేక మైత్రివలనం బూజించితినంటివేని మహానుభావులగు నీరాజవర్యుల రప్పించి యవమానంబు గావించుట యుక్తంబగునె? ఇట్టి నీవు కప్పంబేటికి నొసంగితని యడిగితేనిజెప్పెద. ధర్మప్రధానుండగు నీధర్మనందనునకుం బార్థివత్వంబు గలుగ వలయునని యిచ్చితిమిగాని, భయంబునకేనియు, లోభంబునకేనియు, నిచ్చకంబునకేనియు నిచ్చినవారముకాము. అట్లయ్యును మమ్ముంగణింపక యవమానించెదవు. పూజార్హలక్షణంబులలో నొక్కటియును లేని హీనునికి సపర్యగావించుటంజేసి మాకునింతకంటె వేఱెయవమానంబునుం గలదె? కటకటా! ధర్మపుత్రుండు ధర్మా

త్తుండనియెడి వచనంబు నిష్కారణంబుగా జనియె. తాను వృష్ణి కులంబునంజనించి మూర్ధాభిషిక్తుండగు కంసునిజంపె. ఇట్టిదురాత్ముని లోకంబున నెవ్వండేనియుం బూజించునె? ఈ యాదవునిం బూజించుటవలన నీకంటె నధర్మపురుషుండునుంగలండె? అనిపలికి మాధవు నుద్దేశించి, పాండవులు దీనులును, భీతులును నగుటంజేసినిన్నుం బూజించిన మహాకులసంభవులగు రాజులమధ్యంబున నీకు నర్హ్వంబు గాని పూజనెవ్విధంబునగైకొంటివి? అగ్రపూజంగైకొంటినని యింత మాత్రంబున గర్వింపకుము. నిర్జనంబగు స్థానంబుననున్న దేవార్హ్వంబగు నన్నంబు శునకంబుగైకొనిన దానికి నది ప్రతిష్ఠాకరంబగునె? ధర్మనందనుండు రాజుల నవమానించి నన్నుంబూజించెనని తలంపకుము. ఇతనికిం బూజకునెంతదూరంబని కౌరవులెల్లను నిన్నె పరిహారించెదరు. మహారాజయోగ్యంబగుపూజ రాజకులసంభవుండవుగాని నీకు నొసంగుట నపుంసకునికిం గన్యకనొసంగిన తెఱంగును, నంధకునికిం జిత్తరువుచూపిన మార్గంబును నయ్యెనని రాజలోకంబు నవలోకించి, యిట్టి వివేకసంపన్నులగు గాంగేయ కౌంతేయ యాదవులం గనుంగొంటిమి. ఇంతియచాలు, పదివేలని పరమాసనంబుననుండి దిగ్గనలేచి నిజబంధునమేతంబుగ సభాస్థానంబు వెడలవడియె.

ఇది నలువదియైదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 46

---

అంత ధర్మనందనుండు శిశుపాలుని సమీపంబున కేంగి యతనినుద్దేశించి సాంత్వపూర్వకంబుగ మధురభాషణంబుల నిట్లను. మహాత్మా! సభామధ్యంబున నిష్కారణంబుగా నిట్లు పరుషభాష

ణంబులాడుట నీయట్టి వానికి నుచితంబగునె? ఇంతకన్న నధర్మం బేమియున్న యది? లోకంబునం బృథివీపాలుండగు వాండు సజ్జనుల నిందింపంబోవునె? కావున శంతను కుమారుండగు భీష్ముని నధర్మ వాదిగాం దలంపకుము. నీకంటె వయోవృద్ధులగు నీమహీపాలు రందఱును వాసుదేవునిం బూజించుటకు సమ్మతించి యుండ నీవును నత్తెఱంగున నంగీకరింపవలయు. ఈమాధవుని మహత్త్వంబు భీష్ముం డెఱింగినట్లు నీవెఱుంగమిం జేసి గదా ఇంత నిందించితివి, అనునెడ గంగానందనుండు కౌంతేయాగ్రజునిం గనుంగొని, సకల జగత్పూజ్యుండగు శౌరినర్చించుటకు సహింపలేని యితండు ప్రియభాషణం బుల ననునయించుటకు యోగ్యుం డగునె? క్షత్రియుండగు వాండు సమరంబునం దన్ను నిర్జించి, దయాళుం డగుచు హింసింపక పరిత్యజించిన యతని గురువుగం దలంచుట నీతిమార్గంబు. ఈనరేంద్ర లోకంబున యదువల్లభునిచే బరాజితుండు గాని వాం డొక్కరుం డును లేండు. కావున నతండు మనకు మాత్రంబన నేటికి, త్రిలోకం బుల వారలకు నర్చనీయుండు. చరాచరాత్మకం బగు నీజగంబంత యును జనార్దనుని యధీనం బగుట, లోకంబునం గల మహాను భావులలోని నితండె పూజ్యుండు. ఈచైద్యుని తోడిరిత్తమాటల వలనం బ్రయోజనం బేమి గలిగెడు? ఊరకుండుమని పలికి శిశుపాలు నిం గనుంగొని, నేను మహాత్ములగు ఋషీశ్వరులవలన నీమాధవుండు జన్మించినది మొదలుగ నొనర్చిన యతిమానుషంబులగు పరాక్రమం బులును, నితని యనంతకల్యాణగుణంబులును, మిగుల వినియును, గనియును, బూజచేయించితిం గాని, యీతని యందలి మైత్రియును బాంధవంబును గార్యంబును దలంచియేనియును, గాక యితని వలన నగు భయంబున నేనియునుం గాదు. మఱియును, సజ్జనపూజ్యుం డును నిఖిలజనసంరక్షకుండును నగు నతనియందు కీర్తియును,

ప్రతాపంబును, లక్ష్మియును, బలంబును, నౌదార్యంబును సామర్థ్యంబును, ప్రజ్ఞయును, వినయంబును, ధైర్యంబును, బుష్టియును; వేదవేదాంగ విజ్ఞానంబును, నుత్సాహంబును మొదలగు సద్గుణంబు లెల్లను గలిగియున్నయవి. ఇట్టి గుణంబు లితని యందు గాక వేఱొక్కనియందు గలుగనేర్చునె? అట్లగుట నిఖిలరాజన్యుల కంటె మహానుభావుం డని తెలిసి యాచార్యుండును, దండ్రియును, గురువును, ఋత్విజుండును, నృపతియును, స్నాతకుండును, మిత్రుం డును నీకృష్ణుండ యని తలంచి పూజం గావించితిమి. బ్రాహ్మణుల లోన జ్ఞానవంతుండును, క్షత్రియుల లోన శౌర్యధురంధరుండును శ్రేష్ఠులనం దగుదురు, కాన వేదవేదాంత విజ్ఞానంబును, నపరిమిత పరాక్రమంబును, నితనియందె కలిగియుండుటం దెలసి పూజ గావిం చితిమి. సకల లోకంబుల సృష్టి స్థితిలయంబులకుం గారణభూతుం డీకృష్ణుండు. చరాచరాత్మకంబగు నీవిశ్వంబంతయును నతనియందె వసించియున్నయది. ప్రకృతిశరీరుండును, నవ్యక్తాత్మకుండును, జ్ఞానమయుండును, సర్వోత్తముండును నీవిష్ణుండె యగుట నితండు సర్వోత్తముం డని యాచరించితిమి. దేవతలలోన నగ్ని దేవతచం దంబున, ఛందంబులయందు గాయత్రి తెఱంగునం, బర్వతంబుల లోన మేరువు కైవడిం, బక్షికులంబున వైనతేయుని చాడ్పున, సకల లోకంబులలోన నీవాసుదేవుండు ముఖ్యుండగు. మఱియు, బుద్ధి యును, మనంబును, మహత్త్వంబును, వాయువును, దేజంబును, నుద కంబును, నాకాశంబును, జతుర్వింశతి తత్త్వంబులును, నక్షత్రంబులును, సూర్యుండును, జంద్రుండును, గ్రహంబులును, దిశలును, విదిశలును ననునిన్నియును నీవెన్నునియందెయున్నయవి. బ్రహ్మయు, రుద్రుం డును, బురాణపురుషుండును నితండె యని యెఱుంగుము. జరాయు జంబులును, నండజంబులును, స్వేదజంబులును, నుద్భిదంబులును

ననుచతుర్విధభూతంబులును నీతనియందె వసియించియున్నవని పలికి, ధర్మపుత్రు నుద్దేశించి యిట్లు విశ్వాత్ముండును, సర్వేశ్వరుండును, సకల దేశకాల పరిపూర్ణుండును నగు నచ్యుతుండు లీలామానుష రూపం బంగీకరించి యీకృష్ణుండై యుండుట యెఱుంగంజాలకుండు టం జేసి యీశిశుపాలుండు పరుషభాషణంబుల నివ్విధంబునం బలికెడు. లోకంబున బుద్ధిమంతుం డగు జనుండు ధర్మంబాచరించుటకె తలంచు. వీండు పాపచిత్తుం డగుటం జేసి యది యెఱుంగక యిట్లా డుచున్నవాండు. బాలవృద్ధ సహితంబుగ నున్న యీమహానుభావు లగు రాజవర్యులలోన గృష్ణునిం బూజింపనివాండును, నతని నారా ధింపవలదనిన వాండొకరుండేనియునుం గలండె? ఇతనికి సపర్య గావించ యోగ్యంబుగాదని చైద్యుండు పలికెడుం గదా! వీండిట్లు వలికినం బలుకనిమ్ము. అనిన భీష్ముని పలుకులకుం గోపోద్దీపితుండై యున్న సునీథుని నిరీక్షించి, సహదేవుండు మేము నీతిమార్గంబున నడచితిమి గాని వేఱొండాచరించుట లేదు. ఇది నీకయుక్తంబని తోంచె. నిఖిలమహీపతులలోన బలపరాక్రమంబులవలనం గృష్ణుండె సర్వోత్కృష్టుండు గావున నతనికి నర్ఘ్యం బొసంగితిమి. ఇది సకల జనపాల సమ్మతంబు. ఇది యెవ్వనికి నసంగతంబై యుండె? వాండు దానసమర్థుం డయ్యేనేని మాతోడ నిప్పుడె సమరంబునకు రాంగలండు. ఇదె వాని శిరంబు మెట్టెదనని వామపాదంబున భూత లంబు దాటించి, యెవ్వండేనియు దీనికి నుత్తరంబిండని పలుకుచున్న సమయంబున, సకల రాజమధ్యంబున నున్న యతని శిరంబునం బుష్పవర్షంబు గురిసె. అంత నభిమానవంతులగు మహీకాంతులు యొండేమియు ననక యూరకుండు నెడ శిశుపా లుండు స్వభావరక్తంబులగు తన నేత్రంబులు మిగులం జేవురింప రోషావేశంబులతో నుండు లెత్తింగి భీష్ముండు సభాసదుల నుద్దేశించి

ఇప్పుడీసహాదేవుండు కేశవుని మహత్త్వంబంతయు నెఱింగి పలికిన యీపలుకులు యథార్థంబులు. ఇంతయును మీహృదయంబున విచారించి తెలియుండు.

ఈకథ సభాపర్వంబున నలువదియాఱవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 47

---

అని యివ్విధంబునం బలుకు భీష్ముని వచనంబు లాకర్ణించి, మహాత్మా! ఈ వాసుదేవుని మహత్త్వంబు శ్రవణానందంబై యున్న యది. ఇతని స్వరూపంబును సద్భుతచరిత్రంబుల యానుపూర్వియును, దివ్యావతారంబులును, సవిస్తరంబుగ వివరింపు మని యడిగిన, శాంతనవుండు రెండవ పురందరుండునుం బోని కృష్ణుని సన్నిధానంబున సకలరాజలోకంబు వినుచుండం గాంతేయాగ్రజు నుద్దేశించి భూతభవిష్యద్వర్తమానంబుల నితం డొనరించిన కృత్యంబుల నిర్వచనీయంబులై యుండు. అవి యెఱింగించెద. సావధానచిత్తుండవై వినుమని సాంత్వవచనంబుల శిశుపాలు ననునయింపుచు, మగుడ ధర్మనందనుం గనుంగొని తొలుత నవ్యక్తుండై యుండి యిప్పుడు వ్యక్తస్వరూపంబునం దోంచుచుండెడు నీపుండరీకాక్షుండు పూర్వంబున సర్వతంత్రుండును, బితామహజనకుండును, సహస్రశీర్షుండును, సహస్రలోచనుండును, సహస్రవదనుండును, సహస్రబాహుండును, సహస్రపాదుండును, బురుషోత్తముండును, సహస్ర దివ్యనామధేయుండును, విశ్వాత్మకుండును, ననేకవర్ణుండును బ్రకృతికంటెంబరుండును, సర్వవ్యాపకుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును నగు నారాయణుండై యనం బరగుచుం దొలుదొలుత జలంబు సృజియించి యాసలిలంబులోన జతుస్ముఖు

నిం బుట్టించె. ఆకమలాసనుండు సకలలోకంబులుం గలిగించె. ఇది జగదుత్పత్తిప్రకారంబు. ఇంక మహాప్రళయంబున బ్రహ్మరుద్రాది దేవసంఘంబులును, జరాచరంబులును, మహాప్రకృతిలోనలీనంబై యుండునెడ సర్వాత్మకుండగు నాదిపురుషుం డొక్కరుండై యుండు. అతనికి స్వర్గంబు శిరస్సును, నాకాశంబు నాభియును, బృథివి పాదంబులును, నశ్వినీదేవతలు కర్ణంబులును, సూర్యచంద్రులు నేత్రంబులును, నింద్రవైశ్వానరులు ముఖంబును, మఱియునుంగల యితర బృందారకబృందంబు లవయవంబులునునై సూత్రంబునం దగిలిన మణిగణంబుల తెఱంగునం దోంచుచుండు. ఇట్లు కల్పాంతంబున సర్వంబును బ్రకృతినిమగ్నంబై యుండునెడ మహాయోగీశ్వరుండును, సర్వజ్ఞుండును, నఖిలశక్తిసంపన్నుండును నగు లక్ష్మీకాంతుండు తన యంశంబున హిరణ్యగర్భుని గలిగించె. సర్వభూతాధ్యక్షుండగు నతండు సనత్కుమారుండును, రుద్రుండును, మనువును, సప్తమహర్షులును నను వీరలం దొలుందొలుత సృజియించి పదంపడి నిఖిలలోకంబులు గావించె. ఆ బ్రహ్మరుద్రాదులవలన జరాచరాత్మకంబగు ప్రపంచం బంతయును గలిగె. ఇట్లు మన్వంతరంబులును, యుగంబులును, బ్రళయంబులును, బ్రహ్మకల్పంబులును జక్రంబు దిరుగు చందంబునం దిరుగుచున్నయవి. ఇవ్విధంబున నిట్టి నిఖిలప్రపంచంబును విష్ణుమయంబని యెఱుంగుము. సకలలోకహితార్థంబుగం జతుర్ముఖుని సృజియించి జనార్దనుండు క్షీరసాగరమధ్యంబున సుఖంబున వసియించియున్నవాండు గావున నీభువనంబునకుం బద్మసంభవుండు పితామహుం డనంబడు. అతనికి జనకుండగుటం జేసి వైకుంఠుండు లోకంబులకుం బ్రపితామహుం డనం బరంగుచున్నవాండు.

ఇది నలువదియేడవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 48

అనిపలికి భీష్ముండు మఱియు నిట్లను. ఆదికాలంబున నరనారాయణులయ్యును,హరియయ్యును ప్రాదుర్భవించిన మహానుభావుండగు నీకృష్ణుండు లోకరక్షణార్థంబుగా బ్రహ్మయయ్యును, సూర్యచంద్రులయ్యును, ధర్మంబయ్యును, మఱియు బహురూపంబుల జనించు నితని దివ్యావతారంబులు వివరించెద నాకర్ణింపుము. దేవదేవుండగు జగన్నాథుండు వేయియుగంబులు యోగనిద్ర గావించి మేలుకొని ప్రపంచ నిర్మాణంబుగ బ్రహ్మకుపరి పరమేష్టి ముఖ్యులగు దేవతలను, మనుశంకరసనత్కుమారులను, సప్తర్షులను సృజించి, స్థావరజంగమాత్మకంబగు నీభువనంబగు దేవదానవ గరుడోరగ ప్రభృతి విరహితంబై సముద్ర మధ్యంబున నిమగ్నంబై యున్నతఱి, సమరాభిలాషులును, దుర్జయులును, మృణ్మయగాత్రులును, సహోదరులును నగు మధుకైటభులను నిరువురు రాక్షసులు హృషీకేశుని కర్ణయుగళంబువలనం బ్రాదుర్భవించి ప్రళయసాగరమధ్యంబు బ్రవేశించియున్న సమయంబునం బితామహ నియుక్తుండై వాయుదేవుండు వారల దేహంబులంజొచ్చి ప్రాణస్వరూపియై నెలకొని యుండుటం జేసి యష్టదిక్పరి పూర్ణంబులగు గాత్రంబులం దనరారెడు నాదానవుల సమీపంబున కేంగి, కమలసంభవుండు కరస్పర్శనంబుగావించి యందుంగఠినశరీరుండగు వానికిం గైటభుండనియును, మృదుతనుండగువానికి మధువనియును నామధేయంబులిడిన, నాదైత్యులు బలపరాక్రమ గర్విష్ఠులగుచు సకల లోకంబుల సర్పయుక్తులై సంచరింపుచు యుద్ధకుతూహలులై సత్యలోకంబున కేంగిన, వారలం గనుంగొని హిరణ్యగర్భుండు మహాసలిల మధ్యంబున మునింగి యంబుజోదరుని నాభివలనంజనించిన దివ్యపంకజంబు బ్రవేశించె. నారాయణుండును, జతుర్ముఖుండును,

ననేక దివ్యయుగంబులు జలమధ్యంబున నిశ్చలులై యుండునంత బహుకాలంబు జలంబులం ద్రిమ్మరుచునుండి యామధుకైటభులు సన్నద్ధులై తమ సమీపంబున కరుగుదెంచినం గనుంగొని రోషారుణీతలోచనుండగుచు దనుజాంతకుండు దిగ్గనలేచి వారలం దార్కొని యనేకదివ్య సహస్రవర్షంబు లేకార్ణవంబగు త్రైలోక్యంబున నతిఘోరంబగు సమరంబుగావించునెడ, దానవులెంతయును శ్రమంబు జెంది యామధుసూదనునిం గనుంగొని, మహాత్మా! నీయుద్ధంబునకు సంతుష్టులమైతిమి. ఈలోకంబు లోన నీవె ముఖ్యుండవు. అటుగాననాహవంబున నీచేమృతినొందెదము. తమ్మలంబులులేనియెడ వధియింపుము. తమ్మనెవ్వండు సంహారించునతనికి మేముతనూజులమై జనించెద మనిన, నట్లకాకయని యా నారాయణుండు నయ్యిరువుర నిరుగేలంబట్టి తొడల నిరికించి సమయించి జలమధ్యంబున వైచిన, వారిరువురిశిరంబు లేకిభవించి జలతరంగంబులుగొట్టువడనందుండియును మేదోభరంబువెలువడి సలిలంబున నాక్రమించినయనంతరంబ వాసుదేవుండు చరాచరంబులగు భూతంబుల సృజించె, నయ్యసుర కళేబరంబులవలనం దొఱంగు మేదోభరంబున వ్యాప్తంబగుటం జేసి మేదినియను నామధేయంబుగలిగి మహీతలంబాకైటభాంతకుని కృపావిశేషంబున శాశ్వతంబై నిలిచె.

ఇది సభాపర్వంబునందు నలువది యెనిమిదవయధ్యాయము.

---

## అధ్యాయము 49

---

అని భీష్ముండు మఱియును ధర్మజుంగనుంగొని అట్లు జలనిధి మధ్యంబున శయనించియుండెడు పద్మనాభుని నాభీకమలంబువలన

నతని యంశభూతులైన చతుర్ముఖప్రభృతి దేవర్షిగణంబు లావిర్భవించుటం జేసి యది పౌష్కరికావతారంబనందగు. ఆ జగదీశ్వరున కిట్టి ప్రాదుర్భావంబు లనేక సహస్రంబులు గలిగి యుండు. వానిని వివరించుటకు బ్రహ్మరుద్రాదులకు నలవి కాదు. కాన నెఱింగిన మాత్రంబు తెలిపెద. పురాణపురుషుండును వేదాంతప్రతిపాద్యుండును సురశ్రేష్ఠుండును నగు నా విష్ణుదేవుండు శైలకానన సమేతంబుగ జలనిధి నిమగ్నంబైన భూమి నుద్ధరించుటకై యవతరించిన యజ్ఞవరాహావతారంబు నెఱింగించెద. ఆకర్ణింపుము. చతుర్వేదంబులు పాదంబులు, యూపంబులు కరాళదంష్ట్రలు, యజ్ఞంబులు దంతంబులు, చయనంబు ముఖవివరంబు, వైశ్వానరుండు జిహ్వాక, దర్భలురోమంబులు, మంత్రసమూహంబు శిరంబు, అహోరాత్రంబులు నేత్రంబులు, వేదాంగంబులు శ్రుతిభూషణంబులు, ఆజ్యంబునాసిక, స్రువపాత్రంబు తుండంబు, సామగానంబు ఘుర్ఘురస్వనంబు సత్యధర్మయశంబులు శరీరకాంతులు, క్రియాకలాపంబులు పదవిక్షేపంబులు, ప్రాయశ్చిత్తంబు ముఖంబు, పశుబంధంబులు జానువులు, ఉద్గాత్రుహోమంబులింగంబు, పశువులును వ్రీహియవాదిబీజంబులును నోషధులును బాహ్యాభ్యంతరశరీరంబు, మంత్రంబులు శల్యంబులు, యజ్ఞవేదికలు స్కంధంబులు, హవిస్సుగంధంబు, హవ్యకవ్యంబులు జవంబు, ప్రాగ్వంశంబు శరీరంబు, దక్షిణ హృదయంబు, పశూపాకరణం బధరోష్ఠంబు, ప్రవర్గ్యహోమంబావర్తంబు, యజ్ఞశాల భార్య, బాహ్యాభ్యంతరంబులు బిలంబునుంగాగల్గి తపోనిధియును, ప్రాయశ్చిత్తమయుండును, ధర్మాత్ముకుండును, మనోహరాకారుండును, దేజోదురంధరుండును, నానాదీక్షావిరాజమానుండును, యోగీశ్వరేశ్వరుండును, మణిశృంగపర్వతాకారుండును నగుయజ్ఞవరాహమూర్తియై యవతరించి నారాయణుండు మహాజలమధ్యంబున మునింగియున్న, నిజకాంతయగు భూదేవిని మార్కండే

యుండు గనుంగొనుచుండ నిఖిలలోకసంరక్షణార్థంబుగా దంష్ట్రాగ్రం బున నుద్ధరించి చరాచర వస్తునిర్మాణంబు గావించి త్రిలోకకంటకు లగు దైత్యదానవుల ననేకుల సంహరించె. ఇది వరాహావతార క్రమంబు. ఇంక హిరణ్యకశిపుని సంహరించుటకై యవతరించిన జగన్నాథుని నృసింహావతారమహిమం బెఱింగించెద.

ఇది నలువదితొమ్మిదవ యధ్యాయము.

---

## అధ్యాయము 50

---

అని భీష్ముండు మఱియు నిట్లను. పూర్వకాలంబున దనుజకులాధ్యక్షుండును బలపరాక్రమ గర్విష్ఠుండును, త్రైలోక్యకంటకుండును, హిరణ్యకశిపు నామధేయుండును నగు నసురవీరుండు, మహారణ్యమధ్యంబున సుపవాసవ్రతపరాయణుండును, నిశ్చలుండును, మౌననిష్ఠుండును, శమదమసమన్వితుండును, బ్రహ్మచర్యవ్రతనిష్ఠుండును నగుచు హిమవత్పర్వతంబున విరించి నుద్దేశించి పదునొకండు వేలు న్నేనూఱు సంవత్సరంబు లతిఘోరంబగు, తపం బాచరింప నతని కాంతి నియమంబులవలన నెంతయును సంతసించుచు వాణీకాంతుండును, ప్రద్యోతనద్యోతమానంబును రాజహంసయుక్తంబును నగు విమానం బెక్కి ద్వాదశాదిత్యులును, నేకాదశరుద్రులును, దశదిశలును, నవగ్రహంబులును, నష్టవసువులును, సప్తర్షులును, సప్తమరుత్తులును, నాశ్వినేయులును, మఱియును సిద్ధసాధ్యగరుడగంధర్వకిన్నరకింపురుషప్రముఖులును, నదులును, సముద్రంబులును, నక్షత్రంబులును, ముహూర్తంబులును, దేవర్షులును, రాజర్షులును, నప్సరోగణంబులును బరివేష్టించి కొలువ బ్రహ్మజ్ఞాననిష్ఠులలో శ్రేష్ఠుండు నగు జలజాసనుం డతని సమీ

పంబునకుం జనుదెంచి, వత్సా! నీ తపోమహాత్త్వంబువలన సంతుష్ట హృదయుండనైతి. వలయు వరంబొసంగెద. నీ యభీష్టం బెయ్యది వివరింపుమనిన, దానవేంద్రుం డంజలిగావింపుచుం గంజగర్భును ద్దేశించి, దేవాసురగంధర్వులవలనను, యక్షరాక్షసోరగులవలనను, మనుష్యులవలనను, బిశాచులవలనను, మహర్షుల శాపంబులవలనను, శస్త్రాస్త్రంబులవలనను, బర్వతంబులవలనను, వృక్షంబులవలనను, బశుపక్షిమృగంబులవలనను, నార్ద్రద్రవ్యంబులవలనను, నీరసవస్తువులవలనను, నంతరిక్షంబునను, భూస్థలంబునను, దివారాత్రంబులయందును, దివంబునను, నంతర్బహిఃప్రదేశంబులయందును, నిధనంబు లేకుండునట్లుగా వరం బొసంగుమనిన, వనజసంభవుండును నట్లకాక యని యతని మనోరథంబు సఫలంబు గావించి బ్రహ్మర్షిగణసేవితుండై సత్యలోకంబునకుం జనియె. అంత గంధర్వోరగప్రభృతి దేవసంఘంబులు నతని వరలాభంబు విని యచ్చతురాననుని సముఖంబున కేంగి, మహాత్మా! ఆదానవున కివ్విధంబున మరణంబు లేకుండ మీర లనుగ్రహించుటం జేసి యింక నతండు నిఖిలభువనంబులు సాధింపకమానునె? అట్లగుట సర్వభూతేశ్వరుండును, స్వయంభవుండును, విశ్వసృష్టికర్తయును, శాశ్వతుండును నగు మహానుభావుండవు నీవె. కావున నతని వధించుటకు నుపాయంబు చింతింపుమనిన, నిర్జరుల దయావిలోకంబున నిరీక్షించి ప్రపంచ పితామహుండు, గీర్వాణులారా! ఆయసురుండు గావించిన క్రూరతపంబున కట్టివరం బొసంగుట వలసియుండె. అయిననేమి? వాని సుకృతఫలంబు తీరిన పిదప కైటభాంతకుం డెవ్విధంబుననైన హింసింపంగలండనిన నిఖిలవిబుధులానందభరితులగు నిజస్థానంబులకు నరిగిరి. అంత వరదానగర్వితుండగు నాదైత్యేంద్రుండు నిజభుజాబలంబువలన సకలలోకంబులకు బాధ గావింపుచు ననేక దైత్యసేనాపరివృతుం డగుచుం జక్రవాళపరివృతం

బులగు సప్తద్వీపంబులును, దివ్యంబులగు లోకాంతరంబులును, స్వాధీనంబులు గావించి, బహుభోగంబు లనుభవింపుచు నమరనగరంబునాక్రమించి మదోన్మత్తుండగుచు జంద్రసూర్యులును, వైశ్వానరుండును, వాయుదేవుండును, వరుణుండును, వాసవుండును, వైవస్వతుండును, ధనాధ్యక్షుండగు యక్షేశ్వరుండును, గిన్నరకింపురుషులును, బదిదిక్కులును నంతరిక్షంబును, దారకలును, నుదకంబులును, గామక్రోధంబులును నైనయై యుండవలయునని తలంచి వారల స్థానంబు లెల్లను విక్రమధురంధరుం డగుచు నాక్రమించి, యాయా దేవతలచే నగు కృత్యంబులు తానె కావింపుచు, సత్యధర్మనిరతులును, జితేంద్రియులును, వ్రతపరాయణులును, మహానుభావులును నగు మునీశ్వరుల యాశ్రమభూములకుం జేరి వారల బహువిధంబుల బాధింపుచు, యజ్ఞార్హులగు దేవతలంబరిహరించి దైత్యుల యాగభాగయోగ్యులం జేసి, మఱియు నమరులు యెందేనిచని డాగియుండిన దానందుంజని వారల నివాసంబులు నిజాధీనంబులు గావింపుచు నందుంగోటియును, నఱువదియొక్క లక్షలును, నఱువదివేల లెక్కకుందగిన సంవత్సరంబులు దివ్యభోగానుభవంబుల సంతుష్టహృదయుండగుచునున్న సురారివలన భయార్తులగుచు, నింద్రాది దేవతలు బ్రహ్మలోకంబునకుంజని యబ్జసంభవునకు దండప్రణామంబు లాచరించి జయజయ శబ్దంబులం బ్రశంసింపుచు,పితామహా! ఆహిరణ్యకశిపునిచే సంతతంబునుబీడితులమగుచు శరణంబు సొచ్చిన యాపన్నులమగుమమ్ముం గృపాకటాక్షంబుననిరీక్షించిరక్షింపుమనిన,వారలంగనుంగొని,కమలాసనుండు మీకు నొక పరమరహస్యం బెఱింగించెద. పురుషోత్తముండును,విశ్వశరీరుండును, గోటిసూర్యప్రకాశుండును, నవ్యక్తుండును, నచింత్యుండును, నవ్యయుండును, సర్వభూతేశ్వరుండును, బ్రకృతికంటెం బరుండును నగు నారాయణుండు మనకు రక్షకుండై

యున్నవాఁడు. అతనివలనఁ గదా నేనుద్భవించితి. నా వలనఁ బ్రపంచంబుగల్గె. మీకు నెట్లో యట్లన లక్ష్మీరమణుండు మాకును నధీశ్వరుండు కావున నెల్లభంగుల నీదైత్యాంతకుండు సంహరించు, అతనికసాధ్యంబగు కార్యంబు లోకంబులం గలుగనేరదు. మన మందఱము ముకుందసుదర్శనంబునకుం బోవలయునని, యాదిత్యులును, మరుత్తులును, విశ్వేదేవతలును, వసువులును, రుద్రులును, మహర్షులును నాశ్వినేయులును మొదలగు దేవతలు పరివేష్టింప, క్షీరసాగరంబునకుం బోయి తన్మధ్యప్రదేశంబున శ్వేతద్వీపంబున శేషశయనుండును, దేదీప్యమానుండును, శాశ్వతుండును, వేదమయుండును, నిఖిలమంత్రప్రతిపాద్యుండును, సర్వశక్తిసంపన్నుండును, లోకత్రయాత్మకుండును, జగత్పూజ్యుండును, ననంతుండు నగు నిందిరావల్లభునిం గనుంగొని, భక్తిపులకితాంగులగుచు సాష్టాంగదండప్రణామంబు లాచరించి, పుండరీకాక్షా! శరణాగతులమగు మమ్ము దయామయలోకనంబునం జూచి భువనభయంకరుండగు నసురేశ్వరుని నిగ్రహించి జగంబుల ననుగ్రహించుమని ప్రార్థించిన, విరించి ప్రముఖనిఖిల బృందారకబృందంబుల నిరీక్షించి, పంచశరగురుండు, మీకు నభయం బొసంగితి. నిర్భయులై మీమీ నిలయంబులకుం జనుండు. దానవవాహినీ సమన్వితుండును, సురాసురులకు నజేయుండును నగు హిరణ్యకశిపుని నిపుడె సమయించెద ననిన సర్వేశ్వరుని నుద్దేశించి, వాణీవల్లభుండు, ఈదేవతలందఱు ఖిన్నులై యున్నవారలు. ఆ దైత్యునకును గాలంబు సన్నిహితంబై యున్నయది. శీఘ్రంబుగ సురద్రోహిని నిగ్రహింపు మనిన, రమామనోహరుం డగుంగాక యని బ్రహ్మాదివిబుధవర్గంబుల యథాస్థానంబునకుం బనిచి, నృసింహరూపంబున నవతరించి, కరంబు కరంబునం బీడించుచు, భీమాకారుండగుచు, విలయకాలాంతకుని చందంబునంగదలి, దానవేంద్రుని సమీపంబునకుం జనుదెంచిన, నద్భుతా

కారభీకరంబగు నారసింహమూర్తిం గనుంగొని కోపోద్దీపితులగుచు దైత్యవీరభటులు బటుపరాక్రమధురీణులై యనేక శస్త్రాస్త్రంబు లొక్కుమ్మడి ప్రయోగింప, నతండును వాని నెల్లం గ్రసించుచు నతి పరుషంబులగు నిజచరణాఘాతంబుల బహుసహస్రసంఖ్యగల దనుజసంఘాతంబుల భూతలంబు బడలువడంజేయుచు నరుగుదేర, నీలజీమూతసంకాశగాత్రుండును, ఘనాఘన నిస్వనుండును, జలధరోపమానగర్వసంపన్నుండును నగు నా దుష్టదైత్యుం డకుంఠితపరాక్రమశౌర్యుం డగుచు నా నరకంఠీరవునిం దాకి యతి ఘోరసంగ్రామంబు గావించు నెడం గుపితశార్దూలవిక్రముండును, భుజాబలపరాక్రమధురీణుండును నగు నా హిరణ్యకశిపునింబట్టి నిజాంకస్థలంబున నునిచి వజ్రాయుధసఖంబులగు నఖముఖంబులం జించి సంధ్యాసమయంబున భవనద్వారంబున సంహరించి త్రైలోక్యంబులకుం బ్రమోదంబు గావించి ధర్మసంరక్షణంబుం బొనరించె. ఇది నృసింహావతారవైభవంబు. ఇంక వామనావిర్భావం బెఱింగించెద. ఆకర్ణింపుము.

ఈ కథ సభాపర్వంబున నేబదవ యధ్యాయము.

---

## అధ్యాయము 51

---

అని భీష్ముండు మఱియు నిట్లను. పూర్వకాలంబునందు త్రేతాయుగంబునం బరాక్రమశాలియును, నసమానబలుండును, విరోచనకుమారుండును నగు బలియను నొక దైత్యవల్లభుండు దైత్యసేనాసమేతంబుగ నడచి, మహేంద్రుని సమరంబున నిర్జించి, యతని నివాసంబగు నమరావతీపురంబు నాక్రమించి, పాకశాసనప్రముఖులగు బృందారకులు భయభ్రాంతులగుచు బ్రహ్మలోకంబునకుం జని, చతురానన

పురస్సరంబుగ క్షీరసాగరంబున కేంగి, సర్వేశ్వరుండగు వాసుదేవునిం బలుదెఱంగులం బ్రశంసింప నయ్యార్తజనరక్షకుండగు పుండరీకాక్షుండు సాక్షాత్కరించి వారలను నభయంబొసంగి పనిచి దేవమాతయగు నదితిగర్భంబున విష్ణునామధేయంబున నింద్రావరజుండై జనియించియుండు సమయంబున, శౌర్యధుర్యుండగు విరోచననందనుండు క్రతుశ్రేష్ఠంబగు నశ్వమేధంబు గావింపుచునుండ నయ్యుపేంద్రుండు, శిఖాయజ్ఞోపవీతంబులును, ముండితంబగు శిరంబును, బాలాశదండంబును మెఱయ వటువేషధారి యగుచు వామనరూపంబునం జని యతని యజ్ఞశాలం బ్రవేశించి బలిసన్నిధానంబు జేరి దక్షిణాకాలంబునం దనకు మూండడుగుల కొలంది యగు భూమిదానంబొసంగవలయునని యడిగిన, నతండును నిచ్చుటకు నంగీకరించి యట్లన యొసంగినంత నవ్వటువేషధారియగు నయ్యనాది బ్రహ్మచారి దశదిశాపరిపూర్ణంబుగ నిజశరీరంబు విజృంభించునట్లు గావించి, స్వర్గమర్త్యపాతాళంబులు విక్రమత్రయంబున నాక్రమింప, నతని పాదవిక్షేపంబునం బీడితులగుచు ఘోరాకారులును, కులశైలసంకాశులును, వివిధవేషధారులును, బహువిధాయుధహస్తులును, రక్తమాల్యాలంకృతులును, నజేయులును నగు విప్రచిత్తిప్రముఖదైత్యవీరులు యుద్ధసన్నద్ధులగుచు శస్త్రాస్త్రంబులు నిగుడింప, నింతేనియుం గంపింపక పాదహస్తఘాతంబులం బూర్వనిలింపులంజంపి యవక్రపరాక్రమంబున నిఖిలమహీచక్రంబును లోకంబును నాక్రమించుచుం ద్రివిక్రమమూర్తి విజృంభించి పెరిగెడు సమయంబునం జంద్రాదిత్యులు కొంత తడవు వక్షస్థలంబునందోంచి పదంపడి నాభిప్రమాణంబునం గనుపట్టి యనంతరంబ జానుప్రదేశంబున నిలిచి కనుపింపుచు నుండిరి. ఇట్లు వృద్ధినొందెడు నమ్ముకుందుని చరణాంగుష్ఠంబు దాంకిబ్రహ్మాండభాండంబు వగుల నావరణజలంబున నతని పాదంబు వెంబడిం

జాలు వారి గంగానది రూపంబునం బ్రవహించి సముద్రగామియయ్యె. అంత నా లక్ష్మీకాంతుండు దైత్యవల్లభుని మహనీయంబగు నైశ్వర్యంబు గైకొని నిర్జరేశ్వరున కొసంగి నముచిశంబరప్రహ్లాదప్రముఖులతోం గూడ నా దైత్యుని నిజపాదాహతివలనం బాతాళలోకంబునకుం బనిచె. ఇట్లత్యున్నతంబుగం బెరిగిన యతని దివ్యదేహంబునం బ్రపంచంబంతయును దగిలియుండుటం జేసి యితనిచే వ్యాప్తంబుగాని ప్రదేశంబు లేదని నిఖిలమరుత్తులు మోహంబునకుం గొనుచు, నతని తేజంబు నేత్రంబుల మిరుమిట్లు గొలుప రిచ్చవడి యూరకుండిరి త్రైఅంగున ననిర్వచనీయంబులగు నద్భుతకృత్యంబు లాచరించి మహాపురుషుండు గావున నింత జేసితింగదా యని యించుకయును విస్మయంబు జెందక సకల సంపదలవలనం బరిపూర్ణంబగు త్రైలోక్యంబు సహస్రాక్షున కొసంగె. ఇది వేద వేదాంగ పారగులగు బ్రాహ్మణుల వలనం గీర్తితంబగు వామనావతార ప్రకారంబు. ఇంక మనుష్యావతారంబులుపన్యసించెద.

ఈ కథ సభాపర్వంబున నేబదియొకటవ యధ్యాయము.

---

## అధ్యాయము 52

---

అని భీష్ముండు ధర్మనందనుం గనుంగొని పూర్వకాలంబున వేదంబులును, ధర్మంబులును, క్రియలును, సత్యంబును, శిథిలంబుగాం జాతుర్వర్ణ్యంబును సంకరంబై యసత్యంబును బహుళంబుగాం బ్రజాక్షయంబు వాటిల్లిన సమయంబున నీ కృష్ణుండు దత్తాత్రేయ ఋషీశ్వరుండై యవతరించి చాతుర్వర్ణ్యంబు వేర్వేఱ నేర్పరచి, శ్రుతులును, యాగంబులు మొదలగు సత్క్రియలును గ్రమ్మఱం

గలిగించి వనంబునం దపోయోగనిష్ఠుండై యుండునంత, నతని సమీపంబునకు హైహయదేశాధీశ్వరుండగు కార్తవీర్యార్జునం డరుగుదెంచి యత్యంతభక్తిసమేతుండగుచు నహంకారమమకారాదులు వర్జించి శుశ్రూషానిరతుండగుచు ననేక కాలంబు పరిచర్యం గావింప, బుధజనసేవ్యమానుండును, ననసూయాసహితుండును నగు దత్తాత్రేయమునీంద్రుండు సంతుష్టచిత్తుండగుచు, నీకు నమరత్వం బొక్కటియును దక్క నీకు నలుము నాలుగు వరంబు లొసంగెద వేండుమనిన, నయ్యర్జునుండు వినయావనతుండై యంజలి గావించుచు నతని నుద్దేశించి, మహాత్మా! యైశ్వర్యంబును, నౌదార్యంబును, సూనృతభాషణంబును, సుస్థిరంబగు బలంబును, నపాయ లేకుండుటయును, సహస్రభుజంబులును నాకుం గలిగియుండవలయు. ఇది ప్రథమంబగు వరంబు. జరాయుజంబులును, నండజంబులును మొదలగు చరాచరంబులగు ధర్మమార్గంబున నే బరిపాలింపవలయు. ఇది రెండవవరంబు. సమస్తవిరోధివర్గంబుల నిగ్రహించి నానావిధాధ్వరంబుల మహేంద్రాది నిర్జరులను, బితృగణంబుల మునీంద్రుల మహీసురులను సంతుష్టులం గావింపవలయు. ఇది మూడవ వరంబు. స్వర్గమర్త్యపాతాళంబుల యందును, త్రికాలంబులయందును, సమానరహితుండగు పురుషునిచే మరణంబు నొందుట నాలవవరంబు. ఇట్లు ప్రసాదింపవలయునని ప్రార్థించిన నమ్మహానుభావుం డట్లని యన్నివరంబులు నొసంగినం గైకొని కృతవీర్యనందనుండు మహాబలపరాక్రమసంపన్నుండగుచు, నింద్రద్వీపంబును, గసేరుద్వీపంబును, దామ్రద్వీపంబును, గాంధర్వద్వీపంబును, వారుణద్వీపంబును, సౌమ్యద్వీపంబును, గభస్తిమద్వీపంబును, మఱియును దొల్లిటిరాజులచే జయింపనలవిగాక యున్న ద్వీపంబులు నన్నిటి జయించి, నభోమధ్యంబునం దేజరిల్లు మార్తాండుని తెఱంగునం దోంచుచు మాహిష్మతీపురంబున వసియించి రాజ

నీతిమార్గంబు దప్పక, లక్షసంవత్సరంబులు రాజ్యంబు పరిపాలించె. అతని విమానంబులు స్వర్ణమయంబులై యుండు. మఱియు నతండు నిజభుజాపరిపాలితంబగు రాష్ట్రంబు నాల్గుపాళ్ళు గావించి శుభకరంబులగు యాగంబుల నొనర్చి జనరంజనంబు సేయుటకు నొక భాగంబును, సైన్యంబులకు నొక పాలును, మహావనమధ్యంబుల గ్రామంబుల వసియించి యుండెడు దస్యుగణంబుల జయింప నరిగెడు సేనలకు నొక పంపకంబునుగా ధనవ్యయంబు సేయుచు సకలసామంతధరణీకాంతుల వలనం గప్పంబులు గైకొనుచు, నిజాజ్ఞాభంగంబు గావించిన కొక మూషకంబుల నేనియు నిగ్రహింపుచు, నాజ్ఞాధురంధరుండగుచు ధరాచక్రంబు పరిపాలింప, నతని రాష్ట్రంబున నగరంబునం గల ప్రజలు కవాటబంధనంబులు మాని నిర్భయులై యుండిరి. మఱియు నతండు రాష్ట్రంబును, మనుష్యులను, స్త్రీలను, ధేనువులను దానె పరిపాలింపుచు నుండు. ఆ నృపాలుండు సముద్రంబునం బ్రవేశించెనేనియును యోగమహాత్వంబువలన నస్త్రం బార్ద్రంబుగాకనె యుండు. ఇట్టి కార్తవీర్యార్జునుని మహాత్త్వంబు భూతభవిష్యద్వర్తమానకాలంబులం గల నరేంద్రులకు ననుకరణీయంబై యుండు. ఇట్లు దత్తాత్రేయమునీంద్రుని మహాప్రసాదంబున నిఖిలమహిమంబులును గలిగి రాజ్యంబు బరిపాలింపుచునుండె. ఇది దత్తాత్రేయావతారంబు. ఇంకం బరశురామావిర్భావం బుపన్యసించెద.

ఈ కథ సభాపర్వంబున నేంబదిరెండవ యధ్యాయము.

---

## అధ్యాయము 53

---

అని పలికి భీష్ముండు ధర్మనందనుం గనుంగొని మఱియు నిట్లను. తొలుతటియుగంబున భృగువంశశ్రేష్ఠుండగు జమదగ్ని

మహామునీంద్రునకుం బరశురామాభిధానంబున వైకుంఠుం డవతరించి, హైహయాంతకుండును మహాబలశాలియునునై తనరారుచుం దన యెడ విధిప్రేరితంబునం జేసి యపరాధంబు గావింపుచుం గృతవీర్య నందనుండు క్రోధోద్దీపితుండై దివ్యరథారూఢుండగుచుం జనుదెంచి, యతిఘోరసంగ్రామంబు గావింప నతిమానరహితుండగు నతనికుఠారధారకుం బాలుపరచి, యసహితుండై యున్న జంభాసురుని ఋత్విక్సమేతంబుగ సంహరించి, మఱియు శతదుందుభి యనువాని మర్దించి, తక్కునుంగల భూవరులు బ్రాహ్మణులం బాధింప వారలందఱునుం జనుదెంచి సరస్వతీ నదీతీరంబున బహురథతురగపదాతి సమేతంబుగ దొమ్మిగూడి తనపై నడరిన నాఱులక్షలును నలుబదివేల సంఖ్యలం దగు క్షత్రియోత్తముల ధనుర్విద్యాకౌశలంబు మెఱయం దునిమి, మఱియును బ్రాహ్మణ ద్రోహులును, బాహుబలశాలులును నగు పదునాలుగువేల రాజుల నాజిరంగమ్మునం దెగటార్చి, యనంతరంబ పదివేవురు భూపతులం బిలుకుమార్చి పదంపడి వేవురు నృపతుల ముసలంబునకు నశనంబుగావించి, మఱియును వేవురునరేంద్రులం గృపాణధారాభివంతులం గావించి, మఱియుం జతుర్దశసహస్రసంఖ్యలం గల ధరాధిపుల రూపుమాయించి, తక్కునుంగల భూపతులు బ్రాహ్మణులం బాధింప వారలందఱునుం జనుదెంచి, భృగునందనా! క్షత్రియులవలనం బీడితుల మగు మమ్ము రక్షించుమని యాక్రోశనంబు గావించిన, నయ్యార్తనాదంబు విని సహింపంజాలక మించినకోపంబున జైత్రయాత్ర వెడలి, కాశ్మీర, దరద, కుంతి, క్షుద్రక, మాళవ, శక, చేది, కాశ, కరూశ, ఋషిక, క్రథ, కైశికాంగ, వంగ, కళింగ, మాధవ, కాశికోసలదేశాధీశ్వరులను, రాత్రాయణ, వీతిహోత్ర, కిరాత, మార్తి, కాతవ ప్రముఖులను, మఱియునుంగల వేలకొలందులగు మనుజేంద్రులను నిశితశస్త్రాస్త్రంబుల జముని సదనంబునకుం

బనిచి, యివ్విధంబున నిరువదియొక్కమారు నిఖిల క్షత్రియులం బంచత్వంబు నొందించి, మేరుమందర శైలసమేతం బగు ధరాతలంబంతయును క్షత్రియరహితంబు గావించి, యింద్రగోపంబుల బంధుజీవకుసుమంబులం గెంజాయల మిగుల రంజిల్లు నెత్తురులవలన బహుప్రవాహంబులును సరోవరంబులును నాపాదించి తన్మధ్యంబున నవగాహనంబొనర్చి చతుస్సముద్ర ముద్రితంబును, నిష్కల్మషంబును, నిరుపద్రవంబును నగు ధరణీమండలంబు పదునెనిమిదిమూరలందనరి, స్వర్ణమయంబును, కతిపురుషంబును, జతుగాత్రప్రమాణంబును నగు వేదికం గాశ్యపునకు నొసంగెనని తూర్యులు గాథలుగా నెఱింగింతురు. పదంపడి మఱియు నివ్విధంబున ననేకాధ్వరంబులు భూరిదక్షిణాసహితంబులుగ గావించి, యతండు నభోమార్గంబునం దిరిగెడు సౌభపురంబు నకు నధ్యక్షుం డగు సాళ్వునిపై దివ్యరథారూఢుం డగుచు నడరి శతసంవత్సరంబులు దారుణం బగు రణంబు గావింపుచునుండ, దేవతాకన్యకలు ఖేచరమార్గంబుననుండి యారామును ద్దేశించి, భృగునందనా! నీవు భృగువంశకీర్తి వర్ధనుండవు. ఇటమీంద ద్వాపరంబునం జక్రగదా ప్రముఖ దివ్యాయుధధరుండును, దీనసంరక్షకుండునునగు కృష్ణుండు ప్రద్యుమ్న సాంబసమేతుండగుచు నీసాల్వుని సౌభకంబును సమయింపనున్నవాండు. ఇపుడు నీచే నిహతుండుగాండు. కానశస్త్రాస్త్రంబు లుజ్జగింపుము. అనినవారలవాక్యంబు లాకర్ణించి కాంగల కార్యంబట్లయగుటయెఱింగి, సమర్థుండయ్యు నతని వధింపనొల్లక, రథంబును, గవచంబును, నాయుధంబును, బరశువును, శరంబులును, చాపంబును, జలమధ్యంబుననునిచి, హ్రీయును, శ్రీయును, బ్రజ్ఞయును, గీర్తియును, తేజంబును, గలిగి మహారణ్యంబున కేంగి నిష్ఠాగరిష్ఠుండగుచుం దపంబొనరించె. మహానుభావుండును, ఋషిశ్రేష్ఠుండును, సకలలోక ప్రసిద్ధుండును

నగునట్టి జమదగ్ని నందనుండన నీగోవిందునియంశ భూతుండని యెఱుంగుము.

ఈకథ సభాపర్వంబున నేంబదిమూండవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 54

---

అని భీష్ముండు ధర్మనందనుం గనుంగొని, మఱియుం దొలుత యిరువదినాలవయుగంబునం జైత్రమాసంబునందుం బునర్వసునక్షత్ర సమేతంబగు నవమీదినంబున నవ్యయుండును, శాశ్వతుండును, విశ్వ వ్యాపకుండును నగు విష్ణుదేవుండు నిజదివ్యస్వరూపంబు నాలుగు భావంబులుగ దశరథనందనుండగుచు నవతరించి కోటిసూర్య ప్రభా భాసమానుండగుచు రామనామధేయం బంగీకరించి జగత్ప్రసిద్ధుండ గుచు మెలంగె. ధర్మనందనా! ఆరఘువీరుని నిఖిలలోకేశ్వరుండగు కృష్ణునిమూర్తిగా నెఱుంగుము. మఱియు నారాఘవుండు విశ్వా మిత్రమునీంద్రుని యాగంబులకు విఘ్నంబాచరింపుచున్న సుబా హుని నిహతునిం గావించి మారీచునిం బలాయితునింజేసి, కౌశిక మునీంద్రునివలన నిఖిల శత్రువినాశకారణంబులును నప్రతి హతంబు లునునగు దివ్యశస్త్రాస్త్రంబులు వడసి, మహానుభావుండగు జనక భూపాలుండుగావించు యాగంబు గనుంగొనవలయునను కుతూ హలంబున గాధినందనుని పిఱుందనరిగి, శ్రేష్ఠంబగు గిరీశ చాపంబు లీలామాత్రంబున భగ్నంబొనర్చి నిఖిలగుణ విఖ్యాతయగు సీతాలతాంగినిం బరిణయుండై మఱలి జానకీ సహితుండగుచు సాకేతపురంబున కరిగి ప్రమోదభరితమానసుం డగుచు నిష్టభోగానుభవంబునం గొంతకాలంబు వసియించి, యనంత

రంబకై కేయీప్రేరితుండగుచు దశరథుండుపనుపం బితృవాక్యపరిపాల నంబు గావింపవలయునను తలంపున సాక్షాత్కరించిన లక్ష్మీదేవి యగు సీతావనరుహాక్షియును బ్రియసహోదరుండగు లక్ష్మణుండును, వెంబడిం జనుదేర, సకలభూతహితుండును నిఖిలధర్మజ్ఞుండును నగు రఘునందనుండు నిఖిలదుష్టమృగశరణ్యంబగు దండకారణ్యంబునకుం జని, పదునాలుగుసంవత్సరంబులు వనంబున మెలంగునెడ జనస్థానంబున దేవకార్యార్థంబుగ వసియించి రావణానుజయగు శూర్పణఖ యను రాక్షస వనితను నాసికాచ్ఛేదంబు గావించి, దానివలన బ్రేరితులగుచు సమరంబున కరుగుదెంచిన భువనభయంకరులగు ఖరదూషణత్రిశిరులు మొదలుగాంగల చతుర్దశసహస్రసంఖ్యలం గలుగు రక్షోవీరభటుల చటుల పరాక్రమ సమేతుండగుచుం దక్షణంబునం దెగటార్చి, పేర్చిన రోషావేశంబున నతిరిచుండగు మారీచునిం దునిమి, రావణ మాయా మోహితుండగుచు జనకజం గోల్పడి యా వనితామణిన్ వెదకుచు వనంబునన్ జనుదెంచునెడ, శాపగ్రస్తులగుచుం గబంధవిరాధనామ ధేయంబుల జనియించిన గంధర్వులకు శాపవిమోచనంబు గావించి, యట కదలి ఋశ్యమూకంబునకుం జేరి పంపానది నతిక్రమించి నిఖిల గుణవంతుండగు హనుమంతుని వచనప్రకారంబున సుగ్రీవునితోడ మైత్రివాటించి, కిష్కింధానగరంబునకుం జని సంక్రందననందనుండగు వాలినొకకోలం గూలనేసి బలపరాక్రమశాలియగు సూర్యపుత్రుని గపి రాజ్యంబునకుం బూజ్యునిం గావించి, పవననందనుని వలన సీతా వృత్తాంతం బంతయును నెఱింగి వానరసేనాసమేతంబుగా నడచి జల నిధిబంధించి, శత్రుభయంకరంబగు లంకాపురంబుపై వనచరసైన్యంబు విడియించి, దేవగంధర్వపన్నగుల వలనను యక్షరాక్షసపక్షిగణం బుల వలనను నవధ్యుండును, దుర్జయుండును, దుర్నిరీక్షుండును, త్రిలోకకంటకుండును, వరదానగర్వితుండును, భీకరాకారుండును,

నంజనాచలోపమానగాత్రుండును నగు దశకంఠుని బుత్రమిత్రా మాత్యసహితంబుగా రణరంగంబునం గీటణంచి, వినయభూషణుండగు విభీషణునికి దేవత్వం బొసంగి లంకారాజ్యంబునకుం బట్టంబు గట్టి, సీతాసమేతంబుగ బుష్పకారూఢుండై సమస్తవాహినీపరివృతుండగుచు నయోధ్యాపురంబునకుం,జనుదెంచి నీతిమార్గంబున బ్రజాపరిపాలనంబు గావింపుచు, మధుపుత్రుండును, మహాబలుండును నగు లవణాసురుని శత్రుఘ్నునిచే సంహారంబు సేయించి, మఱియును లోకహితార్థం బుగా దుష్టనిగ్రహం బాచరింపుచు, శాస్త్రోక్తప్రకారంబున శతాశ్వ మేధంబు లొనర్చి దేశంబులేలుచున్న తఱి నతని రాష్ట్రంబున నశుభ వాక్యంబులు వినంబడుటయును, నాపదలు సెందుటయును, నపమృత్యు భయంబును, జలాగ్నులవలనం గలిగెడుభీతియును, జతుర్వర్ణంబుల సంకరంబును, బలిమింజేసి కప్పంబుగొనుటయును, జారత్వంబును నేపట్టునం గలుగదయ్యె. చాతుర్వర్ణ్యంబును, యథోక్తవర్తనంబులం బ్రవర్తిల్లుచుండె. మఱియును సకలజనంబులును, నాయుర్వృద్ధి సూచకంబులగు నుచ్ఛ్వాస నిశ్వాసంబులు సమంబుగా నడువ నరోగదృఢ గాత్రులై పుత్రసహస్రపరివృతులును, సహస్రవర్ష జీవులును నగుచు సంతుష్ట హృదయులై యుండిరి. దేవఋషి గణంబులకు నయ్యెయెడల మనోహరంబులగు నివాసస్థానంబులు గలిగియుండె. భూసురోత్తము లెల్లను జతుర్వేద సంపన్నులై యుండిరి. నిఖిలభూప్రజలును బ్రహ్మ నిష్ఠులై నిజధర్మాసక్తులగుచు వసించిరి. నీలమేఘశ్యాముండును, యౌవనాభిరాముండును, నరుణకమలపత్రాక్షుండును, భద్రదంతావ ళంబు చందంబున మహోన్నతుండును, నాజాను దీర్ఘబాహుండును, బ్రసన్న వదనుండును, సింహస్కంధుండును, మహాబలుండును, దయా సముద్రుండును నగురామభద్రుండు రాజ్యంబు పరిపాలించు సమ యంబున నిఖిలజనంబులును సకల వ్యాపారంబులందును సారెసారెకు

నామోచ్చారణంబొ తక్క వేరొండెఱుంగక యఖిల ప్రపంచంబును, రామాత్మకంబుగం దలంపుచుండిరి. ఇవ్విధంబున రఘువల్లభుం డిక్ష్వాకుకులంబున నవతరించి యఖిలదేవతా ద్రోహుండును, పరాక్రమధురంధరుండును నగు దశకంధరుని బంధుజన సమేతంబుగ సమయించి సమస్తలోకంబులకుం బ్రమోదంబావహిల్లంబదునొకండు వేల సంవత్సరంబులు ధరాసంరక్షణంబుగావించె. ఇది కోదండదీక్షా గురుండును, ననంతకల్యాణగుణాభిరాముండును, మహాబల శౌర్య ధుర్యుండును, దివ్యతేజోవిరాజమానుండును నగు రామచంద్రుని దివ్యావతార మహత్వంబు. మహానుభావుండగు నారాయణుం డిరువై యెనిమిదవ యుగంబునద్వాపరంబున నాపన్నశరణ్యుండును, శత్రు భయంకరుండును, శ్రీవత్స లక్షణ లక్షితుండును, మనోహరాకారుండును, శంఖ చక్ర గదాంధరుండును నగుచు భూభారంబు మాన్పందలంచి వృష్ణివంశంబున వసుదేవకుమారుండునునై యుద్భవించి లోకప్రసిద్ధంబుగా శ్రీకృష్ణనామధేయం బంగీకరించి, మహేంద్రార్జునబలరాములకు విరోధులగు వారలం దెగటార్చి మహీమండలంబున రాజులై జనియించిన కంసాదిదుష్టరాక్షసుల హింసించె. ఇది భువనరక్షణార్థంబుగ వాసుదేవుం డంగీకరించిన ప్రాదుర్భావంబు. ఇంక నిటమీంద ధర్మంబు శిథిలంబైయుండెను. కలియుగాంతంబున ననేకపాషండనిగ్రహంబును, ధర్మసంస్థాపనంబున భూసురపోషణంబునం గావించుటకై కైటభాంతకుండు విష్ణుయశోనామధేయంబున గల్క్యవతారంబు ధరించంగలవాండు. ఇపుడు నేంజెప్పినవియును మఱియును దేవతాసహితంబుగా ధరణీతలంబున నవతరించిన నతని ప్రాదుర్భావంబు లపరిమితంబులని పురాణంబులం బలుకంబడు.

ఇది సభాపర్వంబున నేంబదినాల్గవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 55

అనిన గాంగేయునిం గనుంగొని కౌంతేయాగ్రజుండు, మహాత్మా! విష్ణుండు కృష్ణుండై వృష్ణివంశంబునం జనియించిన తెఱంగున నతండు బాల్యంబు మొదలుగ నాచరించిన యద్భుతకృత్యంబులును విన వేడుకై యున్న యది. సవిస్తరంబుగ వివరింపు మనిన దేవవ్రతుండు నతని నుద్దేశించి, పూర్వకాలంబున నొకకృతయుగంబునందు సకల లోకభయంకరంబగు తారకామయంబను యుద్ధంబున విరోచనుండును, మయుండును, దారుండును, వరాహుండును, శ్వేతుండును, లంబుండును, గిశోరుండును, స్వర్భానుండును, నరిష్టుండును, క్షురుండును, విప్రజిత్తియును, బలంబుండును, వృత్రుండును, జంభుండును, వలుండును, నముచియును, గాలనేమియును, బ్రహ్లాదుండును, మొదలుగాం గల యనేక దైత్యదానవవీరులు బహువిధంబులగు నాయుధంబులు ధరియించి వివిధవాహనారూఢులగుచు సమరసన్నద్ధులై దేవతాసైన్యంబున కభిముఖంబుగ నడువ, నాదిత్యులును, వసువులును, రుద్రులును, సిద్ధసాధ్యులును, విశ్వేదేవతలును, మరుత్తులును, నింద్రుండును, జంద్రుండును, యమవరుణకుబేరులును, నాశ్వినేయులును, మఱియును దక్కుంగల యమరవీరులు దైత్యవర్గంబుతోడం దొడరి యనేకశస్త్రాస్త్రంబులు నిగుడింపుచు భీమంబగు సంగ్రామంబొనరించుతఱి నాదేవాసురాహవంబు ఘోరంబై భువనభయంకరంబై చెల్లుచుండ నా సమయంబున దైత్యపుంగవులు పరాక్రమసమేతులగుచు నందఱు నొక్కపెట్ట నదరి బాణపరంపరల నిలింప సమూహంబులన్నొంపరలాడుచు, దేవగంధర్వసిద్ధసాధ్యచారణోరగ ప్రభృతి గీర్వాణసైన్యంబు దైన్యంబు నొంది భయభ్రాంతంబగుచు సమరసాధనంబులు వైచి నలుదిక్కులం

శౌదరిపఱచుచు, నార్తజనసంరక్షకుండును, సర్వవ్యాపకుండును నగు జనార్దనుని మనంబున సంస్మరించి, శంఖచక్రాది దివ్యాయుధ ధరుండును జగదీశ్వరుండును వాసుదేవుండు గరుడవాహనా రూఢుండై సాక్షాత్కరించినం గని భక్తపాలనపరాయణుండగు నారాయణునిం జూచి ప్రమోదంబునం బొందలుచు నమరవరులెల్లను వెఱపుదక్కి క్రమ్మఱ మఱలి దైత్యబలంబులతోడ నుక్కునందాకి యత్యాశ్చర్యకారణంబును దారుణంబునునగు రణంబు గావింప మహేంద్రప్రముఖులగు బృందారకుల క్రొత్తలకు సైరింపంజాలక కంపించుచుం గలంగియుం దొలంగియుం బెదరనియు, నలుగడలంబరచియు నిజసైన్యంబు దీనభావంబు నొందుటం బరికించి, శతకంధరుండును, శతబాహుసమేతుండును, శతవక్త్రుండును, ధూమ్రకేశుండును, హరిశ్మశ్రుండును, శతశీర్షుండును నగు కాలనేమియును, దనుజ పుంగవుండు శతశృంగంబులు గల శైలంబు చందంబున న్నిలిచి భూషణంబులొండొంటిం దాకి మ్రోయు మండ మార్తాండమండలంబు ననుకరించుట కిరీటంబు వెలుంగ శతభుజంబుల నాయుధంబుల ద్రిప్పుచుం దన శరీరంబు త్రైలోక్యంబు నావరింపం బెరిగి రోషావేశంబున నొడుకరచి విబుధవర్యుల నిలునిలుండని హుంకారంబుల నదల్చుచుం బ్రళయకాలంబున సకలభూతంబుల గ్రసింప వివృతాననుండై చను దెంచు నంతకుని చాయ్పునం దోచుచుం బ్రిదశనికరంబులం దాకొని నంతం దొలుతవిరిగి పఱచిన దనుజవ్రాతంబంతయు నతనిపిఱుందునం గూడందరవి సురనికరంబునకు దెప్పరంబగు సంగ్రామంబు గావించు సమయంబున సహస్రాక్షయమవరుణ వాయ్వగ్ని కుబేరసూర్యముఖ్యులగు దేవచమూపతుల నతుల పరాక్రమంబున నిర్జించి వారల స్థానంబు లాక్రమించి తేజరిల్లుచున్న కాలనేమి న భోమార్గంబునం గోటి సూర్యప్రకాశమానుండగుచు వైనతేయునిపై

నుల్లసిల్లుచున్న దానవాంతకుని వీక్షించి యెంతయుం గనరి క్రోధతామ్రాక్షుండగుచు నిజబాహుశతంబునం దేజరిల్లెడు నానా విధాయుధంబుల నొక్క మొగిన కైటభారి యురంబునం గుప్పింప మయుండు మొదలగు నతనితోడి దానవేంద్రులయ్యుపేంద్రునిపై ననేక శస్త్రాస్త్రంబులు నిగుడించిరి. ఇట్లు తన పయింబడు దైత్యుల బాణజాలంబులకు విరించిజనకుండించుకయును జలించక వర్షధారలచేం గులాచలంబు చందంబున నచంచలుండై నిలువరించినం జూచి మించిన కోపంబునం గాలనేమి కాలదండోపమానంబగు గదాదండంబు బిఱబిఱం ద్రిప్పి లక్ష్మీకాంతుని గరుత్మంతుని బ్రహరించిన సైరింపంజాలక యతని పెట్టున బిట్టుగలంగిన పక్షివల్లభునిం గనుంగొని, పద్మాక్షుండు కోపోద్దీపితుండగుచుం జక్రంబుచే గ్రక్కున నతని బాహుమస్తకశతంబులు దునిమివైచి పలాయితులగు మయుండును, విరోచనుండును స్వర్భానుండును, దక్కుందక్కిన దైత్య దానవసంఘంబులం దెగటార్చి దేవఋషి సందోహంబు లానందంబులం బొందల నిజస్థానంబులకుం బనిచి హిరణ్యగర్భసహితంబుగ సత్యలోకంబునకుంజని, యనంతరంబ నిఖిలమునిజనసేవ్యమానుండగుచు క్షీరాబ్ధిమధ్యంబు సంధింపుచు శ్వేతద్వీపంబున కేంగిసహస్రశీర్షుండగుచు శేషతల్పంబున శయనించి స్వకీయమాయాబలంబున నఖిలభువనంబుల మోహింపంజేయుచు మనుష్యమానంబున ముప్పదియాఱులక్షలగు సంవత్సరంబులు యోగనిద్ర గావించి ద్వాపరయుగాంతంబున మేలుకొని బ్రహ్మాదిదేవతలు బ్రశంసింప దేవకార్యార్థంబుగ మేరుశిఖరంబునం దేజరిల్లెడు దివ్యసభాభవనంబున కరిగి యందునిలుచుటయు నిఖిల దేవతలును బరివేష్టించియుండిరి. అట్టి సమయంబున సభాసదులు నిశ్శబ్దంబుగ నుండు నెడ భూమిదేవి చనుదెంచి బ్రహ్మాదులగు దేవతల నుపలక్షించి ఖేదసూచకంబులగు దీనవచనంబులతోడ, నో మహా

త్మకులార! బలవంతులగు మహీకాంతుల సైన్యసముదయంబుననగు మహాభారంబున మిగులం బరిశ్రాంతిం జెంది యతిప్రయత్నంబునం బ్రాణంబులు ధరియించి యున్నదాన. అది యెట్లంటేని యొక్కొక్కపురంబుననొక్కొక్కనృపాలుండుకోటిసంఖ్యాసమన్వితంబులగుసైన్యంబులతోఁడుబలసియున్నవాఁడు.ఒక్కొక్కగ్రామంబుననేకసంఖ్యాసమేతంబులగుగ్రామంబులచేనిబిడంబులగురాష్ట్రంబులవలననునాయెడసూదిమోపుటకేనియు నవకాశంబు లేకయున్నయది. కావున నిట్టి బహుజన సహస్రంబులవలన నగు భారంబు నే నిర్వహింపం జాలకున్నదాన. అదియునుంగాక దైత్యబాధలం బరితపించు ప్రజల దుఃఖంబు కనుంగొన నోపకున్నదాన ననిన నారాయణుండు భూదేవి వచనంబు లాకర్ణించి దేవతల వీక్షించి మీరు మీమీ యంశంబుల భూతలంబున జనియింపుండని పలికి తానును నవతరించుటకుం జిత్తంబునం దలంచుచుండె.

ఈ కథ సభాపర్వంబున నేంబదియొకవ యధ్యాయము

---

## అధ్యాయము 52

అని మఱియు దేవవ్రతుండు పాండవాగ్రజునిం గనుంగొని, మహానుభావుండగు నారాయణుండు వసుదేవకులంబున నవతరించి కావించిన విచిత్రంబులగు చరిత్రంబులును సకలలోకహితంబులై యుండు. అవియును నీ కెఱింగించెద. ఇవ్విధంబునం బలుకు భూదేవి దీనభాషణంబు లాకర్ణించిన నవ్వాసుదేవుండు స్వర్గసౌఖ్యంబు నెడ ననాదరంబు సేయుచు, భూజనంబులకు సౌఖ్యంబు గలిగింపందలంచుచు, మరుత్తులును, వసువులును, చంద్రసూర్యులును, గంధర్వులును,

నప్సరసలును, రుద్రాదిత్యులును, నాశ్వినేయులును, మొదలుగాంగల దేవతల దానవనిగ్రహార్థంబుగా క్షోణితలంబున జనియింపుండని నియమించి, మఱియు నిజాంశంబువలనం గొందఱం బుట్టించి మఱియునుం గొందఱం దిర్యగ్జాతులం బ్రభవించుమని పంచిన దైత్య దానవసంహారార్థంబుగ వారలందఱు నట్లన భూలోకంబున రాజులై జనియించి యుండునంత నిఖిలప్రాణిసంరక్షణార్థంబుగ యయాతి వంశ సంభవుండగు వసుదేవునకుం గుమారుండై యవతరించి ప్రేమాతిశ యంబున గోగణంబులం బరిపాలింపుచున్న యీ కృష్ణదేవుని మహత్వంబు దేంటపరచెద ఆకర్ణింపుము.

ఈ కథ సభాపర్వంబున నేంబదియాఱవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 57

---

అట్లు నారాయణుండును, దేవకీగర్భంబుననుండి యవతరించు సమయంబునం బ్రహ్మానందభరితంబులగుచు సముద్రంబులుప్పొంగె. శైలంబులు నర్తనంబులుగావించె. త్రేతాగ్నులు ప్రదక్షిణార్చులగుచుం బ్రకాశించె. శుభకరంబులగుచు ననిలంబులువీంచె. ధరాపరాగంబు లణంగె. గ్రహతారకాగణంబులు ప్రభాభాసురంబులయ్యె. నభంబున దేవదుందుభులు మిక్కుటంబుగ మ్రోసె. పుష్పవర్షంబులుగురిసె. గంధర్వగానంబులును నప్సరస్త్రీనటనంబులునుం జెలంగె. అత్తఱి నారద ప్రముఖులగు దేవఋషిముఖ్యులరుగుదెంచి శుభవాక్యమ్ముల నమ్ము రమర్దనుని బహువిధంబులం బ్రశంసించిరి. దేవగణపరివృతుండగుచు మహేంద్రుండేంగుదెంచి గరుడధ్వజుని నుపలక్షించి పలుదెఱంగుల నన్నుతింపుచు లోకహితార్థంబుగ దేవతాకార్యంబు లన్నియును

సంఘటించె, పదంపడి నిజస్థానంబునకు మగుడిరాంగలరని పలికి ఋషి జనసమేతుండై యమరావతికింజనియె. అంతనమ్మురాంతకుండు మహేంద్రప్రముఖులంబనిచి నిజదివ్యస్వరూపంబు మఱుగువడం జేయుచు నందగోపుని మందిరంబునం గొన్నిసంవత్సరంబులు వసి యించియుండె. అంతనొక్కనాంటి యశోదాదేవి నిజకుమారుండు శకటంబు క్రింద నిదురింపుచునుండనతనిందొరంగి యమునా నదికిం జనిన నబ్బాలకుండు నిదురమేల్కొని కరచరణంబులు విదుర్చుచు మధురస్వనంబున గానంబు గావింపుచు బాలలీలానుగుణంబుగ పదం బులున్నతంబులుగ సాంచి శకటంబునొక్క పాదాంగుష్ఠంబునందన్ని రెండవచరణంబున మహీతలంబునం బడంద్రోచి స్తన్యంబు నభిల షించు చందంబున నేడ్చుచుండె. అట్లుముకుందుని పదాఘాతంబునం భూతలంబునంబడి భిన్నభాండఘటంబగు శకటంబునుదన్నిదాన నించుకేనియును, వికారంబుజెందక యెప్పటట్లనయున్న బాలకునిం గనుంగొని సకల జనంబులును విస్మయంబుజెందిరి. మఱియు నతం డతిఘోరాకారయును మహాస్తనియునునగు పూతనయను భూత వనితంజంపి శిశువై శయనించి యుండి, పక్షినింబరిమార్చి, మఱికొన్ని దినంబులు జనినపిమ్మట రామకృష్ణు లిరువురుం జతగూడి నభంబున నన్యోన్య కిరణంబులవలన నావృతులగు చంద్రసూర్యుల తెఱంగునం దోంచుచు నల్లనల్లన జానుసంచారంబునం దిరుగుచుండి మఱికొన్ని దినంబులకు భుజంగ భోగోపమానంబు లగు భుజంబులు మెఱయం బాంసుక్రీడాసక్తులై విహరింపుచుం దదనంతరంబ పెరుగుచిలికెడు భాండసమీపంబునకేంగి దధిపానంబు సేయుచు మెలంగిరి. అంత గోవిందుండొక్కండు గోపికా గృహంబుల నవనీతంబుగైకొని వలయు నంతయు భక్షించినం గనుంగొని గోపవధూజనంబులు చిన్నికృష్ణునిం బట్టి యులూఖలంబునంగట్టిన నతండు రోలీడ్చుకొని యాసమీ

పంబున నున్న యర్జునవృక్షయుగంబు మధ్యంబునం బ్రవేశింపుచుండని వానిసమూలంబుగం బెకలించిపడవైచె. అంత నా రామకృష్ణులు బాల్యంబు నతిక్రమించి యేడేండ్లప్రాయంబు వారలగుచు నీల పీతాంబరంబులు ధరియించి యరుణ ధవళవర్ణంబులగు దివ్యగంధంబుల లంది, చలిది చిక్కంబును, నలాబుపాత్రయును బూని వనంబునం గ్రేపులన్ మేపుచు గ్రుమ్మరు సమయంబున నెమలిపింఛంబులు కర్ణావతంసంబుగ ధరియింపుచుం గెంజగురాకుగుత్తులును, బద్మమాలికలును, చిప్పకూంకటులం జుట్టుకొనుచు, వనమాలికలు ధరింపుచు, వత్సబంధ సూత్రంబుల యజ్ఞోపవీతంబులుగ వైచికొనుచుం, బర్ణవాద్యంబులు గావింపుచుం, బిల్లంగ్రోవులూదుచు, మఱియు నొక్కొక్క యెడ నవ్వుచు, గ్రీడింపుచు, నొక్కొక్కయెడం జిగురుంబొన్నలం బవ్వళిం చుచు, వేఱొక్కయెడ నిద్రించుచు, ఫలంబుల నుపయోగించుచుం బూదేనియలు గ్రోలుచు, నెందెందులందిరుగుచు, మహాభుజంగ యుగ్మంబు చందంబున వనంబునం దిమ్మరుచునుండి యంతనొక్క నాండు బృందావనంబునకుంజని గోగణంబుల మేపుచు నిజశరీర ఛాయలవలన వనంబు బ్రకాశింపంజేయుచు విహరింపుచుండిరి.

ఈకథ సభాపర్వంబున నేబదియేడవ యధ్యాయము

---

## అ ధ్యా య ము 58

అని గాంగేయుండు కౌంతేయునిం గనుంగొని పెండియు నిట్లను. అంత నొక్కనాండు మనోహరాకారుండును, మందస్మితముఖారవిం దుండును, గాకపక్షధరుండును, నిందీవరదళశ్యాముండును, బద్మ దళాయతాక్షుండును, బీతాంబరధరుండును, నిందీవరదళశ్యాముండు

ను, యవ్వనసమేతుండును, శ్వేతచందనచర్చితాంగుండును, నీలకుంజితకేశుండును, లతాయజ్ఞోపవీతుండును నగు కృష్ణుండు నిజవక్షస్థలంబున శ్రీవత్సంబు మెఱయం గళంకసహితుండగు పూర్ణశశాంకుని తెఱంగునం దోంచుచు శిరంబునం జెరివినమయూరపింఛంబు మందమారుతంబున నల్లనల్లనం గదలి గోపాలకసహితుండై బృందావనంబునకుం జని యొక్కయెడ గానంబు సేయుచు, నొక్కయెడం గ్రీడింపుచు, నొక్కచక్కి నృత్తంబు సలుపుచు, నొక క్రేవనవ్వుచు, నొకచెంత గోపాలకులకు సంతోషానుగుణంబుగా మధురస్వనంబున వేణునాదంబు సంఘటింపుచు బహువిధంబులగు బాలక్రీడలం బ్రవర్తిల్లుచు నుండె. అంతం గొంతకాలంబున వర్షాకాలంబున దోంచిన యదునందనుం డావులమందల పిఱుందం జని రమ్యంబులగు వనప్రదేశంబుల గోపాలకులుం దానునుం గూడి క్రీడింపుచు భాండీరంబను నొక వటవృక్షసమీపంబున కేంగి తొల్లిదివంబున దేవగణపరివృతుండై యుండు తెఱంగున గోపబాలకులు నలుగడలం బరివేష్టించి నిలువ నామహీరుహంబునీడన్ వసియించి యుండునెడం గొందఱు గానంబు గావించువారును, గొందఱు కిన్నరులు వాయించువారును, గొందఱు పర్ణవాద్యంబులు వాయించువారును, మఱికొందఱు పలుదెఱంగులం గ్రీడించువారును నగుచు నుండిరి. అందుం గొందఱమ్ముకుందుని చరిత్రంబులు గానంబు సేయుచునుండ ముకుందుండును దదనుగుణంబుగం బర్ణవాద్యంబును వేణువాద్యంబును గావింపుచుం గిన్నర మీటుచు వారలం గూడి బహువిధంబుల సకలజనంబులునుం గనుంగొనుచునుండ లోకహితార్థంబుగం గ్రీడింపుచునుండె. అంత యమునానదీతీరంబున కేంగి యందుంగల నీపవృక్షం బధిరోహించి హ్రదమధ్యంబునందు మిక్కి యచ్చటంగల కాళియుండను దుష్టభుజంగంబు నెల్లవారును గనుంగొనుచునుండ మర్దించి, తదనంతరంబ

బలరామసహితుండై తాళవనంబు బ్రవేశించునంత గర్దభాకారుం డగు ధేనుకాసురుండు దార్కొనిన బలదేవుండు వానింబట్టి సంహరించె. మఱియు రామకృష్ణులు తాము దేవశ్రేష్ఠులయ్యును మనుష్యలీలల నటించుటంజేసి తదనుగుణంబుగం గ్రీడింపుచు నొక్కనాండు గోపాలకులుందారును వనంబునకుంజని గోగణంబుల మేపుచు వాని వాని పేరు మోడింబిలుచుచుం బూంబొదల నిలుచుచు, మఱియు ననేక విధంబులగు లీలలం బ్రవర్తిల్లుచుం బశుపక్షిమృగంబుల తెఱంగునం గూయుచు నుండిరి. అంత సర్వాత్మకుండును సర్వేశ్వరుండును నగు కృష్ణుండు గోపకులు గోయజ్ఞంబు గావించుతఱిం దానొక దివ్యపురుషుండై పర్వత నివేదనార్థంబగు పాయసాన్నంబులు భుజియించిన గోపకులాహాసుదేవునిం గనుంగొని యతనికి సపర్య గావించిరి. అతండును వారలవలనం బూజితాంగుం డగుచు బాలుం డయ్యును గోవర్ధనపర్వతంబును, సప్తరాత్రంబులు కరాగ్రంబున ధరియించి గోసంరక్షణంబు గావించిన నయ్యద్భుతకృత్యంబు నిరీక్షించి సకలజనంబు లాశ్చర్యంబు నొందిరి. అంత మహేంద్రుం డరుగుదెంచి యానందనందనునకు గోవిందుండను నామధేయం బొసంగి యతనికిం బట్టాభిషేకంబుగావించి కౌంగిటం బొదివి మగుడ దివంబునకుంజనియె. తదనంతరంబ కృష్ణుం డొక్కనాండు వృషభాకారుండై చనుదెంచిన యరిష్టదైత్యుని మృత్యువునకుం బాలుపఱిచి నిఖలధేనుగణంబునకు హితంబు గావించె. మఱియు నొక్కనాండు కంసప్రేరితుండై ఘోరాకారంబునం జనుదెంచిన గజాయుతబలుండగు కేశియను దైత్యవల్లభుని ద్రుళ్లడంచి పదంపడి బలరామసహితంబుగ మధురాపురంబునకుం జని చాణూరముష్టికుల ముష్టియుద్ధంబున వినష్టంబు గావించి, గజోత్తమంబగు నైరావతంబునకు సమానంబైన కువలయాపీడంబను దంతావళంబును హింసించి, కంసానుజుండగు సునామునిం దునిమి

నిఖిలజనంబులు గనుంగొనుచుండం గంసునిం బరిమార్చి యుగ్రసేను నిం బట్టాభిషిక్తునిం గావించి, తమ తల్లిదండ్రులగు దేవకీవసుదేవు లకుం బ్రణామంబు లాచరించి, యివి మొదలగు నద్భుతకర్మంబు లొనర్చి బలరామసహితంబుగ నచటం గొన్ని దినంబులు వసియించె.

ఈ కథ సభాపర్వంబున నేంబదియెనిమిదవ యధ్యాయము.

---

## అధ్యాయము 59

---

అంత నమ్మహానుభావులవంతిదేశంబున కరిగి సాందీపని యను మునీంద్రునింగాంచి యతనికి శిష్యభావంబు లవలంబించి శుశ్రూషంగావింపుచు నుగ్రంబగు విద్యావ్రతంబున మెలంగుచు నఱువదినాలుగుదివసంబులలోన షడంగసహితంబులగు వేదంబు లభ్యసించిరి. మఱియు వారలు లేఖ్యశాస్త్రంబును, గణితశాస్త్రంబును, సమస్తంబగు గాంధర్వవేదంబును, గజతురగశిక్షాశాస్త్రంబును బండ్రెండు దినంబులలోన నభ్యసించి మగుడం జాపవిద్యావిశారదుండగు నతని సన్నిధానంబున ధనుర్వేదంబు నభ్యసించు నభిలాషంబునం జేరి యేంబది యహోరాత్రంబులలోన దశాంగసమన్వితంబును రహస్యంబునునగు ధనుర్వేదంబు సకలంబును సుప్రతిష్ఠితంబుగా నెఱింగిరి. అంత నవ్విప్రపుంగవుండు తన వలన నిఖిలవిద్యావిశారదులగు నా రామకృష్ణులం గనుంగొని గురుదక్షిణ యొసంగవలయునని వచింపుచు నందు గోవిందునిం గనుంగొని, ఓమహాత్మకా! తొలుత సముద్రంబులోన నొక మహామత్స్యంబు తన కుమారునిం బట్టి మ్రింగె. అక్కుమారుని నీవు మగుడ రావింప వలయునని దుఃఖార్తుండగుచు బ్రార్థించిన నతని వాక్యంబులు విని

లోకత్రయంబునందు నెవ్వరికి నలవిగాని యాకార్యంబు నిర్వహింతు నని గుర్వర్థంబుగం గృష్ణుండు ప్రతినంగావించె. అంత నయ్యాదు నందను లాచార్యకుమారఘాతకుండగు నిశాచరుని బాతాళలోకం బున సమరంబునం దునిమి పడవైచి యటనుండియును యముని పురంబు జేరి వైవస్వతునిం గెలిచిరి. అంత నమ్మహానుభావుల యను గ్రహంబునం దొలుత చిరకాలంబుననున్న గురునందనుం డెప్పటట్లన శరీరవంతుండయ్యె. అంత నా కుమారునిం దోడితెచ్చి గురువున కొసంగిన నశక్యంబును నచింత్యంబును నగు నయ్యద్భుతంబు గనుం గొని సకలజనంబు లాశ్చర్యంబునం బొదలిరి. మఱియు నమ్మహా త్ములు గోధనంబులును నశ్వంబులును గురుదక్షిణ గావించిరి. అం తం గృష్ణుండు మఱియును గదాపరిఘ సంగ్రామంబులును శస్త్రాస్త్ర ప్రయోగంబులును నేర్చి సకలలోకంబు లందు ముఖ్యుం డనంబరంగె. దివ్యరత్నఖచితం బును, సూర్యసంకాశంబును నగు మహేంద్రుని రథంబు నధిరోహించి వాసవునకుం బరమమిత్రుండును, సాంధ్యకుశలుండును నగు మా తలిహయంబులం గడప నపరివారుండును, సహోదరసహితుండును నగు కంసుని హింసింప నీపురుషోత్తమునికిం గాక యితరులకు సామ ర్థ్యంబు గలదె? అనినం గాంతేయాగ్రజుం డతని నిరీక్షించి బహు శస్త్రాస్త్రసంపన్నుండును, శౌర్యధుర్యుండును, నంధకవృష్ణిప్రభృతిసేనా సమేతుండును, గార్తవీర్యసమానుండును నగు భోజవిభునిం దాకి బాలుండును, శిక్షారహితుండును నగు నీకృష్ణుండు జయించిన వృత్తాం తం బంతయు సవిస్తరంబుగ నెఱింగింపు మనిన, సత్యవ్రతుం డతని కిట్లనుః అట్లు కువలయాపీడంబను గజంబునుం బరిమార్చిన యనంత రంబ, యింద్రుండు సకలశాస్త్రసంపన్నుండగు నిజస్యందనంబును, మఱియు ననేక దివ్యాస్త్రంబులును బనిచినం బ్రియంబందుచు రథా

రూఢుండై మాతలిసారథ్యంబు సేయుచుండం జనుచున్న సమయంబున నెవ్వని నిరీక్షించిన మహీపతు లెల్లను గరుత్మంతునిం గనుంగొనిన యురగంబుల తెఱంగునం బరతురో, అట్టి యుగ్రసేననందనుండు ఖడ్గకార్ముకప్రాసనిస్త్రింశ ప్రముఖంబులగు నాయుధంబులు ధరియించిన పదాతు లొకకోటియును, శూరాగ్రేసరులై రణంబున వెనుకతీయని సేనాధిపతు లెనిమిదిలక్షలును, రత్నకాంచన ధ్వజకక్ష్యాలంకృతంబులును, మదోత్కటంబులును నగు భద్రదంతావళంబు లెనిమిదిలక్షలును, నానాభూషణభూషితంబులును, నతివేగసమేతంబులును నగు నొక్క పడియేనుంగులు పదియాఱులక్షలును, పర్వతోపమానంబులును, ధ్వజపతాకాశోభితంబులును నగు కాంచనరథంబు లెనిమిదిలక్షలును, మోదుగుజాయలం దురంగలించు తురంగంబులు పదియాఱువేలును, మఱియును సునాముండు మొదలగు నతని సహోదరులధివసించి వచ్చిన కిశోరాశ్వంబులు పదియాఱువేలును, నానావిధవర్ణంబులు గల హయంబులను, ఫేనంబులను, నశ్వారోహకుల వేగంబును జలంబును, గదాపరిఘంబులను మీనంబులును, గవచంబులను శైవాలంబులును, భద్రగజంబులను గ్రావంబులును, శస్త్రసమూహంబులను ఫేనంబులును, రథచక్రంబులను నావర్తంబులును, వీరభటసింహనాదంబను మహాధ్వనియును, గార్ముకంబులను కల్లోలంబులును, రథాశ్వంబులను హ్రదంబులును, రుధిరంబను కర్దమంబును, గంసరోహంబను మహావేగంబునుం గలిగి యతిఘోరంబగు సైన్యంబను మహానదిం బ్రవేశించి కలంచుటకు నీకైటభాంతకునికిం దగెంగాక యన్యుల కలవియగునె? వినుము. అట్టి సేనాసముద్రంబునడుమం దన యరదంబు బరపించి ప్రళయజంఝామారుతంబు జీమూతనికరంబుల విరియించు చాడ్పున యోధాగ్రేసరులం బడలువడం జేయుచుం గదిసి కంసుని బుత్రామాత్యసహితంబుగ సంహరించి సకలజనంబులకు హృద

యానందములు గావింపుచు, బంధుజనసమేతయును బూజార్హయును నగు దేవకీదేవికి, రోహిణికి, యశోదకు సారెసారెకు నభివాదనంబు గావించి యుగ్రసేనునకుం బట్టంబు గట్టి యాదవముఖ్యులందఱును దన్ను బహుమానంబు గావింప మఱియు ననేకాక్షౌహిణీపరివృతుండై చనుదెంచిన జరాసంధుని సరస్వతీతీర్థంబునం గెలిచె. అట్టి మహాత్వంబు గొనియాడ నెవ్వరికి నలవియగు?

ఈకథ సభాపర్వంబున నేంబదితొమ్మిదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 60

---

అని భీష్ముండు మఱియును ధర్మనందనుం గనుంగొని, అంత నయ్యదునందనుండు శూరసేనపురంబునం బరిత్యజించి ద్వారకానగరంబునకరిగి సుఖంబుననున్న సమయంబున వరదాన గర్వితులగు దైత్యదానవు లుపద్రవంబు మొనరింపుచుం దొడరి మహాహవం బొనర్చిన నందఱం దెగటార్చె. మఱియును నరకుండను నసురపుంగవుండు భూగర్భంబున వసియించి నిజశౌర్యప్రభావంబున దేవతలకు భయంబు గావింపుచు, మహామునీంద్రుల మర్త్యులం బీడింపుచు, ద్వారకానగరంబునకు బాధ యొనర్పుచు, నొక్కనాండు గజరూపంబున నేంగి విశ్వకర్మకుం బదునాలవ కూంతురును మనోహరాంగియునునగు కశేరువను కన్యకం గైకొని యచ్చట నున్నవారలందఱం బిలుకుమార్చి నిర్భయుండగుచు బలాత్కారంబున నిజపురంబునకుం దెచ్చి దాని నుద్దేశించి యీ భూమండలంబున సముద్రమధ్యంబును దేవతాలోకంబునను గల ధనంబును దివ్యరత్నంబులును నేండు మొదలుగ నీకుం గానుకగా తెచ్చి యొసంగుమని నా వీరభటుల నియో

గించితినని పలికి యట్లన సకలలోకంబులంగల మణినికరంబులను దెచ్చి దానికి నొసంగుచు మఱియు నతండు సౌందర్యవతులగు దేవగంధర్వ మనుష్యకన్యకలను సమస్తవిధంబులగు నప్సరోగణంబులునుం గూడం బదియాఱువేలను నూర్వురు భుజాబలంబున బట్టితెచ్చి వారలందఱకును మణిపర్వతంబున నివాసంబు గావించి యునిచిన వారును నేకవేణీధరలగుచు ధర్మమార్గంబున మెలంగుచునుండిరి. యాదకదుర్గంబగుస్థలంబునం గనుపట్టు ప్రాగ్జ్యోతిషంబను నగరంబున మురాసురుండును, నతని కుమారదశకంబును, మఱియు ననేక దైత్యదానవముఖ్యులుం గొలువ నక్కన్యకలం బాలింపుచు నుండె. వెండియు నతం డుగ్రంబగు తపంబుగావించి వరంబు జెందిన యతిశయంబున దేవమాతయగు నదితి నవమానించి యా దేవి కుండలంబులు గైకొని తెచ్చె. అట్టి క్రూరకర్మంబులుచేసిన దానవులు మున్నెవ్వరేనియునుం గలరె? సమరకర్కశులును, నిర్జరభయంకరులును నగు నసురవీరులు గొలువ నన్నరకాసురుండును, హయగ్రీవుండును, నిశుంభుండును, బుత్త్రసహస్త్రపరివృతుండగు మురుండును, బంచజనుండును ననునామధేయంబులుగల నలువురు ప్రాగ్జ్యోతిషపురంబు నాల్గు సరుదుల వసియింపుచు దేవలోకపర్యంతంబునకు నాక్రమించి తన్ను సేనాధిపతులునుం గొలువం బ్రాగ్జ్యోతిషంబున వసియించియుండె. భూగర్భంబునం జనించి త్రిలోకభీకరుండై ప్రవర్తిల్లెడు నట్టి నరకాసురునిం బరిమార్చి శంఖచక్రగదాద్యాయుధధరుండై వృష్ణివంశంబున వసుదేవునివలన దేవకీగర్భంబున నవతరించి జగత్పూజ్యుండును, బురుషశ్రేష్ఠుండును ననంబఱంగు శ్రీకృష్ణున కింద్రనగరంబులకన్నను మనోహరంబగు ద్వారావతిముఖ్య నివాసంబై యుండునది నీవెఱింగినదియ. అట్టి ద్వారకాపురంబున యోజనప్రమాణదైర్ఘ్యంబును విస్తారంబునుం గలిగి యొకసభాభవనంబు ధర్మాభిధానంబున మిగులం బ్రకాశింపుచు

నుండు. దాని నీవును గనుంగొనియున్న వాఁడవు. ఆసభామధ్యంబున నంధకవృష్ణివీరులు సేవింప బలరామసమేతుండగుచు వాసుదేవుం డొక్కనాం డిష్టకథాగోష్ఠిం బ్రవర్తిల్లుచుండెడు సమయంబునం దొలుదొలుత దివ్యగంధసమేతంబులగు మందమారుతంబులు వీతెంచె. పదంపడి పుష్పవర్షంబులు గురిసె. అనంతరంబ నభంబున సహస్రార్కసంకాశంబగు నొక్క దివ్యతేజంబు దోంచె. ఆవెంబడి నాదివ్యతేజోనివహంబు ముహూర్తమాత్రంబునకు భూతలంబునకుం దిగియె. అట్టి తేజోరాశిమధ్యంబున నిఖిలదేవతాగణంబులు గొలువ నైరావతారూఢుండగుచు మహేంద్రుండు గనుపట్టె. అంత రామకృష్ణులు సకలయాదవపరివృతులగుచు నుగ్రసేనపురస్సరంబుగా నమస్కరింప నతండును నైరావతంబు డిగ్గి చనుదెంచి వాసుదేవబలదేవులనుగ్రసేనునిం గౌంగిటం బొదివి, వసుదేవుండును, నాహుకుండును, సైతద్రుండును, బ్రద్యుమ్నుండును, సాంబుండును, నిశఠుండును, ననిరుద్ధుండును, సాత్యకియును, గదుండును, సారణుండును, నక్రూరుండును, భానుండును, ఝల్లియును, విదూరథుండును, గృతవర్మయు, జానుధేష్ణుండును సనువారలం గ్రమంబునం గౌంగలింపుచు, వారలొసంగు పూజ లంగీకరించి సుఖాసీనుండై కృష్ణునుద్దేశించి మీజననియగు నదితిం బనుపం జనుదెంచితి. ఆదేవికుండలంబులు నరకుండు హరించి తెచ్చె. ఈలోకంబునకు నతం డధీశ్వరుండై ప్రవర్తిల్లెడు. కాన నీ భూపుత్రునిం దెగటార్పుము.

ఈకథ సభాపర్వంబున నఱువదవ యధ్యాయము.

---

## అధ్యాయము 61

అని మఱియును శంతనునందనుండు కౌంతేయాగ్రజున కిట్లను. అవ్విధంబునం బలుకు పురందరునివాక్యంబు లాకర్ణించి సంతుష్టహృదయుండగుచు మహాభుజుండును, తేజోధురంధరుండును, నజేయుండును, యదువంశదీపకుండును, వైరిభయంకరుండును, దేవకీనందనుండునునగు చక్రిధరుం డట్లన భూపుత్రుండగు నరకాసురుం డెగటార్చి కుండలంబులు గొనితెచ్చెదనని నిర్జరేశ్వరునితో సవినయంబుగం బలికి బలభద్రుండును, బ్రద్యుమ్నుండును, ననిరుద్ధుండును, సాంబుండును మొదలగువారలకు నెఱింగించి, శంఖచక్రాది దివ్యాయుధంబులు ధరించి గరుడవాహనారూఢుండగుచు మహేంద్రప్రముఖబృందారకులు సంతోషభరితులై ప్రశంసింపుచు వెంబడిం జనుదేర దేవకార్యార్థంబుగ నరిగి యత్యుగ్రులును నరకాసురసైనికులును నగు వీరభటుల ననేకులం దునుమాడి, యటనడచి క్షురాగ్రంబులును, షట్సహస్రసంఖ్యాకంబులును నగుమురాపాశంబులు దివ్యాస్త్రంబునం ద్రెంచి, సపరివారుండై వచ్చి తాకిన మురాసురుశిరంబు నఱికి, శిలాసంఘంబులు గడచి, నిశుంభుండను రాక్షసునిం బిలుకుమార్చి, పటుభుజాబలపరాక్రమశాలియును, సహస్రాసురసమానబలుండును, నిర్జరభయంకరుండును నగు హయగ్రీవుండను దానవునిం దునిమి, మోహితగంగానది మధ్యంబునం గల యౌాదకంబను పురంబున నున్న విరూపాక్షునిం బొరిగొని, ఘోరాకారులగు పంచజనులను నామధేయంబులు గల యేవురు మహాసురులం బంచత్వంబు నొందించి, యట కదలి మహనీయ ప్రభాభాసమానంబగు ప్రాగ్జ్యోతిషపుర సమీపంబునకుం జని, మున్నెన్నండును దేవాసురులకు నిట్టి సంగ్రామంబు లేదనంజాలి యతివిస్మయకారణం బగు దారుణ

రణంబునం జక్రలాంగలంబులవలనను శక్తిఖడ్గప్రముఖాయుధం బులవలనను నెనిమిదిలక్షల దానవులనుంబడలుపఱిచి పాతాళబిలంబు బ్రవేశించి యమరభయంకరుండగు నరకాసురునిందాకి పూర్వకాలంబున మధుదైత్యునితో సమరంబు గావించిన తెఱంగున భీమంబగు సంగ్రామంబు ముహూర్తమాత్రంబు గావించి సైన్యంబులనెల్ల నిశ్శేషంబుగ సమయించి సహస్రధారావిరాజమానంబగు చక్రంబున నతనిమస్తకంబు దునిమె. అది వజ్రప్రహారంబునంగూలు వృత్రాసురుని శిరంబు చందంబునంబడియె. ఇట్లు తెగిన కుమారునిం గనుంగొని భూదేవి కుండలంబులు గైకొని తెచ్చి కృష్ణునకు నొసంగి, దనుజభంజనా ! ఈ నరకాసురునిం దొలుత నీవే సృజియించి పదంపడి నీవ సంహరించితివి. నీకు దోంచినట్లు ప్రవర్తిల్లుదువుగాక. ఇతని పుత్రులం బరిపాలింపుము. అనిన మహీమహిళం గనుంగొని యావాసుదేవుండు దేవముని పితృభయంకరుండును, బ్రాహ్మణద్రోహియును, బురుషాధముండును, సకలలోక కంటకుండును నగు నీకుమారుండు, నిఖిలజగత్సామ్రాజ్య యగు నదితికి నుపద్రవంబు గావించి యాదేవి ధరించియుండెడు కుండలంబులు గొనితెచ్చె. కావున నీమదాంధుని సంహరించితి. ఇట్లొనరించితినని నీవు నాయెడం గోపింపకుము. భవత్పుత్రునకు నుత్తమంబైన పదంబు భావత్ప్రభావంబున నొసంగితి. నీభారంబును దీరె నని వలికె.

ఈ కథ సభాపర్వంబున నఱువది యొకటవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 62

---

ఇవ్విధంబున సత్యభామా సహాయుండగు నాకృష్ణుండు ధరణీ నందనుండగు నరకాసురు సంహరించి, యింద్రాది గోపాలకులు పరి

వేష్టింపం బ్రాగ్జ్యోతిషపురంబునకుం జని నరకాసురుని మందిరంబుం బ్రవేశించి యయ్యెడ నపరిమితంబగు ధనంబును, ననర్ఘ్యంబులగు పద్మరాగంబులును, ముక్తామణి ప్రవాళంబులును, వైడూర్యంబులును, జంద్రప్రభానిభంబులగు స్ఫటికోపలంబులును, నగ్నిజ్వాలాసమానంబులగు కాంచనరాసులును గనుంగొని స్వర్ణవర్ణరుచిరంబును ముక్తామణిమయంబును నగు నతని యభ్యంతర గృహంబు నిరీక్షించి కుబేర సదనంబునం దేనియు, వాసవపురంబుననేనియును, గనంబడని యనేక రత్న కాంచన సంచయంబు లయ్యెడం దిలకించె. అంత నిట్లు నరకాసురాదుల సంహరించి కుండలంబులు గైకొనియుండెడు పుండరీకాక్షు నుద్దేశించి సహస్రాక్షుం డీనానావిధంబులగు మణిరత్న సువర్ణంబులును, మఱియును హేమసూత్ర సమేతంబులును, దోమర సహితంబులును, శౌర్యవంతంబులును, భీకరాకారంబులును, బ్రవాళభాసుర కుథాలంకృతంబులును, విచిత్రాంబరవిరాజితంబులును, విమలపతాకా భూషితంబులును నగు నిరువదివేలు భద్రవంతావళంబులును, నలువదివేలు పిడియేనుంగులును, మనోజవంబులు గల యెనిమిది లక్షలు జాత్యశ్వంబులును, ఘోరథంబులును, మృదులంబులగు రత్నకంబళ విశేషంబులును, గనక నిర్మితంబులగు శయనాసనంబులును, వలసిన తెఱంగులం బలుకుచుం జూడ వైదుకమ్మైయుండు శుకశారికాది పక్షిగణంబులును, జందనాగరు మిశ్రితంబులగు బహువిధయానంబులును, నియ్యెడ నున్న యవి. వీని రాజధర్మ ప్రకారంబున నీ వార్జించుటం జేసి వృష్ణివరులకు నివాసంబగు ద్వారకానగరంబునకుం బనిచెదనని దేవగంధర్వ దైతేయాది లోకంబులం జయించి గైకొనిన నరకాసురుని గృహంబున నున్న యమూల్యంబులగు రత్న నికరంబు లన్నియును గరుత్మంతుండు గొనితేర జిష్ణుండు కృష్ణ సమేతంబుగం గదలి మణిపర్వతంబునకుం

జని పరిమళవంతంబులగు మందమారుతంబులును, బహు రత్నప్రభా విశేషంబులునుం గలిగి చంద్రాదిత్యుల, దేవ ఋషి గణంబుల ప్రభల నావరింపం జాలిన తేజంబునం దనరారుచు, విచిత్రంబులగు మేఘ బృందంబుల వలన నావృతంబగుచు, స్వర్ణమయంబులగు పతాకాని కరంబులచే నభిరామం బగు ప్రాసాదంబులవలనం దేజరిల్లుచు నుం డెడు నాపర్వతంబున నందఱు విస్మయవంతులై కనుంగొనుచునుండ బలరామవాసవులచేత ననుజ్ఞాతుండగుచు, ముదితహృదయుండును, భుజాబలశాలియును నగు యదువల్లభుండు మణిపర్వతంబునకుం బోయి, వైడూర్య నిర్మితంబులును, దోరణపతాకాలంకృతంబులును, నగు ద్వారంబులు గల గృహంబులును, నతివిశాలంబులును, రత్న సోపానఖచితంబులును నగు హర్మ్యంబులునుం గనుంగొని యయ్యెడ వసియించి యుండెడు నేక వేణీధరలును, రక్తాంబరధారిణులును, వ్రత నిరతులును, సువర్ణవర్ణాంగులును నగు దేవగంధర్వాసురనృపకన్యక లతనిం గనుంగొనిన మాత్రంబున వ్రతశోక దైన్యంబులు దొలంగ సకలా లంకారశోభితలగుచుస్వర్గసమానంబగునామణిపర్వతప్రదేశంబుననున్న యదువల్లభుని సమీపంబున కేంగి యతని నలుగడలం బరివేష్టించి యుండి యంజలి గావింపుచు, నామాధవు నుద్దేశించి తొలుత నారద మునీంద్రుండు, విష్ణుండును, నారాయణుండును నగు యదువల్లభుండు శంఖచక్రాద్యాయుధంబులు ధరించి దేవకార్యార్థంబుగ నియ్యెడకుం జనుదెంచి మురాసురప్రముఖులతోడం గూడ నీ నరకాసురుని సంహ రించి యితని యైశ్వర్యం బపహరించి మిమ్ము నందఱం బెండ్లి యాడెడునని యెఱింగించి చనిన, మేమును గృష్ణుండెన్నటికి నేంగుదెంచునని మనంబున నేప్రొద్దును నిన్నె దలంపుచు దానవసంర క్షితులమై ఘోరతపంబు గావింపుచు నున్నవారము. అదియునుంగాక నారదుండు తెలిపి చనిన తెఱంగున వాయుదేవుండు మాకెఱింగించి

యుండు. ఇపుడు మా కోరికలు నెరవేర్పం దలంచి మీ రలిటకు విచ్చేసితిరి. త్రికాలజ్ఞాన సంపన్నుండగు నారదముని వాక్యం బమోఘంబు గావున గాంధర్వవివాహంబున మమ్ము నందఱ నంగీకరింపుము. పూర్ణచంద్రోపమానంబగు మీ వదనారవిందంబు కనుంగొనుటవలన మా నేత్రంబులు సఫలంబులయ్యె, అనిపలుకుచున్న సమయంబున గోగణపరివృతంబగు మహోవృషభంబు చందంబున నయ్యెందువదనల నడుమందనరారెడు గోవిందుని నమర బృందంబు లానందంబునం గనుంగొనుచునుండె. అంత నాకృష్ణుం డనురాగాచిత్తల గుచు నవ్విధంబునం బలికెడువనితలం గనుంగొని మీ తలంచినట్ల చేసె దనని యూరడింపుచు బహువిధంబులగురత్నంబులును, వనితారత్నంబు లును బరిజనసమేతంబుగా ద్వారావతికిం బనిచి, నానావిధపక్షిగణం బులును, మత్తమాతంగంబులును, సింహశరభవరాహాదులును, భుజంగం బులును, శాఖామృగంబులును, కృష్ణసారంబులును, విచిత్రమయూరంబు లును, రత్నశిఖరంబులును, విశాలశిలాతలంబులును, మనోహరంబులగు తటప్రదేశంబులునుం గలిగి ప్రకాశమానంబై యుండెడు మణిపర్వ తంబు సకలజనంబులుం గనుంగొనుచు నుండం బెకలించి గరుత్మంతుని భుజంబుననిడి, యమృతధవళంబును, బూర్ణచంద్రోపమానంబును నగు వరుణ ఛత్రంబును, మఱియు ననేక దివ్యరత్నంబులును నతని పైనిడి, పాకశాసన బలదేవసహితంబుగ గరుడాధిరోహణంబు గావించిన మేరుశిఖరసమానుండును మహాబల శాలియును నగు వైనతేయుం డింత భారంబు వహియిం పుచు నిజపక్షవిక్షేపంబున దశదిశాభాగంబులు ఘూర్ణిల్ల నిజగమన వేగంబునం బర్వత శిఖరంబులం జలింపంజేయుచు, మహీరుహం బులం బెల్లగింపుచు, మేఘసంఘంబుల నాకర్షింపుచు, నభోమార్గం బుననెగసి, వైశ్వానరపదంబుగడచి, గ్రహతారకంబుల సప్తఋషి

సంఘంబుల నిజప్రభా విశేషంబున నతిక్రమింపుచుం జంద్రసూర్యులు చరించు మార్గంబుజెంది మేరుమధ్యశిఖరంబుననిలువ నమ్మధుసూద నుండు మరుత్తులును, విశ్వేదేవతలును, సిద్ధులును సాధ్యులును, నాశ్వినేయులును మొదలగుదేవతల నివాసస్థానంబులు నిరీక్షింపుచుంజని సుకృతపరులకుం బ్రాప్యస్థానంబగు స్వర్గంబునకరిగి వైజయంతంబునకు సమీపంబున గరుడునిందిగి బలరామ సహితంబుగ నదితిపాదంబులకు నమస్కరించి బ్రహ్మాదకాది నిఖిలదేవగణపూజ్యమానుం డగుచు ననేకదివ్యరత్నంబులును, దివ్యకుండలంబులును, నదితికి నొసంగినంగైకొని యాదేవియును ముదంబునం బొదలుచు బలరామసహితుండగు నుపేంద్రునిం బూజించె. అంతశచీదేవి చనుదెంచి సత్యభామందోడ్కొని చని, యీ లతాంగి కృష్ణుని ప్రియురాలని యాదేవజననికి నెఱింగించినం గనుంగొని యీయదువల్లభుండు మనుష్యావతారంబున భూమినివసియించుచున్నాఁడును, యౌవనంబుకలిగి సకల దివ్యగంధ సమేతంబగు గాత్రంబుకలిగి వసియింపుమని కృష్ణునకుం బ్రియంబుగ దీవననొసంగి పనిచినం దోడ్కొనిచని శచీదేవి సాత్రాజితియుం దానును గొంతదడ విష్టాలాపంబులాడుచునుండి పదంపడి కృష్ణనివాసంబునకుంబనిచె. ఇవ్విధంబున దేవగణ పూజితుండగుచు సత్యభామా మనోహరుండు ఋషిగణంబులు సేవింప స్వర్గలోకంబు వెడలి యనేక దూరంబుగడచి వర్ధమానపురద్వారంబగు ద్వారకాపురంబు సమీపంబునం జేరె.

ఈకథ సభాపర్వంబున నఱువది రెండవ యధ్యాయము.

---

*

## అధ్యాయము 63

అని భీష్ముండు మఱియు నిట్లనె. నలుగడలం బరివేష్టించి యుండెడు పుష్పఫలసమేతంబులగు నారామంబులవలనను, జంద్రార్క సమానంబులును, మేరుశిఖరాకారంబులును, మనోహరంబులునగు మందిరంబులవలనను, గమలసందోహంబులును హంసకారండవాది జలపక్షిసంఘమ్ములం దనరి గంగాసింధు సదృశంబులగు పరిఘలవలనను విభ్రాజమానంబై, మఱియు శ్వేతాభ్రవర్ణప్రాకారంబుచేనావృతంబగుచు మేఘమాలికా పరివేష్టితంబగు నమరావతి తెఱంగునం గనుపట్టుచు, నందనోపమానంబును, మిశ్రకోద్యాన నిభంబును, చైత్రరథారామ తుల్యంబును, బితామహవన ప్రతీకాశంబును, వైభ్రాజోపవనప్రతిమంబునునై నిరంతర కుసుమోపేతంబులగు నుద్యానంబుల వలన నక్షత్రగణ నిబిడంబగు నభంబుచందంబునం బ్రకాశింపుచు, మఱియును బూర్వ దిగ్భాగ భూషణంబును, నతిరమ్యంబును, సానుగుహానిర్ఝర సమేతంబును నగు రైవతక పర్వతంబును దక్షిణ దిగ్భాగంబునం బంచవిధవర్ణంబులు గల లతావేష్టంబను ధరాధరంబును, బశ్చిమంబున నింద్రధ్వజ సమానంబును, రజతమయంబును బుష్పిత వనోజ్జ్వలంబునునగు సుకక్ష్యంబను నచలంబును, మఱియు నుత్తర దిగ్భాగంబున మందరనగోపమంబై యతి ధవళంబగు వేణుమంతంబనుపర్వతంబును విలసిల్లుచు నుండ, రత్నకంబళవర్ణంబును, సంతత ప్రసూనసంయుక్తంబునునగు పాంచజన్య వనంబు రైవతక పర్వత సమీపంబునం దనరార, మేరుప్రభవనంబును, దాళవనంబును, బుష్పకవనంబును, బుండరీకవనంబునను నుద్యాన వనంబులు లతావేష్ట మహీధరంబు నావరించి యుండ, చిత్రపుష్ప వనంబును, శతపత్రవనంబును గరవీర వనంబును, గుసుంభివనంబును

నగు నారామంబులు సుకక్ష్యాద్రి సమీపంబునం దనరం జైత్రరథం బును, నందనంబును, రమణంబును, భావనంబును నను నుపవనంబులును వేణుమంతం బనునచలంబున నమరం బ్రాగ్భాగంబున ధనుశ్శత ప్రమాణంబగు విస్తీర్ణంబు గలిగి రమణీయంబగు నొక సరోవరంబు మెఱయుచు నుండ, మఱియును బంచాశద్ద్వారసహితంబును, మనోజ్ఞంబును, ననిర్వచనీయంబును, నత్యున్నతంబును, స్వర్ణప్రాకర సమావృతంబును, నగాధపరిఘోజ్జ్వలంబును, శ్వేత సౌధోప శోభితంబునునగుచు, వీక్షయంత్రశతఘ్నులవలనను, యంత్రజాలంబులవలనను, నాయసచక్రంబులచే నభిరామంబునునై కనుపట్టుచు, నష్ట యోజన విస్తీర్ణంబును, ద్వాదశ యోజనాయతంబును, జతుర్వింశద్యోజన ప్రమాణంబునందగు శాఖానగరంబుల వలన విరాజమానంబునునై కనుపట్టుచు, నష్టమార్గంబులును, ననేకంబులగు కక్ష్యాంతరంబులును, విహారస్థానంబులగు పదియాఱు ముంగిళ్ళనుం గలిగి యొప్పుచు, సప్త సంఖ్యాకంబులగు రాజ మార్గంబులును, మఱియు ననేకంబులైన యుపవీధులుం గలిగి ప్రకాశమానంబగుచు, రత్నకాంచన ఖచితంబులగు సోపానంబులును గీతవాద్య ధ్వనివిశేషంబులునుంగల రాజసదనంబులవలన హృదయాహ్లాదకరంబగుచు స్వర్ణకింకిణీజాలభూషితంబులగు మహోన్నతపతాకంబులుగల యష్ట లక్షసంఖ్యందనరు సౌధంబులుగలిగి విశ్వకర్మనిర్మితంబై త్రిజగన్మోహనంబగుచుం దనరారు ద్వారకాపట్టణంబుం బ్రవేశించి రాజవీధిం జనుచున్నసమయంబున నత్యున్నతంబులగు పతాకంబులును, నతిధవళంబులగు శృంగంబులును స్వర్ణమయంబులగు నుపకరణంబులునుంగలిగి మేరుపర్వత శిఖరంబుచాట్పున సర్వరత్నభూషితంబగుచు శుకశారికాదివిహంగంబులు వసియించు పంజరంబులం దగు కోణికల వలనను, శిరోగృహంబులవలనను, నిబిడంబులగు జలయంత్ర మంది

రంబులవలనను శోభితంబై ధాతుగణపరివృతంబగు నచలంబు చందం బునం దోచుచు, రత్నకాంచన ఖచితంబులగు మేలుమిద్దెలును సుధాలిప్తంబులగు స్థలంబులును, జాంబూనదమయంబులగు ద్వారంబులును, వైడూర్యనిర్మితంబులగు నర్గళంబులున, నానాపుష్పసదృశంబులగు పంచవిధవర్ణంబులును, మేఘధ్వనిసమానంబులగు వాద్యఘోషంబులునుం గలిగి విచిత్రవర్ణంబులుగల జలధరంబుల తెఱంగునం గనుపట్టుచు, రత్నసానుగుహాప్రదేశంబువలన మహేంద్రశిఖరసంకాశంబులునగుచు, విశ్వకర్మనిర్మితంబులును, నత్యున్నతంబులు నగుచుం జంద్రార్కులనతిక్రమించి ప్రకాశింపుచు నాగోత్తమంబులం దనరారెడు భోగవతీహ్రదంబులపోలిక యదుకుమారులవలనం దనరారెడు గృహంబులను, సరోవరంబులను బ్రకాశింపుచు, నీలధ్వజంబులనియెడు కుంజరంబులును, యదువీరుల యాయుధంబులనియెడు నింద్రచాపంబులును, వృష్ణివరులనియెడు మత్తమయూరంబులును, వనితాజనంబులనియెడు విద్యుల్లతికలును, బలదేవవాసుదేవులనియెడు నింద్రపర్జన్యులును గలిగి కనుపట్టు రాజసదనంబులనియెడి మేఘబృందంబులవలన జీమూతనిబిడంబగు నభోమండలంబు చందంబున నందంబగుచు, సర్వర్తుసుఖప్రదంబగు నప్పురమధ్యంబున నాలుగు యోజనంబుల నిడివియును, నంతియ విస్తారంబునుం గలిగి యింద్రచోదితుండగు త్వష్ట్రివలన నిర్మితంబగుచు దివ్యప్రాసాద సమేతంబును, క్రీడాచలోజ్జ్వలంబును, మహాధనపరిపూర్ణంబును, దేవదేవుండగు పురుషోత్తమునికి విహారస్థానంబైన భవనంబును, యోజనప్రమాణంబగు నలుచదరంబు గలిగి రత్నకాంచనమయంబగు కనకగిరిశైఖరిం దనరు రుక్మిణీ విహారస్థానంబగు హర్మ్యంబును, నవరత్ననిర్మితసోపానంబును, నతిధవళంబును, సూర్యప్రకాశంబుగల కేతనంబులవలన నలంకృతంబును, జతు

ద్రిశాలంకారంబులగు నుపవనంబులవలన శోభితంబును, రత్నధ్వజ ప్రదీప్తంబును నగుచు శీతవంతంబను నామధేయంబు గలిగిన సత్య భామ సదనంబగు హర్మ్యంబును, నానావిచిత్రభూషణప్రభలవలనం దైలోక్యంబు బ్రకాశింప జేయుటకుం జాలి యతిశుభ్రంబై రుక్మిణీ సత్యభామల మందిరంబుల నడుమం దనరారెడు జాంబవతీనివాసంబగు సౌధంబును, కైలాసశిఖరాకారంబును, కాంచనమయాగ్రంబును, దీప్తా గ్నిసంకాశంబును, రత్నాకరసమానంబును నగుచు మేరు నామధే యంబు గలిగి, కులరూపవిఖ్యాతయును, గాంధార రాజకన్యకయు నగు సుకేశివధూరత్నంబునకావాసంబగు హర్మ్యంబును పద్మవర్ణం బును, ప్రభాభాసితంబును, మహార్ణంబును నగుచు పద్మకూలంబను నామధేయంబు కలిగిన భద్రాలతాంగి వసియించు సౌధంబును,సూర్య ప్రభంబను నభిధానంబు గల లక్ష్మణాకేళిహర్మ్యంబును, వైడూర్య మణివర్ణప్రతీకాశంబును హరిద్వర్ణప్రభాదర్శనీయంబును దేవర్షిగణ పూజితంబును నగుచు హరినామధేయంబు గలిగిన మిత్రవిందాలయం బగు సౌధంబును, నిఖిలశిల్పిజనపరికల్పితంబును, సకలగృహాలంకారం బును, మణికాంతిద్యోతమానంబును నగుచుం బద్మయను నామధే యంబుగల సుదంతాకాంతాలలామంబు వసియించు సౌధంబును,యో జనప్రమాణంబగు విస్తీర్ణంబును నిడివియునుం గలిగి త్వష్ట్రివలన నిర్మి తంబై దనరారెడు కేతుమంతంబను శైలంబునకు సన్నిభంబై ప్రభా భాసితం బగుచు విరజంబను నామధేయంబు గలిగి నిఖిలాంగనాజన సమేతంబుగం బుండరీకాక్షుండు విహరించు సౌధంబును, మఱియు నాయా ప్రాసాదగృహసముదయంబులకు సంజ్ఞాసూచకంబులును, స్వర్ణ దండమండితంబులును, ఘంటికాజాల విరాజమానంబులును నగు పతాకలవలన నభిరామంబులగు ధ్వజంబులును, యదువల్లభునివలన నా నీతంబులగుచుం గ్రీడాచలంబులై యుండెడు వైజయంతనగంబును,హంస

కూటపర్వత శిఖరంబును, షష్టితాల ప్రమాణంబగు నగాధంబును, నర్ధయోజన విస్తీర్ణంబును, గిన్నరనినాదమేదురంబును నగు నింద్ర ద్యుమ్న సరోవరంబును, త్రైలోక్య విఖ్యాతంబును, గామగమనం బును, హేమమయంబును, సర్వౌషధీ సంయుక్తంబగుచు విభ్రాజమా నంబును, గృష్ణునివలన సమానీతంబును నగు మేరునగశృంగంబును, దత్ప్రాంతంబున నింద్రభవన సమానీతంబై ప్రతిష్ఠితంబగు పారి జాతంబును, గనకమయ విమానంబులును, బ్రహ్మలోకంబున నుండి తెచ్చిన మహావృక్షంబులును, సాలతాలాశ్వకర్ణశతశాఖ రోహిణ భల్లాతక కపిత్థ చంద్రవృక్ష చంపక ఖర్జూర కేతక మహీరుహం బులును, మఱియుం బద్మనిబిడంబులై యల్లనల్లనం గదలుచుండెడు జలంబును, రక్తోత్పల సౌగంధికంబులును, ముక్తామణిమయంబులగు సైకతంబులునుం గలిగి మనోజ్ఞంబులగు పుష్కరిణీ సరోవరంబులును, దదుభయతీరంబులందును హిమవత్పర్వతంబువలన నుండియును నందనోద్యానంబు వలన నుండియునుం దెచ్చి ప్రతిష్ఠితంబులై రక్త పీతారుణవర్ణంబులు గలిగి సర్వర్తు ఫల పుష్ప పరిపూర్ణంబులగు, పాదపంబులును, దన్మధ్యప్రదేశంబుల సహస్రపత్రకమలంబులును, మందారంబులును, మఱియు నంకోల, కర్ణికార, తిలక, నాగమల్లిక, కురువ, నాగపుష్ప, తృణగుల్మక, సప్తపర్ణ, కదంబ,, నీప, కురువక, కేసర,హింతాళ, తలతాటక, ప్రియంగు,వకుళ,పింజక,బీజక, పూరకంబు లును, ద్రాక్షామలక, ఖర్జూర,మహిాక, జంబు, కామ్రమ, పనస, తిల్వ,తిం దుక,లికుచామ్రాతక,క్షురిత, కంటకి, నారికేళ బ్రక్రోశకంబులును, కద ళీ,మల్లికపాటకంబులును, భల్లాతకకపిత్థబంధుజీవకాశోకకాశ్మర్య ప్రాచీనబదరీధవస్పందనస్యందనసజ్జశమీాభల్లపలాశవటపిప్పలోదుంబర కీచకేంద్ర వృక్షార్జున చిరిబిల్వ కసాభాంజనక భల్లాటాశ్వ సాహ్వయతాంబూల వల్లీక్రముకలవంగపారి భద్రంబులును, మఱి

యును, బీతలోహితవాలు కాశోభితంబులునగు దీర్ఘికలును, నిర్మలోదకంబులు గల హ్రదంబులును, ప్రఫుల్లకుముదోత్పల సహితంబులును, నానాద్రుమలతాకీర్ణంబులును, మణివాలుకాలలితంబులు నగుచు నయ్యెడం బ్రవహించు నదులును, మత్తమయూరబృందంబులును, మదకోకిల కులంబులును, గజయూధంబులును, గోమహిషంబులును, వరాహముఖ్యంబులగు మృగంబులును బక్షిగణంబులునుం గలిగి, మనోహరంబులగు క్రీడా పర్వతంబులును, మఱియు విశ్వకర్మ వలన నిర్మితంబై నూఱు మూరలు వెడల్పు గలిగి చంద్రసమానం బగు శిలాఫలక ప్రకారంబునుం గనుంగొని యింద్రాదులగు సమర వరు లందఱు నత్యాశ్చర్య భరితులగుచు, నాపురమహాత్వంబు బ్రశంసింపుచుండం గృష్ణుండు మహేంద్రముఖ్యులగు బృందారకులు పరివేష్టింపం జనుచున్న సమయంబున విశ్వకర్మ యరుగుదెంచి వందనంబు గావింపుచు, వినయావనతుండై యున్న యతనిం గనుంగొని యింద్రుండు పరిమోదంబునం బొందెను.

ఈకథ సభాపర్వంబున నఱువదిమూడవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 64

అని భీష్ముండు మఱియు నిట్లను. అవ్విధంబునం బురుష శ్రేష్ఠులగు నింద్రోపేంద్రబలరాములు ముువ్వురును ద్వారకాపురంబు ప్రవేశించు సమయంబున గరుడవాహనారూఢుండగు కృష్ణుండతిధవళం బగు పాంచజన్యంబు పూరింప వైరిహృదయ భేద్యంబగు నానిధ్వానంబున సముద్రంబులు గలంగుటయును, నాకాశంబు మ్రోయుటయును నత్యద్భుతంబైయుండె. అట్టి యదువల్లభుని శంఖనిస్వనంబాకర్ణించి

కురు రాంధక ప్రభృతులగు మహీపతులును, సంతోష భరితులగుచు, శంఖచక్ర గదాద్యాయుధ ధరుండగు దేవకీనందనుం డుదయాచల శిఖరంబునందోచు విభాకరుని తెఱంగున వైనతేయభుజాధిరూఢుండై చనుదెంచుటకుం బ్రమోదంబులం బొదలిరి. భేరీమృదంగాది వాద్య ధ్వానంబులును, సింహనాదంబులును, వేణుశంఖారావంబులును చెలంగ, దాశార్హులును, నుగ్రసేనుండును, వసుదేవపురస్సరంబుగ జనార్ద నుని సమీపంబునకరిగి, మఱియు రోహిణియును, దేవకియును, నాహుక భార్యలునుం జని యదువల్లభునింగనుంగొని, భూసురకంటకులగు నరకా సురప్రభృతులగు నిశాచరులు నీచే సమరంబున నిహతులగుటం జేసి సకలజనంబులకును మాకును సంతసంబావహిల్లెనని ప్రశంసింప, వారల వాక్యంబు లాకర్ణింపుచు నమ్మధుసూదనుండు మణిపర్వతంబున నొక యుచిత ప్రదేశంబుననునిచి, వైనతేయునిపైం దెచ్చిన యనేకధనరత్న కాంచనంబులు సుధర్మాస్థానంబుననునిచి, పితృసర్శన లాలసుండగుచుం దోలుదోలుత సాందీపుని గృహంబునకుంబోయి గురువందనం బాచ రించి, యానందాశ్రుపరిపూరితలోచనుండును, సంతుష్ట చిత్తుండును నగు వసుదేవునకు బలరామసమేతంబుగం బ్రణామంబొనర్చి, మఱియు నుంగల పూజ్యులగువారలకు యథోచితంబుగ నమస్కారంబు గావింప వారలును పరమ హర్షంబునం బొదలుచు గాఢాలింగనంబు లొనరిం పం బుండరీకాక్షుండును మహాభుజుండునునగు కృష్ణుండు దాందెచ్చిన ధనరత్న కాంచన సంచయంబులంధకవృష్టి ప్రభృతులగు బంధుజనం బులకు వేర్వేఱ బహుమాన పూర్వకంబుగం బంచి యొసంగె.

ఈ కథ సభాపర్వంబున నఱువది నాలవ యధ్యాయము.

---

*

## అ ధ్యా య ము 65

అని భీష్ముండు మఱియు నిట్లను. ఆసమయంబున బలరామ కేశవ ప్రభృతులగు వృష్ణి కుమారవర్గంబులవలనను, మహేంద్రప్రముఖులగు బృందారక బృందంబుల వలనను, నా సభాస్థానంబు కంఠీరవంబులందనరు గిరిగుహాభాగంబు తెఱంగు సంగీకరించె. అంత సమరేంద్రుండగు పాకశాసనుం డుచితాసనంబులనున్న యంధకవృష్ణివీరుల నాలోకించి శుభకరంబులగు వచనంబుల వారలకు మనః ప్రియంబు గావింపుచు మహానుభావుండగు నీ కృష్ణదేవుండు మనుష్యలోకంబునం జనించుటకుం గారణం బింతకు మున్నతండు గావించిన దుష్కరంబులగు కృత్యంబులును మీకు సంక్షేప రూపంబున నెఱింగించెద. ఈ కృష్ణుం డెయ్యది దలంచి మహీతలంబున నవతరించె నట్టి కార్యంబులన్నియు నితండు నేరవేర్చుట మీకు విశదంబు గావించెద. ఈ యదువల్లభుం డనేక లక్షసంఖ్యలుగల దానవులం బరిమార్చి వదంపడి పాతాళ బిలంబుచేరి ప్రహ్లాద, బలి, శంబర, ప్రముఖుల కేనియును దుర్లభంబై యున్న ధనంబులు గైకొని, పాశంబులతోం గూడ మురాసురుని వినాశంబు నొందించి, పంచజనుని బంచత్వంబు నొందించి, శిలాసంఘంబులు గడచి, సబలుండగు నరకుని సమరంబున సంరంభంబు మాయించి,మహాబలశాలియగు హయగ్రీవుని నిగ్రహించి, నరకాసుర సంహారం బొనర్చి, దివ్యకుండలంబులు గైకొని, దివంబునకుం జని మహత్తరంబగు కీర్తి సంపాదించె. ఈ కంసాంతకుని భుజాబలంబు నాశ్రయించి భయశోక బాధారహితులగుచు మీరందఱును దేవతలకుం బ్రియంబుగ ననేకాధ్వర్యంబులు గావింపుచు సుఖంబునం బ్రవర్తిల్లెదరు. ఈ కృష్ణుం డింక బాణాసురుని నిగ్రహించు సమయంబున నిఖిల బృందారక సమేతంబుగా నప్పటికి నరుగుదెం

చెద నని బలరామ వాసుదేవ వసుదేవులను గాఢాలింగనంబు గావించి ప్రద్యుమ్న సాంబ నిశఠానిరుద్ధ సారణ బభ్రు ఝల్లిగద భాను చారుదేష్ణ ప్రముఖులచే ననుజ్ఞాతుండై, కైలాసపర్వతాకారంబును, హేమసూత్రకక్ష్యాలంకృతంబును, కనకవలయోజ్జ్వలదంత సమేతంబును, మనోహరకుధాస్తర్ణంబును, సర్వరత్నభూషణ భూషితంబును, ననేక రత్నఖచితపతాకాలంకృతంబును, వర్షసమన్వితంబగు వారిదంబు విధంబున మదధారాసమేతంబును, మహోన్నతంబును, గాంచనమాలికా కలితంబును, నిజబృంహితాపూరితదశదిశాభాగంబును, దిగ్గజశ్రేష్ఠంబును నగునైరావతంబును వైశ్వానరసమేతంబుగ నెక్కి సకలజనంబులు కనుంగొనుచు నుండ మందరపర్వతాగ్రంబునం దోచు మార్తాండుచందంబునం గనుపట్టుచు, వజ్రమయంబును, నతిభయంకరంబును నగునంకుశంబు కరతలంబున నమర్చి, కుబేరవరుణ ప్రముఖులగు నిర్జరులు విమానగజకరేణుప్రముఖయానారూఢులగుచుం బరివేష్టించి నడువ, వాయుపథంబును, నగ్నిపథంబును, సూర్యపథంబునుం గడచి యవలనంతర్ధానంబు నొందె.

ఈ కథ సభాపర్వంబునం దఱువదియైదవయధ్యాయము.

---

## అధ్యాయము 66

---

అని భీష్ముండు మఱియు నిట్లనె. అంత సౌందర్యసౌశీల్యాది గుణసమేతయును, మహాపతివ్రతాశిరోమణియునునగు రుక్మిణియును సత్యభామయును జాంబవతియును, గాంధారియును, శిశుమాదేవియును, విశోకయును, లక్ష్మణయును, సుమిత్రయును, కేతుమావధూటియును, మఱియునుం దక్కిన కృష్ణప్రియయువనితలును, వెం

బడి నరుగుదేర, నందభార్యయును, జగద్విఖ్యాతయును నగు యశోదా దేవియును, నుగ్రసేనభార్య లేడ్వురును, దేవకీదేవియును, రోహిణియు ను, బలభద్రసహితుండై యున్న గోవిందుని వైభవంబు జూడవలయు నను వేడుకం జనుదేర నయ్యాదువల్లభుండు బలదేవసమన్వితంబుగం బ్రత్యుత్థానంబు గావించి పదంపడి దేవకీదేవికి వందనం బొనర్చి తక్కిన మాతృజనంబులకు యథాక్రమంబుగ నమస్కారంబులు జేసిన, వారలును బలుదెఱంగుల దీవన లొసంగుచు నుచితాసనంబులం గూర్చున్న యనంతరంబ, దేవకీదేవి వృషభాత్ములగు బలదేవవాసు దేవుల నిరువురం దొడలపై నిడుకొని మిత్రావరుణులచేం దనరారు నదితిచందంబున నెంతయును సంతసింపుచు నుండునంత నేకన్యక నిమిత్తంబునం గంసుండు కృష్ణునిచేం బరివారసహితంబుగ నిహతుం డయ్యె నట్టి ప్రకాశమానాంగియును, సౌందర్యవతియును, మాయా రూపిణియును, యశోదాకుమారియును, నేకానంగాభిధానయును నగు తమ ముద్దుచెలియలు చనుదేగ నానీలాంబరపీతాంబరులు గౌర వంబున నిరువురును దాని వామదక్షిణకరంబుల నిరుగేలం దిగిచి సన్ని ధానంబున నునిచికొని లాలింపుచు నుండ, నబ్బాలికారత్నం బేనుంగు దోయినడుమనుండెడు నిందిరారమణి తెఱంగునం గనుపట్టిన నపుడు సంతుష్టాంతరంగులగుచు వృష్ణిజనంబులు లాజాక్షత పుష్పాజ్యవర్షం బులు వారలపయిం గురియించిరి. ఇవ్విధంబున బాలవృద్ధసహితులగు బాంధవులకుం బ్రమోదంబుగావింపుచు వారలు పూజింపం గొంత తడవు వసియించియుండిరి. అంత కృష్ణుండు రుక్మిణీసహితుండగుచు నిజమందిరంబునకరిగి యచ్చట లీలావినోదంబులం బ్రొద్దుగడపుచుం గొండొకసేపు వసియించి యనంతరంబ సత్యాజాంబవతీప్రభృతులగు నిజకాంతలు వసియించియుండెడు నంతఃపురమందిరంబులకుం జని వారలకెల్లను హృదయానందంబు గావించి క్రమ్మఱితి రుక్మిణీరమణి

సౌధంబున కరుగుదెంచి సుఖంబునం బ్రవర్తిల్లె. ఇవి శార్ఙ్గధనుర్ధరుం డగు కృష్ణునివిజయకారణంబులు. ఏతదర్థంబుగ నితండు మహీతలం బున నవతరించెనని యార్యు లెఱింగింతురు.

ఈకథ సభాపర్వంబున నఱువది యాఱవ యధ్యాయము.

---

## అధ్యాయము 67.

---

అని భీష్ముండు మఱియు నిట్లను. ఇవ్విధంబునం బ్రియకాంతలుం దానును ద్వారకానగరంబున నిష్టోపభోగంబున సంతుష్టుం డగుచున్న కృష్ణుండు నిజపౌత్రుండగు ననిరుద్ధుండు కారణంబుగ నింద్రాదిసురులకు నశక్యంబును దేవహితంబును నగు కార్యంబు నిర్వహించె. అది యెఱింగించెద నాకర్ణింపుము. బలిదైత్యునకు నగ్ర తనయుండును, శౌర్యధుర్యుండును, సహస్రబాహుండును నగు బాణా సురుండు సత్త్వగుణసంపన్నుండగుచు బహుసంవత్సరంబు లత్యుగ్ర తపంబొనర్చి త్రిలోచనునకు మనఃప్రియంబుగావించి యతనిచే నసు రులకు దుర్లభంబులగు ననేకవరంబులువడసి యసమానబలుండగుచు శోణితపురంబున రాజ్యపరిపాలనంబు గావింపుచుం బాకశాసనప్రముఖు లగు నిర్జరుల సంగరాంగణంబున నిర్జించి రెండవకుబేరుని తెఱంగునం దేజరిల్లుచు నిజహితంబులగు కార్యంబులు శుక్రుండు నడుపుచుండ మహావిభవసంపన్నుండై రాజ్యంబుసేయుచునుండునంత రూపలావ ణ్యంబులవలనం బార్వతీదేవితోడ సమానంబనంజాలి యసమానసౌంద ర్యశాలినియై తనరెడు బాణాసురునితనూజయగు నుషాకన్యకం గూడి ప్రద్యుమ్నకుమారుండగు ననిరుద్ధుండు ప్రచ్ఛన్నుండై విహరింపు చున్నసమయంబున నీవృత్తాంతంబంతయు నెఱింగి బాహుబలగర్వి

తుండగు బలినందనుం డనిరుద్ధునిం బట్టి కారాగృహంబునం బెట్టిన, సుకుమార గాత్రుండును, మహాసుఖార్హుండును నగు నారాజకుమారుం డనుభవించు ఖేదంబు గనుంగొని నారద మునీంద్రుండు ద్వారావతికిం జని కృష్ణసన్నిధానంబున కేంగి, యదు పుంగవా! నీపౌత్రుండగు ననిరుద్ధుండు దానవేశ్వరుం డగు బాణు నిచే నగపడి కన్యాంతఃపురంబున నిరుద్ధుండైయున్నవాండని యెఱిం గించి శోణితపురంబున కరిగె. అంతం గృష్ణుండు బలరామప్రద్యు మ్నుల రావించి, మునిపుంగవుండు తెలిపిన వాక్యంబులన్నియు వార లకు నెఱింగించి, వారలుం దానును నతికుపితులగుచు గరుడవాహనా రూఢులై చని తామ్రప్రాకారసమావృతంబును, రజతద్వారోపశోభి తంబును, గాంచనసౌధవిరాజమానంబును, ముక్తామణి విచిత్రితం బును, నుద్యానవనసంపన్నంబును, నానాపక్షిసమాకులంబును, నృత్త గీతమనోహరంబును, మకరతోరణాలంకృతంబును, బహుసరోవర విరాజమానంబును,హృష్టపుష్టజనాకీర్ణంబును స్వర్గసంకాశంబునునగు బాణుని పురంబు వీక్షించి యాశ్చర్యభరితులగుచుం బురద్వారసమీ పంబునకుం బోయి ద్వారిపరిపాలకులగు మహేశ్వర, గుహ, భద్ర కాళి, పావకులం జూచి, బలపరాక్రమధురంధరుండును, శంఖచక్రాది దివ్యాయుధధరుండును, గోపోద్దీపితుండునునగు జనార్దనుండు నిజ భుజాబలంబున వారలనందఱ నిర్జించి, శంకరునిచే సంరక్షితంబగు నుత్త రపువాకిటికింజని యుయ్యెడం దేజోవిరాజమానుండును త్రిశూల ధరుండును నగు రుద్రుండు బాణాసురహితార్థంబుగం బినాకంబున శరంబు సంధించి సంగ్రామోన్ముఖుండై యుండి ప్రళయకాలాంతకుని కైవడి క్రోధారుణేక్షుండై చనుదెంచు నయ్యనంతునిం గనుంగొని యతిఘోరంబును, నాశ్చర్యకరంబును, నచింత్యంబును నగు మహా యుద్ధంబున నన్యోన్య జయకాంక్షులై యస్త్రప్రయోగంబులును,

ప్రత్యస్త్రసంధానంబులును గావింపుచు నొక్కముహూర్తమాత్రంబు పెనంగునెడ వాసుదేవుండు మహాదేవుని దక్షిణంగల ద్వారపాలకులం గెలిచి పురంబునం బ్రవేశింప నబ్బాణుండరుగుదెంచి నిశితంబులగు శస్త్రాస్త్రంబు లొక్కమొగి న్నిగుడింపుచు మఱియును సహస్రభుజంబుల నాయుధంబులు ధరియించి ప్రయోగించునెడం గృష్ణుండు ప్రత్యస్త్రంబులవలన వాటి నంతయు నింతింతలుగ ఖండించి మగుడ నొక ఘటికాయుగంబు దారుణంబగు రణం బొనర్చి నిఖిల శస్త్రాస్త్రముఖ్యంబును, దేదీప్యమానంబును నగుచక్రంబుం బ్రయోగించి యతనిబాహుసహస్రంబును ఖండించె. అంతవిచ్ఛిన్నబాహుం డగు బలితనయుండు శాఖారహితంబగు మహీరుహంబు తెఱంగునం గూలె. అంత యదువల్లభుండు శీఘ్రగమనంబున నంతఃపురంబునకుం జని భార్యాసమేతంబుగ ననిరుద్ధుని విడిపించి యాబాణాసురుని సదనంబునం గల యసంఖ్యంబులగు దివ్యరత్నంబులును, గోధనంబులును, మఱియు ననేక ధనకాంచననిచయంబులును గరుడుండు గొనితేర, బలదేవుండును, ప్రద్యుమ్నుండును, ననిరుద్ధుండును, ననేక దాసదాసీజనపరివృతయును, సౌందర్యవతియును నగు నుషాకన్యకయును, మొదలగువారలుం దానును సంతోషభరితుండగుచుం బీతాంబరధరుండును, మహాబలధురంధరుండును, దివ్యభూషణభూషితగాత్రుండును, శంఖచక్రాద్యాయుధధారియును, వృష్ణికులతిలకుండును నగు వాసుదేవుం డుదయగిరి శిఖరంబున మెఱయుతరణి తెఱంగునం గనుపట్టుచు ద్వారకాపురంబు బ్రవేశించి సకల యాదవజనసమన్వితుం డగుచు దేవగణపరివృతుం డగు నాఖండలు చందంబునం బ్రకాశించె.

ఈకథ సభాపర్వంబున నఱువది యేడవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 68

అని భీష్ముండు మఱియు నిట్లను. అవ్విధంబున మురాసురుని పాశంబులు తెగంగోసి నిశూంభ నరకాసురుల హింసించి ప్రాగ్జ్యోతిష పురమార్గంబు సుపథంబుగావించె. మఱియును ధనుర్గుణారావంబులును, పాంచజన్యనినాదంబును, మేదురంబుగా మేఘబృందంబులువోని సైన్యసందోహంబులంగూడి నడిచి దక్షిణదేశాధీశ్వరులగు రాజులం గలసి సమరంబున కరుగుదెంచిన రుక్మియనువానిని భంగంబొనర్చి జలధర సమాన నిస్వనంబును, దివాకర సంకాశంబునునగు రథంబున రుక్మిణీదేవినునిచికొని జగదేక వీరుండై చనుదెంచె. జరూధిపురాధీశ్వరుండగు నాహృతిని మఱియును గ్రాధుని శిశుపాలునిం జయించె. వక్రుండును శైబ్యుండును, శతధన్వుండును, నింద్రద్యుమ్నుండును, కచేరుదేశాధీశ్వరుండగు కాలయవనుండును, సౌభనగర నాయకుండగు సాల్వుండును, కృతధన్వుండును మొదలగు మహీపతుల రూపుమాయించె. మఱియును బురంబున కావరణంబై యుండెడు పర్వత సహస్రంబు చక్రధారచేం దుత్తుమురుగావించి ద్యుమత్సేనుని గ్రమందించె. మహేంద్రాచలంబున నిమిషమాత్రంబులోన వచ్చుచుం బోవుచునుండెడు మనోవేగంబుగల వారుణాచరులంబట్టి వధించె. ఐరావతిపట్టణంబున సూర్యాగ్నిసమానబల ధురంధరులగు గోపతి తాళజంఘులను భూవల్లభుల సమయించె. అతుప్రపతనంబను దేశంబున నిమియనువానిని, సురాతి దేశంబున హంసపతియనువానిని నిహతులం గావించె. మఱియును వారాణసీపురంబుదహించి సబలుండును, సపరివారుండునునగు కాశీదేశాధ్యక్షునిం దెగటార్చె. లోహిత కూటంబున కేంగియ జేయుండును, లోకపాలకుండును నగు వరుణుని నిరసించె. ఇంద్రలోకంబునకుంబోయి మహేంద్రసంరక్షితంబగు పారిజాత మహీరు

హంబు పెకలించుకొని తెచ్చె. మఱియును, పౌండ్ర్యుండును, పౌండ్రుండును, మత్స్యుండును, కళింగుండును, వంగరాష్ట్ర విభుండును నను వీరలందఱును నొక్కపెట్టం దనపై నడరినం బవలువఱచె. ఏకశత రథికులగు క్షత్రియవీరులం బొరిగొని గాంధారియను కన్యకా రత్నంబునువరించె. మఱియును గుంతీదేవి కనుంగొనుచుండ గాండివధనుర్ధరుండగు పార్థుని లీలాసంగ్రామంబున నోటుపరిచె. మఱియును ద్రోణుండును, కృపాశ్వత్థామలును, కర్ణుండును, భీమసేనుండును, సుయోధనుండును మొదలుగాంగల వారల చక్రంబునకై చనుదెంచిన సమయంబునం గెలిచె. బభ్రుభార్యంగొని చనిన వేణుధారియనువాని సంహరించి యతనికింగల సకలైశ్వర్యంబుతోంగూడ రాజ్యంబపహరించె. తపోబల గర్వితుండును, బలపరాక్రమ సంపన్నుండును నగుచు నింద్రాది దిక్పాలకుల ననేకమారులు నిర్జించి, వారల దివ్యాస్త్రంబులకు నచలుండై నిలిచిన బాణాసురునికి గర్వభంగంబు గావించి బాహు సహస్రంబును ఖండించె. పీఠుండును, కంసుండును, పైరకుండును, నతిలోముండును, జంబుండును, శంబరుండును, నైరావతుండును, విరూపుండును మొదలగు వారలంబిలుకుమార్చె. మఱియును భోగవతీపురంబు ప్రవేశించి వాసుకిని పరాభవంబు నొందించి రోహిణేయుని విడిపించె. ఇట్లు, బాల్యంబున బలరామ సమేతుండగు నియ్యదుకులాగ్రగణ్యుండగు కృష్ణుండు గావించిన యద్భుత కృత్యంబులెన్నియేనియుం గలవు. పుండరీకాక్షుండును, సురాసురులకు నభయంబును గావించువాండును, సర్వలోకేశ్వరుండును, జగద్వ్యాపకుండును, మహాభుజుండును, దుర్జన శిక్షకుండును, నగు నీ కృష్ణుండును, దేవహితంబులగు కార్యంబులు నిర్వహించి పదంపడి నిజస్థానంబున కరుగంగలవాండు. వెంబడినె శైలకానన సమేతంబుగ మనోహరంబును, భానుమండల ప్రభాభాసురంబునునగు ద్వారకా

పురంబున యాదవులు సమయుసంత తడవునునుండి వసియించి వరుణ నివాసంబగు సముద్రంబున మునుంగంగలయది. ఈమాధవుండు దక్క తక్కిన దేవదానవమానవులలో నెవ్వండేనియును ద్వారకాపురంబున నుండుట కర్హుండుగాడు. ఇప్పుడు ద్వారకాపురంబున వసియించియుం డెడు నంధకవృష్ణిప్రముఖజనంబులు శౌలవృద్ధసహితంబుగం దుది దివంబున సుఖంపంగలరు. విష్ణుండును, నారాయణుండును, సోముం డును, సూర్యుండును, నప్రమేయుండును, స్వతంత్రుండును, నిచ్ఛావి హారియును దానెయగు నీగోవిందుండును బాలురు క్రీడించు చందం బున వీరలంగూడి యివ్విధంబున మెలంగుచున్నవాండు. ఇతనికి నొక గర్భంబున వసియించుటయును, జనియించుటయును లేదు. నిజతేజో విశేషంబువలన నితండెల్లవారలకు సద్గతింగలిగింపసమర్థుండు. ఈ చరాచరాత్మకంబగు ప్రపంచంబంతయును బుద్బుదంబులు జలంబులం బుట్టి యందెయడంగు నట్లు నీవాసుదేవునియందుద్భవించి యందెలీ నంబగు. సర్వేశ్వరుండగు నీవిశ్వాత్మకుని మహాత్వంబు నిట్టిదట్టిదని వివరింప నెవ్వరికి నలవిగాదు. ఇతనికంటె నధికుండగువాండెందునుం గలుగనేరండు.

ఈ కథ సభాపర్వంబున నఱువది యెనిమిదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 69

---

అనిన వైశంపాయనుండు జనమేజయుంగనుంగొని మఱియు నిట్లను. ఇవ్విధంబునం బురాణపురుషుండగు నారాయణుని దివ్యావ తార వర్ణనంబుగావించి యూరకుండిన భీష్ముని వచనంబు లాకర్ణించి సహదేవుండు కేశిసూదనుండును, నప్రమేయుండును, శత్రుసంహార

కుండును నిఖిలలోకేశ్వరుండును, నగు నీకేశవుని నాచార్యుండును, గురుండును, సకలగుణసంపన్నుండును, జనకుండును, బురుషోత్తముం డునుగా మనంబునం దెలిసి యతనకి నగ్రపూజ నొసంగితిమి. ఇక్కార్యంబు మీరందఱు సమ్మతింపవలయు. ఇది యెవ్వనికి సమ్మతంబు గాదయ్యె నతం డిప్పుడె చతురంగబలసమేతంబుగ సంగరంబునకు వచ్చుంగాక! అతనిశిరం బిదె వామపాదంబునం దున్నద నని సకల రాజలోకంబు నిరీక్షింపుచుండ సభామధ్యంబునం బదంబు దాచి ఇందుకు నభిమానశాలియగువాం డుత్తరం బొసంగుగాక యని కోపోద్దీపితుండై పలుక భుజాబలధురంధరులగు నారాజవర్యులలోన నొకండేనియును మాఱుపలుకం డయ్యె. ఆసమయంబున సహదేవునిపై సభాసదులు గనుంగొనుచు నుండం బుష్పవర్షంబులు గురిసె. మేలుమేలను నాకాశవాణి పలుకులు వినంబడియె. అట్టియెడం త్రికాలజ్ఞాన సంపన్నుండును, నిఖిలధర్మవిదుండును నగు నారద మునీంద్రుండు ప్రమోదంబునం బొదలి కృష్ణాజినంబు బిఱబిఱంజుట్టి మహీతలంబునం గొట్టి చెలరేంగి యాడుచునుండె. అట్టియెడం జైద్యప్రభృతు లగు కొందఱు మహీపతులు ధర్మనందనుని సామ్రాజ్యాభిషేకంబును గృష్ణదేవుని యగ్రపూజయును జూచి సహింపంజాలక రోషావేశభీషణులగుచు యాదవపాండవేయుల నడరు తఱి బంధుజనంబు లడ్డంబుగ నిలిచి తమ్ము నివారింప నోరికండనాచికొనిన హుంకారంబు గావింపుచు సింహంబుల తెఱంగున గర్జిల్లుచు నుండు నెడ యుద్ధసన్నద్ధులును నపారసేనాసమేతులు నైయుండొరులు సంకేతంబు గూడియున్న యన్నరనాథుల బలసముద్రంబువీక్షించి బలభద్రానుజుండు రౌద్రరసోల్లాసితుండగుచు వారలతో దారుణంబగు రణంబు గావింపవలయునను తలంపున సమర సన్నాహంబు దీపింపనిలిచె. అంత విశేషజ్ఞుండగు సకులానుజుండు

మఱియును దక్కుంగల బ్రాహ్మణక్షత్రియులకు సపర్యసమాప్తంబు గావించె. అట్లు వాసుదేవున కొసర్చిన బహుమానంబునకు సైరింపం జాలక క్రోధారుణలోచనుండగుచు శిశుపాలుండు భూపాలలోకంబు నాలోకించి యీ యనుచితకార్యంబు నిరీక్షించి యూరకె యుండుట మీ యట్టి వారల కుచితంబగునె? మీ యందఱకు నేన సేనాధిపతినై నిర్వహించెద. వార్ష్ణేయు పాండవేయులతోడ నిప్పుడె సంగ్రామంబు నకుం గడంగుండని యందఱం బురికొల్పుచు యజ్ఞవిఘాతంబు గావింపవలయునని తలంచె.

ఈ కథ సభాపర్వంబున నఱువదితొమ్మిదవ యధ్యాయము

---

## అ ధ్యా య ము 70

---

అని వైశంపాయనుండు జనమేజయుం గనుంగొని మఱియు నిట్లను. ఆసమయంబున ధర్మనందనుండు కోపాటోపంబునం బొంగు రాజసముద్రంబు నిరీక్షించి కురుపితామహుండును, మేధాగరిష్ఠుండును, వృద్ధుండునగు గాంగేయు నుద్దేశించి కమలాసనునితోడం బలుకు మహేంద్రుని చందంబున నిట్లను. ఈనరేంద్ర సాగరంబంతయును క్రోధంబునం గలంగంబారి యున్నయది. ఈ సమయంబున సమస్త జనంబులకు హితంబు గలుగునట్లును, యజ్ఞంబునకు విఘ్నంబు వాటిల్లకయుండునట్లును మనము గావింపవలయు కార్యంబెయ్యది దానినెఱింగింపుమనిన శాంతనవుండు కౌంతేయాగ్రజుంజూచి, నీకు భయంబు సెందనేమిటికి? సారమేయంబు సింహంబును హింసింపం జాలునె? ఇందుకు శుభకరంబగు మార్గంబు తొలుతనె నిశ్చయించి యున్నవాండ. కంఠీరవంబు నిదురించు సమయంబున జాగిలంబులు

కూసిన తెఱంగున శునకసమానులగు నీ నృపాధములు పలుతెఱంగులం బ్రల్లదంబులాడెదరు. ఈకృష్ణుండునునిద్రించు మృగేంద్రంబుచందంబు ననూరకయున్న వాఁడు. ఈయదుకంఠీరవుని పరాక్రమంబునీయెఱింగిన దియకాదె. ఈ దుష్టాత్మకుండగు చైద్యుండు సకలరాజలోకంబును యముని లోకంబునకుంబనిచి తాసును పోవుటకునై పరాక్రమ హీనులగు నాపార్థివులకు శౌర్యంబు గలుగజేసి పురికొల్పుచు నున్న వాఁడు. ఈయదువల్లభుండెవ్వని సంహరింపందలంచు నతనికి బుద్ధిక్షోభంబు సంభవించు. కావున శిశుపాలునకును దక్కిన మహీపాలుర కును వినాశకాలంబు ప్రాప్తంబగుటంజేసి యిట్టిదుర్బుద్ధి సంభవించె. జరాయుజంబులును, నండజంబులును, స్వేదజంబులును, నుద్భిదంబులును నను నీచతుర్విధ భూతంబుల యుత్పత్తిస్థితిలయంబులకుం గారణ భూతుండగు నీకృష్ణుండు శిశుపాలునియందుగల తన దివ్యతేజంబు క్రమ్మఱం గైకొనుటకు నుద్యుక్తుండైయున్న వాఁడు. ఇదినిశ్చయంబు అని పలుకు భీష్ముని వచనంబు లాకర్ణించి శిశుపాలుండు నూతఘో రంబులగు పరుషభాషణంబుల భీష్మునకిట్లనె.

ఈకథ సభాపర్వంబున డెబ్బదవ యధ్యాయము.

---

## అధ్యాయము 71

---

కులదూషకా! కౌరవకులశ్రేష్ఠుండవయ్యును వృద్ధుండవయ్యును భయంకరంబులగు వాక్యంబుల నీరాజలోకంబునకు భయంబుగల్పించుచు నెట్టులజ్జింపకున్న వాఁడవు? నపుంసకుండవగు నీకునివ్విధంబునం బలుకుట యుచితంబె. ఇట్టి నీవు కౌరవులలోనం బెద్దయును, వాచాలకుండును నగుట కేమనంగలవాఁడ? యానపాత్రంబునం గట్టిన యా

నపాత్రుని వితంబున, నంధుం డంధునినూంతగాని నడచు కైవడి నీవచనంబులు హితంబుగం దలంచి పాండవేయులు నిన్ననుసరించి మెలంగుచు నున్నవారు. అజ్ఞానియును మూర్ఖుండును నగుచు గోపాలునిం బ్రశంసింప నిశ్చయించిన నీదు జిహ్వ యెట్లు శకలంబులు గాక యున్నయది? ఆ వాసుదేవుని పూతనాసంహారాదికృత్యంబులు విశేషించి నీ వెఱింగించుటవలన నాహృదయం బెవ్విధంబునం జలింపక యుండు. గోపాలుండును బాలునకు నేలియు నిందార్హుండును నగు దాశార్హుని నీవు జ్ఞానవృద్ధుండవయ్యును నెట్లు వొగడ నిచ్ఛయించెదవు? ఇతండు బాల్యంబున నొక విహంగంబు జంపుటయును, యుద్ధం బొనర్ప సామర్థ్యంబులేని వృషభాశ్వంబుల రెంటిని సమయించుటయును, నచేతన కాష్ఠంబగు నొక్క బండిం బదంబున విరగం దన్నుటయును, బన్నగంబుం బరిమార్చుటయును, నర్కవృక్షసమానంబులగు రెండు వృక్షంబులం బెకలించుటయును, భుజంగంబుపై నటించుటయును, వల్మీకప్రమాణంబగు గోవర్ధనాచలంబు నేడుదినంబులు మోచి యుండుటయును, నపరిమితంబగు నన్నంబు భుజించుటయును, బర్వతాగ్రంబుపయిం దోచుటయు నితనికి నతిశయావహంబని సభామధ్యంబునం బలుమఱుం బ్రశంసించెదవు. ఇవెవ్వరి కద్భుతంబులై తోచినను నామనంబున కద్భుతావహంబులు గావు. లోకంబున బుద్ధిసంపన్నులును ధర్మశీలురును నగు వార లిట్టి యల్పకార్యంబులం బ్రశంసించరు. తిండిపోతగువాండు మిక్కిలిగా నన్నంబు భక్షించెనని ప్రశంసించు బుద్ధిసంపన్నుని నెన్నొక్కనిం గనుగొంటి. కురుకులాధమా! నీవు ధర్మరహస్యం బెఱుంగమిం జేసి యితండు కంసునిం బరిమార్చుటం బలుదెఱంగుల నుతించెదవు. ఇంతకంటెం బాపం బేమి యున్నయది ? శరణాగతుండగు వానిని, బ్రాహ్మణుని, నన్నం బడిగిన వానిని, స్త్రీజనంబులను, ధేనువులను, జంపుట యుక్తంబు గాదని ధర్మ

శాస్త్రజ్ఞు లెఱింగింతురు. మీకధీశ్వరుండగు నతనియందీకలుషంబు లన్నియునుం గలవు. ఇట్టి యీతని జగదీశ్వరుండునని యెంతయును వివేకశాలిచందంబునం బెక్కువిధంబులం బ్రశంసించెదవు. వీని నే నిప్పుడె తెగటార్పం దలంచినవాండ. నాబారికిం దప్పి తన్నుం దా రక్షించుకొనియెనేని యప్పుడు నీవు చెప్పిన దంతయు నితనికిం దగు. అది యట్లుండె. సాహసంబు సేయవలదని యెల్లప్రొద్దులం దెలుపుచు నుండెడు కులింగపక్షి తానతిసాహసంబుగ సింహంబునిద్రించునెడదాని దంష్ట్రామధ్యంబున నుండెడు మాంసం బాహారంబు గావించు వితంబున లోకంబున జనంబులు పరులకు ధర్మోపదేశంబు సేయు వారయ్యును తాము నిజస్వరూపంబగు దుష్టవర్తనంబునం బ్రవర్తిల్లుదురు. కావున నింతయునుం దెలుపుచు నీవు నిజభావంబు విడువక వర్తించెదవు. అట్లగుటం జేసి పురాణంబు లెంత పఠించెనేనియును బఠించు నతని సంరక్షింపం జాలవు. నక్రగమనంబు గల నదీ పుత్రుండవగుటం జేసి నీచిత్తంబు కుటిలవర్తనంబు. ధర్మహీనుండవగు నీవాక్యంబు లాలకించి మూదవుని బూంకించిన పాండవేయులు దుర్బుద్ధులు. ధర్మ మార్గంబు దప్పియు నేను ధర్మజ్ఞుండనని నీవాచరించిన కార్యంబు జ్ఞానవంతుండగు వాండు కావింపంబోండు. నీవు ప్రాజ్ఞుండనని యుండియు సకల ధర్మంబు లెఱింగియు సాళ్వుని యెడ ననురాగంబు గల యంబ యను కన్యక నెవ్విధంబున నపహరించితివి? అట్లు తెచ్చినను నీసహోదరుండగు విచిత్రవీర్యుండు ధర్మజ్ఞుండు గావున దాని వివాహంబునకు నొడంబడండయ్యె. దారయోగ్యుండవగు నీవు గలిగి యుండియును, నితరుండగు సాత్యవతేయుని వలనం బుత్రులం గాంచుట సజ్జన మార్గంబె? అట్లు కావున నీవు నపుంసకుండవు. నీషండభాసంబు లోకుల కెఱుంగం బడక యుండ బ్రహ్మచర్యవ్రతం బాచరించెదనని సంచరించెదవు? నీయందు ధర్మలేశం బెఱింగియున్నదని

25

నామనంబునం దోపదు. నీవు వృద్ధోపసేవ గావించి వారలు ధర్మార్థం బెఱుంగమిం జేసి యకృత్యంబు లాచరింపుచుం బరులకు నట్లు బోధిం చెదవు. దానంబును, బహుదక్షిణంబులగు యజ్ఞంబులును, వేదాధ్యయనంబును నను నీధర్మంబులు పుత్రలాభంబునకుం బదియాఱవ పాలును బోలం జాలవు. అపుత్రకుండు గావించు వ్రతోపవాసాది ధర్మంబులు వ్యర్థంబులై చెడు. కాన ననపత్యుండును, వృద్ధుండును, మిథ్యాధర్మోపదేష్టయును నగు నీకుం దొలుత నొక్క హంసంబు నిజ బాంధవులవలనం జెడిన తెఱంగున జ్ఞాతివర్గంబుచే నీకు హానివాటిల్లం గల యది. పెద్దలవలన వినిన యాయితిహాసంబు నీకెఱింగించెద. ఆకర్ణింపుము. పూర్వకాలంబున సముద్రతీరంబున నొకవృద్ధ హంసంబు గలదు. అవి ధర్మంబె యాచరింపవలయుననియును, నధర్మంబు సేయ వలదనియును, సంతతంబును నిఖిల పక్షిగణంబులకు నుపదేశంబు సేయుచుం దానధర్మంబు గావింపుచునుండు. ఇట్లు వలికెడు హంస వచనంబులు విని సమ్మోదంబునం బొదలుచు విహంగంబు లెల్ల దాని సన్నిధానంబునకు జేరి మహాత్మా! మాకు మీరలు ధర్మంబు సంక్షేపరూపంబున వివరింపవలయుననిన నది యిట్లను. విహంగంబులారా! అహింసయె పరమధర్మంబు. హింస గావించుటయె దుష్కృతంబు. ఇంతమాత్రం బెఱింగి నడువుండనిన రాజహంస వాక్యంబు లంగీకరించి ధర్మ నిరతంబులగు ఖగంబు లాశ్చర్యభరితంబులగుచు నవ్వంశ వృద్ధునిం గనుంగొని లోకంబున సుకృతంబు నాచరించు పురుషశ్రేష్ఠుం డెట్టి పుణ్యలోకంబున కరుగు? అది యెఱింగింపవలయు ననిన నాహంసంబు ధర్మశీలుండగు వానికి సమస్త లోకంబులు హస్తగతంబులని తెలియుండు, అనిన నాపతంగంబులు దాని నిరీక్షించి యిన్ని ధర్మంబు లెఱింగిన నీవు దుర్లభంబగు స్వర్గంబు నొందకుండెదు కారణంబేమనిన నమ్మరాళంబు శకుంతంబులారా! మీరు బాలురగుటం

జేసి ధర్మసూక్ష్మంబు తెలియం జాలరు. జగంబున నధర్మంబు గావించిన యతం డాయుష్యాంతంబున శరీరంబు దొఱంగి త్రిదివంబునకుం జను గావునం దాను దేహాంతంబున నాకలోకసుఖం బనుభవించెద. ఇది ధర్మస్వరూపంబని యివ్విధంబున నిఖిల విహంగంబులకు హితోపదేశంబు గావించిన నవియు నాపలుకు లాలించి యితండు ధర్మవిధిజ్ఞుండని మిగుల విశ్వసింపుచు నది మొకలుగ నాసముద్రప్రాంతంబునం ద్రిమ్మరి యారాజహంసంబునకు మనఃప్రియంబులగు నాహారంబులు దెచ్చి యొసంగుచు నెరనమ్మి దాని చెంతనె యండంబులిడి స్వేచ్ఛానుగుణంబుగం జరింపుచునుండ నావృద్ధహంసంబు వాని గ్రుడ్లనెల్లను భక్షింపుచు స్వకార్యం బేమరకయుండె. ఇవ్విధంబున నిజసంతానంబు దినక్రమంబున నాశంబు నొందుచుండ నందు నొక బుద్ధిశాలియగు మరాళం బీసంతాననాశనంబునకుం గారణం బీవృద్ధహంసంబని యెఱింగి సకల విహంగంబులు సంచారంబున కరిగిన తఱిం దానొక ప్రదేశంబున దాగియుండి యది యాచరించు కిల్బిషంబులు గనుంగొని దుఃఖంబు జెందుచు నవ్వృత్తాంతంబు నిఖిల శకుంతంబులకు నెఱింగించిన నవియు నట్లన ప్రత్యక్షంబుగాం గనుంగొని కపట వర్తనంబగు నావృద్ధ హంసంబునుం బొరిగొనియె. కావున నాహంస వితంబున మిథ్యాచారుండవగు నిన్ను నీనరేంద్రు లెల్లను పక్షుల తెఱంగున నిప్పుడె సంహరించెదరు.

ఈకథ సభాపర్వంబున డెబ్బదియొకటవ యధ్యాయము.

---

## అధ్యాయము 72

---

అని శిశుపాలుండు మఱియు నిట్లను. ఈ కృష్ణభీమార్జునులు జరాసంధుని గపటోపాయంబునం జంపిన తెఱంగెవ్వరికేనియు నుచితం

బని దోచునే? బ్రాహ్మణవేషధారులై యద్వారంబునం బ్రవేశించిన వీరల ధర్మశీలుండగు జరాసంధుండు మహీసురులుగా దలంచి యుద్ధురాత్మకుండగు కృష్ణునకుం దోలుదోలుత నర్ఘ్యపాద్యంబులొసంగి భుజింపవలయునని ప్రార్థించినయతని కపకారంబు సేసిన యీయాదవుని జగదీశ్వరుండని నిశ్చయించితివేని నిన్ను నీవె బ్రాహ్మణుండవని యేటికితెంగించుకొనవు? బ్రహ్మస్వరూపంబు నీవెంచుకయును తెలియంజాలవు. ఈమాధవుని గోపాలుండని దలంచి యితనితోడ సమరంబు గావింపండయ్యెం గావున బార్హద్రథుండు రాజవర్యుండని నాహృదయంబునం బ్రశంసించెద. ధర్మస్వభావులగు పాండునందనుల నీవీదుర్నీతికి లోనుగావించుటయును, వారలు సదిద్ధిమె మేలని కొనియాడుటయును, నామనంబున విస్మయకరంబై యున్నయది. ఇది యిట్లుండె. వృద్ధుండును నపుంసకుండునునగునీవు యీ కౌంతేయులకు ధర్మోపదేష్టవగుటంజేసి వారలిట్లు ప్రవర్తిల్లుట యద్భుతంబుగానేరదని యివ్విధంబునం బలుకు దమఘోషనందనుని పరుషభాషణంబు లాకర్ణించి ప్రతాపోద్దీపితుండును బలపరాక్రమసంపన్నుండును నగు పవమానతనూభవుండు రోషంబువలన స్వభావరక్తంబులగు పద్మంబులువోని తనచెడంద కన్నులు మిక్కిలి జేవురింప త్రికూట శిఖరాగ్రంబునందోచు భాగీరథీ ప్రవాహత్రితయంబు చందంబున ఫాలభాగంబున రేఖాత్రయంబు గనుపట్టబొమముడిం గదియింపుచు లోకంబులు దహింపంగడంగు ప్రళయాంతకునికై వడిం గోపాతిశయంబున నౌడు కరచుచు దిగ్గనలేచినంగనుంగొని దేవవ్రతుండు, కార్తికేయుని వారించు మహాదేవుని వితంబున నిలుపుచు, బహువిధంబులగు సాంత్వవచనంబుల నతని క్రోధంబడంచిన, వైరిభయంకరుండగు నావృకోదరుండు ప్రచండమారుతోద్ధూతంబగు మహార్ణవంబు వేలాతిక్రమణంబు సేయని తెఱంగున నిలిచె. ఆ సమయంబున నవక్రపరాక్రమశాలియగు శిశుపా

లుండు క్షుద్రమృగంబుల లక్ష్యంబు సేయుని కంఠీరవంబు విధంబున నచంచలుండై మందహాసంబు గావింపుచు మందాకినీ నందను నుద్దేశించి, యతని నీవు వారింప నేటికి? సకలరాజలోకంబు గనుంగొనుచు నుండ దావానలంబునంబడిన శలభంబు చాడ్పున నాప్రతాపాగ్నిచే దగ్ధుండగుగాక, విడువిడుమని యదల్చుచున్న సమయంబున బుద్ధి సంపన్నుండగు కురుపితామహుండు వాయుసూను నుద్దేశించి ఈశుక్తి మతీపురాధ్యక్షునిపై నీవేమిటికి కలిగెదవు? దేవదేవుండగు గోవిందుం డీతని సమయింపంగలవాండు. ఇది నిశ్చయంబు.

ఈకథ సభాపర్వంబున డెబ్బదిరెండవ అధ్యాయము.

---

## అధ్యాయము 73

---

అని మఱియు నిట్లను. ఈ శిశుపాలుండు నేత్రత్రయంబును జతుర్భుజంబులును గలిగి చేదిరాజ కుమారుండై యుద్భవించి తోడన రాసభాస్వరంబున మహారవంబుగ నేడ్చినం గనుంగొని సకలబంధు సహితంబుగ వీని తలిదండ్రులు భయాకులచిత్తు లగుచు నావికృతా కారుండగు బాలకునిం బరిహరింపవలయునని తలంచిరి. అంతం జింతా క్రాంతహృదయుండై యున్న నమ ఘోషు నుద్దేశించి, నరేంద్రా! మహాబలపరాక్రమ సంపన్నుండును నైశ్వర్యసమేతుండునుంగాంగల యీబాలకుని మీరు భీతిచేం ద్యజింప నేటికి? వీనికి మృత్యువు వే ఱొక్కం డవతరించి యున్నవాండు. అతండు శస్త్రంబున హింసింపం గలండు. మీరు పరిపాలించుండని యాకాశవాణి పలికిన వాక్యంబు లాకర్ణించి వీనిజనని పుత్రస్నేహమోహిత యగుచు నంజలి పుటంబు ఘటించి ఇపుడు నాతనయుని వృత్తాంతంబు దెలిపిన యశరీరియగు

మహాభూతంబునకు నిదె నమస్కరించెద. వీని సంహరించువాం డెవ్వం డతని నెఱింగింపవలయు ననిన నానభోవాణి యీబాలకు నెవ్వం డం కంబున నుంచుకొని యున్నతఱి నధికంబగు బాహుద్వయంబు విరిగి పడి ఫాలంబున నున్న లోచనం బదృశ్యంబై పోవు నతండె వీనికి నంతకుండని పలికి పోవునంత నియ్యద్భుతంబు సకల మహీపతులు విని చూడవలయునను వేడుకం జనుదెంచిన వారల నందఱ యథోచి తంబుగాం బూజ గావించి తనకుమారుని నొక్కొక్కని యంకతలం బున నుంచుచుం జనుదేర నాబాలకుం డెప్పటివితంబున నుండె. అంత నిత్తెఱం గాకర్ణించి ద్వారకానగరంబున నున్న మహాబలపరాక్రమ వంతులగు బలరామకృష్ణులు తమ మేనయత్తం గనుంగొనవలయునని చనుదెంచి భార్యాసమన్వితుండగు దమ ఘోష నృపాలునకుం దక్కిన భూపతులకు యథాక్రమంబుగ వందనం బాచరించి వారలం గుశల ప్రశ్నంబు గావింప సుఖోపవిష్టులై యున్నయెడ బాలకునిం దోడి తెచ్చి వాసుదేవుని యంకంబునం దునిచినంత నధికంబగు భుజాద్వ యంబు ధరం బడియె. లలాటనయనం బదృశ్యం బయ్యె. ఇంతయును గనుంగొని యతని జననియగు సాత్వతీదేవి తన మనంబునం బరిత పింపుచుం గృష్ణు నుద్దేశించి మహాత్మా! నీవార్తజనసంరక్షకుండవు. భీతులగువారి కభయప్రదుండవుం గావున భయార్తనగు దనకు వరం బొసంగవలయునని ప్రార్థించిన నతండు తన పితృసహోదరి నవలో కించి, నీకు విచారం బేటికి, ఎట్టివరం బేనియు నొసంగెద ననిన నద్దేవి యు బాలుండగు శిశుపాలుండు నీయెడ నెంతయపరాధంబు గావించె నేనియు క్షమింపవలయు ననిన మాధవుండు ఇబ్బాలుండు వధార్హంబు లగు శతాపరాధంబులు నాయెడం గావించిన నేను క్షమించెద. నీవు శోకంబు జెందకుమని కృష్ణుండు తొలుతం దనకు వరం బొసంగిన

గర్వంబునను నతండు తనకు మృత్యువని యెఱుంగుటం జేసి నిన్ను సమరంబునకుం బిలుచుచున్నవాండు.

ఈకథ సభాపర్వంబున డెబ్బదిమూండవ యధ్యాయము.

---

## అధ్యాయము 74

---

అని భీష్ముండు మఱియు నిట్లను. నీచైద్యాధముం డిప్పుడు దైవప్రేరితుండగుచుం గయ్యంబునకుం గాలుద్రవ్వుచు నున్నవాండు. వీనినిప్పుడ యీయాదువల్లభుండు సమయించు. ఈకులపాంసనుండగు సునీథుండుదక్క బ్రదుక నిశ్చయించిన వేఱొక్క మహీపాలుండు నన్ను నివ్విధంబున దుర్భాషణంబులాడునె? వీండు గోవిందుని యంశభూతుండు గావునం గృష్ణుండు తనతేజంబు తానె కైకొనందలంచుటం జేసి వీండు మనలం జీరికింగొనక శార్దూలంబు చందంబున గర్జింపుచు నున్నవాండని పలుకు మందాకినీ నందనుని యాలాపంబులాలకించి రోషభీషణాకారుండగుచు దమఘోషనందనుండతని నుద్దేశించి యింతతడవువంది విధంబున శాత్రవులనుగు పూకట్టెదుట నీయాదవునిం బొగడితివి. ఈ నిఖలరాజన్యుల నిట్లు సన్నుతించితివేని నీ స్తోత్రంబు సఫలంబగు. ప్రశంసించుటకు నీకు వేడుక కలదేని యౌదార్యశాలియును రాజశ్రేష్ఠుండును నగు బాహ్లికునిం గొనియాడుము. బాలార్కసంకాశంబగు సహజ కవచంబును దివ్యంబులగు కుండలంబులును ధరించి తేజరిల్లుచున్నవాండును, చాపవిద్యావిశారదుండును, మహేంద్రోపమానుండును, నంగరాజ్యాధ్యక్షుండును నగు నీకర్ణుని నుతియింపుము. భూసుర శ్రేష్ఠులును, ధనుర్ధర వర్యులును, స్తోత్రార్హులును, మహారథికులునునగు నీద్రోణాశ్వత్థామలలోన నొక్కండలిగా

నేనియును ఈ రాచరాత్మకంబగు నీ ప్రపంచంబు భస్మంబుగావింపం జాలుదురు. కాన వీరినవ్వరిలో నొక్కనినైన వినుతింపరాదే? చతుస్సముద్రపరివేష్టితంబగు మహీమండలంబునకు నధ్యక్షుండగు దుర్యోధనుండును, నస్త్రశస్త్రవిశారదుండగు జయద్రథుండును, గింపురుషాచార్యుండగు ద్రుముండును, భరతకుల శిక్షకుండగు కృపాచార్యుండును, మహాశౌర్య సంపన్నుండగు భీష్మకుండును, ప్రతాప ప్రసిద్ధుండగు దంతవక్త్రుండును, వైరిభయంకరుండగు భగవంతుండును, గీర్తిమంతుండగు భూరిశ్రవుండును, జయశీలుండగు జయత్సేనుండును, ధైర్యధుర్యుండగు మాగధుండును, క్షుద్రదేశాధీశ్వరుండగు శల్యుండును మఱియును దక్కంగల మహాభుజులగు భూభుజుల నిరసించి యీ గోపాలకుని బ్రశంసింప నేటికి? ఎల్లప్పుడును నొకనిం బొగడుచు నుండవలయునని నీకు వేడుక కలదేని నీ మనంబునకుం దోచినట్ల సన్నుతింపుము. ఇది మేము వలదని నందీసనె? ఆత్మనిందయును, నాత్మప్రశంసయును, బరనిందయును, బరస్తుతియును ననునివి సత్పురుషులకుం దగదనుట ధర్మవాదులచే నీవువినినవాండవగుటం జేసియే ప్రొద్దును నీపసుల గాపరిని పలుకుచుంగొనియాడెదవు. భోజరాజభృత్యుండై వత్సంబుల మేపుచున్న యీదురాత్ముని జగదీశ్వరుండని యుచ్చకంబు నలికెదవు. కాని నిజంబరసిచూడ నిది భక్తియును గాదు. స్తుతిపాఠకుని విధంబున నూరక యొకనిం బొగడుచుండుటయె నీస్వభావంబు. ఇది యెవ్వరికి సమ్మతంబుగాదని యివ్విధంబున నిందించు చైద్యుని పరుషభాషణంబు లాకర్ణించి భీష్ముండు కఠోరవాక్యంబుల నతని కిట్లను. చైద్యాధమా! యిప్పుడీ యున్న రాజలోకంబును నీవును నా దృష్టికిం దృణమాత్రంబుగ దోచుచున్నవారు. యాగంబునకు విఘ్నంబు వాటిల్లునో యని తలంచెదు ధర్మనందనునకై సైరించియున్నవాండనని పలికిన శాంత

వుని వచనంబు లాకర్ణించి నిఖిల ధరావల్లభుల లోనం గోపోద్దీపితు లగు వారును, గొంద ఱీభీష్ముని దూషించువారును, గొందఱు సంత సించువారును, మఱికొందఱు పాపాత్ముండును, గుత్సితుండును, వృద్ధుండును నగు గాంగేయుని నెల్లభంగులం బశువుచందంబునం బట్టి తెచ్చి హింసింపవలయునను వారును, గాదేని కటాగ్నిచే దహింప వలయునను వారునునై యుండ వారల వచనంబులు విని రోషభీష ణుం డగుచు శంతను నందనుండు, నృపాలకులారా! ఇట్టి వృథాలాపం బులవలనం బ్రయోజనం బేమి? మీరలందఱు వినం బలికెద. తన్నుం బశువు తెఱంగున సంహరింపవలయుననియును, గటాగ్నిచే దహింపవలయునని యుంటిరి. మీకుం దోచిన తెఱంగునం గావిం తురుగాక! ఇదె మీయందఱి శిరంబులు వామపాదంబునం ద్రొక్కి యీజగదీశ్వరునికి సపర్య గావించినవాండ. శంఖచక్రగదాద్యాయుధ ధరుండునునగు నతండిదె యున్నవాండు. ఎవ్వనికి జముపురంబు చూడవలయునని వేడుకై యున్నయది? వాండు కృష్ణుని యుద్ధంబు నకుం బిలువుమ. వాని తేజంబు కృష్ణునియెడం బ్రవేశింపంగలదు.

ఈకథ సభాపర్వంబున డెబ్బదినాల్గవ యధ్యాయము.

---

## అధ్యాయము 75

---

అని పలికి భీష్ముని వచనంబు లాకర్ణించి ప్రతాపవంతుం డగు శిశుపాలుండు సమర సముత్సాహంబు దీపింప నిలిచి లోకేశ్వ రుం డగు వాసుదేవునిం గనుంగొని, యదునందనా! మహానుభావు లగు నీరాజన్యుల నిరసించి గోపాలకుండును, బూజకు ననర్హుండును రాజభావవిరహితుండును నగు నీకు సపర్య యొనరించిన పాండు

నందనులను, కావించుమనిన గాంగేయుని, గైకొనిన నిన్నును, సంగ రాంగణంబున నిప్పుడు తెగటార్చెద. యుద్ధసన్నద్ధుండవై నిలువుమని పలికి కంఠీరవంబు చందంబున గర్జిల్లుచు నిఖిల మహీపాలకులు నిరీక్షింప యాగంబునకు విఘ్నంబు గావింపవలయునను తలంపున ననేక రాజ పరివృతుండై మహాకార్ముకంబు కరంబునం బూని సత్వరంబుగ నడచిన, చక్రాయుధధరుండును, గేశినిషూదనుండును నగు కేశవుండు భీష్ముని హస్తంవలంబించి కనకపతాకాలంకృతంబగు రథంబెక్కి సమీపంబున కరుగుదేరం గమలపత్రాక్షుండును, గరుడ ధ్వజుండును, భాస్కరప్రభాభాసమానుండును నగు వాసుదేవుని వీక్షించి యతని దివ్యతేజంబువలన నవశత్వంబు జెంది సకల రాజన్యులు యథాయోగ్యంబుగ వందనాదికృత్యంబు లాకర్ణించిరి. అంత నమ్మహీ కాంతుల నాలోకించి మురాంతకుండు సాంత్వపూర్వకంబుగ నిట్లను. రాజవర్యులారా!నిష్కారణంబుగమీకు మాతో వైరంబేటికి?మీవంటి వారలకు నిట్లు కోపంబు జనింపం జేసిన యీదురాత్ముకుండగు శిశుపాలుండు మాకుం బగతుండు. అట్లగుట మీరలు నిజసేనాసమేతంబుగ మఱలి చనుండు. ఎల్లభంగుల వీనిం బొరిగొనక మాన. వీండు మున్ను మాయెడం గావించిన ద్రోహంబుల వినరించెద. మేము నరకాసుర సంహారంబుగం బ్రాగ్జ్యోతిషపురంబునకుం జనిన సమయంబున వీండు ద్వారకాపురంబు దహించి చనియె. మాబాంధవులగు భోజభూపాలకులు రైవతకాచలంబున విహరించుతఱి నయ్యెడకు వీండరుగుదెంచి యందు కొందఱం బొరిగొని, కొందఱ బంధించి నిజనగరంబునకుం గొని చనియె. నాజనకుండగు వసుదేవుండశ్వమేధాధ్వరంబు గావింపుచు నున్నయెడ సైన్యాధిపతులవలన సంరక్షితంబై సంచరించు తురంగంబు నీపాపాత్ముండు యజ్ఞంబునకు విఘ్నంబు గావించు తలంపున నపహరించె. నేను సౌవీరదేశ విజ

యార్థంబుగాం జని యున్న సమయంబున నీపాపకర్ముండు మహాను భావుండగు బభ్రుని భార్యను బలాత్కారంబునం బట్టికొని చనియె. మఱియును నీదురాత్ముండు ప్రచ్ఛన్నుండగుచుం జని తన మేన మామయు నాజనకుండును నగు నీవసుదేవుండు విశాలరాజకుమారి వై శాలియను నామధేయంబుగలదాని బరిణయంబగు సమయంబున దంతవక్త్రుండు సహాయంబుగ నయ్యంతిని బలిమి నపహరించుకొనియె. ఇదియునుం గాక కుకురాంధకవృష్ణిభూపతుల ననేకుల నపహరించి సంతుష్టుండై యుండె. వీండు జరాసంధుని నాశ్రయించి మాయెడం గావించిన ద్రోహంబు లెన్నియని వచియింప నలవియగు! ఈ క్రూరకర్ముండు జనియించుట మొదలుగ వృష్ణివరులకుం గావించిన యపకారంబులు గలవు. వీనియెడ వధార్హంబులగు శతాపరాధంబులు సైరించెదనని వీని జననికి వరం బొసంగినవాండ నగుటం జేసి ధర్మపాశబద్ధుండనై యన్ని యపరాధంబులట్లన విని జననిం దలంచి సైరించితి. అయినను, నీయజ్ఞవిఘాతం బాచరించుటయుం బాండవుల దూషించుటయు నను నీరెం డపరాధంబు లెట్లు సహింపనగు? ఇప్పుడు మీ యందఱి సన్నిధానంబున వీండు నన్ను నిరాకరించి దూషించుట యెల్లవారలకుం దెల్లంబై యున్నదిగదా! తొలుత శూద్రుండు వేదంబు నిచ్ఛయించిన తెఱంగున నీమూఢాత్ముండు రుక్మిణీదేవి నభిలషించె. ఇట్టి మహాపకారం బెవ్విధంబున సైరింపనగు? ఇన్నిటికిం బ్రాయశ్చిత్తంబుగ వీని నిప్పుడె మీరు కనుంగొనుచుండం దెగటార్చెదనని యివి మొదలుగాంగల శిశుపాలుని యకృత్యంబులు కృష్ణుండు గడింప విని యుద్ధసన్నద్ధులైన మహీపతులు భయభ్రాంతులగుచుం జతురంగబలసమన్వితంబుగ మరలిరి. ఇట్లు కృష్ణ తేజోనిరస్తులై చను భూపాలకుల నాలోకించుచు రథారూఢుండును, రోషారుణలోచనుండును, సజ్యకార్ముకధరుండును నగు నాచైద్యుం

డొక్కరుండును దవానలంబు నెదిరించు శలభంబుచందంబున శర సంధానంబు గావింపుచు నాకేశవున కభిముఖంబుగ రథంబు పరపించె.

ఈకథ సభాపర్వంబున డెబ్బదియైదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 76

---

ఇత్తెఱంగున శిశుపాలుండు యుద్ధసన్నద్ధుండై నిలిచిన యవసరంబునం బ్రజ్ఞాసంపన్నుండగు ధర్మనందనుండు నారదునిం గనుంగొని, మునీంద్రా! భువన త్రయంబునందును మీ రెఱుంగని యర్థంబులేదుగదా? భూమ్యంతరిక్షంబులయందు రాజవినాశ సూచకంబులగు మహోత్పాతంబులును, దుర్నిమిత్తంబులును దోచుచున్న యవిగదా! ఇన్నియును నీచేవిశదంబుగ నెఱుంగందలంచెదనని యడిగిన నతనికి సకలలోకప్రసిద్ధుండును బుద్ధిసంపన్నుండునునగు బ్రహ్మనందనుండు, పాండవాగ్రజా! లోకంబునదైవజ్ఞుండగువాండు సూర్యాది గ్రహంబులయెడంగలుగు పరాక్రమంబును, గతివిశేషంబును, బరస్పర యోగంబును, నుచ్చనీచభావంబులును, సముచ్ఛ్రియంబులును, నితరేతరాభిముఖ్యగమనంబును, నన్యోన్యకిరణసంసర్గంబును, మార్గంబును, యుద్ధంబును, దర్శనాదర్శనంబులును, సదృశ్యంబులు కనుబట్టుటయు, దృశ్యంబులు కనుపడకయుండుటయు, వృద్ధిక్షయంబులును, బలహీనతయును, గ్రమంబున బలక్షయంబగుటయును, వర్ణస్థానంబులును, బలాబలంబులును, నెఱుంగవలయు. మఱియును దేవనిర్మితంబులగు ననేకోత్పాతంబులు తోలుదోలుత భూస్థలంబునను పదంపడి నభంబునందోచు. భువనంబున నేపురుషునినీడ యపరాహ్ణ సమయంబునందును దూర్పునకు నిగుడకయుండు దాన నతనికి హానివాటిల్లునని

తెలియవలయు. జనాశ్రయంబులగు చైత్యవృక్షంబులకు నీడ కనుపట్టక యుండు దేశంబునందును స్పష్టంబగు ప్రతిఛాయ చందంబున నీడ తోచుటయు, జీర్ణపత్రంబులు పల్లవంబులు నేకసమయంబున రాలుటయు, నిర్నిమిత్తంబుగం బర్ణంబు లెండుటయు నరిష్టసూచకంబుల నంబడు. మఱియును వృక్షంబులు చిగురు జొంపంబుల మనోహరంబులై చేతనకృత్యంబు లాచరించని తెఱంగు కనంబడెనేని యదియశుభ కారణంబు. ప్రసూనంబుపై ప్రసూనంబు, ఫలంబుపై ఫలంబు తరుశాఖలంగనుపించెనేని యాదేశంబునకుంగల రాజునకేనియును, నతని సమానంబగు పురుషునకేనియును మరణంబు వాటిల్లు. ఒకఋతువునంబొడమెడు ఫలపుష్పంబులు మఱియొకఋతువునం జనించెనేని రాజ్యక్షోభంబుగలుగు. పూజ్యాపూజ్యంబులగు నశ్వత్థాది పాదపంబులు వాతాహతంబులుగాక విరిగిపడుటయును, జీలుటయును, వాలుటయునుంగలిగెనేని, యయ్యెడమారు తాగ్ని భయంబేనియును, బ్రభు వినాశనంబేనియును సంభవించు. ఎల్లదిక్కులు మండెడు తెఱంగునం గనిపట్టిన యాదేశంబునకు నుపద్రవంబుజనియించు. మహీరుహంబు నరికెడు సమయంబున నతిఘోరంబగు మహాధ్వని బొడమిన యయ్యెడంగలజనులకు హాహాకారంబుప్రాపించునట్టి భూరుహంబునరికి పడవైచిన యతండును నరికించిన యతండును శీఘ్రుంబునంబంచత్వంబు నొందంగలరని యెఱుంగుము. దేవతాప్రతిమలు నిష్కారణంబుగం బడుటయు, మంటపంబుల మహాధ్వనిపుట్టుటయును, బర్వతంబులు గదలుటయును ననునివిమహాభీతికి నిదానంబులు. నిశాసమయంబున నింద్రాయుధంబు వీక్షింపంబడెనేనిం గనుగొనినవాండు తద్దేశంబు బరిత్యజించవలయు. నృత్తగీతలాస్యంబులును, నేత్రోన్మీలననిమీలనంబులును నను నిట్టికృత్యంబులు దేవతా విగ్రహంబులయందు కనంబడియెనేని యారాష్ట్రింబునకు హానిగందెలియుము. శిలలవలన నుండి

జలవికారంబు స్రవించుటయును, నిష్కారణంబుగ జలంబుల యందుం జమురు గనిపించుటయును, మఱియునుంగల వికారంబులు గలిగెనేని రాజైనను మంత్రియైనను వినాశంబునొందు. కాదేని దేశంబునకు వ్యాధిభయంబులువాటిల్లు. దేవతాభవనంబుల, రాజమందిరంబుల, ధనాగారంబుల, నాయుధశాలలం దేనెపుట్టుపెట్టెనేని బలశాలి యగువానిచేత దేశంబునకు భయంబుప్రాపించు. వృక్షంబులయెడ రక్తస్రావంబుగలిగిన జనోపద్రవంబును, గజదంతంబులవలన శోణితంబువోడమిన రాజునకు భయంబును, వృషభశృంగాగ్రంబువలన రుధిరంబు జనించెనేని గోబ్రాహ్మణ వినాశంబును గలుగనోపు. మహీపాలకుని ఛత్రంబు తునిసి ధరాతలంబునం బడెనేని ప్రజాసమేతంబుగ నతనికి హానిగలదు. నదులయెడ నకాలప్రవాహంబు గలిగిన రాజ్యంబునకు భీతి సంభవించు. దేవతాగృహంబుల రాజసదనంబుల గజశాలలవికారంబులు వోడమెనేని దేశంబునకు రాజునకుంబీడ వాటిల్లు. దేవతాప్రతిమలకు బాహువులు భగ్నంబైన గృహస్థులకునుప్రదవంబు గలుగు. ఆదేవతామూర్తిచే నుండెడు నాయుధంబు పడెనేని సేనాధిపతి వినాశంబునొందు. ఉపద్రవంబువలన దేశాంతరంబున నుండియుం జనుదెంచిన దేవతామూర్తుల నుచితస్థానంబులనిడి పూజలు నడిపింపండేని యాభూపాలునకు నాలునెలలలోన రాజ్యభ్రంశంబు గలుగు. భూమి వ్రక్కలగుటయును మ్రోయుటం గలిగిన నయ్యెడంగలుగు రాజునకును రాష్ట్రంబునకును హాని సిద్ధంబు. పాము జలగ, నలికిరియును నను జంతువిశేషంబుల మండూకంబు గ్రసించెనేని యాభూమిం గల భూపతి వినాశంబు నొందు. ఆకాలంబునం గూపంబులు జలసమృద్ధంబులగుటయును, స్థావరంబుల నుదకంబులు స్రవించుటయును, నేకపాదంబును, ద్విపాదంబులును, మస్తకద్వయంబును, జతుర్భుజంబులునుం గలిగి బాలకులు జనించుటయును, గరేణు

మహిషీ ధేనుగణంబుల ఖరోష్ట్రసూకరంబులు ప్రభవించుటయును, మేకలును, గొఱ్ఱెలును, బసులును మొదలగు వానివలన వికృతజంతువులు సంభవించుటయును, నదీజలంబులు ప్రలంగంబారి యెదురెక్కుట యును, దిశలుమలినంబులగుటయును ననునివి యపజయసూచకంబులని యెఱుంగుము. పక్వంబును భిన్నంబును గాక నన్నంబు భాండంబు నిండియుండెనేని యది భుజింపక తోలు తన నాగృహస్థులకు మరణంబు ప్రాప్తంబగునని తెలియుము.

ఈకథ సభాపర్వంబున డెబ్బది యాఱవ యధ్యాయము

---

## అధ్యాయము 77

అనిన నారదుండు మఱియు నిట్లను.చంద్రాదిత్యగ్రహతారకంబులవలనను, వాతాగ్ని మహీజలంబులయందును, నివి మొదలగు దుర్నిమిత్తంబు లేదేశంబునకు హాని గావింపవలయునని యీమాధవుండు తలంచె నాదేశంబునం గనుపట్టు. ఇతండే రాజ్యంబు రక్షింపవలయునని తలంచె నచ్చట శుభనిమిత్తంబులు జనించు. అట్లగుట నీచైద్యునికి వినాశకాలంబు సమీపంబగుటం జేసి యీకృష్ణుం డిట్టి యుత్పాతంబులు గల్పించుచున్నవాండు. కావునం గదా భూమి కంపించుటయును, నపర్వకాలంబున రాహువు చంద్రుని గ్రసించుటయును, నిర్ఘాతసహితంబుగ నుల్కాపాతంబులగుటయును, ప్రచండ మారుతంబులు విసరుటయును, నాకసంబున నంధకారంబు నలుదెసల నావరించుటయును గలిగియున్నవని నారదుండు ధర్మనందనునకు వివరించె. అయ్యేడంగల యుత్పాతంబులు సకల రాజన్యులు గనుంగొనుచునుండ యుద్ధసన్నద్ధుండై శిశుపాలుండు నతికుపితుండగుచు

మధుసూదనునిపై దార్కొను సమయంబున శివారావంబు లెసంగుటయును, గానన శైలసమేతంబగు మహీచక్రంబు మ్రోయుటయును, నకాలంబున సూర్యబింబంబు రాహువు గ్రసించుటయున్, జైద్యుని రత్నధ్వజంబుపై నభంబునుండి తీక్ష్ణతుండంబుగల గృధ్రంబు పడుటయును, గ్రామ్యంబులగు మృగవిహంగంబులును నరణ్యమృగవిహంగంబులునుం గలసి మహారావంబు గావించుటయును ననునివి మొదలుగాం గల మహోత్పాతంబులుగనుపట్టె.

ఈకథ సభాపర్వంబునం డెబ్బది యేడవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 78

---

అంత నిత్తెఱంగున రోషభీషణాకారుండై నిలిచిన మధుసూదనుం గనుంగొని చేదిదేశాధీశ్వరుండగు శిశుపాలుండు యుద్ధసన్నద్ధుండగుచు నత్యున్నతంబగు కోదండంబు కేలం బూని గుణంబు సారించుచు నతని కభిముఖుండై, నిలిచి యీలోకంబున నాకు నీవొక్కరుండ శత్రుండ వగుటం జేసి చిరకాలంబునుండి నీతోడి ద్వంద్వయుద్ధంబ పేక్షించి యుండుదు. నేండు దైవయోగంబున నాకబ్బారింబడితివి గాన భీష్మపాండవ సహితంబుగ నిన్ను నిపుడె తెగటార్చి చతుస్సముద్రపరివేష్టితంబగు భూమండలం బంతయు నిష్కంటకంబుగం బరిపాలించెద నని వీరాలాపంబు లాడుచు నతిసిశితంబులగు కురుచకనుపు తూపులతనిపై నిగుడించె. ఇట్లు చేదిరాజ ధనుర్విముక్తంబులగు నా కంకపత్రంబులు ధరాధరగుహాలం బ్రవేశించు భుజంగంబులకైవడి నమ్మురాంతకుని దేహంబునం గీలుకొనియె. ఆచైద్యుని కరలాఘవ శరలాఘవంబు నభంబున విహరించు సమీరణుగతి విధంబున సకల

జనంబులకు దృష్టిగోచరంబు గాదయ్యె. మఱియు నాశిశుపాలుండను ధరాధరంబు శరవర్షంబున నయ్యాదువీరుండను పర్వతంబుం గప్పె. అంతనాదనుజాంతకుండును సకలశత్రుభయంకరంబగు 'శార్ఙ్గచాపంబున మహనీయంబగు నొక్క సాయకంబు సంధించి యతని నుపలక్షింపుచు వజ్రాయుధంబునం బర్వతంబు భేదించు కైవడి నీమార్గణంబున నీహృదయంబు భేదించెదనని నిగుడించు నాలోన నాచైద్యుండును నిశితశరపరంపరల నొక్కుమ్మడి నిగుడించె. ఇట్లతని బాణంబులవలన బీడితుం డగుచుం బరాక్రమాధుర్యుండగు నాయదువల్లభుండు శతసహస్రసంఖ్యంబులగు క్రూరనారాచంబులు ప్రయోగింప నతండును వాని నన్నింటిని నడుమనె ఖండించి యాలుశితశరంబు లామురాంతకుని యురస్స్థలంబున నాటించిన నతండును నొక్క దివ్యాస్త్రంబు నిగుడింప నాశిశుపాలుండును ప్రత్యస్త్రంబున నది వారించి మఱియు ననేక బాణంబుల నమ్మురారిం గప్పి శౌర్యరసోద్దీపితుండై సింహనాదంబు గావింపుచు నతని కిట్లనె. ఎల్లభంగుల నీసంగ్రామరంగంబున నాదివ్యబాణంబులం బుత్రామాత్యసహితుం డగు నిన్నుం బాండునందనులతోం గూడ నిప్పుడె సమయించి యాపరమమిత్రులగు కేశి, జరాసంధ, కంస, నరకాసురుల ఋణంబు దీర్చుకొనియెదనని క్రోధతామ్రాక్షుం డగుచు బహుబాణజాలంబు లతనిపయిం గురిసి మాయాబలంబునం దిరోహితుం డయ్యె. ఆకంసారియును శతసహస్రసంఖ్యలగు శిలీముఖంబు లతనిపై నడరింపుచు నిట్లనును. చైద్యాధమా! లజ్జారహితుండ వగుచుం బెక్కులు ప్రేలెదేటికి? క్షణమాత్రంబు నాకట్టెదుట నిలువం జాలుదువేని నీకు నెంతయును బరమమిత్రులగు జరాసంధాదులం జూడం బనిపెద నని తానును నదృశ్యాకారుండగుచు నతని శరపరంపర లన్నియు నొక్క

దివ్యాస్త్రంబున ఖండించి మఱియు ననేక మార్గణంబు లతనిపయిం గుప్పించె. ఇట్లద్భుతాకారులై పోరు నమ్మహావీరుల యుద్ధం బుపలక్షించి మున్నెన్నడును నిట్టి సంగ్రామంబు కనియును వినియును నెఱుంగమని యాశ్చర్యభరితంబు లగుచు భూతగణంబులం బరంబునం బ్రశంసింపుచుండె. అంత నాదమఘోషనందనుండు మార్గణత్రయంబున నమ్మురవైరిని బెట్టు నొప్పింప నతండును నైదువాలికతూపు లతని మేనం గీలించి మఱియు డెబ్బది శితశిలీముఖంబుల మిగుల నొప్పించిన సంగ్రోధమూర్ఛితుం డగుచు నాసునీథుండును బటుచండకాండంబు లతనిపై నొక్కట నిగుడించి, మూండు నారాచంబుల నతని స్తనాంతరంబు భేదించి సింహనాదంబు గావించె. ఇత్తెఱంగున నఖంబులం బోరు బెబ్బులుల కైవడి దంతాఘాతంబులం బెనంగు భద్రదంతావళంబుల మాట్కిం గరాళదంష్ట్రలం జీరు మృగేంద్రంబుల తెఱంగున, నారెలచేం జించు చరణాయుధంబుల పోలికె నయ్యిరువురును బరస్పరబాణవిదారితాంగు లగుచు నతిఘోరంబగు ద్వంద్వయుద్ధంబు సేయు సమయంబున రోషానలభీషణుం డగుచు శిశుపాలుండు దివ్యాస్త్రప్రయోగంబునకుం గడంగి యాగ్నేయాస్త్రంబు నిగుడింపం గృష్ణుండు వారుణాస్త్రంబున వారించె. మఱియు నతండు కౌబేరాస్త్రంబు నిగుడ్ప నా ధనంజయసఖుండు దానన మరల్చిన శౌర్యధురంధరుండగు నా చైద్యుండు యామ్యాస్త్రంబువరపిన నతండు తదస్త్రంబునసె నిహతంబు గావించె. మఱియు నా చైద్యుండు గాంధర్వంబును, మానవంబును, వాయవ్యంబును, నైంద్రంబును, రౌద్రంబును మొదలగు దివ్యాస్త్రంబులు ప్రయోగింప నాకృష్ణుండును దత్తదస్త్ర ప్రయోగంబున విఫలంబు గావింప నాసునీథుండు విలయకాలాంతకమూర్తి కైవడిం గుపితుండగుచు సకల భువనభయంకరంబుగ వైష్ణవాస్త్రంబు బ్రయోగింప నయ్యుపేంద్రుండును వైష్ణవా

స్త్రంబున దాని నస్త్రమంబున వారించె. ఇవ్విధంబున నితరేతర శస్త్రాస్త్రంబులు విఫలంబులు గావింపుచు నతిఘోరంబుగ సమరంబు సల్పునెడ నాచైద్యుండు మాయాబల సమన్వితుండగుచు శక్తితోమరగదాముసలపరశ్వధ ప్రముఖాయుధవర్షంబులు గురియించిన నమ్మేకుందుం డమోఘంబగు దివ్యాస్త్రంబుల నివారించె. మఱియు నాదమఘోషనందనుండు శిలావర్షంబులు గురిసిన వాసుదేవుండు వజ్రాస్త్రంబునం జూర్ణంబుగావించె. అతండు జలవర్షంబు గురియించిన కృష్ణుండు వాయవ్యాస్త్రంబున విరియించె. ఇవ్విధంబున నతిరథశ్రేష్ఠులగు నయ్యిరువురును మఱియు నొక్క ముహూర్తమాత్రం బతి విస్మయకరంబగు రణంబు సల్పుచుండిరి. ఆసమయంబునం జేదివల్లభుండగు నాశిశుపాలుండు గోవిందునిం గనుంగొని యదునందనా! నేఁడు మొదలుగ నీలోకంబునం గృష్ణుండను నామధేయంబు లేకుండునట్లు గావించెద, నిలు నిలుమని యదల్పుచుం బ్రచండకాండంబు లొక్కమొగిందొడిగి నిగుడించిన నాశిలీముఖజాలంబుల జర్ఝరితాంగుండగుచు యదునందనుండు రక్తప్రవాహంబులు దొరుంగ క్షణమాత్రం బూరకయుండె. మఱియు నాచైద్యుండు సూతాశ్వరథపతాకా సమేతంబుగా మార్గణాసారంబునం గప్పె. ఇట్లతినిబిడంబులగు నతని బాణజాలంబుల లోకంబులు భయంబు జెందె. ఇత్తెఱంగున నతని శరపరంపరల నావృతుండగు జగన్నాథునిం గనుంగొని సకలభూతంబులు దల్లడిల్లుచు హాహాకారంబు గావించె. ఆసమయంబున సారథియగు దారుకుండు మధుసూదనుం గనుంగొని, మహాత్మా! ఇట్లతిదారుణంబగు సంగరంబు మున్నెన్నండును జూచి యెఱుంగ. లోకేశ్వరుండవగు నీశౌర్యప్రభావంబుల నెఱింగినవాండనగుటంజేసి యుండవలయునని యున్నవాండ. ఇంక క్షణమాత్రంబేనియును బాణంబులు నిలువంజాలవు.

ఈదుష్టాత్ము నతివేగంబునం దెగం జూడుమనవుడు గోవిందుం డతని కిట్లను. వీండు తొలుతవరగాన గర్వితుండగుచుం ద్రైలోక్య కంటకుండై 'హిరణ్యకశిపు నామధేయంబునం బ్రవర్తిల్లుచుండె. పదంపడి భువనభయంకరుండగు రావణుండై జనియించె. ఇప్పు డివ్విధంబునం బొడమి యట్టి బలవీర్యధురంధరుండగుచు నాదు శౌర్యాటోపంబులు సరకు సేయక యున్నవాండు. ఈదుష్టచిత్తునకు నాదుష్టచిత్తునకు నాయాయుగంబుల నేనేమృత్యువనై సంహరించితి. ఇట్టునే గలుగ నీకు భయంబేటికి? ఇంచుక సైరింపుము, అని సింహనాదంబు గావింపుచు దిక్కులు పిక్కటిల్లం బాంచజన్యంబు పూరించి యాచేది వల్లభుని మూర్ఛితుం జేసి శతకోటి ప్రభాభాసమానంబును సహస్ర ధారా విరాజమానంబును నిఖిలదానవసంత్రాస కరంబునునగు చక్రంబు కరంబున నమర్చి ప్రయోగించిన నా దివ్యసాధనంబు ప్రళయానల జ్వాలాభీలంబగుచు విస్ఫులింగంబులు నలుదిక్కులం జెదర మనోవేగంబునం బరతెంచి యాదుష్టాత్ముని మస్తకంబు ఖండించిన నదియు వజ్రప్రహారంబునం ద్రెళ్ళు కులశైలంబు చందంబున మహీతలంబునంబడియె. అంత నతని దేహంబునుండి యొక్క దివ్య తేజంబు మేఘమండలంబువలన వెలువడివచ్చు మార్తాండబింబంబు తెఱంగునం దోచుచుం జతుర్దశ భువనాధీశ్వరుండును, బుండరీకాక్షుండును, సకల దేవ మునిగణస్తూయమానుండును, నిత్యుండును, నజుండును నగు నా కృష్ణదేవుని దివ్యదేహంబున సకలజనంబు లాశ్చర్యభరితులై కనుంగొనుచునుండం బ్రవేశించె. ఆ సమయంబున మేఘంబులేకయ గగనంబు వర్షంబుగురియుటయును, ధరణీచక్రంబు కంపించుటయును, జ్వలితాశనిపాతంబులునుం గలిగె. అట్టియెడ నిఖిల మహీపాలురును నొండేమియునుం బలుకక యూరకుండిరి. అందుం గొందఱు రాక్షసాంశ సంభవులగు రాజులు రోషారుణిత లోచను

లగుచు నా దైత్యాంతకుని జూచుచుంజూచువారును, గోపావేశంబున గరపీడనం బొనర్చువారును, క్రోధంబున నొడుగరచువారునునై యుండిరి. మఱియును గంధర్వాంశ జనితులగు భూపతులు నమ్మురాసురమర్దను సంతసంగంబునం బ్రశంసించువారును, బ్రకాశంబుగం బ్రశంసించువారునునై యుండిరి. ప్రాజాపత్య గణాంశ సంభవులగు మహీపతులు మధ్యస్థులై యూరకుండిరి. మఱియును బ్రహ్మర్షులును దేవర్షులును సిద్ధులును గంధర్వోరగ చారణ గణంబులును భూసుర సంఘంబులును జయజయశబ్దంబులం బ్రశంసింపుచు వివిధగీతంబుల తోడ సర్తనంబులు సేయుచు నానంద భరితులై యాదైత్యాంతకునింబరివేష్టించి యుండిరి. అంత ధర్మనందనుండు తమ్ములం గనుంగొని యతిపరాక్రమశాలియగు నీ శిశుపాలునకు సంస్కారాది పరలోకక్రియలు సేయించుమనిన వారలు నతని కుమారునిం బనిచి యట్లన గావించిరి. అంత పాండవాగ్రజుం డాశిశుపాలనందనుని మంత్రి పురస్సరంబుగం జేదిరాజ్యంబునకుం బట్టాభిషిక్తునిం గావించె.

ఈకథ సభాపర్వంబున డెబ్బదియెనిమిదవ యధ్యాయము.

---

## అధ్యాయము 79

---

ఇవ్విధంబున వాసుదేవపూజా నిమిత్తంబుగా నడచిన విఘ్నంబులన్నియు నుపశాంతంబులైన యనంతరంబ నిఖిలధర్మవిధిజ్ఞుండగు ధర్మనందనుండుగావించు నారాజసూయాధ్వరంబు మహర్షి జన సంకులంబగుచుం బ్రవర్తిల్లుచున్నయెడ వాచాలకులగు తార్కికులొకరి నొకరు జయింపవలయునను తలంపున నానావిధంబులగు హేతువాదంబు లొనరింపుచునుండం గనకమయంబులగు తోరణంబులును,

విహారయోగ్యంబులగు శయ్యాసనంబులును, స్వర్ణమయంబులగు కటాహఘటకలశాదివిచిత్ర పాత్రంబులునుంగలిగి తనరారుచు బాలార్కసంకాశంబులగు రత్నగృహంబుల గ్రహగణంబుల నల గారెడు నభఃస్థలంబులై వడి యజ్ఞవాటంబు శోభిల్లె. ఇష్టభోజనంబుల సంతుష్టులగుచు బహువిధంబులగు నితిహాసంబు లొండొరులకుం జెప్పి కొనుచు నటనర్తకాదులం గనుంగొని చెలంగుచు చతుర్విధ భోజన శాకాది వస్తువిశేషంబులంగలచవులు వర్ణించుచు రాజభృత్యుల వలన సత్కృతులగు మహీసురుల స్తుతిశబ్దంబులునిబిడంబులై చెలంగె. ఇవ్విధంబున నొకలక్షభూసురులు భుజియింప సంకేతార్థంబుగ నొక శంఖంబు పూరింపంబడు. అట్టి శంఖనినాదంబునిరంతరంబుగ వినంబడు చుండె. ఇట్లు కృష్ణసహదేవులచేసంరక్షితంబైన క్రతుశ్రేష్ఠంబగు నారాజ సూయాధ్వరంబు గనుంగొని నానాదేశాగతులగు సకల మహీపతు లును నిఖిలజనంబులును నాశ్చర్యభరితులైయుండ, మఱియు నయ్యజ్ఞ సమయంబునం బర్వతోపమానంబులగు నన్నరాసులును ఘృతదధి ప్రవాహంబులు నద్భుతంబులై కనంబడియె. జంబూద్వీపంబునం దనరు నానాజనపదంబులంగల సమస్తజనంబులమ్మహాయజ్ఞంబు గనుంగొను కుతూహలంబునం జనుదెంచి యొక్కెడం గనుపట్టిరి. అట్టియెడ సకలజాతులవారును నానావిధంబులగు ధనకనక వస్తువిశే షంబులుగొనితెచ్చి ధర్మజున కొసంగిరి. నిఖిలరాజన్యులు దివ్యభూషణ మాల్యాలంకృతులై బహువిధాన్నంబులవలనను, మహారాజయోగ్యం బులగు భక్ష్యభోజ్యలేహ్యచోష్య పానీయంబుల వలనను, స్వాదుఫల శర్కరాక్షౌద్రంబులవలనను, బహుసంఖ్యగల బ్రాహ్మణులకు సంతుష్టి గావింపుచునుండిరి. ఇట్లనేక ధనధాన్య గోగణరత్న కాంచనాది వస్తువిశే షంబులంబరిపూర్ణంబగునయ్యజ్ఞవాటంబువీక్షించిసకలజనులుసంతోష భరితులై యుండునెడం గృష్ణద్వైపాయనధౌమ్యసమేతులును, సకల

శాస్త్రజ్ఞులును, యాగక్రియావిచక్షణులును నగు ఋత్విగ్గణంబులును, తమతమ కృత్యంబులు శాస్త్రోక్తంబుగ నెరవేర్చుచుండిరి. ఇట్టి రాజసూయాధ్వరంబునకుం జనుదెంచిన సదస్యులలోన షడంగరహితుండును, బహుశ్రుతుండునుగానివాండును, వ్రతహీనుండును, వేదశూన్యుండును, పాపచిత్తుండును, నసమర్థుండును, దీనుండును, లోభియును, క్షుభితుండును, రోగార్తుండును, ప్రాకృతుండును, ప్రాకృతజనుండుననువాం డొక్కరుండును లేండయ్యె. అట్టియెడ వేదశాస్త్రసంపన్నులగు దేవద్విజమహర్షులవలన నక్షత్రగణాకీర్ణంబును నభంబు తెఱంగున యజ్ఞవాటంబు శోభిల్లె. శోభనార్థంబుగం గనకరత్నంబులచే విచిత్రంబగు మహీపతుల సహస్రాదిత్యద్యోతిమానంబగు నాకాశంబు చందంబునం జూపట్టుచు, దిగ్గజంబుల దంతంబులవోని తోరణస్తంభంబులవలనను, దేవమానవయక్షోరగులవలనను, విద్యాధరకిన్నరకింపురుషాప్సరోగణంబులవలనను శోభితంబగుచు, హోమంబు లాచరించి యూరకుండెడు సమయంబునం దుంబురు నారద విశ్వావసు చిత్రసేనప్రభృతులు గానంబు గావింప నప్సరోజనంబులు నృత్తగీతంబు లొనర్ప సకలశాస్త్రజ్ఞులగు మహీసురు లితిహాసపురాణాఖ్యానంబుల బోధ్దులు గడప భేరీమృదంగాదిముఖవాద్యనినాదంబు లెసంగ మనోహరంబై యుండె. మఱియును భీష్మద్రోణాదులును దుర్యోధనప్రభృతులగు కౌరవులును, వృష్ణిమహీపాలురును, బాంచాలభూపాలురును నయ్యజ్ఞంబున దాసులతెఱంగున నిఖిలకృత్యంబు లాచరింపుచు మెలంగిరి. ఆయాగంబు పూర్వకాలంబునం దింద్రుండు గావించిన యజ్ఞంబునకు సదృశంబై యుండె. మఱియును నానాదేశంబులం జనుదెంచిన మహీపతులు కానుకలొసంగిన వస్త్రంబులును రత్నకంబళంబులును రత్నకాంచనంబులును నమూల్యంబులగు దివ్యాభరణంబులును ధర్మజుండు బ్రాహ్మణులకు నొసంగె.

ఈ కథ సభాపర్వంబున డెబ్బదితొమ్మిదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 80

అని వైశంపాయనుండు జనమేజయుం గనుంగొని మఱియు నిట్లను. ఇవ్విధంబున సకల జనమనోహరంబును, విఘ్నరహితంబును, బహు ధనధాన్య సమేతంబును, మహోత్సవంబును, చతుర్విధ మృష్టాన్న పరిపూర్ణంబును నగు నీయజ్ఞంబు శంఖచక్రాద్యాయుధ ధరుండును, జనార్దనుండును, షడ్గుణైశ్వర్యసంపన్నుండును నగు యదు వల్లభుండు నిర్విఘ్నంబుగం బరిపాలింపుచు నుండె. అంత నాధర్మ నందనుం డితరదుష్కరంబగు యాగంబు సమాప్తంబు గావించి సహస్ర కోటిసంఖ్యాకంబగు ధనంబు ఋత్విజులకు నొసంగి వారలకు సంతుష్టిజేసి పదంపడి యవభృథస్నానం బాచరించి, వ్యాసధౌమ్య నారదసుమంతు జైమినులును, పైలవైశంపాయనయాజ్ఞవల్క్యశత కలాప ప్రముఖులగు మహర్షులును, విప్రవర్యులును, బహువిధంబుల సత్కరింపుచుం బూజగావించి వారలం గనుంగొని, మహాత్మకులారా! మీ కటాక్షంబువలనను, లోకేశ్వరుండగు కృష్ణుని ప్రభావంబువల నను నీరాజసూయాధ్వరం బొక విఘ్నంబు లేక నెరవేరుటవలనను నామనోరథంబు సఫలం బయ్యెనని పలుకుచు యజ్ఞంబు సమాప్తంబు గావించి కృష్ణబలదేవులను భీష్మముఖ్యులగు కౌరవరాజన్యుల నుచిత ప్రకారంబున సపర్య గావించి కృతకృత్యుండై యున్న పాండునంద నుని సన్నిధానంబునకు నిఖిలమహీపతు లరుగుదెంచి, ధర్మనందనా! దేవతానుగ్రహంబునం జేసి నీయాగంబు సమాప్తం బయ్యె. నీవును సామ్రాజ్యాభిషిక్తుండవైతివి. అజమీఢ వంశంబునం బొడమిన మహీపాలకుల కీర్తి యెంతయును బ్రకాశించె. సకల ధర్మంబులు నీ యధీనం బయ్యె. మేమును నిఖిలసత్కారంబులవలనం బరమహర్షంబు నం బొదలితిమి. ఇంక స్వదేశంబులకుం జనియెదము. అనుజ్ఞ యొసం

గవలయు ననిన వారల నందఱ నుచితప్రకారంబునం బూజించి భీమార్జున నకులసహదేవులం గనుంగొని యీ మహీపతు లందఱును మనయెడం గల స్నేహాతిశయంబునం జనుదెంచి యధ్వరంబు నెరవేర్చి తమ తమ పురంబులకుం బోయెదరు కాన వీరలును మన రాజ్యంబు కడచి చను పర్యంతంబును వెంబడిం జనుండని నియమింప ధనంజయుం డమాత్యబంధుజనసమేతంబగు జయత్సేనుని వెంబడిం జనియె. భీమసేనుండు భీష్మధృతరాష్ట్ర విదురసంజయుల పిఱుంద నరిగె. సహదేవుండు ద్రోణాశ్వత్థామ కృపాచార్యుల ననుసరించి నడచె. నకులుండు పుత్రామాత్యసమేతుండగు సుబలునిం గూడి చనియె. పుత్రసమేతుండగు శల్యుని సాత్యకియును, భగదత్తబృహద్బల విరాటుల దృష్టద్యుమ్నుండును, గుంతి సహోదరుల భీష్మకుని మఱియును దక్కుంగల దాక్షిణాత్యధరాధిపుల ఘటోత్కచుండును, బార్వతీయమహీపతులనభిమన్యుసమన్వితులగు ద్రౌపదేయులును, మఱియును దక్కుంగల రాజుల వెంబడి కౌరవులుం జనిరి. ఇవ్విధంబున నిఖిలరాజన్యుల భూసురోత్తముల దేవర్షిగణంబుల యథాస్థానంబులకుం బనిచి ధర్మనందనుండు మంత్రిసమేతంబుగం బురంబునకుం జని సింహాసనంబున సుఖాసీనుండై మహేంద్రుని తెఱంగునం బ్రకాశింపుచుం గృతకృత్యుండై యుండె. అంత నా ధర్మనందనుం గనుంగొని బలపరాక్రమశాలియగు కృష్ణుండు నీదు భాగ్యంబునం జేసి రాజసూయాధ్వరంబు నిర్విఘ్నంబుగం బరిసమాప్తంబయ్యె. ఇంక నేను ద్వారకానగరంబునకుం బోయి వచ్చెదననిన నతండు మధుసూదనా! నిఖిలమహీపతుల నిర్జించి వారలెల్లను కప్పంబు లొసంగుచు నా వశవర్తులై మెలంగం జేసితివి గాన నీ ప్రసాదంబునం జేసి యీ మహాయాగంబునకు భాజనంబనైతి. ఇట్టి నిన్ను నే నెడబాసి యొక్కింత దడవైన నిలువరింపంజాల. నీకును వసుదేవసందర్శనార్థంబుగం

బోవలసియుండుట యుచితంబెకదా యని పలుకు పాండవాగ్రజుం డోడ్కొని కృష్ణుండు కుంతి సదనంబున కేంగి యాదేవిం గనుంగొని, ధర్మగుణగరిష్ఠుండగు యుధిష్ఠిరుండు సామ్రాజ్యంబు జెందె, సకల భూపాలకులు తమ పనిచిన పంపు సేయ సంతుష్టహృదయులగుచు నీ కుమారకుల ఖన్నులై యైశ్వర్యంబు లనుభవించెదరు, నేనును ద్వారకానగరంబునకుం జనియెద నని, ద్రౌపదీసుభద్రల కెఱింగించి వారలుం బనుప నంతఃపురంబు వెడలి కౌంతేయాగ్రజుండు వెంబడి నరుగుదేర, స్నానాదికృత్యంబు లాచరించి మహీసురులు స్వస్తి వాచనంబులు గావింప వారలకు నెంతయును బూజ లొనరించి యనంతరంబ మహాజీమూతసంకాశంబును, గరుడకేతనోపశోభితం బును, సమస్త శస్త్రాస్త్రసన్నద్ధంబును నగు రథంబు దారుకుండు సమీ పంబునకుం గొనితేర నయ్యరదంబునకు బ్రదక్షిణంబు గావించి యుధిష్ఠి రార్జునులుకై దండ లొసంగ స్యందనారూఢుండై సాత్యకి కృతవర్మ లిరుగడల వింజామరలు వీవ ద్వారకాభిముఖుండై నడచునంత, బల రామముఖ్యులగు యాదవులు కౌంతేయాగ్రజునిచే సత్కృతులగుచు వాసదేవుని వెంబడిం జనిరి. అంత పాండవాగ్రజుండు సువర్ణమయం బగు యానంబధిరోహింపక సహోదరసహితంబుగం బాదచారి యగుచుం గృష్ణుని రథంబు పిఱుందం జనుచుండ నతనిం గనుంగొని యొక ముహూర్తమాత్రంబు రథంబు నిలిపి లీలామానుషరూపంబు ధ రించి యదువంశంబునం జనించిన యా జగద్గురుండగు పుండరీకాక్షుం డు, పక్షిజాతులు వృక్షంబును, భూతలంబులు పర్జన్యుని, నిర్జరులు నమ రేశ్వరుని నుపజీవించు కరణి నెల్ల బంధుజనంబులును నిన్ను నుప జీవింపం బ్రజాపరిపాలనంబు గావింపుమని పలికి యతని పురంబునకుం బనిచి సకలయాదవులు పరివేష్టింప ద్వారకానగరంబునకుం జనియె. అంత నిక్కడ నజాతశత్రుండు నగరంబునకుం జనుదెంచి దుర్యోధ

నుండును దుశ్శాసనప్రభృతులగు నతని తమ్ములును వైరిభయంక రుండగు కర్ణుండు గాంధారదేశాధీశ్వరుండు శకునియును మొదలగు వారల సత్కారంబుల సంతుష్టులం గావింప వారలును నాదివ్యసభా మధ్యంబునం బాండవులం గూడి కొన్నిదినంబులు వసియించి యుండిరి.

ఈ కథ సభాపర్వంబున నెనుబదియవ యధ్యాయము.

---

## అధ్యాయము 81

---

అని వైశంపాయనుండు మఱియు జనమేజయుం గనుంగొని, యంతనిటు నిఖిలరాజన్యులంబనిచి సహోదర సుహృత్సహితుండై ధర్మనందనుండు సభామధ్యంబునంగొలువున్న సమయంబున ముని గణ పరివృతుండై సాత్యవతేయుం డరుగుదెంచిన నతండనుజసమే తంబుగాం బ్రత్యుద్గతుండై యతని నర్ఘ్యపాద్యాది పూజావిధానంబు లొసంగి సుఖాసనంబున నునిచి యతనిచే ననుజ్ఞాతుండై తాను సింహాసనంబున గూర్చుండె. అంత వాక్యవిశారదుండగు నా తపోధన ముఖ్యుండు భ్రాతృజన పరివృతుండగుచుం బాండవాగ్రజుని నిరీక్షించి, ధర్మనందనా! ఇతర దుర్లభంబగు సామ్రాజ్యంబు జెందితివిగాన కౌరవవంశంబు పరిపాలింపుచు సుఖంబున వసియింపుము. నేనును బోయివచ్చెదననిన వ్యాసమునీంద్రునిం గనుంగొని ధర్మనందనుండు, మహాత్మా! భూమ్యంతరిక్షంబులను దివంబునను మహోత్పాతంబులు దోచెంగాన దీనివలన మహాభయంబు వాటిల్లునని నారదుండెఱింగించె. ఆభయంబు శిశుపాలుని వధియించుటతోడం దీరెనో? కాకయింక నే మేనియుంగలదో కోయని నామనంబున మహాసంశయంబుగలిగి యున్న

యది. ఇది మీరుదక్క నెఱింగింపంజాలరని యడిగిన యజాతశత్రుని వాక్యంబు లాకర్ణించి మహర్షిశ్రేష్ఠుండగు కృష్ణద్వైపాయనుండీ మహోత్పాతంబువలనం జతుర్దశ సంవత్సరంబులలోన దుర్యోధనుని దుర్నయంబునం జేసి భీమార్జునుల బాహుబలంబువలన నీవు కారణం బుగ నిఖిలక్షత్ర సంహారంబు వాటిల్లంగలదు. అట్టిజనక్షయకాలంబు ప్రాప్తంబగు సమయంబున నొకనాంటి నిశావసానంబున నీలకంఠుం డును, వృషభధ్వజుండును, భవుండును, స్థాణుండును, త్రిపుర సంహార కుండును, నుగ్రుండును, రుద్రుండును, పశుపతియును, మహాభుజుం డును, పార్వతీవల్లభుండును, శివుండును, శూలపాణియును, నజగవధను ర్ధరుండును, గజచర్మాంబర ధరుండును నగు శంకరుండు కైలాసశిఖరోప మానంబగు వృషభంబు నధిరోహించి దక్షిణాభిముఖుండై యుండెడు నట్లు నీకు స్వప్నంబుగాంగలయది. కాలం బెంతవారికేనియును నశక్యంబు గాదు కావున దీనికిని నీవు పరితాపంబు జెందనలవదు. అప్రమత్తుండు ను నతీంద్రియుండును నగుచు రాజ్యంబు పరిపాలింపుము. సకల శుభం బులు వాటిల్లెడు. నేను రజతాచలంబునకుంజనియెదనని యాసత్యవతీ నందనుండు శిష్యగణ సమేతంబుగ నజేచ్ఛనరిగె.

ఈ కథ సభాపర్వంబున నెనుబదియొకటవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 82

---

అని వైశంపాయనుండు మఱియు నిట్లను. అంత దుర్యోధనుం డు కరినగరంబున మున్నెన్నండును కని యెఱుంగని యీ సభాభవ నంబునం గల దివ్యమహత్వంబులు శకునిసమేతంబుగం గనుంగొను చుండు సమయంబున నొక్కయెడ స్ఫటికోపలనిర్మితంబగుస్థలంబగు

స్థలం బవలోకించి యిది జలంబని శంకించి వస్త్రోత్కర్షణంబు గావింపుచు, వేఱొక్కయెడ స్ఫటికోపలస్తంబంబు వీక్షించి యిది వాకిలి యను తలంపున వినమ్రశిరస్కుండై ప్రవేశింపం బోయి లలాటంబు తాకించుకొనుచు, ద్వారంబు గలిగిన ప్రదేశంబు జూచి కవాటబంధంబుగం దలంచి యవ్వలికిం జనుచు సమప్రదేశంబు గనుంగొని యున్నత ప్రదేశంబని తలంపుచు వస్త్రోత్కర్షణంబు గావించి యారోహణం బొనర్పం బోవుచు, వేఱొక్క చక్కి స్ఫటికోపలధవళంబగు జలంబులును స్ఫటికనిర్మితసరోరుహంబులునుం గలిగి చెలంగెడు సరోవరంబు గనుంగొని స్ఫటికోపలప్రదేశంబను విభ్రాంతి నూరక చని జలంబులం బడిన యతనిం జూచి కింకరులును భీమార్జున నకులసహదేవులును ద్రౌపదియును బరిహాసంబు గావించిరి. అంత ధర్మనందనుండు పరిజనంబులచే వస్త్రంబులు బనిచినం గైకొని ధరించి, ధర్మాధర్మంబులు లౌకికవ్యవహారంబులును నతని నగరంబున నొనరింపుచుండుటవలనను గజాశ్వఖరోష్ట్రఖడ్గంబులు విక్రయించు వణిగ్జనంబులును హరిప్రస్థంబునకుం జనుదెంచి క్రయవిక్రయాది వ్యవహారంబులు నడపించుచుండుటం జేసియును రథగజతురగాది యానారోహణంబులును నచ్చటనె ప్రవర్తిల్లుచుండుటను నన్నగరంబు నిబిడంబై చెలంగ గౌరవుండను నభిఖ్యాధర్మనందనునియం దప్రసిద్ధంబై యున్నయది. మఱియును సుయోధనుం డవ్విధంబునం బాండవులు తన్ను జేయు నపహాస్యంబునకు మనంబున నెంతయును లజ్జింపుచుం దన వైవర్ణ్యం బొరులెఱుంగకుండ గాంభీర్యంబు వహించి తన్ను నపహసించువారలనం గైకొనక సభామధ్యంబునం దాను పలుదెఱంగుల మోసపోవుటకు మనంబున దుఃఖింపుచుం బదంపడి కౌంతేయులచే ననుజ్ఞాతుండై కరిపురంబునకుం జని, యజాతశత్రుయజ్ఞమహత్వంబును వారల మహావైభవంబును నిఖిల మహీపతులు వారలకు వశవర్తులై యుండుట

యును నా దివ్యసభాభవనంబునం గల విచిత్రంబులును సారెకు మనం బునం దలంచి ఖేదంబు నొందుచు నెవ్వరితోడం బలుకక చంచల హృదయుం డగుచు నుండునెడ, సుబలతనయుండగు శకుని యారా రాజు నుద్దేశించి కౌరవేశ్వరా! నిట్టూర్పులు నిగుడించుచు నూరక యున్నవాండవు, నీకిట్టి విచారంబునకుం గారణం బేమియనిన, నతం డాతనిం గనుంగొని సకల భూమండలంబును యుధిష్ఠిరునియందు యుం డుటం జేసి దేవర్షి యక్షగంధర్వులు సైతంబును నిత్యంబు నచ్చటికి వచ్చుచున్నవారు. దుష్టస్వభావుండగు నాకృష్ణుండును నయ్యుధిష్ఠిరుని సంపదల నభివృద్ధి గావించుట కతంబున దేశంబుల నున్న యభిజ్ఞులు ను నాహూయమానులగుచు సకలరాజన్యుల నిర్జించిన యర్జునుని భుజాబలంబును నింద్రుం డొనర్చిన యాగంబునకు సమానంబగు రాజసూయాధ్వరంబును నిఖిల మహీమండలంబును వారలకు నధీనం బైయుండుటయును గనుంగొనుటచే నహర్నిశంబును నాహృదయంబు గ్రీష్మకాలంబున నింకం బారెడు కొంచెపు మడుగు కైవడి శోకం బున శోషింపుచున్నయది. అదియునుం గాక మహారథుండగు శిశు పాలుని కృష్ణుండు నిష్కారణంబుగ సమయించునెడ ధరాధిపు లంద ఱును బాండవ ప్రతాపాగ్నిచే దహ్యమానులగుచు నొండేమియు ననంజాలక యూరకుండిరి. ఇంతియకాని యొక్కండేనియును నాచైద్యు నకుం దోడ్పడండయ్యె. ఇవ్విధంబున నయ్యదునందనుండు గావించిన యనుచితకృత్యం బెవ్వండు సైరింపనేర్చు? ధరణీతలంబునం గలిగిన రాజవర్యు లందఱును వారల మహిమంబునకు నోడి వైశ్యుల తెఱం గున రత్నకాంచనాదుల్ కప్పంబు లొసంగెదరు. కావున నిట్లు సర్వాతిశయంబగు పాండునందనుల యైశ్వర్యంబు గనుంగొనుట వలనం బొడమిన రోషంబు నాహృదయంబు దహింపుచున్న యది. అట్లగుటం జేసి విషభక్షణంబైనను, నగ్నిప్రవేశం బేనియు,

జలప్రవేశంబేనియును గావించి శరీరంబు పరిత్యజింపంగలవాండ. శత్రు వర్గంబు లధికంబులగు సంపదలు పెంపువహించి తాను హీనుండై యుండుట నెవ్వండేనియును సహింపంజాలునె? అసహాయుండును నశక్తుండును నగుటవలన స్త్రీయును పురుషుండునుం గాక యున్న వాండను జనిసవాండును గాని తన వ్యర్థపుజీవనం బేటికి యని తలంచి మరణంబు గోరెద. న్యాయార్జితంబగు వారల విభవంబు చూచుట వలన హృదయంబు పరితపించుచున్నయది. మున్ను పాండునందనుల హింసించుటకు నే ననేక యత్నంబులు జేసినను దేగటాగక వారలు జలమధ్యంబున నున్న పద్మంబులు చందంబున వృద్ధిం బొందుటం జేసి పౌరుషంబుకన్న దైవంబె యధికంబని తలంచెద. ధార్తరాష్ట్రులు హీనులై పాండవు లభివృద్ధిం గాంచుటయును, వారల తేజంబును, నా సభాభవనంబును, దన్మధ్యంబున వారలచేం దా నపహాసితుండగుటయును మనంబునం జింతించిన శోకానలంబు దరికొనుచున్నయది. నా వృత్తాంతంబంతయును ధృతరాష్ట్రున కెఱింగింపుము.

ఈ కథ సభాపర్వంబున నెనుబదిరెండవ యధ్యాయము.

---

## అధ్యాయము 83

---

అనిన సుయోధనుం గనుంగొని శకుని యిట్లను. కౌరవేంద్రా! కౌంతేయుల విభవంబు వీక్షించి నీ వింత శోకింపం జెల్లునె? పాండునందనులు జన్మాంతరంబున సుకృతంబు లాచరించిన వారలగుటం జేసి తత్ఫలం బనుభవింపుచున్నవారలు. వారలం బొరిగొనవలయునని నీవు పన్నిన కపటోపాయంబులన్నియును నిష్ఫలంబులయ్యెంగాని

వేయొక్కటేనియును ఫలింపనేరదయ్యె. వారల భాగ్యాతిశయంబునకు నీవు పరితపింపం బనిలేదు. పాండవులు ద్రౌపదిని వరించుటకతనం బుత్రమిత్రామాత్యపరివృతుండగుచుం బాంచాలమహీపాలుండు వారలకు సహాయుండై యున్నవాఁడు. యదువంశతిలకుండును దేవదానవమానవులకజేయుండును నగు పుండరీకాక్షుని సాహాయ్యంబు వలననగు తేజంబునం బ్రకాశించెదరు. తమ పితృభాగంబగు రాజ్యంబు తొలుత మీర లొసంగినం గైకొని పరాక్రమధురీణులగుట పదంపడి నిఖిలధరాచక్రం బాక్రమించిరి. ధనంజయుండు పావకుని నారాధించి యతని కృపాతిశయంబునం గార్ముకోత్తమంబగు గాండీవంబును నక్షయసాయకంబులుగల తూణీరయుగళంబును వడసి సకల రాజన్యుల నిర్జించి తనకు విధేయులం గావించుకొనియె. ఇందులకు నీవు దుఃఖింపనేటికి? దానవుండగు మయుని నగ్నిబాధవలన దలంగింప నతం డనేక కింకరుల వలన భరింపంబడుచున్న సభాభవనంబు నొసంగె. దానికి నీవు వగవం బనియేమి? అది యట్లుండె. ఇపుడు నేను సహాయహీనుండనై యున్నవాఁడనని పలికితివిగదా! ధనురాచార్యుండగు ద్రోణుండును, బాహాబలసంపన్నుండగు నశ్వత్థామయును, మహారథుండగు కర్ణుండును, గురువంశప్రదీపకుండగు భీష్ముండును, బలపరాక్రమసమేతులైన దుశ్శాసనప్రముఖులగు నీ సహోదరులును, నతిరథశ్రేష్ఠుండగు కృపాచార్యుండును, బాహుబలశాలియగు జయద్రథుండును, శస్త్రాస్త్రకోవిదుండగు దృఢధన్వుడును, సోదరసమేతుండగు నేనును, బాహ్లీకసోమదత్తులును, దక్కనుంగల మహారథికులును గలిగియుండ నే నసహాయుండనై యున్నవాఁడ నని పలుకందగునె? రాధేయుం డొక్కరుం డలిగెనేని బంధుమిత్రసమన్వితులగు కుంతినందనుల నిమిషమాత్రంబునం జయింపనోపండె! నీవు ధర్మజప్రభృతుల నిర్జించి భూమండలంబు

పాలించవలయునని తలంచితివేని యీ మహావీరుల నందఱం గూర్చు కొని నీవును నీ తమ్ములు నన్ను రక్షింపం బాండవేయుల నేనొక్కరుండ నుక్కణంచెద. అట్లైన నిఖలధరణీవలయంబునం గల సమస్త నరేంద్రులును నీకు వశవర్తులై యుండుదురు. ఆ సభారత్నంబును నీకు స్వవశంబగు. ఇంక నొక్కయుపాయంబు నెఱింగించెద. శస్త్రాస్త్రప్రవీణులును, మహాబలపరాక్రమసమేతులును, సమరకర్కశులును, మహారథులును నగు కృష్ణపాండవేయపాంచాలభూపతుల యుద్ధరంగంబున నింద్రున కేనియును జయింపనలవిగాదు. అట్లైనను నయ్యుధిష్ఠిరుని నోడింప నొక్క యుపాయం బెఱుంగుదు. అది నీకు వివరించెద నాకర్ణింపుమనిన సుయోధనుం డతని నాలోకించి యఖిలరాజన్యపరివృతులగు కౌంతేయుల సంగ్రామంబు లేకయ జయించు నుపాయంబు తెల్పుమనిన సౌబలుండు రారాజుం గనుంగొని యజాతశత్రునకు జూదంబునందు మిగుల కుతూహలంబు గలదు. అట్లైనను దాని యెడ నిపుణుండు ఎవ్వరేనియును ద్యూతంబునకుం బిలిచినను సంతసించుం గాని రాకయుండంజాలండు. జూదంబున సమానుండగు వాండు ముజ్జగంబులం గలుగనేరండు. కావున నీ వతని జూదంబునకుం బిలిచిన నక్షవిద్యాపాటవంబునం జేసి యతని రాజ్యంబును నైశ్వర్యంబును నపహరించి నీ కొసంగెద. ఇంతయును ధృతరాష్ట్రున కెఱింగించి యనుజ్ఞ గైకొనుమనిన గాంధారీనందనుండు సుబలనందను నుద్దేశించి కురుముఖ్యుండగు వైచిత్రవీర్యునకు నీతోంచిన తెఱంగున నీ వెఱింగింపుము. నే నతనికిం దెలుపంజాల.

ఈ కథ సభాపర్వంబున నెనుబదిమూండవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 84

అనిమొనని వైశంపాయనుండు జనమేజయునకు మఱియు నిట్లనియె. అట్లు దుర్యోధనుండు ధర్మనందనుని రాజసూయయాగంబును నతని యైశ్వర్యంబును గనుంగొని సైరింపంజాలక దుఃఖింపుచు నుండ నతని వైవర్ణ్యంబు వీక్షించి పాపాత్ముండగు గాంధారరాజ తనూభవుండు రారాజునకుం బ్రియం బొనరింపవలయునను తలంపున దైవప్రేరితుండగుచు నిఖిలక్షత్రవినాశకారణంబును లోకవిరుద్ధంబును నగు నాదుర్యోధనుని మతం బవలంబించి ధృతరాష్ట్రుని సన్నిధానంబున కేంగి యతని నుద్దేశించి, కౌరవేంద్రా! నీయగ్రపుత్రుండగు సుయోధనుండు వివర్ణుండును, కృశగాత్రుండును, జింతాక్రాంతహృదయుండును నై యున్నవాండు. నీవతని క్లేశంబు పరామర్శింపకుండు టుచితంబగునె యని పలుకు శకునివచనంబు లాకర్ణించి యయ్యాంబికేయుండు గాంధారేయుని రావించి యతనిదిక్కు మొగంబై కుమారకా! శోకింపుచున్నవాండని నీమాతులుం డెఱింగించె. దీని కిం గతం బెయ్యది? ఎన్నిభంగుల విచారించిన నామనంబునకుం దోపదు. అంతయును విశదంబుగ నెఱింగింపుము. దుశ్శాసనాది సహోదరవర్గంబు నిన్ను నుపాశ్రయింప మహావైభవం బనుభవింపుచు సుఖంబున నున్నవాండవు. నీవన్నంబిడిన భుజింపుచు, గాంధారియును నేనును నున్నవారము. మనోహరంబులగు వస్త్రంబులు ధరింపుచు, మాంసప్రధానంబులగు భోజనంబులు గావింపుచు, నుత్తమాశ్వంబుల నధిరోహింపుచు భద్రదంతావళంబుల నెక్కుచు, రత్నకాంచననిర్మితంబులగు మందిరంబులును, రమ్యంబులగు విహారస్థలంబులును, మహార్హంబులగు శయనాసనంబులును, సౌందర్యవతులగు యువతులును గలిగి క్రీడింపుచుండియు నీకు ఖేదింపనేటికి? లోకంబునం దలిదం

ద్రులు కుమారకులయెడ జేయవలయు నర్థంబులెల్లను గావించి కుల క్రమాగతంబగు షడంగంబులం దనరు వేదంబుల నష్టవ్యాకరణం బుల నర్థశాస్త్రంబుల నభ్యసించి మఱియు బలరామభారద్వాజుల వలన నస్త్రవిద్యాకౌశలంబును నేర్చి సర్వజ్యేష్ఠుండవై పట్టాభిషిక్తుండ వగు నీకు దుఃఖించుటకుం గారణంబేమి? ఇతరజనదుర్లభంబులగు నిఖిలభోగంబు లనుభవింపుచు సూతమాగధులు బహువిధంబులం బ్రశంసింప సంతసిల్లుచుండెడు నీకు నిట్టి క్లేశంబునకుం గతం బెయ్యది? ఈలోకంబున నీకంటెం బ్రభుత్వం బెవ్వనికి యున్న యది? అంతయును నెఱింగింపు మనిన నసూయాగ్రస్తుం డగు నాదుర్యోధనుండు నిజజనకు నుద్దేశించి తన యభిప్రా యంబు విశదంబుగ నిట్లను. లోకంబున నభిమానశాలియగు పురుషుం డొకరివలనం బరాభవంబు తనకుం బ్రాప్తంబయ్యేనేని యది తీర్చుకొనవలయునను తలంపుసం దనయభిప్రాయంబు గుప్తంబు కావించుకొనియుండి సమయంబువచ్చినతఱి మనోవ్యధలం దీర్చుకొ నంజాలు నతండు పురుషవర్యుం డనంబడు. కాలవైపరీత్యంబునం జేసి యత్యుగ్రంబగు రోషం బడంచుకొని యశనాచ్ఛాదనంబు లుప యోగింపుచు నన్నుం బలె మెలంగెడు కుత్సితుండునుంగలండే! దయయును, సంతోషంబును, ననుద్యోగంబును, భయంబును నను నీ గుణంబు లెవ్వని యెడనుండు నతం డతిశయంబు జెందంజాలండు. అతి మానుషంబును జగత్ప్రసిద్ధంబును నగు యుధిష్ఠిరుని యైశ్వరంబు తనకు శోకావహంబగుచు మనంబు దహింప నన్ను నెఱుంగక యున్న వాండ. విరోధులగు పాండవులు శ్రేయంబులనుభవింపుచుం జెలంగి యుండునెడ వారలు కనుంగొన నతిదీనుండనై యుండెడు నే నభివృ ద్ధిం జెందుటకుం గారణం బేమియును గాన. కావున నాకు నిట్టి శోకంబు ప్రాప్తంబయ్యె. ఒకండొకండు త్రింశత్సరిజనసమేతులును,

స్నాతకవ్రతులును, గృహస్థులునగు సప్తాశీతిసహస్రసంఖ్యలంగల బ్రాహ్మణుల యుధిష్ఠిరుండు సంరక్షింపుచు నున్నవాండు. దశసహస్ర సంఖ్యలంగల జితేంద్రియులగు యతీశ్వరు లతని గృహంబునం బ్రతి దినంబును గనకపాత్రికల భోజనంబు గావింపుచునున్నవారు. పాండవుల శౌర్యంబునకు నోడి యన్నపానంబులు వర్జించి కాంభోజమహీపాలుండు కృష్ణశ్యామారుణవర్ణంబులుగల మృగచర్మంబులును, ననేకంబులగు రత్నకంబళంబులును, జతుర్దశసహస్ర సంఖ్యాకంబులగు రథాశ్వవృషభంబులును, బదునాలుగువేలు వనితాజనంబులును, మూండులక్షల యొంటెలును, మూండులక్షల గోడిగలును, గొనితేనగు సకల వస్తుసంభారంబులును యుధిష్ఠిరునకుం బనిచె. ఇవ్విధంబున భూమండలంబునం గల రాజన్యులెల్లరు రత్న కాంచనాదులు వారలకు కానుక లొసంగుచునున్నవారలు. ఇట్టి ధనాగమంబు మున్నెన్నండును కన్నదియును విన్నదియును గాదు. నా వాక్యంబుల సత్యంబులని తలంచితేని సంజయునడిగి తెలియుము. అపారంబగు ధనసంఘంబు గనుంగొని దివారాత్రంబులు నిదురలేక చింతింపుచు నున్నవాండ. త్రిఖర్వమహీపాలకులు సువర్ణరజితపాత్ర ప్రముఖంబులగు కానుకలు గొనితెచ్చి ద్వారపాలకులవలన నివారితులై యతని వాంకిటం గాంచి యున్నవారు. తొలుత నప్సరోవని తలుమహేంద్రుని కేనియు నొసంగని దివ్యమద్యరసంబును రత్నఖచితం బగు కాంచనకలశసహస్రంబును క్షీరవారాశిధర్మనందనునకుం దెచ్చి యొసంగె. ఇదియునుం గాక అది కనుంగొనుట మొదలుగా నా మనంబు తపించుచున్నయది. అనేక రాక్షసులు పక్షికులై కగమ్యం బగు నుత్తరసముద్రం బొక్కటియును బరిత్యజించి పూర్వదక్షిణ పశ్చిమసముద్రంబులకు నేంగి తదీయోదకంబుల దశభార కనకనిర్మితంబులగుటంబులంగొని తెచ్చిరి. బిందుసరోవరంబునం గల రత్నం

బుల మయుండు నిర్మించిన స్ఫటికఖచిత సరోవరంబు గనుంగొని దాని నుదకపూరితంబుగా తలంపున నేను చేలాంచలంబులు ముడించి నం గనుంగొని భీముండును సభాపాలకులగు కింకరులును పరిహాసించిరి. ఈ వృకోదరుని నప్పుడె సంహరించుటకు సామర్థ్యంబులేని దోషంబునను మీకు ఖేదంబు రారాదను తలంపుననుం జేసి ప్రాణంబులు ధరియించి యున్నవాండ. వేఱొక్క యెడ స్ఫటిక ధవళంబగు సలిలంబును స్ఫటిక నిర్మితంబులగు పుండరీకంబులునుం గల తటాకంబును వీక్షించి, యది నిజంబుగ సభాప్రదేశంబని తలంపుచుం జని జలంబులం బడిన నన్నుం గనుంగొని భీమార్జునులును పాంచాలి ప్రముఖులగు వనితాజనంబులును నపహసించిరి. అంత ధర్మజుండు కింకరులచే వస్త్రంబులు పనుపం గైకొని ధరియించితి. మఱియు నొక్క ప్రదేశంబున బహుస్తంభంబులు గలిగియుండియును లేని చందంబునం దోప నయ్యెడకుం జని నాదులలాటంబు స్తంభంబుల వలనం బలుమఱుం దాడితంబయ్యె. ద్వారంబు గలిగిన స్థానంబద్వారంబుగ దోచిన నయ్యెడం బ్రవేశింపక ద్వారంబులేని ప్రదేశంబు ద్వారసహితంబుగంగనుపట్ట నేనచటం జొరందలంచిన నిటలంబు శిలాతలంబు నందాకె. ఇట్లు దిగ్భ్రమంబు జెంది పరిభ్రమించు నన్నుం గనుంగొని యందుంగల వనితాజనంబు లపహాస్యంబు గావించిరి. అప్పుడు పవననందనుండు నవ్వుచు నన్నుద్దేశించి అది ద్వారప్రదేశంబు గాదు, ఇట్టి మార్గంబునం జనుదెమ్మనియె. ఇట్లు సదస్యులకును యువతీజనంబులకును నాదు వ్యాపారంబు సమస్తంబును హాస్యాస్పదంబయ్యె. ఇవ్విధంబున వైరులు గనుంగొనుచునుండ భంగంబు జెందిన తన జీవనంబేటికి? అగ్నిప్రవేశంబు గావించెద. బహుమానయోగ్యుండనగు తన కపకీర్తికంటె మరణంబె మేలని తోచుచున్నయది. ఇంక నొక యద్భుతంబు వివరించెద నాకర్ణిం

వుము. ఒక్క లక్షభూసురులు భుజియించిన నొక్కసారి వినంబడు శంఖనినాదంబు పలుమాఱును వినంబడుటవలనం దనకు రోమహర్షంబు వాటిల్లె. నానా దేశాగతులగు ధరణీవల్లభులు ధర్మసుతునకు ననేక దివ్యరత్నంబులు గొని వైశ్యులకై వడిం గానుక లొసంగి యతని పనుపున మహీసురులకు వడ్డింపుచున్నవారు. వారలకుం గల దివ్య రత్నంబు లెన్నండును కనియును వినియును నెఱుంగ. కావున నింద్ర వరుణ యమ కుబేర విష్ణు ప్రభృతులగు దేవతలకైనను, రాక్షసేశ్వ రుల కేనియును, నా పాండవుల యైశ్వర్యసమృద్ధి లేదని తోఁచుచున్న యది. ఇట్టి పాండవుల యపరిమితంబగు నైశ్వర్యంబు గనుంగొని నెమ్మ నంబునం బరితపింపుచు నుపశాంతిం జెందక యున్నవాఁడ. అట్లగుట సమరరంగంబున వారల నిర్జించి నిఖిలైశ్వర్యంబునుం గొనుట యొండె. కాదేని వారల దివ్యాస్త్రంబులచేం దెగుట యొండె. అట్లుంగునం గావింపని తన జీవనంబునం బ్రయోజనం బేమి? పాండవులు నానాంట నభివృద్ధిం బొందుచున్నవారు. మనము తొలుత నున్న యునికిన యున్నవారము.

ఈ కథ సభాపర్వంబున నెనుబదినాల్గవ యధ్యాయము

---

## అ ధ్యా య ము 85

---

అని యివ్విధంబునం బలుకు దుర్యోధనుని వాక్యంబు లాక ర్ణించి శకుని యతనిం గనుంగొని, యాకౌంతేయుల యైశ్వర్యాతిశ యంబు నిరీక్షించి నీ వింత దుఃఖంప నేటికి? వారల లక్ష్మి నిన్నుం జేరుటకు నొక్కయుపాయంబు సెప్పెద నాకర్ణింపుము. అక్ష హృదయజ్ఞానంబును, బన్నిదంబు వూను నైఖరియును దానంగల వి శే

షంబులును నాయెడ మిగులం గలదని భూమండలంబున బ్రసిద్ధంబై యున్నయది. పాండవాగ్రజుండు జూదంబునెడ మిక్కిలి ప్రియంబు గలవాండు. అట్లయ్యును దాని యెడ నతనికి సామర్థ్యంబులేదు. ఎవ్వరేనియు ద్యూతంబునకుం బిలిచినంతన ప్రీతుండై చనుదెంచు గావున నీవతని జూదం బాడుటకుం బిలువుము. అనిన సౌబలుని వాక్యంబులు విని గాంధారేయుండు డాంబికేయునుద్దేశించి ఈ గాంధారవల్లభుం డక్షవిద్యానిపుణుండగుటం గుంతిపుత్రులతోడ దురోదరంబాడి వారల రాజ్యం బపహరించెదనని పలికెను. నీవు సమ్మతింపవలయు ననిన వైచిత్రవీర్యుండు సుయోధనుని వీక్షించి మహాప్రాజ్ఞుండును, బలిమాప్తుండును, బుద్ధిసంపన్నుండును, దీర్ఘదర్శియును నగు విదురుని తోడ మంతనంబు గావించి పదంపడి యీ కార్యంబు నిశ్చయించి పలికెద. అతండు మన యుభయపక్షంబుల వారలకు ధర్మంబును హితంబునునగు తెఱంగెఱింగింపంగలండు అనిన నారాజతనిం గనుం గొని విదుఱుం డరుగుదెంచిన నీ కార్యం బవశ్యంబును వలదని నివారించు. నీవును నతని మతం బంగీకరించితివేని యెల్లభంగులం నేను శరీరంబు పరిత్యజింపం గలవాండ. అంత విదురుండును నీవునుం గూడి యప్రయోజకుండగు నన్నుం దొలంగి రాజ్యంబు పరిపాలింపుచు సుఖంబునం బ్రవర్తిల్లుండనిన కుమారకుని దీనాలాపంబులు విని యతని దుఃఖోపశమనంబు గావింపవలయునను తలంపున శిల్పకుల రావించి స్తంభసహస్రశోభితంబును, నతివిస్తీర్ణంబును, శతద్వార సమేతంబును, విచిత్రజాలామార్గంబును, మనోహరంబును, దర్శనీయంబును, నవరత్నఖచితంబును, దివ్యవాసనావాసితంబును నగు నొక్క సభ సుయోధనుని యర్థార్థంబుగ నిర్మింపుమని నియోగించి దురోదరం బాడుట దోషంబని యెఱింగియును బుత్రస్నేహంబున నతని వారింపంజాలక విదురవ్యతిరిక్తంబుగం గార్యాలోచనంబ నేయని

వాండు గావున నతనిం దోడితెమ్మని తగువారలం బనిచిన నతం డావృత్తాంతంబంతయు విని కలహంబునకు గారణంబయ్యెననియును, దీనివలనం గౌరవులకు నెల్ల వినాశనంబు వాటిల్లుననియును నిశ్చ యించి తన యన్న సన్నిధానంబునకుం జని యతని చరణంబులు లలాటంబుసోంక సాష్టాంగనమస్కారంబు గావింపుచు నతని నుద్దే శించి, కౌరవేశ్వరా! నీ విప్పుడు తలంచిన కార్యంబు నాకు ననమ్మ తంబై యున్నయది. ఈ జూదంబువలన నీ తనూజులకు నన్యోన్యం బును మిత్రభేదంబు జనించుననిన, ధృతరాష్ట్రుండతని కిట్లను. భీష్ముం డును నేనుం గలుగ నా తనూభవులకుం బరస్పర విరోధం బొకనాంటి కిం గలుగదు. దేవతానుగ్రహంబట్లన యుండు. కాక వాని వలన శుభం బేనియును నశుభంబేనియును, హితంబేనియును, నహితంబేనియును, గలిగినంగలుగుంగాక! ఎల్లభంగులం బుత్రప్రియంబుగ జూదం బాడింపవలయు. నీవు వాయువేగసంపన్నంబులగు హయంబులం బూన్చిన యరదంబెక్కి యిపుడె యింద్రప్రస్థపురంబున కేంగి ధర్మ నందను నిచ్చటికిం దోడితెమ్ము. ఇది యకృత్యంబు వలదని నీవు వారించితివేనియును దైవప్రేరితుండనగుటం జేసి యిది మానంజాల ననినం బ్రజ్ఞాశాలియగు విదురుం డింక కౌరవకులంబు నిలువనేరదని తన మనంబునం దలంపుచుం జని మహాప్రాజ్ఞుండగు భీష్మునకు నిం తయు నెఱింగించె.

ఈ కథ సభాపర్వంబున నెనుబదియైదవ యధ్యాయము

---

## అ ధ్యా య ము 86

---

అనిన జనమేజయుండు వైశంపాయనుం గనుంగొని, మునీంద్రా! మావంశకర్తలగు పాండవులకును గౌరవులకును ననర్థమూలంబగు

దుర్యోదరం బెవ్విధంబున నడచె? ఆ సమయంబుననే యే భూపాలకులు మధ్యస్థులై యా సభాస్థలంబున నుండిరి? ఆ కార్యంబునకు నెవ్వరు సంతసించిరి? అది యెవరివలన ప్రారంభం బొనరించిరి? ఇంతయును విశదంబుగ నీ వలన వినంగోరెద. ఈ జూదంబువలనం గదా సకల క్షత్రవినాశంబు వాటిల్లె ననిన, వ్యాసశిష్యుండును వేదవేదాంగవిశారదుండును నగు వైశంపాయనుం డతని కిట్లను. ఇది సవిస్తరంబుగ వినందలంచితేనిం జెప్పెద నాకర్ణింపుము. అవ్విధంబున, విదురుండు తనకు హితోపదేశంబుజేసి చనిన యనంతరంబ ధృతరాష్ట్రుండు దుర్యోధనుని రావించి యేకాంతంబున నతని నుద్దేశించి, విదురుండు జూదంబు వలదని పలుకుచున్నవాండు, మతిమంతుండగు నతండు మనకు హితంబెకాని యప్రియం బెఱింగింపండు. అతని వాక్యంబంగీకరించుటె నీకు మేలని నా మనంబునం దోచుచున్నయది. పూర్వంబున దేవర్షియును, నమరగురుండును, మహామేధావియును నగు బృహస్పతి మహేంద్రున కెఱింగించిన నీతిశాస్త్రంబు రహస్యసమేతంబుగ నతనికిం దెలిసియుండు గావున నేను నతని బుద్ధి నవలంబించి మెలంగుదు. వృష్ణివంశంబునం గల రాజులకుం బ్రజ్ఞావంతుండగు నుద్ధవుని చందంబున నీ కౌరవులకు విదురుండు పూజ్యుండగు. ఈద్యూతంబువలన భేదంబు వాటిల్లు. దానివలన వినాశం బవశ్యంబును బ్రాపించు. కావున నెల్లభంగుల దీనిం బరిహరింపుము. వంశక్రమలబ్ధంబగు రాజ్యం బనుభవింపుచు సకలవిద్యలును నేర్చి నీ సహోదరులును దక్కనుం గల బంధుజనంబులును నీ శాసనంబునం బ్రవర్తిల్లుదురు. మనఃప్రియంబులగు నశనాచ్ఛాదనంబుల సంతుష్టుండవై త్రిదివంబున దేవేంద్రుని తెఱంగున నిఖిలమహీమండలంబు నేలుచునుండెదు నీకు దుఃఖంపం గారణంబేమి? యెఱింగింపు మనిన సుయోధనుండతని వీక్షించి లోకంబునం దనకు నశనాచ్ఛాదనంబులకుం గలిగియున్న యది. ఇం

తీయ జాలునని సంతుష్టినొంది శత్రువులపై కినుకసేయక యుండు నతండు పురుషాధముం డనంబడు. కాన భువనంబునం గల రాజుల తెఱంగున నేనును గొంత భూమి బాలించుచు నున్నవాండ. ఇది యొక యతిశయంబె! అఖండభూమండలంబుం బరిపాలించుం బాండునందనుల వైభవంబు గనుంగొనిన నాంటనుండియును దుఃఖింపుచున్నవాండ. కాంస్కరులును, లోహజంఘులునునను నామధేయంబులు గల సాగరద్వీపనివాసులును, హిమవత్పర్వతప్రాంతనిలయులును నగు వారలును నమూల్యంబులగు రత్నంబులను గానుక లొసంగి కింకరుల విధంబున ధర్మపుత్రునకు నధీనులై మెలంగుచు నున్నవారు. నేను జ్యేష్ఠుండను శ్రేష్ఠుండను ననుతలంపున సమస్తమహీపతులు తెచ్చి యొసంగు రత్నంబులు గైకొనుటకై నన్ను నియమించినయెడ వారలొసంగు కానుక లందుకొనుచు నుండుటయ కాని క్షణమాత్రంబేనియును విశ్రాంతి నొందుటకు సమయంబు లేదయ్యె. ఆ రత్నరాసులకు నింతింతని ప్రమాణంబు దెలుప నెవ్వరికి నలవిగాదు. ఇది యట్లుండె. మఱియు ననేక విదంబుల నా సభామధ్యంబున భంగపడితి. ఇట్లు వనితల కేనియును బరిహాసాస్పదంబైన నా జీవితంబేటికి? అట్టి మహావైభవంబుగల ధర్మనందనుని యైశ్వర్యంబు గనుంగొని సైరింపంజాలక సత్పురుషుండగువాని కపకీర్తి ప్రాపించుటకంటె మరణంబు మేలు. కాన నగ్నియందైనను, జలంబులలోనైనను బడియెద. ఇంతయును నిశ్చయంబుగ నెఱుంగుము.

ఈ కథ సభాపర్వంబున నెనుబదియాఱవ యధ్యాయము.

## అధ్యాయము 87

అని దుర్యోధనుండు ధృతరాష్ట్రుం గనుంగొని మఱియు నిట్లను. పాండవులకు నానామహీపాలకులు దెచ్చి యొసంగిన రత్న కాంచన ప్రముఖంబులును మహార్ఘంబులు నగు కృష్ణాజినంబులును మొదలగు వస్తువిశేషంబులు కాంభోజ మహీపాలుండు యాగార్థంబుగ ధర్మజునకుం బనిచె. తీతువ వన్నెలును శుకతుండసమానముఖంబులును గల ముప్పూఱుహయంబులును, ననేకంబులగు నుష్ట్రంబులును, మఱియు నపారంబులగు ఘోటికానికాయంబులును గైకొని తెచ్చి త్రిగర్తలును గోపకులును దుద్రువులును మొదలగు రాజులు ధర్మనందనుని సమయంబు ప్రతీక్షించి వాంకిటం గాచి యుండిరి. మనోహరంబులగు సువర్ణకలశంబులును రత్నకాంచనంబులును గైకొని మహారథుండగు త్రిఖర్వమహీపాలుండు స్వజనసంవృతుండై యతని హజారంబునం గాచి యుండ, సముద్రోద్భవంబును, గనక చిత్రితంబును, విశ్వకర్మనిర్మితంబును, నతిధవళంబును, మనోజ్ఞంబును నై తనంతనె మ్రోయుచు నుండెడు శంఖంబు కుళిందభూపాలుండొక బ్రాహ్మణునిచే యుధిష్ఠిరునకు కానుక గావించిన, నతండును సంతసింపుచుం బార్థున కొసంగ, నా ధనంజయుం డా దివ్యశంఖంబునకు నమస్కరించి ముదితహృదయుం డగుచు నాశంఖంబు పూరించిన సమయంబున దారుణంబగు సన్నిధానంబువలనం గృష్ణుండును, సాత్యకియును, బాండవులును, దృష్టద్యుమ్నుండునుం దక్క తక్కిన మహీపతులతోడ నేనును మూర్ఛాక్రాంతుండనై పడినం గనుంగొని నన్ను నందఱుం బరిహాసంబు గావించిరి. అంత నయ్యర్జునుండు కనక శృంగంబులు గల యేనూఱు వృషభంబులాభూసురున కొసంగె. మఱియు సుముఖుండను ధరావల్లభుండు చిత్రవస్త్రంబులు మణిహేమం

బులును నజాతశత్రునకుం బనిచె. కాశ్మీరధరణీనాయకుండు స్వాదు శర్కరాగుడంబులును ద్రాక్షామద్యంబును మొదలుగాంగల కప్పంబులు గొనితెచ్చి యొసంగె. యవనరాజ్యాధీశ్వరుండు మహాజవసంపన్నంబులును బర్వతోద్భవంబులునునగు నశ్వంబులును, నభినవంబులును నతిసూక్ష్మంబులును మహావిచిత్రంబులును, దర్శనీయంబులును ననర్ఘ్యంబులును నగు రత్నకంబళంబులును, శయనాసనంబులును, మఱియు ననేక దివ్యమణిరత్నంబులును తెచ్చి ప్రతిహారులచే నివారితుం డగుచు నతని భవనద్వారంబునం గాచియుండె. కళింగదేశాధిపతియగు శ్రుతాయు వనేక రత్నంబులు తెచ్చి యొసంగె. మనోహరాంగులును సువర్ణభూషణాలంకృతులునునగు వనితారత్నంబులం గానుకలు గొనితెచ్చి యంగమహీపాలుండును జాంబూనదమయంబులును శతసహస్రసంఖ్యాకంబులునునగు పర్యంకంబులును, మఱియును నానావిధంబులగు పట్టాంబరంబులును దక్షిణసాగరసంభవంబులగు నమూల్యరత్నంబులునుం గొనితెచ్చి యనేక రాజపరివృతుండైన వంగరాజాధ్యక్షుండును రాజున కెఱింగింపుమని బహిర్ద్వారంబున నున్నవారు. పాండ్యమండలాధ్యక్షుండును దర్దురాచలంబునం బ్రభవించిన చందనవృక్షంబులు తొంబదియాఱు బారువులును, నన్ని బారువుల శంఖంబులం బనిచె. ముక్తావైడూర్యభూషణంబులును, జందనతరుకాష్ఠంబులును, జోళకేరళేంద్రు లతనికిం బనిచిరి. మఱియు నశ్మకభూపాలుండు హేమశృంగంబులును, రత్నభూషణాలంకృతంబులును, బహుక్షీరప్రదంబులును, వత్ససహితంబులునునగు దశసహస్రగోగణంబులం బనిచె. సింధుదేశోద్భవంబులును, గాంచనమాలికాలంకృతంబులును, బంచవింశతిసహస్రసంఖ్యాకంబులునునగు తురంగంబుల సైంధవుండు బనిచె. నానారత్నప్రభాభాసితంబులును, స్వర్ణమయంబులును, మధ్యందినార్క

సంకాశంబులునునగు దంతావళంబులును, మున్నూఱురథంబులును మఱియు ననేకవస్తువాహనంబులునుం గొనితెచ్చి యొసంగె. మఱియు ననంతిదేశాధీశ్వరుండు వేలకొలందులగు దివ్యమణులును, నపారంబులగు ముక్తాహారంబులును, నంగదప్రముఖంబులగు భూషణంబులును, బదివేలు దాసీజనంబులును, గప్పంబుగొనితెచ్చి యజాతశత్రుని నిరీక్షింపవలయునని సభాబహిర్ద్వారంబున వసియించె. మహాబలశాలియగు చేదివల్లభుండును, దశార్ణదేశాధీశ్వరుండును, శూరసేనవిభుండును నసంఖ్యంబులగు కప్పంబులు గొనితెచ్చిరి. స్వర్ణభూషణభూషితంబులును, సింధుసంభవంబులును నగు సహస్రహయంబులును, బదివేలు ధేనువులును, నెనిమిదినూఱుల గజంబులును గాశీదేశాధ్యక్షుండుపనిచె. విదేహనగర పరిపాలకుండగు గృతక్షణుండును, గోసలేశ్వరుండగు బృహద్బలుండును బదునాలుగువేలు తురంగంబులం బనిచిరి. మఱియు వసాతివల్లభుండగు శైబ్యుండును, మాళవేశ్వరుండును, త్రిగర్తుండును నను వీర లొకండొకండు లెక్కకు మిక్కిలియగు రత్నభూషణముఖ్యంబులగు నుపహారంబులం బనిచిరి. చారుకచ్ఛుండను మానవేంద్రుండు రూపలావణ్యసమేతులును, సర్వాభరణభూషితులును నతిదీర్ఘకేశభారులును, యవ్వనవతులును, రుచిరాంగులును, గార్వాశదేశనివాసునులు నగు నొక్కలక్షవనితాజనంబులును నమూల్యంబులగు ముక్తాహారంబులును వివిధభూషణంబులును, బ్రాహ్మణార్హంబగు కంబళంబులును మొదలగు కప్పంబులు దెచ్చి యొసంగె. మఱియు నింద్రకృష్టధాన్యంబు లాహారంబుగ నుపజీవించియుండెడు సముద్రద్వీపనివాసులునునగు, నాందిముఖ, పారద, శక, కైరాతక, సాముద్రక నిష్కుట ప్రముఖులగు పశ్చిమసముద్రతీరనివాసులును, నజావిక గోహిరణ్యంబులును, ఖరోష్ట్రంబులును, ఫలంబుల వలన జనించిన తేనియలును, నా నా విధ విచిత్రకంబళ

ప్రముఖంబులగు వివిధవస్తువిశేషంబులు కానుకలు గైకొని యతని భవనద్వారంబున నివారితులై కాచియుండిరి. వాయువేగ సంపన్నంబులును, విచిత్రవర్ణంబులునునగు నుత్తమాశ్వంబులును, మఱియు నయోమయంబులగు భాండంబులును, దంతపుపరజులందన రారెడు ఖడ్గంబులును మొదలగు కప్పంబులు గొనితెచ్చి ప్రాగ్జ్యోతిషాధీశ్వరుండగు భగదత్తుండు యవనసేనాసమేతంబుగ వాంకిట వసియించి యుండె. మఱియు నానాదేశాగతులగు నేకాక్షులును, ద్విలోచనులును, త్రినేత్రులును, లలాటనయనులును, నుష్ణీషవంతులును, బహుపాశనులును, భయరహితులును నగు సాగరద్వీపనివాసులనేకంబులగు రజితహిరణ్యరాసులును, మనోజవంబులును, నింద్రగోపశుకసంధ్యాభ్రశక్రధనుసమానవర్ణంబులుగల బహువిధంబులగు నరణ్యాశ్వంబులును దెచ్చి యతని కొసంగవలయునని బహిర్ద్వారంబున నున్నవారల నిరీక్షించితి. సింహళదేశాధీశ్వరుం డనేక ద్రవ్యంబులును, గోశీర్షకంబును, బర్బరకంబును, హరిశ్యామంబును ననియెడు నామంబులు గల చందనంబులును, నూఱు బారువులు గొనితెచ్చి యతని వాంకిట నిలిచియుండె. బర్బరనగ్నరాజ్యవల్లభులు శతసహస్ర దాసీజనంబులును నపారంబులగు రత్నకంబళంబులును బరిగ్రహించి ధర్మనందనుని వెలుపలి హజారంబున వసియించి యున్నవారు. కాలేయకంబును, రూప్యంబును, నగరుజాతీఫలతక్కోలలవంగకర్పూరంబులును, నపారంబులగు స్ఫటికదంతంబులును వహించి పౌండ్రధాతులిప్తకామకృతముఖ్యులగు మహీపతు లతని వాకిట సమయంబు నిరీక్షించి యుండిరి. క్షౌమాంబరంబులు కానుకలు గైకొని తెచ్చి శైలేయుండను నృపాలుండును, నత్యున్నతంబులును బాహ్లికదేశోద్భవంబులును నగు దశసహస్రసంఖ్యందగు నుత్తమాశ్వంబులును, విచిత్రంబులగు నుష్ణీషంబులును, బట్టకంబళంబులును, గటజంబులును, నతి

విస్మృతంబులును, మృదుస్పర్శంబులును, విచిత్రవర్ణంబులును, నరుణారుణంబులును, బాహ్లికచీనదేశోద్భవంబులునునగు వస్త్రంబులును, రసగంధంబులునుం దెచ్చి దౌవారికులం బ్రశంసింపుచు నతిప్రయత్నంబున సమ్ముఖంబు జేరిరి. పర్వతనివాసులగు చీన, హూణ, కష, కాచనృపాలకులును, నానావిధంబులగు వస్త్రంబులు గైకొనివచ్చి, ఘర్వటులును, దోమరులును, వర్ధనకులును, మఱియు బహువిధంబులగు వనంబులం గల వస్తువిశేషంబులు గొని తెచ్చిన ప్రాక్కోటకులును, నాటకేయులును, నాదేయులును, నాగరకులును, నాపీతులును, దూపసులును, బంచగేయులును, బురుమంతులును ననియెడు నాటవికప్రభువులును మొదలగువార లాకౌంతేయాగ్రజుని హజారంబున సమయంబు నిరీక్షించియుండిరి. బలసమేతంబులును దూరగమనంబులునునగు నర్బుదహయంబులును, బద్మకింజల్కసమానవర్ణంబుగల సువర్ణమయంబులగు కింకిణీగణంబులును, నతినిశితంబులును నతిదీర్ఘంబులునునగు ఖడ్గంబులు మొదలగు వస్తువులం గొని తెచ్చిన శక, తుషార, రోమిక, శృంగిప్రముఖులైన నానాద్వీపంబుల సంభవించిన పురుషులతని సమయంబు బ్రతీక్షించియుండిరి. రత్నకాంచనఖచితంబులును గజదంతవినిర్మితంబులును నగు శయనాసనవాహనంబులును, జాంబూనదాలంకృతంబులును మనోహరాకారంబులును వ్యాఘ్రచర్మావృతంబులును నుత్తమాశ్వసమేతంబులును విచిత్రంబులును నగు రథంబులును, గాంచనచిత్రితంబులగు కార్ముకంబులును, నారాచంబులును, నర్ధచంద్రబాణంబులును, మఱియు ననేకవిధంబులగు శస్త్రంబులును, లత్తుకచాయలందు రంగలించువస్త్రంబులు రెండువేలును, దుకూలంబులు పదివేలును, ననేకవిచిత్రంబులగు కాంస్యపాత్రంబులును, మహార్హంబులగు కుథంబులును మఱియు ననేక దివ్యరత్నంబులునుం దెచ్చి పూర్వదిగ్భాగంబు

పరిపాలించు మహీపాలుండు యజ్ఞవాటంబునకుం జని యుధిష్ఠిరునకు నుపాయనంబుగావించె. సముద్రమధ్య ద్వీపనిలయులు కొందఱు అమూల్యంబులగు మణిగణంబులు గొనితెచ్చి ధర్మజున కొసంగిరి. మాళవనృపాలకుండు బహువిధరత్నంబులును, గోటిద్రోణపరిమితంబులగు గోధూమంబులును, మఱియును దక్కిన ధాన్యవిశేషంబులును యజ్ఞార్థంబుగం బాండవులకుం దెచ్చియొసంగె. సురాష్ట్రదేశాధీశ్వరుం డనేక మణిగణంబులును, నయుతద్రోణపరిమితంబులగు తైలంబులును, స్వాదుగుడశర్కరాపరిపూర్ణంబగు శకటసహస్రంబునుం గొనితెచ్చి ధర్మజున కొసంగె. మఱియును సప్తదేశాధీశ్వరులగు నరపతులును నవరత్నరాసులం గైకొనితెచ్చి కౌంతేయుల కొసంగిరి. జంబూద్వీపంబునం గల నవవర్షంబులలోన హిరణ్మయ కురువర్షంబు దక్క సప్తవర్షంబులందునుంగల మహీపతులలోనం బాండునందనులకుం గప్పం బొసంగకయున్నవాం డొక్కరుండును లేండయ్యె. ఇవ్విధంబున సకల జనపరిపూర్ణంబుగ నతండు గావించు రాజసూయాధ్వరంబు మహేంద్రుని సభాభవనంబు తెఱంగునం బ్రకాశించె.

ఈ కథ సభాపర్వంబున నెనుబదియేడవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 88

---

అని దుర్యోధనుండు మగుడ నిట్లను. మఱియు నానాదేశాగతులగు మహీపతులు తెచ్చిన వస్తువిశేషంబులు వివరించెద నాకర్ణింపుము. మేరుమధ్యప్రదేశంబున నుండెడు శైలోదానదీప్రాంతంబునం గల వేణువనంబుల వసియించి యుండెడు కష, శక, శతద్యోత, ప్రఘాస, దీర్ఘవేణు, పశుపాల, కుణింద, తంకణ, పరతంకణ, పైప్పలిక,

ప్రభృతులగు నాటవికులు పిపీలికాసంగృహీతంబులగు తేనియలును హిమవత్పర్వతంబునం గల పుష్పసూనంబుల జనియించిన పూందేనియలును నించిన స్వర్ణఘటంబులును, నీలవాలంబులును శ్వేతవాలంబులును గల చమరీమృగంబులును, నుత్తరకురుదేశంబులం గల దివ్యోదకంబులును, దివ్యప్రసూనంబులును, గైలాసనగంబున కుత్తరభాగంబున నుండెడు మహాఫలసమేతంబులగు దివ్యౌషధంబులును గైకొని వచ్చి ధర్మనందనున కొసంగిరి. మఱియును శైలంబుల నుండెడు విశేషవస్తువులు గొని తెచ్చిన పార్వతీయు లతని హజారంబునం గాచి యుండిరి. మఱియును బశ్చిమదిశాంతరంబులను, నుదయాచలప్రాంతంబులను, సముద్రమధ్యద్వీపంబులను, లోహితపురసమీపంబునను వసియించు ఫలమూలాశనులును జర్మపరిధానులును నగు కిరాతులు మహారాజయోగ్యంబులగు కంబళంబులును, చందనాగరు ముఖ్యంబులగు సుగంధద్రవ్యంబులును, నతిమనోహరంబులగు చర్మంబులును రత్నకాంచనంబులును, మహార్హంబులగు గంధంబులును, గిరాతదాసీజనంబులు పదివేవురును, నతివిచిత్రంబులును ద్వీపాంతరోద్భవంబులగు మృగపక్షిగణంబులును, బర్వతంబులం జనియించిన శుద్ధసువర్ణంబునుం గొని తెచ్చి యతని సభాద్వారంబునం బ్రతీహారులవలన నివారితులై యుండిరి. కాలవ్యపరదదార్వశూరహైమవతయౌదుంబర, దర్వ భాగ పౌరవ బాహ్లిక కాశ్మీరకుంతలగౌరహంసకశిబిత్రిగర్తయౌధేయమాంత్రికవసాతిసమాలేయక్షుద్రకమాళవశౌండిక చోదర సాల్వఅంగవంగకళింగయవనగయప్రభృతులగు మహీపతులు స్వజాతీయంబులగు తమతమ బలంబులు సేవింప ననేక ధనంబులు గొని తెచ్చి ధర్మజున కొసంగిరి. తామ్రలిప్తపౌండ్రక ప్రభృతులగు నరపాలకులు దుకూలంబులును గౌశేయంబులును మొదలగు వస్త్రంబులు దెచ్చినం గైకొని వారల ద్వార ప్రదేశంబున నివారించిరి. ఈ

పాదండప్రమాణంబులగు దంతంబులును, గనకమయంబులగు నొరి జిత్రాళ్లును నరవిందనిభంబులగు కుథంబులును, శంఖమాలికలునుం గలిగి తనరారుచుం గులీనంబులును బర్వతాకారంబులును నగు దంతావళంబు లొకండొకండు దశశతంబులు గొని తెచ్చి ద్వారంబు నంగల యధికారుల వశంబుగ నిచ్చి సమ్ముఖంబునకు వచ్చిరి. వైదేహకపుండ్రకగోలవతామ్రలిప్తకమరుకకాశికదర్ధభామేయనట నాటకకర్ణాటకకాంస్యకుట్టపద్మజాలశుచివరదాక్షిణాత్యకుళిందశ బరకంకణకమబర్బరయవనఘూర్జరయాభీరకపప్లవశకకారూశ తుంబురకాశికప్రముఖులగు ధరావరులు తమతమకు గల రత్నం బులు కౌంతేయాగ్రజునకుం గానుకలు గావించిరి. మరియును సింహళద్వీపనివాసులగు నవనీనాథులు సముద్రోద్భవంబులును నమూల్యంబులును నగు ముక్తావైడూర్యమణి నివహంబులును, దక్షిణావర్తంబులగు శంఖంబులును, మనోజ్ఞంబులగు శుక్తికా జాలంబులునుం దెచ్చి పాండవాగ్రజున కిచ్చిరి. వాసవసఖుండును, జిత్రరథనామధేయుండునునగుగంధర్వవల్లభుండు స్వర్ణమయవస్త్రాలం కృతంబులును రక్తలోచనాంచలంబులును జాంబూనదభూషణభూషి తంబులును దేవలోక సముద్భవంబులును నగు నన్నూఱుగజంబు లుపాయనంబుగ నొసంగె. చూతపల్లవవర్ణంబుగల తురంగశతంబు తుంబురుం డొసంగె. కుళింద దేశాధ్యక్షుండు వేలకొలందులగు రత్న కాంచనంబులును వస్త్రంబులును గానుకగా సమర్పించె. మత్స్య దేశపరిపాలకుండగు విరటుండు గాంచనాలంకారశోభితంబులగు సహస్ర మదవారణంబు లొసంగె. వసురాష్ట్రాధిపతిముప్పదియాఱుగంధగజేం ద్రంబులును, హాటకమాలికాలంకృతంబులును,సర్వజనసమేతంబులును నగుసహస్రతురంగమంబులును,మఱియుం గొన్ని వస్తువిశేషంబులును దె చ్చియిచ్చె. యజ్ఞసేనభూపాలుండుస్వర్ణాలంకారశోభితంబులు బంచవిం

శతిసహస్రసంఖ్యాకంబులును నగు ఘోటకంబులును, బత్నిసమన్వితు లగు దాసజనులు పదివేవురును, మనోహరాంగులగు దాసీజనంబులు పదునాలుగువేలును దెచ్చి యొసంగె. బాహ్లికదేశాధీశ్వరుం డశ్వ సమేతంబులగు నరదంబులు నిరువదియాఱును, మఱియును గొన్ని కుంజరంబులును, దనరాజ్యంబంతయును నతని యజ్ఞార్థంబుగనొసంగె. అది కనుంగొనిన నాంటనుండియును నామనంబు పరితపించుచున్నయది. జ్యేష్ఠునికుమారుండును గుణవంతుండును నగు తా నొగిలియుండుట యును, కనిష్ఠునిపుత్రులును గుణహీనులును నగు పాండవేయు లభి వృద్ధిం బొందుటయుం జూచినం గాండిపై గుఱ్ఱంబులం గట్టినట్లు వైపరీత్యంబు దోచుచున్నయది. ఇంతయును నీవలనం గలిగె. ఇంక నుం జెప్పెద. అభిమానవంతులును బలసంపన్నులును నగు రాజులంద ఱును దమకు కప్పంబులగుటం జేసి కౌంతేయులు ముదంబునం బొద లుచు నున్నవారు. వేదశాస్త్రసంపన్నులగు మహీసురులును, సమర కర్కశులగు రాజులును, వైశ్యశూద్రులునుం దమతమకు విహితంబు లగు పనులుగావించి యతనికి సంతుష్టింగావించిరి. ఆదిమధ్యాంతజాతి సంభవులగు మ్లేచ్ఛులును, జతుర్వర్ణంబులవారును మొదలగు లోకం బునం గలుగువార లందఱును నతనిపురంబునకు వచ్చిరి. ఇవ్విధంబున సకలభూపాలకులునుం దోచియొసంగినం గానుకలు నిరీక్షించిన తనకు శరీరంబు త్యజించునంతదుఃఖం బయ్యెడు. ధర్మనందనుని మందిరంబు నం బక్వాన్నభోజనంబు సేయువారును, బత్యంబులు గైకొనువారలు నునై తేజరిల్లుచు, మూండుపద్మంబులుం బదివేలుగజంబులు మావం తులును, నందఱు నశ్వంబులంగూడిన రాహుత్తులును, బదివేలు రథంబులవామసాదులును, లెక్కకు మిక్కిలియగు పదాతియోధులు నుంగలరు. మఱియును నతని యాగసదనంబున నొక్కొక్కయెడం బారయత్నంబు లాచరించువారును, మఱియు నొక్కెడ బ్రాహ్మణు

లం బిలుచువారును, వేఱొక్కచక్కం బుణ్యాహవాచనంబు సేయువారును నై యుండిరి. ఆయజ్ఞంబులకై చనుదెంచినవారలలోన క్షుభితుండును సంతుష్టుండు గానివాండును నొక్కరుండును లేండయ్యె. ఒకరొకరికిం ద్రింశత్సంఖ్యదాసీజనంబుగల మహీసురు లెనుబది యెనిమిదివేలు యుధిష్ఠిరునిచే సంరక్షితులై యున్నవారు. కాన నతనికి విజయంబు గలుగవలయునని యాశీర్వాదంబు గావింపుచు నుండుదురు. జితేంద్రియులగుయతీశ్వరులు పదివేవు రతని మందిరంబునం బసిండిపళ్లెరంబుల భుజియింపుచు నున్నవారు. మఱియు నతని యజ్ఞంబునం గుబ్జవామనప్రభృతులును వలయునంత భుజియింపుచు నుండం బాంచాలరాజపుత్రి యామెడకుం జనుదెంచి కనుంగొనుచు నుండు. వివాహసంబంధంబువలనం బాంచాలురును, స్నేహంబువలన నంధకవృష్ణివీరులును దక్క, తక్కిన భూపతులలోన నతనికిం గప్పంబొసంగనివాండొక్కరుండును లేండయ్యె.

ఈకథ సభాపర్వంబున నెనుబది యెనిమిదవ యధ్యాయము.

---

## అధ్యాయము 89

---

అని దుర్యోధనుండు మఱియు నిట్లనె. సత్యసంధులును, వ్రతశాలులును, సకలవిద్యాపారగులును, వాచాలకులును, మహాధ్వరంబులుగావించి యవభృథంబులుజేసిన మహాత్ములును, కీర్తిధురీణులును, మహాత్మకులును, సంతుష్టచిత్తులును, మూర్ధాభిషిక్తులును నగు రాజన్యులొక్కాం తేయాగ్రజు నుపాసించిరి. బహుదుగ్ధప్రదంబులగు ననేకసహస్రగోగణంబులు యాగదక్షిణార్థంబుగం గొందఱు రాజులు ధర్మనందనునకొసంగిరి. మఱియును గొందఱు మహీపతు లవభృథాభిషే

కార్థంబుగనతివిచిత్రంబులగుస్వర్ణభాండంబులయ్యుధిష్ఠిరునకుందెచ్చియిచ్చిరి. బాహ్లీక దేశాధీశ్వరుండు కాంచనాలంకృతంబును మహోన్నతంబును నగురథంబును,సుదక్షిణభూవల్లభుండు కాంభోజ దేశోద్భవంబులగు శ్వేతాశ్వంబులును, చేదిరాజ్యాధ్యక్షుండును, మహాయశుండును, సమానరహితుండును నగు కక్షురక్షుండు రత్నధ్వజంబును, దక్షిణ భూవల్లభుండగు మాగధుండు కవచంబును, నుష్ణీషంబును, గనక ప్రసూనదామంబులును, ధనుర్ధరవర్యుండగు వసుధానుం డత్యున్నతంబును నఱువదియేండ్ల ప్రాయంబునుంగల యొక్క భద్రదంతావళంబును, మత్స్యధరణీనాయకుం డశ్వంబులును దురంగమంబులును, నేకలవ్యుండు బాదత్రాణంబులును, నవంతిధాత్రీరమణుండు ధర్మజుయభిషేకార్థంబుగా బహువిధంబులగు పుణ్యోదకంబులును, చేకితానుండు తూణీరంబులును, గాశీవల్లభుండు దివ్యకార్ముకంబును, శల్యుండు కాంచనత్సరుశోభితంబగు ఖడ్గంబును, మఱియునుం దక్కంగల నరేంద్రులును, నానావిధసాధనంబులుబూని తనవెంబడిం జను దేర నాధర్మజుం డవభృథస్నానార్థంబుగ వెడలునెడ ఋత్విగ్గనంబులు మహేంద్రుని వెనుక నరుగు సప్తర్షుల తెఱంగున నతని వెంబడిం జనిరి. విక్రమధురీణుండగు సాత్యకి ఛత్రంబును, భీమధనంజయులు వింజామరంబులు ధరియించిరి. పూర్వకాలంబున క్షీరసముద్రసంభవంబగు శంఖంబు సహస్రప్రమాణంబగు సువర్ణంబున నలంకృతంబు గావించి విశ్వకర్మ కమలాసనున కొసంగె. అతండును పురందరున కిచ్చిన నతనిచే వరుణుండు గైకొని యజాతశత్రునకుం బనిచె. అట్టి శంఖంబునం గృష్ణుండు ధర్మపుత్రునకు నభిషేకంబు గావించె. అది కనుంగొనుటచేం గదా తన మనంబు క్లేశం బొందుచున్నయది ! మఱియును రాక్షసోత్తములు స్వర్ణకలశంబులు గైకొని పూర్వదక్షిణ పశ్చిమసాగరంబులకుం జని జలంబు లాపాండవేయుని యభి

షేకంబునకై తెచ్చిరి. అయ్యవసరంబున శుభప్రదంబులగు బహు శంఖనినాదంబులు వినంబడియె. దానివలననగు భయంబునం దనకు రోమాంచంబు వొడమె. ప్రణతులగు సకల రాజన్యులును నిస్తేజస్కు లగుచు భూతలంబునం బడిరి. అయ్యవస్థం గనుంగొని దృష్టద్యుమ్నుండును, పాండునందనులేవురును, సాత్యకియు, గేశవుండును హాస్యంబు గావించిరి. ఆసమయంబున జాంబూనదశృంగంబులం దనరు నేనూరు వృషభంబులు పార్థుండు భూసురోత్తములకు దానం బొసంగె. వైన్యుండును, యౌవనాశ్వుండును, బృథుండును, భగీరథుండును మొదలగు పూర్వనరపాలుర వైభవం బీధర్మనందనుని యైశ్వర్యంబునకు సమానంబు గాదు. మున్ను హరిశ్చంద్రుండు రాజసూయాధ్వరం బొనరించిన చందంబునం గుంతీసుతుండు యాగం బొనర్చి నిఖిలైశ్వర్యంబు లనుభవించుటం గనుంగొని నే నెవ్విధంబున సైరింపనేర్తు? ఇంక మీకుం దెలుపనేటికి? వారల వైభవంబు వీక్షించి తనకు సహింప శక్యంబుగాదు. కావున నిట్టి వైవర్ణ్యంబును, గార్శ్యంబును, శోకంబును బ్రాప్తం బయ్యె.

ఈకథ సభాపర్వంబున నెనుబదితొమ్మిదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 90

---

అని యివ్విధంబునం బాండునందనుల సామ్రాజ్యంబు గనుంగొని సైరింపంజాలక దుఃఖాక్రాంతుండై పలుకు దుర్యోధనుని వచనంబు లాకర్ణించి ధృతరాష్ట్రుండు, సుయోధనా! జ్యేష్ఠపుత్రుండవు రాజ్యాభిషిక్తుండవు నగు నీవు కుంతిపుత్రులయెడ విరోధంబు వాటించుటవలనం బడంపడి యాత్మనాశంబుచేం గలిగెడునంత

దుఃఖంబు ప్రాప్తంబగుగాన వారలతోడ వైరంబు గావించుట యుక్తంబుకాదు. వివేకధురీణుండును, నిర్మత్సరుండును, ఘనకుం బరమమిత్రుండును నగు నజాతశత్రునిపై నీవిత్తెఱంగున నలుగుట యుచితంబగునె? మీర లిరువురు నొక్కవంశంబునం జనించి సమానపరాక్రములై యుండునెడ మీ యన్నయగు నతని వైభవంబపహరింపం దలంచుట దురాశ. ఇంతియకాని వేఱొండుకాదు. కావున దానిం బరిహరింపుము. నీవును గాంతేయుని చందంబున యాగం బొనరింపవలయునని తలంచితివేని నిఖిలమహీపతులు బహుమానపూర్వకంబుగ రత్నకాంచన ప్రముఖంబులగు వలయు వస్తువులొసంగ, వేదవేదాంగ పారంగతులగు మహీసురులు యాజకులై ప్రవర్తింప మహాధ్వరంబు గావించి ప్రమోదంబునం బొదలుము. నిఖిలమనోభీష్టంబులు నెరవేర్ప సామర్థ్యంబు గలిగి కామధేనువు చందంబునం దనరారెడు నీ వసుంధరారమణి వీరపత్ని యనంబఱంగు. అవ్విధంబుననె రాజ్యలక్ష్మియును వీరుండగు పురుషునికిం గళత్రంబు చందంబున నధీనయై యుండుగాన నట్టి శౌర్యధుర్యులకు నధీనయై యతండు కోరిన కోరికలన్నియును నమకూర్పం జాలియుండు. నీకును నట్టి పరాక్రమశక్తి కలదేని చతుస్సముద్రపరివేష్టితంబగు నిఖిలధరావలయంబు బరిపాలించెదవు. మిత్రులగు వారి నవమానించుటయును, నొరులకు నపకారంబు లాచరించుటయును ధర్మంబుగానేరదు. పరుల ధనంబుల యెడ విముఖుండై యుండుటయును, స్వకార్యనిరతుండై ప్రవర్తించుటయును నని యెడు నీగుణంబులైశ్వర్యంబు జెందుటకు ఫలంబు. మహత్తరంబగు నాపదలు తన్నుం బ్రాపించిన నేఁటి ధైర్యంబువదిలక నిజకార్యప్రయత్నంబు జేయుచు, నప్రమత్తుండును, వినయసంపన్నుండును నగుచు మెలంగెడు పురుషుండు సంతతంబును సకలసౌఖ్యంబు లనుభవించుగావున మనంబునంగలుగు నసూయవర్జించి నీవైభవంబునకుం బ్రయోజ

నంబుగ మహనీయంబులగుమహాధ్వరంబులు గావింపుచు రూపలావణ్యా సమేతంబులగువనితాజనంబులతోడం గ్రీడింపుచు నిష్టోపభోగంబులం జెంది సంతుష్టుండవై యుండుము.

ఈ కథ సభాపర్వంబునం దొంబదియవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 91

---

అని యివ్విధంబున హితోపదేశంబు గావించు ధృతరాష్ట్రునివచనంబు లాకర్ణించి దుర్యోధనుండు, కౌరవేశ్వరా! నీవు సకలం బెఱింగియుండియును, యానపాత్రంబు చందంబునం బరాధీనుండవై స్వార్థంబు పట్లం బ్రమత్తుండవై పలికెదవో? లేక నా యెడ నీకు విరోధంబు జనియించినదో? యెఱుంగ. అకృత్యంబు కృత్యంబని నీవంటి మహానుభావుం డిట్లుపదేశంబు సేయుటవలనం గౌరవులకు నింక నెక్కడి బ్రతుకున్నయది? స్వతంత్రుండవగు నీవు పరుల వాక్యంబులకుం జెవియొగ్గి నాకు నుపదేశించిన వచనంబులు రాజనీతి విరుద్ధంబులు కావున నెవ్వండేనియును నీ బుద్ధిమార్గం బనుసరించి మెలంగం జూచునె? వృద్ధోపసేవియును బుద్ధిసంపన్నుండును జితేంద్రియుండును నగు నీవు స్వకార్యనిరతులమై ప్రవర్తించు మాకు బుద్ధిభ్రంశంబు గల్పించెదవు. ఇంతియ కాని వేఱొండుగాదు. లోకవృత్తంబునకు రాజనీతికిం దూరంబని బృహస్పతి వచనంబులు గలవు. కావున మహీపాలునకుం దనకార్యంబు సేకూరు నుపాయంబె చింతింపుచు నుండవలయు. ఇదిధర్మం బిదియధర్మంబని తలంచక శత్రుసంహారంబునకె ప్రయత్నంబు సేయుచుండుట క్షత్రియుండగువానికిస్వధర్మంబు. సారథియగు వాండు పురోదంబు గైకొని సమయం బెఱింగి రథ్యంబుల

నలుదిక్కులం బరపు తెఱంగున ధరణీవల్లభుం డుపాయతంత్రంబున విరోధుల యైశ్వర్యంబు నలుదిక్కులం బరపవలయు. ప్రకాశంబుగ నైనను బ్రచ్ఛన్నంబుగ నైనను మెలంగి పగతుర జయించు నుపాయంబె రాజులకు శస్త్రంబుగాని వేఱొండు శస్త్రంబు గాదు. తనకు నింత మాత్రంబు రాజ్యంబు గలిగియున్నది. ఇంతియ చాలునని సంతుష్టుండు గాక పగర జయించు నుపాయంబె చింతించు నతండు రాజనీతి విధిజ్ఞుండు. అతనికి సకలైశ్వర్యంబులును గలుగు. కాన నేను నట్టి రాజధర్మంబు గోరుచు నున్నవాండ. ఈ రాజ్యంబును ధనంబును తనదని మనంబునం దలంచుటకు నెవ్వనికిం బనిలేదు. బలవంతుం డగువాండు దుర్బలుల నిర్జించి యది గైకొనుటయె ధర్మంబని ప్రాజ్ఞులెఱింగింతురు. ఈ యర్థంబు మనంబునం దలంచిగదా పరిచ్ఛన్నుండై మహేంద్రుండు నముచితోడ మైత్రి వాటించి కపటోపాయంబున నతని శిరంబు ఖండించె. ఇదియ విరోధుల యెడం గావింపవలయు తెఱంగు. తీర్థాచరణంబు సేయని మహీసురుండును యుద్ధంబునకుం బ్రియత్నంబు సేయని భూపాలకుండును బిలంబునం బ్రవేశించి వెడలక యుండెడు భుజంగంబు చందంబున భూమిచే గ్రసింపంబడుదురు. రాజునకు సమానుండై యైశ్వర్యంబున నుండెడు వాండె శత్రుండు గాక శత్రుజాతి యని వేఱెయొకటి కలిగియున్నదె? నరపాలునకుం బరపక్షసమృద్ధిని సహించి యుండుట పురుషునికి శరీరజంబగు రోగంబు చాడ్పున వినాశంబు నొందించు. విపక్షుండు హీనుండు గదా యని తలంచి తేని యతండు క్రమంబున వృద్ధింజెంది వృక్షమూలంబున జనియించిన వల్మీకంబు వృక్షంబు నాక్రమించు తెఱంగున నతని నాక్రమించు. తనకంటె నధికులగు విరోధుల వైభవంబునకు నోర్వంజాలక యుండుటయె మూర్ధాభిషిక్తులగు రాజులకు ధర్మంబు గాన నీవును శత్రుసమృద్ధి సహింపకుము. ఇతర జనసమృద్ధి

చందంబున వైరుల యైశ్వర్యంబు సహించు నతండు నశించుం గావున విక్రమంబున శ్రేయంబు వడయనలయు. పాండునందనుల శ్రేయంబు తనకు సంశయంబులకునెల్ల నాస్పదంబై యున్నయది. కాన వారల సమరంబున జయించి యైశ్వర్యంబు గైకొనుట యొండె, కాదేని వారలచే నిహతుండ నగుట యొండె, యని మనంబున నిశ్చయించి నాండ. కౌంతేయులు లక్ష్మీవంతులై యుండ హీనుండనై యుం డెడు తన జీవితం బేటికి?

ఈ కథ సభాపర్వంబునం దొంబదియొకటవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 92

---

అని యివ్విధంబున ధృతరాష్ట్రు నుద్దేశించి పలుకు దుర్యోధనునివచనంబు లాకర్ణించి గాంధారవల్లభుండు రారాజు నుద్దేశించి, సుయోధనా! నీవు పాండవాగ్రజునియెడంగల యైశ్వర్యాతిశయంబుగ నుం గాని యింతయేమిటికిం బరితపించెదవు? పాండవుల రావించి తేని యుద్ధంబనియెడు ప్రసంగంబైనను దలంపక సంశయరహితంబుగ నక్ష విద్యావిశారదుండనగు నేనుదురోదరంబునెడ సామర్థ్యంబులేని పాండు నందను లరెక మోయుకయుండ జయించెద. పన్నిదంబనియెడు కార్ముకంబును, నక్షంబులను శరాణంబులును, నక్షహృదయంబనియెడు గుణంబును, నాస్తరణంబనియెడు నరదంబును సాధనంబుగ, జూదంబని యెడు సంగ్రామంబునం గౌంతేయుల నిర్జించి వారి నిఖిలైశ్వర్యంబు నుం గైకొని నీకొసంగెదనను నతనివాక్యంబు లాకర్ణించి, సుయోధనుండు ద్యూతంబునందు సమర్థుండగు నీ శకుని పాండునందనులతోడ జూదంబాడి వారల వైభవంబంతయు నపహరించెదనని పలికెడు

గావున నతనికి ననుజ్ఞ యొసంగవలయు ననిన, నంబికా నందనుండు నేను విదురశాసనంబునం బ్రవర్తిల్లెడువాండ నగుట నతని తోడమంతనంబుగావించి పదంపడియీకార్యంబు నిశ్చయించి పలికెద ననిన, రారాజు తనతండ్రి నుద్దేశించి, కౌరవేశ్వరా! యీ విదురుండు కృష్ణునికంటె బుద్ధిసంపన్నుండగు, అట్లైనను ధర్మంబె ప్రధానంబుగ బలుకుం గాన దానవలన జయంబు సేకూరనేరదు. ధర్మరహితంబగు నయంబును, నయవియుక్తంబగు ధర్మంబును జయంబు సేకూర్పం జాలదు. కాన ధర్మనయసమేతంబగు బ్రయత్నంబున శత్రువిజయం బుగైకొనవలయు. ఈ విదురుండు పాండవపక్షపాతి గావున నెల్ల భంగుల నీబుద్ధి కొనసాగనీయక విఘ్నంబు లాచరించు. లోకంబున జనులబుద్ధులు బహువిధంబులై యుండుం గావున స్వకార్యంబు నొరులబుద్ధి నడిగి కావించువారు నుంగలరె? పరులకు భయంబు సం పాదింపక నిజశరీరసంరక్షణంబు గావించుకొనియెద ననువాండు సంత తంబును వర్షంబునందడిసి జీర్ణంబగు వస్త్రంబుతెఱంగున వినాశంబు నొందు. రోగంబులు మృత్యువును దనకు శ్రేయంబువచ్చునంతకును బ్రతీక్షించియుండవు గాన పురుషుండు తనకు సామర్థ్యంబుగలుగు నప్పుడె శ్రేయస్కరంబులగు కార్యంబు లాచరింపవలయు. అనిన వైచిత్రవీర్యుండు బలవంతులగు పాండుపుత్రులతోడ నీవు విరోధంబు వాటించుట నాకు సమ్మతంబుగాదు. బలవద్విరోధంబు లోహానిర్మి తంబుగాని శస్త్రంబై వినాశంబునొందించు. ఉపద్రవకారణంబగు దురోదరం బెవ్విధంబునం బ్రవర్తించెనేనియును నతిఘోరంబగు కల హంబుగల్పించు గాన దానిమేలని మనంబునం దలంచెదేటికి? అనిన దుర్యోధనుండు జూదంబాడుట యుక్తంబని శాస్త్రవిధిజ్ఞులగు పెద్ద లెఱింగింతురు. కాన దీనివలన ననర్థంబును, యుద్ధంబును వాటిల్లదు. కావున నీశకునివచనంబు లంగీకరించి సభానిర్మాణంబున కనుజ్ఞ

యొసంగుము. ద్యూతంబునం గ్రీడం గావించువారలకు స్వర్గసౌఖ్యంబు గావున దానవిహరించుట మనకుయుక్తంబగుటంజేసి యెల్లభంగులం బాండవులతోడ దురోదరంబె కావింపు మనిన ధృతరాష్ట్రిం డతని నుద్దేశించి యెల్లభంగుల నీవాక్యంబులు నా కయుక్తంబై తోచు చున్నయది. ఇంక నీమనంబునకు రుచియించిన తెఱంగునం బ్రవర్తిం పుము. పదంపడి యనర్థంబు వాటిల్లినయెడ నీవె పశ్చాత్తాపంబుం బొందెదవు. అపుడు నీచేతం దరింపనలవికాదు. రాంగలయర్థం బిపుడే యెఱింగించితి. ఇది నచవమాత్రంబు గాదు. రాజ నీతివిశారదుండగు విదురుండీ ద్యూతంబు వలనం గీడు రాంగలయదియని మున్నెఱింగియున్నవాండు. అతండుతలంచినట్లన దురోదరంబిపుడు ప్రాప్తంబయ్యె. ఇంక క్షత్రియకులంబెల్లను నిశ్శేషం బుగ సమసిపోవంగలయది. అని యివ్విధంబునం బలుతెఱంగులం బలికి మేధాధురీణుండగు ధృతరాష్ట్రిండు దైవయత్నంబనివార్యంబని మనంబునం దలంచి పుత్రవాక్యం బతిక్రమింపంజాలక శిల్పకుల రావించి సహస్రస్తంభశోభితంబును, హేమవైడూర్య చిత్రితంబును, స్ఫటికోపలనిర్మితంబులగు శతద్వారంబులవలన నలం కృతంబును, క్రోశమాత్రాయతవిస్తృతంబునునగు సభామంటపంబు శీఘ్రంబునవినిర్మించుట కనుమతి యొసంగిన, వారలును నతని వచన ప్రకారంబున సకల ద్రవ్యంబులు గొనితెచ్చి రమ్యంబును నత్యాశ్చ ర్యంబును రత్నకాంచనశోభితంబును నగు సభాభవనంబు శీఘ్రంబునం గావించి నానావిధంబులగు శయనాసనంబులు సంఘటించి హేమ మయంబులగు చిత్రంబులును నలంకరించి వైచిత్రవిస్ఫురణ కెరింగింప, నతండును మంత్రి ముఖ్యుండగు విదురు నుద్దేశించి నీవు ధర్మనందను నిసన్నిధానంబున కేంగి రత్నకాంచనమయంబును నతి విచిత్రం బునునగు మా సభాభవనంబును వీక్షించి దుర్యోధనాదుల తోడ

సుహృద్ద్యూతం బాడుటకు సహోదరసహితంబుగం గరిపురంబునకు రమ్మని నా వాక్యంబులుగ నతని కెఱింగించి తోడితెమ్మని పుత్రుని మతంబవలంబించి యనీతివాక్యంబులు వలుకు నాంబికేయుని వచనంబు లాదరించక, యతం డతనిం గనుంగొని, కౌరవేంద్రా? నీ విట్టి కృత్యంబు లాచరించుటవలన నీ తనూభవులకు నన్యోన్యంబును విరోధంబు సంభవించి పదంపడి కులక్షయంబు వాటిల్లంగలయది. వారల సన్నిధానంబునకు నన్నుం బనుపనేటికి? ఈ కార్యంబు నాక ప్రియంబై యున్నయది. అనిన గాంధారీ వల్లభుండు, లోకంబుల నెల్లవారును దైవపరతంత్రులై మెలంగెడువారలే గాక స్వతంత్రులు గారు. దైవానుగ్రహం బనుకూలించి యుండెనేని కలహం బొకనాంటికిం గలుగనేరదు. కావున నీవతిశీఘ్రంబుగ నరిగి పాండవుల నీయెడకుం దోడితెమ్మని పనిచె.

ఈ కథ సభాపర్వంబునం దొంబది రెండవ యధ్యాయము.

---

## 93 అధ్యాయము

---

అంత నా విదురుండు, మహావేగ సంపన్నంబులును, శిక్షితంబులును, సత్వసమేతంబులును నగు తురంగంబులం బూన్చిన యరదం బెక్కి ధృతరాష్ట్రుండు బలాత్కారంబునం బనుప ననేక దేశంబులు దాంటి యింద్రప్రస్థ పురంబునకుం జని యయ్యెడం గల మహీసురులచే బూజితుండగుచుం గుబేరభవనసమానంబగు రాజమందిరంబుం బ్రవేశించి ధర్మపుత్రునిసమీపంబునకుం బోవ, సత్యసంధుండును ధర్మాత్ముండును నగు నజాతశత్రుం డతనికిం బూజావిధానంబులొనర్చి ధార్తరాష్ట్రుల నేమంబడిగి నీముఖంబున విన్నం

దనంబు దోఁచుచున్నయది. కుశలంబుననున్నవాఁడవె? సుయోధనాదులు కౌరవేశ్వరునిపంపున మెలంగుచునున్నవారె? యనిన విదురుండతనిం గనుంగొని మహేంద్రప్రతిమానుండగు నాంబికేయుండు వినయసమన్వితులగు పుత్రమిత్రబంధుజనంబులఁ గూడి సుఖంబుననున్నవాఁడు. అతండు మీసేమంబు పరామర్శించి మీసభాభవనంబునకు సమానంబుగ నొక్కసభ నిర్మించితిమి, నీవు సోదరసహితంబుగం గరిపురంబునకుం జనుదెంచి యాసభాభవనంబు గనుంగొని యయ్యెడ వినోదార్థంబుగ భ్రాతృజనంబులగు సుయోధనప్రముఖులతోడ మిత్రద్యూతంబునం బ్రవర్తిల్లుము, నీవిందు రావలయు ననియును, నిన్ను నవలోకింపవలయుననియును, నేనును దుర్యోధనాదులగు కౌరవులందఱును ప్రియంబందుచునున్నవారమని నీతో నెఱింగింపుమనియె. దురోదరంబునందు సమర్థులగు కొందఱు ధూర్తులాసభామంటపంబున కరుగుదెంచి యున్నవారు. అయ్యెడకుం జనుదెంచిన వారల నిరీక్షించెదవనిన, ధర్మనందనుం డతని నవలోకించి లోకంబున ద్యూతంబు కలహంబునకుం గారణంబై యుండు, బుద్ధిసంపన్నుం డగువాఁడు జూదంబాడంజూచునె, మే మందఱమును నీయాజ్ఞలోన మెలంగెడువారమగుట యుక్తాయుక్తంబులు నిశ్చయించి నీవ యెఱింగింపు మనిన, విదురుం డజాతశత్రునిం గనుంగొని, ఇది యనర్థహేతుకంబని విచారించి వలదని పలుదెఱంగుల వారించితిని, అట్లుండియును మిమ్ముం దోడితెమ్మని నన్నిటకుంబనిచె, ఇంక నీకుం దోచినతెఱం గాచరింపు మనిన, నయ్యుధిష్ఠిరుం డాసభలోన ధృతరాష్ట్రకుమారులగు సుయోధనాదులుదక్క ద్యూతవిశారదులగు వార లెవ్వరున్నవారు, వారలతోడం దొడరి బహువిధంబులగు ద్యూతక్రీడలం బ్రవర్తించెద, వారి నెఱింగింపు మనిన, విదురుండు ద్యూతక్రీడాసమర్థుండును, నక్షహృదయజ్ఞుండును, గాంధారవల్లభుం

డునునగు శకునియును, చిత్రశేఖరుండును, బురుమిత్రుండును, సత్యవ్రతుండును, జయుండునుననియెడు వీర లన్యోడనున్నవార లనిన, నాకొంతేయాగ్రజుం డిప్పుడు నీవు వచియించిన వారలందఱును, మహామాయోపాయులును, గపటాత్మకులును, వంచకులును ననంప్రసిద్ధులై యుండుదురు, ఇట్టివారలతోడం దనకు దురోదరంబు ప్రాప్తంబగుట దైవసంకల్పంబు గానోపు, అట్లైనను ధృతరాష్ట్ర మహీపాలుని వాక్యంబులు నాకలంఘనీయంబులు, శకునితోడ జూదంబాడుట నాకుసమ్మతంబుగాదు, అతండు దిట్టతనంబున సభామధ్యంబున ద్యూతంబునకు తను పిలువకపోవండు, ఎందేనియును దంద్రియగువాండు పుత్రునకు హితంబెకాక వేఱొండువలుకునె, నీవెట్లు చెప్పి తట్లసేయంగలవాండ. అదియట్లుండె. దురోదరంబునందుం బ్రియంబుగలిగి యొకరినాడరమ్మనిపిలుచుటయును, నొక్కండు దురోదరంబునకుం బిలిచినతఱిం బోకుండుటయును లేదు. ఇదితనకు శాశ్వతంబైన వ్రతంబని పలికి సకలజనంబులం గనుంగొని కరిపురప్రయాణంబునకుసన్నాహంబు గావింపుడనిన వారలును నట్లుగావించిరి. అంతం దేజోధురంధరుండును, బరివారసమేతుండునునగు ధర్మనందనుండు భూసురోత్తములకనేక ధనసంచయంబులు యాత్రాదానంబుగ నొసంగి వారలు స్వస్తివాచనంబులు గావింప ధౌమ్యసహితంబుగ నంతఃపురంబువెడలి, హారకేయూరకిరీటకుండలాదిభూషణభూషితుండగుచు నయ్యజాతశత్రుండు సర్వలక్షణలక్షితంబును, మహారాజార్హంబును, సర్వాలంకారశోభితంబును, మధ్యమవయోవిజృంభితంబునునగు భద్రదంతావళంబు నధిరోహించి కాంచనమయంబగు పరమాసనంబునం గూర్చుండి కనకచిత్రితంబగు వేదికామధ్యంబునం గనుపట్టు పావకునిచందంబునం బ్రకాశింపుచుం జతురంగబలంబులును ప్రమోదంబునం బొదలుచు వెంబడిం జనుదేర, తక్కునుంగలవారలు రథాందోళికాప్రముఖంబులగు వాహనంబుల

రథనేమినిస్వనంబుల నంబరంబు పూరింపుచు సూతమాగధవందిజనం బులు బహువిధంబులం బ్రశంసింపం జతురంగబలసమన్వితుండై సహస్రకిరణంబులం దేజరిల్లు మార్తాండునికరణి సకలసేనాసమేతుండై పూర్ణిమానిశామధ్యంబునం బ్రకాశించు పూర్ణచంద్రునిచాడ్పున శ్వేతఛత్రంబు మెఱయ, హేమదండమండితంబులగు వింజామరంబు లిరుగడలఁ మెఱయ, బ్రాహ్మణులు ముందఱఁ జనంబ్రమోదంబునఁ బొదలుచు మార్గంబునం గలజనులు సంతుష్టహృదయులగుచు నాశీర్వ దింప నంగీకరింపుచు, మఱియును గొండఱు శుభసూచకంబులగు మృగపక్షిస్వనంబుల నెఱింగింప సకలసైనికుల సింహనాదంబులు నభంబునం గీలుకొన భద్రేభంబుపై నెక్కి పవననందనుండు ముంద ఱం జనుచుండ యుభయపార్శ్వంబుల మదగజస్కంధారూఢులై మాద్రీపుత్రులు నిజతనుప్రభావిశేషంబుల నలుదిక్కులం బ్రకాశింపం జేయుచు నరుగుదేర, బుద్ధిసంపన్నుండగునర్జునుండు శ్వేతాశ్వంబులం, బూన్చిన పావకప్రసాదలబ్ధంబగు నరదంబెక్కి గాండీవంబు కరంబున నమర్చుచు వెంబడిం జనుదేర సకలసైన్యపరివృతుండై నడుచునంత, ద్రౌపదీప్రముఖులగు వనితలు శిబికాశ్వముఖ్యవాహనంబు లధిరో హించి చమూసముదయంబునకు మునుమున్నుగా నేంగుచునుండ, ధ్వజపతాకారథసమేతంబును, నానావిధశస్త్రశోభితంబును, వీరభట సింహనాదమేదురంబును, శంఖభేరీతాళాది చతుర్విధవాద్యఘోష పరిపూర్ణంబును నగు సేనాసంక్షోహంబెంతయునుం దేజరిల్లె. ఆసమ యంబున ధర్మనందనుండు లంకాపురంబుననుండెడు కుబేరునిచందంబు నం దనరారె. అంత దేవగణపరివృతుండగు దేవేంద్రుండు బృహ స్పతిననుసరించువిధంబున, సమస్తబలపరివేష్టితుండగు ధనంజయుండు ధర్మపుత్రుని పిఱుంద నడిచె. ఆ స మ య ం బు న యుధిష్ఠిరుండు నిఖిలవాహినీసమన్వితుండగు ధనేశ్వరునిచాడ్పున ననేక కాననో్ల

వనంబుల నతిక్రమించి, మహానదులందాంటి కరినగరప్రాంతం బున సమంబును మనోహరంబునునగు నొక్కప్రదేశంబున దళంబు విడియించియుండెడుతఱి విదురుండు కౌంతేయాగ్రజు సమీపంబున కేంగి శోకగద్గదకంఠుండగుచు నతని నుద్దేశించి యాంబికేయుండు తలంచిన దుర్నయంబు లన్నియును సవిస్తరంబుగ నెఱింగింప నతని వాక్యంబు లాకర్ణించి, ధర్మసూనుండు జూదంబున కెవ్వండు పిలిచె నేనియును వచ్చెదనని ప్రతినంగావించినవాండనగుట నిది సైరింపం దగు, సకలజనంబులకును శుభంబె కలుగుంగాక, అత్యంతంబగు తేజంబు దృష్టినిరోధంబు గావించువిధంబున దైవంబు బుద్ధిభ్రంశంబు గల్పింప పాశబద్ధంబగు దంతావళంబు తెఱంగున నరుండు దైవంబున కధీనుండై ప్రవర్తిల్లునని పలికి, మఱునాండు బాహ్లికదత్తంబగు రథం బెక్కి చతురంగ బలంబులుం గొలువ సహోదర సమేతంబుగ హస్తి పురంబు బ్రవేశించి, వైచిత్రవీర్యుని సదనంబున కరిగి భీష్మద్రోణ కృప కర్ణ సోమదత్తులను ననుజసహితుండగు దుర్యోధనుని మఱియు నయ్యెడకుం జనుదెంచి యుండెడు మహీపతులను తగుతెఱంగునం గని వారలచేం బూజితుండగుచు, భ్రాతృసమేతంబుగ నంతఃపురంబున కేంగి తారాగణ పరివృతయగు రోహిణీదేవి కైవడిం గోడండ్రమధ్యం బున నుండెడు పతివ్రతాశిరోమణియగు గాంధారికి వందనం బొనర్చి, యాయమచే దీవనలు గైకొని వృద్ధుండగు కౌరవేశ్వరుని సమీపంబు నకుం బోయి దండప్రణామంబు లాచరింప నతండు వారల నందఱ శిరంబు మూర్కొనియె. అంతం బురుషకంఠీరవులును మనోహరా కారులునునగు పాండవేయులం గనుంగొని ధార్తరాష్ట్రు లెల్లను ప్రమోదంబునం బొదలిరి. అనంతరంబ కౌంతేయులచే ననుజ్ఞాతు లగుచు ద్రౌపదీ ప్రభృతులగు వధూజనంబు లంతఃపురంబునకుం జనినం బాంచాల రాజపుత్రి మహావైభవంబుచూచి సహింపలేక

యయ్యెడనున్న కౌరవాంగనలసూయాక్రాంత హృదయులై యుండిరి. ఆపాండుకుమారులును గరిడికూటంబున కరిగి ముహూర్తమాత్రంబు సాధనచేసి పదంపడి యాహ్నిక క్రియలు నెరవేర్చి భూసురులు స్వస్తి వాచనంబు గావింప వారల సత్కృతులంజేసి మనోహారంబగు భక్ష్య భోజ్య సమేతంబైన భోజనంబుల సంతుష్టులగుచు, నారీజనంబులచే మధురగానంబులు వినుచు, దివ్యగంధమాల్యంబులు ధరియించి, కేళీ గృహంబుల నారాత్రి సుఖంబున నిద్రించి, ప్రాతఃకాలంబున మాగధ స్తుతి పఠనంబుల నిద్ర మేల్కాంచి, కాల్యకరణీయంబులు దీర్చి, యతి మనోజ్ఞంబును ధూర్తజన సమాకీర్ణంబునునగు సభాస్థానంబుం బ్రవేశించిరి.

ఈకథ సభాపర్వంబునం దొంబదిమూండవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 94

---

అంత ధర్మనందనుం గనుంగొని సౌబలుండు సభాసదులంద ఱును మేమును నీ రాకం బ్రతీక్షింపుచు నున్నవారము, జూదంబాడు టకు నిదియె సమయంబనిన యుధిష్ఠిరుం డతని నుద్దేశించి క్షత్రి యులకుం బరాక్రమంబె ధర్మంబు గాని నికృష్టంబును బాపస్వరూపం బును సజ్జననిందితంబునునగు నీదురోదరంబు ధర్మంబుగాదు. దీనిం బలుదెఱంగులం బ్రశంసింపుచు వంచనమార్గంబునం మమ్ము జయిం పందలంచినాండవు. ఇది యుచితంబు కాదనిన నతండు లోకంబున నెవ్వండైనను ద్యూతవిధిజ్ఞుండును బుద్ధిమంతుండునునై భేదంబు నొందక మిత్రభావంబునం జూదం బాడెనేని యతనికి సకల లాభంబు లుం గలుగు. ఇది నిందితంబు గాదు. ఇది కాలక్షేపంబునకును బర

జయంబునకును హేతువై యుండుంగాన మనంబున సంశయింపక యాడుటకు రమ్ము. దీనికిం బన్నిదం బెఱింగింపు మనినం గాంతే యాగ్రజుండు నిఖిలలోకసంచారంబువలన సకలలోకవృత్తాంతంబుల నెఱింగిన వృత్తాంతపరిజ్ఞాతయును మునిశ్రేష్ఠుండునునగు నసితదేవ లుండును నీ జూదంబు పాపస్వరూపంబనియును, ధూర్తులగు వారలు దీని నాచరింతురనియును, రాజులకు నీతిపథంబున సమరజయంబు గైకొనుటయె ధర్మంబనియును, మ్లేచ్ఛభాషణంబులు వలుకరాదని యును, గపటోపాయంబులు గావింపందగదనియు నెఱింగించె. మేము భూసురులకు హితం బాచరించుటయె ధర్మంబని తలంచి యుండు దుము. కావున నేనకుహృదయజ్ఞుండనని వంచనోపాయంబులువన్ని మమ్ము జయింపం దలంపకుము. మాకు ననీతివలనం గలిగెడు ధన సౌఖ్యంబులు సమ్మతంబు గావు. ఇది పాపాత్ములగు వారికే కాక సత్పురుషయోగ్యంబు గాదనిన, శకుని యతని నిరీక్షించి శ్రోత్రి యుండగువాం డశ్రోత్రియును, శాస్త్రజ్ఞుండగువాం డశాస్త్రజ్ఞుని, దుర్బలుండగు వాని బలవంతుండును, నస్త్రాభ్యాసంబు జాలని వాని గృతాస్త్రుండును, ద్యూతజ్ఞుండుగానివాని ద్యూతవిధిజ్ఞుండును, జయించుట యుక్తంబెగాని మాయోపాయంబుగాదు. నిన్నుం గృత్రి మోపాయంబునం జయింతు ననియెడు భయంబు నీకుం గలదేని జూదంబాడక క్రమ్మఱం జనుమనినం బాండవేయుండతని నాలోకించి, యెవ్వండేనియును దురోదరంబునకు రమ్మని పిలిచిన వానితోడ నాడం గలవాండనని ప్రతిజ్ఞ గావించినవాండ. దైవసంకల్పంబు బలవంతంబు. దానిం బరిహరింప నెవ్వనికి నలవియగు? అది యట్లుండె. ఈ నిఖిల మహీపతులలోన నెవ్వనితోడ నాడవలయు? దీనికిం బన్నిదంబెయ్యది యనిన, సుయోధనుండు నే నఖిలరత్నకాంచనంబులు పన్నిదంబున కొసంగెద. నే నాడుటకుం బ్రతిగా మాతులుండగు శకుని దురోద

రంబు సలిపెదు ననిన ధర్మనందనుం డొక్కని కొఱకై వేఱొక్క రుండు జూదంబాడుట యెందేనియుం గలదే? వివేక సం పన్నుండవగు నీకు నిది యుచితంబని తోచెనేని యాడెదనని ద్యూతం బునకు నారంభించిన సమయంబున సకల నరేంద్రపరివృతుండగుచు వైచిత్రవీర్యుండు సభామంటపంబునకుం జని మహోన్నతాసనంబు నం గూర్చుండెఁ. భీష్మ ద్రోణ కృప విదురులు జూదంబాడుట తమకు నప్రియం బయ్యును, రాజు వెంబడి నేంగుదెంచి యుచితాసనంబుల నుండిరి. సింహస్కంధులును, తేజోవిరాజమానులును, వేదవేదాంగ విశారదులునునగు సకలరాజన్యులచే నా సభాభవనంబు దేవగణసమ న్వితంబగు త్రిదివంబు చందంబునం గనుపట్టె. అంత ధర్మసూనుండు సాగరావర్తసంకాశంబును, నమూల్యంబును, గాంచనాలంకృతంబును నగు ముక్తాహారంబుదిగిచి, ఇది పన్నిదంబుగా నొడ్డెద, నీ పన్నిదం బేది, యని యడిగిన దుర్యోధనుండు తన కనేకంబులగు వస్తువాహ నంబు లున్నయవి, నాకు ధనలోభంబు లేదు, వలయు ధనం బొసం గెద, గెలువు మనిన నంత నక్షహృదయజ్ఞుండగు గాంధారవల్లభుండు పాచికలు కరంబునం బూని యిదె జయించితినని వైచె.

ఈ కథ సభాపర్వంబునం దొంబదినాల్గవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 95

---

అంత ధర్మనందనుం డతనిం గనుంగొని నీవు గెలిచిననేమి? నిష్కసహస్ర సమ్మితంబులగు గిండ్లను చేంబూని ముక్తాహారంబు లుగ్గడించి శతసంఖ్యలగు పరిజనంబును, గోశంబును, నక్షయంబగు సువర్ణంబును నాకుం గలిగి యున్నయది, దీనికిం బన్నిదంబు నిలుపు

మనిన, గాంధారపతియును మఱియుం బాచికలువైచి యిదె గెలిచితి ననిన, యుధిష్ఠిరుండు రథసహస్రసమానంబును, వ్యాఘ్రచర్మావృతంబును, కనకచక్రశోభితంబును, కాంచనకింకిణీజాలవిరాజమానంబును, జయప్రదంబును, మేఘసాగర నిర్ఘోషంబును, బదంబుల ధరణీతలంబున మోపక యతిత్వరిత గమనంబునం దేజరిల్లు జాత్యశ్వాష్టకంబుచేత సహితంబగు రథోత్తమంబు పణంబుగ నివేదించితి ననిన, సౌబలుండు చిఱునవ్వు నవ్వుచు దీనియునుం గెలిచితి ననినం, గౌంతేయాగ్రజుండు హేమభూషణ కక్ష్యావిరాజమానంబులును, సువర్ణమాలికాలంకృతంబులును, బద్మకోజ్జ్వలంబులును, దీర్ఘదంతంబులును, బర్వతాకారంబులును, నష్టకరేణు సహితంబులును, శత్రుపురభంజనంబులును, జీమూతసంకాశంబులును నగు వేయుగజంబులు పన్నిదంబునకుం బూన్చిన శకుని యదియును జయింపం, గంబుకేయూరధారలును, నానాభూషణ భూషితాంగులును, విచిత్రాంబరధారులును, బుష్పమాల్యాలంకృతలును, యవ్వనవతులును, నృత్తగీత విశారదలును నగుచు స్నాతకులగు బ్రాహ్మణులకు నమాత్యులకు నృపాలకులకు మదీయశాసనంబునం బరిచర్యం గావింపుచుండెడు నొకలక్ష దాసీజనంబుల సకలజనంబు లెఱుంగం బన్నిదంబని పలుకం గపటద్యూత విశారదుండగు సౌబలుం డదియును జయించె. మఱియు నయ్యుధిష్ఠిరుండు సమర్థులును, హితసంచారులును, బుద్ధిసంపన్నులును సువర్ణకుండలాలంకృతులును, బాత్రంబులు కరంబులం బూని యహోరాత్రంబు లతిథిపూజం గావించువారును, యవ్వనాలంకారులును నగు నొక్కలక్ష పరిచారిక జనంబులు పన్నిదం బని పలికిన నతం డదియును జయింప, హేమదంత పతాకాలంకృతంబులును, నుత్తమాశ్వసమేతంబులును, సమరంబు గావించినను నూరకయున్నను మానంబునకు సహస్ర నిష్కంబులు వేతనంబు జెందెడు విచిత్రయో

ఘులగు రథికులవలన నలంకృతంబులును నగు నొక్క లక్ష యరదం బులు పన్నిదంబనిన నాదురాత్ముండదియును జయింప, మఱియు నతండు తిత్తిరికల్మాషంబులును, హేమమాలికాలంకృతంబులును నగు నశ్వంబులు తోలుత చిత్రరథుండు గాండీవికినొసంగె, అవిపన్ని దంబుపూన్చితిననిన, నాపాపకర్ముండు మాయాబలంబున నదియునుం గెలిచె. మఱియు నాధర్మనందనుండు పదివేలు రథంబులును, బది వేలుశకటంబులును, యానంబులు పదివేలును, నొక్కొక్క వర్ణంబు నకుం బదివేలు హయంబులును, శాలితండులంబులును, క్షీరంబు లాహారంబులు నుండెడు ఘోటకంబులు పదివేలును పన్నిదంబనిన నాదుష్టాత్ముండదియును జయించె.

ఈకథ సభాపర్వంబునం దొంబదిమైదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 96

---

అని వైశంపాయనుండు జనమేజయునకు మఱియు నిట్లను. ఇవ్విధంబున నతిఘోరంబును, నిఖిలజనక్షయకారణంబునునగు ద్యూతంబునడుచు చున్నసమయంబున సకలసంశయనివారణ చతురుం డగు విదురుండు ధృతరాష్ట్రుం గనుంగొని, కౌరవేశ్వరా! మరణంబు గోరువానికి నౌషధంబు రుచియింపని తెఱంగున నావాక్యంబులు నీకు నసమ్మతంబులై యున్నయవి. అయినను హితోపదేశంబుసేయ వలయు కాన నెఱింగించెద, ఆకర్ణింపుము. మున్ను పాపాత్ముండును, గురువంశనాశకుండునునగునీసుయోధనుండుజనియించినతఱిజంబుకంబు చాడ్పునవిస్వరంబుగరోదనంబుగావించె. కావున వీనివలన బహుజనక్ష యంబుగాంగలిగియున్నయది. దుర్యోధననామధేయంబుననీగృహంబున

నొక్క సృగాలంబువచ్చియున్నయది. దానినీవు మత్తుండవై యెఱుంగ నేరవు. మందబుద్ధియగు శబరుండు తరుశాఖ విరిగి ధరణీతలంబునం గూలుదునని తలంచక తేనెపెరంగైకొనవలయునను తలంపున మహీరుహంబు నధిరోహించు చందంబున, దుష్టాత్మకుండగు నీ సుయోధనుండు తన వినాశంబు తెలియంజాలక మహారథికులగు పాండునందనుల యైశ్వర్యంబుం గపటంబున నపహరించుచున్నవాండు. కాన వీండు పాపాత్మకుండగుట నీకు విశదంబై యుండు. అట్లగుటంజేసి యంధకవృష్ణిభోజయాదవప్రభృతులు క్రూరుండగు కంసునిం బరిహరించి మెలంగుచుం బదంపడి కృష్ణునిచే నతండు నిహతుండైన యనంతరంబ యిపుడు సుఖంబున నున్నవారు. నీవును నీ ధూర్తుండగు గాంధారీనందనుని నిగ్రహించినం గౌరవాన్వయంబునకు నెల్ల శ్రేయంబగు. కావున నీ యర్జునునకు ననుజ్ఞ యొసంగితివేని యిప్పుడె వీని శిక్షింపం గలండు. ఒక్క కాకంబు నొసంగి యైదు మయూరంబులు గైకొనిన తెఱంగున, నొక్క సృగాలంబు నిచ్చి యైదు శార్దూలంబులు సంగ్రహించిన విధంబున, దుర్యోధను నొక్కనిం బరిత్యజించి పురుషకంఠీరవులగు పాండవేయులం బరిగ్రహింపుము. శోకార్ణవంబున మునుంగనేటికి? వంశంబు సంరక్షించుటకై యొక్కనిం బరిహరించుటయును, గ్రామపరిపాలనార్థంబుగ నొక్క కులంబు విసర్జించుటయును, దేశనిమిత్తంబుగ నొక్క గ్రామంబు ద్యజించుటయును, దన శరీరంబు గాపాడుటకై మహీతలంబు నుజ్జగించుటయును యుక్తంబని ధర్మశాస్త్రంబులు దెలుపుచున్నయవి. సర్వజ్ఞుండును శత్రుభయంకరుండునునగు శుక్రుండు దురాత్మకుండగు జంభకాసురునిం బరిహరింపుండని దైత్యులకు నెఱింగించుట వినియుందువు గదా? పూర్వంబున నొకని మందిరంబున హిరణ్యష్ఠీవులగు కొన్ని పక్షులు నివాసంబు గావించి యుండి ప్రతిదినంబును గొంత కాంచనంబుమియుచునుండ

దానివలనం గొన్ని దివసంబులు బ్రతుకుచు నుండి పదంపడి యొక్క-నాం డతండతిశయంబగు నాసంజేసి వానింబట్టి చంపి యుదరంబు భేదించి కనుంగొనిన నేమియునుం గానక యిహపరసౌఖ్యంబులం జెందక చెడిన చొప్పున, నీవును దురాశవలనం గౌంతేయుల యెడ విరోధంబు వాటించి సువర్ణష్ఠీవులగు విహంగంబులం బొలియించిన వాని తెఱంగునం బశ్చాత్తాపంబు నొందవలయు. గాలంబున నుండెడు మాంసంబు భక్షింపం బోయి మత్స్యంబు వినాశంబు నొందిన కైవడి నీవునుం దృష్ణాతిశయంబునం జెడిపోవనేటికి? పుష్పదామంబులు గల వాండుద్యానవనంబునంగలపాదపంబులంబ్రతిదినంబునుంబోషింపుచుం బ్రసూనంబులు గైకొనియెడుచందంబున,నీవునుంగుంతీతనయుల యెడ మైత్రివాటించివారలచే సకలశుభంబులు జెందవలయుం గాక, బొగ్గుల కునై మహావృక్షభేదంబొనర్చి నిందితుండును ఫలహీనుండునునగువాని కరణిం బాండవులకుహానిం గావించి పుత్రమిత్రసమేతంబుగ నీవుపరాభవంబు నొందనేటికి? ఈకౌంతేయు లేవ్వరుంగూడి రేని యమరగణపరివృతుండైనమహేంద్రుండైనను, వారలం దేరిచూడ సమర్థుండే?

ఈ కథ సభాపర్వంబునం దొంబదియాఱవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 97

---

అని విదురుండు మఱియు నిట్లనియె. అతి క్రూరంబగు నీ ద్యూతంబునకు విరోధంబు కారణంబు. విరోధంబువలన భీమంబగు సంగ్రామంబు గలిగెడు. ఈ దుర్యోధనునిచే నింతటి యనర్థంబు వాటిల్లుచున్నయది. శంతను వంశంబునను, భీమసేనాన్వయంబునను, బ్రతీపకులంబునను, బాహ్లికాన్వయంబునను, బ్రభవించిన మహాను

భావులగు రాజులందఱును నీ దురాత్ముని కృత్యంబులవలన నిష్కారణంబుగం బొలిసిపోయెదరు. ఇతనివలన రాజ్యంబునకు హాని వాటిల్లుచున్నయది. వృషభంబు మదంబునం జేసి తన శృంగంబు విరుచుకొను తెఱంగున నీ పాపచిత్తుండగు సుయోధనుండు మత్తుండగుచు స్వజనహాని గావించుచున్నవాండు. ధీరుండును, బుద్ధిసంపన్నుండును నగు పురుషుండు తన వివేకంబుమాని ప్రాకృతజనునిబుద్ధి ననుసరించి మెలంగనేని యసమర్థుండగు కర్ణధారుండుగల యానపాత్రంబెక్కిన పురుషుండు సముద్ర మధ్యంబున మునింగిపోయెడు చందంబున దుఃఖసంసారంబున నిమగ్నుండగు. నీ సుయోధనుండు పాండవుల జూదం బాడి జయించుచున్నవాండని నీవిప్పుడు సంతోషభరితుండవై యున్నవాండవు. పదంపడి వీనివలన సకలభూప్రజాక్షయకరంబగు యుద్ధంబు ప్రాప్తంబగుచున్నయది. ఇప్పుడు ద్యూతంబాడుమని నీవు నియమించుట మాత్రంబెకాని దీనిచేం బ్రయోజనం బేమియునుం గలుగదు. దుర్బుద్ధులగు నీశకునిపరిభృతుల మంతనంబు నీమనంబున నాంటియున్నయది. ఇది యుచితంబుగాదు. ఎల్లభంగుల వీరలంబరిహరించి సత్యసంధుండగు ధర్మనందనునితోడ మైత్రి వాటించి యతని మంత్రిగాం గైకొని నిఖిల సౌఖ్యంబు లనుభవింపుచు సుఖంబున నుండుమని మఱియును ధృతరాష్ట్రప్రముఖులగు నిఖిల మహీపతుల నుద్దేశించి, రాజవర్యులారా! మహాజ్వాలాభీలంబగు ననలంబుతోడ సమరంబొనర్చి శాంతి నొందించువారలుంగలరె? కావున నావాక్యంబులందఱు నతిక్రమించక మెలంగి సుఖంబనుభవింపుండు. ఈ యుధిష్ఠిరుండును, భీమార్జున నకుల సహదేవులును, జూదంబునందలి పరాకున నున్నవారలు. ఇంతియకాని వీరలలిగినం దిగ్లోకంబునందును రణంబున మార్కొను పాటిసామర్థ్యంబుగలవాండెవ్వండు? అని మఱియు ధృతరాష్ట్రు నుద్దేశించి నీకు వలయు ధనంబు గలిగియుండియును నీ

పాండునందనుల విత్తంబెల్లనుం గపట ద్యూతంబున నపహరించెదవు. పదంపడి మీసర్వధనంబు నపహరింపంగలవాండు పార్థుండని యెఱుంగుము. ఈ శౌబలుండు దురోదరంబునకు సమర్థుండనియును వీడుతలంచిన తలంపు నెఱుంగుదు. మహామాయాసంపన్నుండగు నీ దుష్టాత్ముని స్వదేశంబునకుం బనుచుటయె నీకు శుభంబు.

ఈకథ సభాపర్వంబునం దొంబదియేడవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము 98

---

అనిన విదురునుద్దేశించి సుయోధనుం డిట్లను. నీవు స్వజనుండనని ప్రచ్ఛన్నంబున మెలంగుచు ధార్తరాష్ట్రులు వివేకహీనులని నిందించి యన్యులం బరాక్రమధురీణులని పలుదెఱంగులం బ్రశంసించెదవు కావున నీవె మాకుం బ్రధానశత్రుండవని యెఱింగితి. సత్పురుషులగు వారి దురాత్ములనియును, దుష్టచిత్తులగు వారి సజ్జనులనియునుంబలుకుట కతంబుననీవు పరపక్షపాతివైయుండుట నేండు గడాతెల్లంబయ్యె. లోకంబునం గపట యుక్తుని హృదయంబును వాని జిహ్వావాక్యంబునం బ్రకాశింపంజేయు. కావున మాయెడ సౌహార్దంబు లేని నిన్ను నిరాకరించుటయు మాకు మేలగు. మార్జాలంబు తన శిశువుల హింసించు తెఱంగున స్వజనద్రోహంబునకుందలంచు నిన్ను నిన్ని దినంబులును మేము పోషించుట పాముకూననంకతలంబున నిడి పెంచిన చందంబయ్యె. ఇట్టి స్వామి ద్రోహంబు గావించు నిన్నుం బాపాత్ముండని ప్రజలు వలుకం జాలరు. మేము శత్రువుల ద్యూతముఖంబునం జయించి సకల ధనంబు గైకొంటిమి. నీవు వైరిపక్షపాతివై యింక మమ్ముం బరుషభాషణంబుల దూషించుట యుచితం

బుగాదు. లోకంబునం దనకసమ్మతంబగు కార్యంబు పలికెడు వాండె విరోధియనం దగు. నీవు మమ్ము నాశ్రయించియుండియు నంత రహస్యంబులగు కార్యంబుల నెల్ల బయలు సేయుచు వైరి ప్రశంస గావించెదవు. నీవు దుష్టహృదయంబున మమ్ము నవమానించి పలుకరాకుము. వృద్ధులవలన నీమనంబు శిక్షితంబు గావించుకొనుము. ఇంకం దోంచిన తెఱంగునం బలుకకుము. ఇన్ని దినంబులు విదురుండు వివేకశాలియని పొగడ్త కెక్కియున్న నీగౌరవంబు నకు హానిం గావించుకొనుచు మమ్మునేటికి నిందించెదవు? పూజ్యులగు వారల సమీపంబున కేంగి వారల నడిగి తెలిసికొనుచుం బరుల కార్యంబునకు వ్యాపరింపకయుండుము. నీవెన్ని విధంబులం బలికినను మేము సైరించియుండుటం జేసి స్వాతంత్ర్యంబు గల్పించుకొని మమ్ము పరుషభాషణంబుల నవమానింపకుము. నిన్నుం బిలిచి మాకు బుద్ధి యెఱింగింపుమని ప్రార్థించెనం బలికెదవుగాని యింక బాధింపక యూరకుండుము. పురుషుండు గర్భంబున నుండుట మొదలుగా శిక్షకుండగువాండు జగదీశ్వరుండగువాండు వేఱొక్కరుండునుం గలండె? కావున నున్నత స్థలంబుననుండెడు జలంబులు పల్లపుదారికిం దిగిన చందంబున నయ్యీశ్వర ప్రేరణానుగుణంబుగ మెలంగెద. లోకంబున మందబుద్ధియగు నొక పురుషుండు ఫాలంబున శిలాఘాతంబు గావించుకొనుటయును నొకం డొకండు భూమిం ద్రవ్వుటయును గలిగియున్నయది. ఇది యీశ్వరప్రేరణంబునం గాక యొకరి బుద్ధి విని సేయుచున్నవారె? కావున నేనీశ్వరాధీనుండనై మెలంగెద. తనవాక్యంబులు విననివానికి బుద్ధి సెప్పెడు నతండును, దనవచనంబు లాదరించు వానికి బుద్ధులు సెప్పని యతండును, మూఢులనందగుదురు. అగ్ని గృహంబుదరికొనకమున్నం బ్రయత్నంబు సేసినందగుం గాక. జాజ్వల్యమానం బగుచు దహింపుచు నుండెడు

సమయంబునం బోయిన భస్మంబె గాక యొకవస్తువేనియుం దొర
కునె? జారిణియగు వనిత పురుషుం డెంత యుపలాలించినను బర
పురుషు నపేక్షించు విధంబున మేమెంత ప్రియంబు గావించినను
గైకొనక మాయెడ ద్వేషంబు ప్రకటించి పాండవులం బ్రశంసించె
దవు గాన నింక నిందుండక వారల సమీపంబునకుం బోయి వసి
యింపుమనిన, విదురుండు దుర్యోధను నుద్దేశించి, దురాత్మా! హితోప
దేశంబు సేసిన మాత్రంబుననే పరిహాసించుటం జేసి యిట్టి నీ బాంధ
వంబువలనం గాంగల యర్థంబేమియున్న యది? రాజుల హృదయంబు
లతి చంచలంబులు గాన ప్రియభాషణంబు లాడినట్లనె యుండి ముసల
ప్రహారంబునం జంపింతురు. నీవిప్పుడు నీతివిధిజ్ఞుండనగు నన్ను
మూఢుండని తలంచితివి. ఒకపురుషుని వివేకశాలియని తలంచి
యతని బుద్ధి ననుసరించి మెలంగి పదంపడి పరిహరించువాండు
మూఢుండు. ఇంతియకాని యతండు మూఢుం డగునె? జారకాంత
శ్రోత్రియుండగు వాని యాగాదికర్మంబులకు నర్హంబుగాని తెఱంగున
దుష్టుండగు వాండు శ్రేయంబునకు యోగ్యుండు కాండు. యవ్వనవని
తయగు భార్యకు వృద్ధపురుషుండు సమ్మతుండుగాని చందంబున
హితవాచరించి పలికిన నేను నీకు విరోధినైతి. నీకు హితాహితంబు
లగు సకల కార్యంబు లెఱింగి తెలిపెడు నన్ను నహితునింగాం దలంచి
తివి గాన నీపురంబునం గల స్త్రీ బాలాంధపంగు జడప్రభృతుల బుద్ధిని
బ్రతుకుము. కార్యం బెఱింగించుతఱి నసమ్మతంబుగం దోంచి పదం
పడి ప్రియంబగు వాక్యంబులు వలుకు నతండు హితుండు గాక
యప్పటికిం బ్రియంబులును వెనుక నప్రియంబులునై యుండెడు
వాక్యంబులు దెలిపెడువాండు దుర్లభుండగు. ఇట్టి నీతి వాక్యంబు
లెఱింగించు మంత్రియును వాని నాదరించు ప్రభువునుం గలుగుట
దుర్లభంబు. నరేంద్రున కెవ్వనియెడం బ్రీతి గలిగియుండు నతండు

సత్పురుషుండును, బుద్ధిశాలియునని తోంచు. ఎవ్వనియెడ నాదరంబు లేక యుండు నతండెట్టి సత్పురుషుండైనను నప్రియుండగు. లోకంబున రోగవినాశ కారణంబును, నతిఘోరంబును, నత్యుష్ణంబును నగు నౌషధంబు వివేకశాలియగు వాండుపయోగించుగాక యవివేకి దాని నంగీకరించండు. కావున నావచనంబు లాదరించి సుఖంబునం బ్రతుకుము. పుత్రమిత్ర సమేతుండగు నీవైచిత్రవీర్యునకుం దేజంబును గీర్తియును లాభంబును గలుగవలయునని ప్రార్థింపుచునుండుదు. నీమనంబున నెటు దలంచినం దలంపుము. ఆశీవిషంబులును, దృష్టివిశేషంబులునునగు విషజంతువులకుం గోపంబు పుట్టించిన హాని వాటిల్లుంగాన మహాబలపరాక్రమ సంపన్నులగు పాండవులకు నలుకపుట్టింపకుము.

ఈకథ సభాపర్వంబునం దొంబదియెనిమిదవ యధ్యాయము.

---

## అధ్యాయము 99

---

అనిన జనమేజయుం గనుంగొని వైశంపాయనుండు మఱియు నిట్లను. ఇవ్విధంబున దుర్యోధనునకు విదురుండు నీతి మార్గంబు లెఱింగింపుచున్న సమయంబున, శకుని ధర్మనందనునుద్దేశించి పాండవోత్తమా! ఇప్పుడపారంబులగు ధనంబు లోడితివిగదా? ఇంక నేమేని యుం గలదేని యెఱింగింపు మనిన యుధిష్ఠిరుండు తనకు నసంఖ్యాకంబగు ధనరత్నరాసులు గలిగియున్నయవి. నీ వడుగనేటికి? అయుతంబును, బ్రయుతంబును, నిఖర్వంబును, ఖర్వంబును, నర్బుదంబును, గవచంబును, బ్రతికవచంబును సముద్రంబునునని యెడు సంఖ్యలం గల ధనంబున్నయది. దీనికిం బన్నిదంబు నిలువు మనిన మహామాయావి

యగు నా దురాత్ముండు కపటమార్గంబున నక్షంబులు వైచి జయిం చితిననిరం, గాంతేయా! గ్రిజుంకుగజంబులును, దురంగంబులును, ధేను గణంబులును, నసంఖ్యేయంబులగు నజావికంబులును, దక్కంగల వస్తువులును బన్నిదంబునకు నొడ్డితిననినం పాపాత్ముండగు నా సౌబలుం డదియునుం గెలిచితి నవియె. మఱియు నయ్యజాతశత్రుండు పురంబులును, జనపదంబులును, భూమియును, బ్రాహ్మణులును, వారల ధనంబులునుం దక్కం దక్కిన జనంబులతోడం గూడ నింతయును బన్నిదంబునకుం బూన్చితిననిన నాదుర్ద్యూత విశారదుం డగు దుష్టాత్ముండు పాచికలువైచి యిదియును జయించితిననిన, మఱియునాకుంతీ నందనుండు సువర్ణకుండలాలంకృతులును, సర్వాభరణభూషితులునునగు నీరాజకుమారులు నాకు జీవధనంబు. వీరలం బన్నిదంబునకుం బూన్చితిననిన నాకపటాత్ముం డదియునుజయింప, నాధర్మసూనుండు శ్యామలవర్ణుండును, యౌవనాభిరాముండును, నరుణలోచనాంచలుండును, సింహస్కంధుండును, దేజోవిరాజ మానుండునునగు నీ నకులుండు నారాజధనంబు. ఇతనికిం బన్నిదంబు వైవుమనిన శకుని యతనిం గనుంగొని ఈమాద్రేయుండు నీకు నతి ప్రియుండుగాన నితనినే జయించితినేని యింక నెవ్వని బన్నిదంబునకుం బూన్చెదవని పలుకుచుం గపటమార్గంబునం బాచికలువైచి యిది గెలిచితిననిన నయ్యుధిష్ఠిరుండు సకలధర్మవిదుండును జగత్ప్రసిద్ధుండును నగు నీసహదేవునింబన్నిదంబునకుం బూన్చుట యుక్తంబు గాదు. అయినను, నమూల్యంబును బురుషరత్నంబును నగు నితనిం బూన్చితి. అక్షంబులు వైవుమని గాంధారవల్లభుండతని నుద్దేశించి భీమార్జునులుండ నీమాద్రినందనులం బన్నిదంబునకుం బూన్చుటవలన నీకు వీరలయెడ నత్యంత ప్రియంబుగలుగుట యెఱుంగనయ్యెనని యా దుష్టాత్ముం డీపన్నిదంబునుం గెలిచితిననిన, యుధిష్ఠిరుం డతని

నుద్దేశించి మే మేవ్వరము నేకహ్యాదయంబుగ మెలంగెడుపట్ల నిట్టి మిత్రభేదంబులగు వచనంబులాడి యందఱం జయింపవలయునని పాప బుద్ధిందలంచితివనిన నతండజాత శత్రునుద్దేశించి, మముబోటి మంద బుద్ధులగు వారలు పల్లంబునంబడుటయును, నున్మత్తుండగువాండు శిలాతాడనంబు గావించుకొనుటయును నుచితంబగు. వివేక సంపన్నుం డును, శ్రేష్ఠుండునునగు నీకు నమస్కరింపందగు. ధూర్తుండగు జనుండు మనంబునందలంచిన యర్థంబె సేయు మనదినిద్రాసమయంబునం దేనియుం గలవరించి బలుకుచుండు. కావున నీమాద్రేయులయెడ నీకువిరోధంబు గలుగుటంజేసి మున్నుగా వీరలంబన్నిదంబునకుం బూన్చితివనినం గాంతేయాగ్రజుండు దారుణంబగు రణసముద్రంబునకునుంగనీక యూ నపాత్రంబు వోలె దరిం జేర్చుటకు సమర్థుండును, శత్రుభయంకరుం డును మహావేగసంపన్నుండును, జగదేకవీరుండునునగు నీయూఖుం డలతనూభవునిం బన్నిదంబునకుం బూన్చుటర్హంబుగాదు. అయి నను బూన్చితి ననిన నా క్రూరచిత్తుండగు సౌబలుండు కపటంబున నక్షంబులు వైచి జయించి ధర్మనందనా! ధనుర్ధరవర్యుండును, వంశ భూషణుండును, సవ్యసాచియునగు నీ యర్జునుండు నాచే జయిం పంబడియె. ఇంక భీముం డొక్కరుండ మున్నవాండు. అతనిం బన్ని దంబునకుం బూన్పుమనిన నాపాండవాగ్రజుండు సింహస్కంధుం డును, గోపశీలుండును, భుజాబలధురంధరుండును, ససమానపరాక్రమ శాలియును, శత్రుసూదనుండును, గదాయుద్ధవిశారదుండును, సేనానాయ కుండును, మహేంద్రుండుదానవసంహారంబుగావించు తెఱంగుననసహా యశూరుండై శత్రునిధనంబొనరించుధైర్యవంతుండును నగు నీ భీమ సేనుని బన్నిదంబునకుం బూన్చుట యుచితంబుగాదు. అయి నను బూన్చితిననిన నా మాయోపాయనిపుణుం డక్షంబులు వైచి యతనిం జయించి పాండవాగ్రజునాలోకించి సర్వధనం

బును, నిఖిలవస్తు విశేషంబులును, భూమియును, రథగజతురగ పదాతిసంఘంబులును, సహోదరులను జూదంబున నోడితివి. ఇంక నీకే ధనంబున్న యది యనిన, ధర్మనందనుండు సహోదర ప్రియ భాజనంబగు నన్ను నేన పన్నిదంబునకు నొడ్డితిననిన నాదు రాత్ముండు మాయోపాయంబున బాచికలు వైచిజయించి యతని నుద్దేశించి యవశిష్టంబగు ధనంబు కలిగియుండియును దనశరీరంబుం బన్నిదంబునకుం బూన్చియోడెడు వారలుం గలరే? ఇంక నేమియైన జీవనంబు గలదేని పన్నిదంబాడి నిన్ను మాత్రంబైనను విడిపించుకొను మని తనచేత నిర్జితులైయున్న పాండవేయులనేవురం గనుంగొనుచు నజాతశత్రు నుద్దేశించి, నీకు నింక నొక్క ధనంబున్నయది, ప్రియ భార్యయగు పాంచాలరాజతనూజం బన్నిదంబునకుం బూన్చి నిన్ను విడిపించుకొమ్మనం గాంతేయాగ్రజుం డతి మనోహ రాకారయును, యావనోజ్జ్వలాంగియును, ననురాగవతియును, శరదిందీవరాక్షియును, నుత్పలగంధియును, గుసుమమాలికాలంకృతయును, వికచాబ్జముఖియును, సుందరదనయును, వేది మధ్యయును, నతిదీర్ఘవేణియును, సౌందర్యంబున లక్ష్మి సమాన యును నై, దయయును, రూపాతిశయంబును, బుత్రిసంపత్తియునుంగలిగినభార్యవలయునని లోకంబునం బురుషులిచ్ఛయింతురుగదా! అట్టి నిఖిల సద్గుణంబులుగలిగి పతివ్రతాతిలకంబనంజాలి గోపాలకప్రభృతులగు పరిజనంబులం దల్లికై వడి నరయుచు నుండెడు ద్రౌపదింబన్నిదంబునకుంబూన్చితి ననిన సభాసదులందఱు నతనిం గనుంగొని ఇతం డెక్కడివాండని నిందింపుచుండ భీష్మద్రోణకృపాదులకు ఖేదాతిశయంబున నెమ్మేనులు చెమర్చె. విదురుండువినమ్రముఖుండై కరంబున శిరంబంటుచు మహాభుజంగంబు చందంబున నిట్టూర్పులు నిగుడ్చుచు నిశ్చేష్టితుండయ్యె. బాహ్లిక సోమదత్తులును, సంజయుండును,

ప్రతీపవంశసంభవులగు రాజులును, నశ్వత్థామయును, భూరిశ్రవుండును, యుయుత్సుండును మొదలగువారలు కరపీడనంబు గావింపుచు నొదలలువాంచి యాశీ విషంబులకైవడి నిశ్వాసంబులు నిగుడ్చుచునుండిరి. ఇవ్విధంబునం గొందఱు మహాశోకాక్రాంతులై కన్నీరు దొఱుంగ నూరకయుండ ధృతరాష్ట్రుండు సంతుష్టుండగుచునిప్పుడేమి జయించెనని తన హృదయాభిప్రాయంబు బయలుగాం బలుమరు నడుగుచునుండం గర్ణుండును దుశ్శాసన ప్రభృతి సహోదరులును ప్రమోదంబునం బొదలిరి. అయ్యవసరంబున సౌబలుండు మీాంద రాంగల యనర్థం బెఱుంగక యక్షంబులు వైచి జయించితినని పాచికలు కరంబునం గ్రహించి ప్రహాసభాసమానముఖుండగుచునుండె.

ఈ కథ సభాపర్వంబునం దొంబదితొమ్మిదవ యధ్యాయము.

---

## అధ్యాయము. 100

---

ఆ సమయంబున దుర్యోధనుండు విదురుం గనుంగొని యీ పాండునందనుల ప్రియభార్యయగు పాంచాలరాజనందనం దోడితెచ్చి మనగృహంబునంగల దాసీజనంబుతోడ సమ్మార్జనాది క్రియలకు నియోగింపుమనిన విదురుండు సుయోధను నిరీక్షించి, మూఢాత్మా! ఇట్టి కృత్యంబులు కాలపాశబద్ధంబనియెఱుంగ నేరవు. బిలంబునం బడుట తెలియంజాలవు. మృగంబు వ్యాఘ్రుంబులకుం గోపంబు రేంచిన తెఱంగునం గ్రోధోద్దీపితంబులగు విషభుజంగంబులం జెనకిన చందంబునం గాంతేయుల నతికుపితులంగావించి మృత్యువుం బ్రాపించ నేటికి? ఈ ద్రౌపది నస్వతంత్రుండగు ధర్మజుండు బన్నిదంబునకుం బూన్ప జయించితిమనుచు దాసీకృత్యంబునకు నియమించుట యుచి

తంబగునె? వెదుఱుటడవి నాశంబు నొందుటకు ఫలంబుగనిపించిన
కైవడి మీ వంశహాని వాటిల్లెడు వైరంబునకుం గారణంబుగం గాల
పరిపాకంబునొందిన నీకు నీదుర్వ్యాతంబు లభించె. పరమర్మభేదంబును,
క్రూరకృత్యంబును, నొరులమర్మంబుదాంక నాడుటయును, నసత్యంబు
పలుకుటయును, జయ భయంకరంబులగు వచనంబు లుగ్గడించుట
యును, నశ్లీలభాషణంబులాడుటయును ననునవి సత్పురుషుండగు
వానికిం గానిగుణంబులు. తన పరుషవచనంబు లొరులచెవి సోంక
నాడిన వారలకు నదిబహు దుఃఖకరంబుగాన పండితుండగు పురుషుం
డిట్టి దుర్వచనంబులు వర్జింపవలయు. అజంబు తన కంఠంబు ద్రెంచు
టకు నాయుధంబుగానక వెదకుచుండెడు ఘాతకునకుం దన పదంబుల
మహీతలంబు ద్రవ్వి యందుండెడు నాయుధంబుచూపి తా నమసి
పోయినచాడ్పునం బరాక్రమ వంతులగు నీపాండుపుత్రులకు రోషంబు
గల్పించి వినాశంబు నొందెదవు. స్తోత్రార్హుండును, దపోవన సంచారి
యగు మునీంద్రుండును, మహానుభావుండును, నిఖిల విద్యాపారంగ
తుండునునను వీరలనతిభీషణంబులగు భాషణంబులాడుచు దూషింపు
చుండెడు నతండు నరకునకంబనందగు. ఈదుర్వ్యాతంబనుజ తనుజ
సమేతుండగు నీకును, నిన్ను ననుసరించి యుండెడు నీ కౌరవులకును,
నతిఘోరంబగు నరక ఘంటాపథంబని యెఱుంగకయున్న వాండవు.
పుత్రసహితుండగు ధృతరాష్ట్రుండిప్పుడు నా హితోపదేశంబులు
వినకయుండుట గుండు తేలి బెండుమునింగిన చందంబయ్యె. వీరలు
దురాశంజేసి నావచనంబు లంగీకరింపకుండుటవలన మీకు నెల్లవార
లకును వినాశకాలంబు నిశ్చయించితిననిన.

ఈకథ సభాపర్వంబున నూఱవ యధ్యాయము.

---

*

## అధ్యాయము. 101

అని వైశంపాయనుండు జనమేజయు నుద్దేశించి మఱియు నిట్లను. అంత దుర్మదాంధుండగు నా ధృతరాష్ట్రనందనుండు గర్వోద్దీపితుండగుచు విదురుని యాచార్యప్రభృతుల సన్నిధానంబునం బలుదెఱంగుల నిందింపుచుం బ్రాతిగామియను తన సారథిం గనుంగొని, యీ విదురుండు పాండవపక్షపాతి గావున మమ్ము నప్రియంబు లాడుచునున్నవాఁడు, కౌంతేయులవలన నీవు నిర్భయుండవగుచు నంతఃపురంబునకుం జని ద్రౌపదిం దోడితెమ్మనిన, వాఁడు నతని వాక్యంబు లంగీకరించి యతివేగంబునం గంఠీరవంబు వసియించి యుండెడు గుహం బ్రవేశించు శునకంబు చందంబునం బాంచాల రాజనందన సమీపంబునకుం బోయి యాదేవి నుద్దేశించి, ధర్మనందనుండు మదాంధుండై జూదంబాడి నిన్ను నోడె. కావున ధార్తరాష్ట్రుల మందిరంబునకుం బనులు గావించుటకుం దోడ్కొని పోవ నరుగుదెంచితి ననిన, యాజ్ఞసేని వానిం గనుంగొని యిట్టి వాక్యంబు లాడం దగునె? ఎందేనియును ద్యూతంబునకు ధర్మపత్నిం బన్నిదంబుగం బూన్చి యాడెడు వారలు గలరె? కాక యుధిష్ఠిరుండు దురోదరంబున మత్తుండయ్యెనో? ఇతనికిం బన్నిదంబు బూన్చుటకు వేఱొండు లేదయ్యెనో? సంశయంబై యున్నయది, నాకింతయును నెఱింగింపు మనిన, నతండు పాండవాగ్రజునివలన వంచన యించుకేనియును లేదు. అతండు శకునితోడ జూదంబాడి తన సహోదరులగు నకుల సహదేవ భీమార్జునులను దన్నును నోడి పదంపడి దేవనంబుచే నిన్ను నోడెననినం బాంచాలి యతని నాలోకించి, నీవు ద్యూతంబు వలన నున్మత్తుండగు నా యుధిష్ఠిరుని సన్నిధానంబున కేఁగి మున్నుగ జూదంబున నిన్ను నోడితివో, లేక పన్నిదంబునకు బూన్చితివో,

యని నావచనంబులుగ నతని నడిగి రమ్ము. పదంపడి నీవెంబడిం జనుదెంచెద ననిన నా సారథి సభాసదనంబునకు నేఁగి కౌంతేయా గ్రజు నుద్దేశించి ద్రౌపది వాక్యంబు లన్నియు నెఱింగింప నతండు లజ్జాభరంబున నిశ్చేష్టితుండగుచు నొండేమియుఁ బలుకక యూరక యున్న సమయంబున, దుర్యోధనుండు ప్రాతిగామిం గనుంగొని ఇం దుకు నీవు రాయభారంబు తిరుగనేటికి, తానె యిచ్చటికి నరుగు దెంచి యీ ధర్మపుత్రు నడుగుమనుము, తమ యిరువురి వాక్యంబు లెల్లవారికిం దెల్లంబై యుండు ననిన, సారథి మగుడ నంతఃపురంబున కేఁగి ద్రుపదరాజతనూభవ నుపలక్షించి, సభవారలెల్లరు నిన్నుం దోడితెమ్మని పలికెదరు. కౌరవులకు నెల్ల వినాశకాలంబు వచ్చిన యట్లు తోఁచుచున్నయది. తల్లీ! ఎవ్వండేనియు నిన్ను సభకు వెలువ రించెనేని యతండు మానంబును ప్రాణంబును గలిగి బ్రతుకంజాలునె? అనినం బాంచాలి జూదంబున సమర్థుండును నసమర్థుండునునగు నిరు వురు పన్నిదంబు బూని జూదంబాడుటయు దైవకృత్యంబని తలంచెద, కావున ధర్మంబ శరణంబని నమ్మియుండెడు మమ్ముల ధర్మంబె సంరక్షింపగలదని తలంపుచునుండు సమయం బున ధర్మనందనుండు దుర్యోధనుని దున్నయంబగు నభిప్రాయం బెఱింగి ద్రౌపది సన్నిధానంబునకు నెంతయు విశ్వాసంబు గల దూతనుం బనిచిన, నేకవస్త్రయును రజస్వలయునునగు పాంచాలి సభామధ్యంబునకు దుఃఖాక్రాంతయై చనుదెంచి, ధృతరాష్ట్రుసమీ పంబున నిలిచి మహారవంబుగరోదనంబు గావింపుచునుండు నంత, దురాత్మకుండగు నాసుయోధనుండు సభాసదులనెల్లం గలయం గనుంగొని ప్రాతిగామి నుద్దేశించి యాజ్ఞసేని నియ్యెడకుం దోడి తెమ్ము, జూదంబువలనం దన్ను గెలిచికొనుట యందఱు నెఱింగింప విని తెలియుం గాక యనిన, నతండు ద్రౌపది కోపంబు

నకు భయంబు నొందుచు దుర్యోధనుని దుర్ణయంబునకు మనంబున నిందింపుచు సభాసదుల నవలోకించి యీపాంచాలి నేమని పలుకం గలవాండనని దైన్యోక్తులాడుచు నుండు నంత, గాంధారేయుండు దుశ్శాసనునిం బిలిచి యీప్రాతిగామి మందబుద్ధియగుట భీమసేనునకు వేచుచున్నవాండు, నీవరిగి పాంచాలి నిటకుం దోడి తెమ్ము, మనకు దాసభూతులైన పాండవు లేమి సేయం గలవార లనిన నతం డగ్రజుని వచనంబు లంగీకరించి క్రోధారుణలోచనుం డగు యాజ్ఞసేని సమీపంబునకుం జని, నిన్ను జూదంబువలన ధర్మప్రకారంబుగ జయించుకొంటిమి, ఇంక లజ్జింపనేటికి, దుర్యోధనుం గనుంగొనుచు నేంటనుండియుం గౌరవులం భజింపుమనిన నాపతివ్రతారత్నంబు దిగ్గనలేచి యతివివర్ణంబగు తన ముఖంబు కరంబులం గప్పికొనుచు దైన్యంబుగ నేడ్చుచు ధృతరాష్ట్రుని వధూజనంబులున్న సమీపంబునం బోవుచుండం బాపాత్ముండగు దుశ్శాసనుండు రోషావేశంబున నందెందుం బోయెదవని యదల్చుచు వెంబడిం జని రాజసూయావభృథంబున మంత్రపూతంబులగు జలంబువలన సిక్తంబులును, నతిదీర్ఘంబులును, నీలోపమానంబులును, నరాళంబులును నగు నా పాంచాలరాజనందన 'కేశంబులం బట్టి పాండవుల భుజాటోపంబును సరకుసేయక బలాత్కారంబున మహావాతంబునం జలియించు కదళిక చందంబునం గంపింపుచునుండెడు నద్దేవిని ననాథయగు వనితం దెచ్చు చందంబున సభామధ్యంబునకు నీడ్చికొని వచ్చు సమయంబున, వినమ్రగాత్రియగుచు నతని నుద్దేశించి గద్గదస్వరంబుతోడ దురాత్మా! రజస్వలయును నేకవస్త్రయును నగు తన్ను సభకుం గొనిపోవుట యుక్తంబు గాదనిన నతండు కేశంబులు బిగియంబట్టుచు ఋతుమతియును నేకవస్త్రధారిణియును గాక వివస్త్రవును నగుదువుం గాకేమి? మేము ద్యూతంబున జయించి

దాసీకృత్యంబు సేయించికొనుటకుం బట్టికొనిపోయెదము. నారాయ ణుం డగు కృష్ణుండును, నరుండగు విజయుండును గదా నీకు రక్ష కులు. నిన్ను విడిపించుకొనుమని వారలకు మొరవెట్టుమనిన, వికీర్ణకేశి యును, విశీర్ణకుంతలయును, బతితార్ధవస్త్రయును, లజ్జావనతముఖియు ను, గోపోద్దీపితయును నగు నాద్రౌపది యతనిచే నీడ్వంబడుచు పాపాత్మా! ఈసభా మధ్యంబున సకల శాస్త్రవిశారదులును, యోగ శీలురును, మహేంద్రసమానులునునగు గురుజన పరిభృతులున్న వారలు. వీరల సమీపంబునకు వచ్చి యేనెట్లు నిలువం గలదాన? దురాచారా! ఇంక నన్ను విడువుము. నీకు నింద్రాదిదేవతలు సహా యంబుగా వచ్చిరేనియును నాపతులగు పాండవేయులు కోపంబు సైరింతురే? సకల ధర్మ రహస్యవిదుండగుట నీధర్మనందనుండు ధర్మ పాశబద్ధుండైయున్న వాండు. నాపతివ్రతాధర్మంబు విడిచి వారల యెడ దోషలేశంబేనియు గణింతునె? పుష్పిణియగు నన్ను నీరాజ లోకమధ్యంబునకు నీడిచికొని వచ్చుట నీచకృత్యంబు. ఇది యొక ప్రతాపంబుగ నిన్నెవ్వరేనియుం బ్రశంసింతురె? ఈకౌరవుల ధర్మం బును శూత్రంబును గాల్పవలదె? ఈయధర్మంబందఱుం జూచుచు నూంగాదనక యూరకయున్న వారు భీష్మద్రోణుల యెడ సత్యంబు లేదని యెఱింగితి. ధృతరాష్ట్ర ప్రముఖులగు కురువృద్ధులలోన నియ్యా కృత్యంబువలదని వారించువాండొక్కరుండును లేండయ్యెనని, సభా సదుల నిరీక్షించి మిమ్ము నేనొక ప్రశ్నంబు వేండెద, నేను జూదం బునం జయింపబడుటయును లేకయుండుటయును నెఱింగింపవలయు నని యివ్విధంబున దీనాలాపంబు లాడుచుం గోపోద్దీపితంబగు వీక్ష ణంబునం గాంతేయులం జూచుచుం జూచిన, తొలుతనె రోషావేశవి వశులై యుండెడు వారలు క్రోధంబినుమడింప నిట్టూర్పులు నిగుడిం పుచు రాజ్యంబును ధనకనకవస్తువాహనప్రముఖంబులు పోయినప్పు

డేనియును లేని శోకం బనుభవించుచు నుండు నంత, దుశ్శాసనుండు మాటిమాటికిం దనవల్లభుల దెసనాలోకించుచు నుండెడు పాంచాలిని వేగంబుగ నీడ్చుచు,దాసియని పేర్కొని పిలిచి,యట్టహాసంబు గావింపం గర్ణుం డెంతయును సంతుష్టుండై హాసంబు గావింపుచు నతనిం బలు దెఱంగులం గొనియాడె. సౌబలుండును నట్లన యతనిం బ్రశంసించె. ఆసమయంబున నత్యంత దుఃఖార్తయై యనాథ తెఱంగున నతనిచేనీడు వంబడి యుండెడు నా పతివ్రతాతిలకంబు శోకంబు గనుంగొనిదుర్యోధన దుశ్శాసన కర్ణ సౌబలురునుం దక్కఁ దక్కిన వారలెల్ల శోకాక్రాంతహృదయులై యుండిరి. అంత బుద్ధిసంపన్నుండగు గాంగేయుండు ధార్తరాష్ట్రుల హృదయం బెఱింగి యింతయును దైవకృత్యంబని తలంచి పాంచాలరాజాత్మజ నవలోకించి, తొలుతం దన్ను నోడిన వాండగుటం బరంపడి నిన్నుం బన్నిదంబునకుం బూన్చుటకు ధర్మనందనుండు స్వతంత్రుండు గాండనియును, నెంతైనను భార్య విభునకు నధీనయనియును, రెండు విధంబులం దోంచుచున్నయది గాన నీ వడిగిన ప్రశ్నంబు ధర్మసూక్ష్మం బెఱింగి వివరింప శక్యంబుగాక యున్నయది. ఈ యజాతశత్రుండు నిఖిలమహీతలంబును ధనరత్న సంచయంబులును బరిహరించినం బరిహరించుంగాని సత్యంబు వద లండు. అట్టి యితండు పరాజితుండనైతి ననియె. ఈ సౌబలుండు దురోదరంబునకు నద్వితీయుండును, గపటాత్ముండును నగుట వంచనోపాయం బించుకేనియు నెఱుంగని యుధిష్ఠిరుని జూదంబునకుం బిలిచి జయించె. ఇన్ని విధంబులై యున్నది. కాన నెఱింగి పలుక నాకు నలవిగాదనిన,ద్రౌపదీదేవి, కపటాత్ములును, ద్యూతవిద్యావిశారదులును,దుర్జనులును, నగు శకునిప్రభృతులు గూడి పరిశుద్ధహృదయుండై దేవనంబు నెడనేర్పులేని యితని బలాత్కారంబునంబిలిచి జయించిరి.

పదంపడి నన్నుం బన్నిదంబునకుం బూన్పమని పలికిరి. ఇవ్విధంబున నడించెం గావున నీ యెడంగల కౌరవశ్రేష్ఠులు తమ కుమారులకును గోడండ్రందఱికిని శిక్షకులుగాన నిదెంతయునుం బరామర్శించి యున్న రూపెఱింగింపవలయు. వృద్ధులు లేనియది సభ కాదనియును, ధర్మంబెఱింగి పలుకనివారలు వృద్ధులు గారనియును, సత్య రహితంబగునది ధర్మంబు గాదనియును, నొక నెపంబునం బలుకునది సత్యంబు గాదనియునుం బలుకుచు నతి కరుణంబుగ వగచుచుం దన వల్లభుల నిరీక్షింపుచు నుండెడు ద్రౌపదీదేవిని దుశ్శాసనుం డతి పరుషంబులును నప్రియంబులును నగు భాషణంబు లాడుచున్న సమ యంబున, గళితోత్తరీయయును, బుష్పవతియును నై సభాసదుల నిం దింపుచు నుండెడు పాంచాలింగనుంగొని భీముండు రోషారుణితలోచ నుండగుచు ధర్మనందను నుద్దేశించి.

ఈ కథ సభాపర్వంబున నూటయొకటవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 102

---

పాండునందనా! లోకంబునద్యూత పరాయణులై ప్రవర్తిల్లెడు ధూర్తులకు వేశ్యలును దాసీజనంబులునుంగలిగి యుండుదురు. వారల నేనియును బన్నిదంబునకుం బూన్చియాడుట కనియునెఱుంగము. ఇట్టియెడ దయావిహీనుండవై యింతచేసితివి. నీవు మాయందఱకును రాజవగుటంజేసి నానామహీపాలకులు గానుకలు దెచ్చిన నవరత్నంబు లును, వాహనంబులును, కవచంబులును, నాయుధంబులును మొద లగు వస్తువిశేషంబులను, రాజ్యంబును, మమ్మును, నీశరీరంబును బన్ని దంబునకుబూన్చి శాత్రవులపాలుజేసిన దీనికినై కోపంబు జనింపదు.

ఈపాంచాలరాజనందనం బన్నిదంబునకునొడ్డి యనుచితంబు గావించితివి. పాండవేయులంబొందియును నీ బాలికారత్నంబు కపటాత్ములును, క్షుద్రులును, క్రూరులునునగు కౌరవులచే నిన్నిపాట్లువడుచున్నయది. అతిసుకుమారాంగియగు నీ వధూతిలకంబునకు నీవలన నిన్నియాపదలు వాటిల్లెంగాన నా కోపంబునకు నిన్నె లక్ష్యంబు గావించి నీబాహుయుగంబు దహించి వైచెదనని సహదేవునుద్దేశించి యగ్నిం గొనితెమ్మని పలుకునంత నతనిం గనుంగొని యర్జునుండు, పవననందనా! ఇట్టి వాక్యంబులు మున్నెన్నండునుం బలుకుదువె? దీని వలనం గపటస్వభావులగు నీవైరులు భీముండింతమాత్రంబువాండే యని నీధర్మగౌరంబు నిందింపుదురు. కాన శాత్రవులకు నవకాశంబు గల్పింతురె? ధార్మికశ్రేష్ఠుండగు నీధర్మనందనుని నతిక్రమించక ధర్మంబె యవలంబింపుము. ఈ యజాతశత్రుండు తనకు జూదంబు నందుం బ్రియంబు లేకయుండియు నెవ్వండేని దురోదరంబునకుం బిలిచిన నాడకమాననని ప్రతిజ్ఞ సేయుట మనకుం గీర్తికరంబుగాదె, అనిన వృకోదరుండు ధనంజయు నుద్దేశించి యిట్టిదురవస్థకుం బాలుపరచిన యీతని బాహుయుగంబు బలాత్కారంబునంబట్టి దగ్ధంబు సేయం జెల్లదె! యని, యిట్లుపాండవేయులును బాంచాలియును బహుదుఃఖార్తులై యుండెడు సమయంబున దుర్యోధన సహోదరుండగు వికర్ణుండు సభాసదులంగలయం గనుంగొని, రాజవర్యులారా! ఇప్పుడీయాజ్ఞసేని యడిగిన ప్రశ్నంబునకు ధర్మరహస్యంబెఱింగి యుత్తరం బొసంగమైతిమేని మనకు నెల్లవారలకు నిప్పుడె నరకంబు ప్రాపించు. కురుకులశ్రేష్ఠులగు భీష్మధృతరాష్ట్రులును, మహాబుద్ధి సంపన్నుండగు విదురుండును, శిక్షకుండగు కృపాచార్యుండును, ద్రోణుండును గలిగియుండి యిందఱు నీసంశయంబు దీర్పకుండుట యుచితంబగునె! యని మఱియును నానాదేశాగతులగు భూపతుల

నుద్దేశించి యీ ద్రౌపదీదేవి పలుమఱు నడిగిన ప్రశ్నంబునకుంగామ క్రోధాదులు మాని ధర్మసూక్ష్మంబు విచారించి మీమీబుద్ధులకుం దోంచు తెఱంగెఱుంగింపు డనుచు, సారెసారెకుం బలికి వారలొం డేమియునుం బలుకక యూరకున్నం గనుంగొని నిట్టూర్పునిగుడిం చుచు మఱియు వారల నుద్దేశించి, మీర లెఱింగి పలికినను తెలుప కున్నను నేమి? నాకుం దోంచిన ధర్మమార్గం బెఱింగించెద, ఆకర్ణిం పుండు. లోకంబున రాజులకు జూదంబును, పానంబును, వనితాసక్తి యును, వేంట వెడలుటయును, ననియెడు చతుర్విధవ్యసనంబులు గలవు. వీని యెడ నాసక్తుండగుపురుషుండు ధర్మదూరుండై మెలంగుం గావున నతండాచరించిన కృత్యంబని తలంపరాదని రాజనీతి విధిజ్ఞు లెఱింగింతురు. అట్లగుట యీ ధర్మనందనుండు ద్యూతాసక్తుండగుట వలనను, నితని జూదంబునకు బలాత్కారంబునంబిలిచి యాడుట వలనను, ద్రౌపదిని బన్నిదంబునకుం బూన్పుమని శకుని తానె యడుగుటవలనను, నీ ద్రుపదరాజపుత్రి పాండవు లేవుర కధీనయగుట వలనను, యుధిష్ఠిరుండు మున్ను తనోడి పదంపడి దీనిం బన్నిదంబు నకు నియమించుటవలనను, నీ యాజ్ఞసేని జయింపంబడినది గాదని నా మనంబునం దోంచుచున్నది, యను నితని వాక్యంబు లాకర్ణించి యా సభాసదులలోన నావికర్ణుని బ్రశంసించువారల వచోనినాదంబు లును, సౌబలుని నిందించువారల వాక్యధ్వనులును నొక్కటం బిక్క టిల్లుచుండం గర్ణుండు క్రోధావేశవశుండగుచుం గరంబెత్తి కలకలంబు నివారింపుచు నీ వికర్ణునియెడ ననేక వికృతంబులు గలిగియున్నయవి. అరణివలనం బొడమిన యగ్ని దానిన దహించు తెఱంగున నితండు తా జనియించిన కౌరవవంశంబునకు నెల్ల నాశంబు గావింపుచు నున్న వాండు. శరీరంబునం బ్రభవించిన రోగంబు దానికి హాని గావించు చందంబునం, దనకు జీవనంబగు తృణంబు ద్రొక్కెడు పశువు చందం

బున, నితండు స్వపక్షంబునకుం గీడొనరింప నున్నవాండని మఱియు నతని నుద్దేశించి, ద్రోణుండును, భీష్ముండును, కృపాచార్యుండును, నశ్వత్థామయును, మహాబుద్ధిసంపన్నుండగు విదురుండును, ధృతరాష్ట్రుడును, గాంధారియును మొదలగు వీరలం గదా పాంచాలి ప్రశ్నగావించె, వారలెల్లను ధర్మమార్గంబున జయింపంబడిన యది యని దలంచి ప్రత్యుత్తరం బొసంగక యూరక యుండెదరు. నీవు బాలుండవయ్యును సర్వజ్ఞుని చందంబునం బలికెదవు. నీవు మందబుద్ధి వగుటం జేసి ధర్మసూక్ష్మం బెఱుంగక యీ యాజ్ఞసేని జయింపం బడిన యది గాదని సభామధ్యంబునం బలికెదవు. ఈ పాండవాగ్రజుండు తనకుంగల సర్వంబును నోడి ద్రౌపదినిం బన్నిదంబునకుం బూన్పమని శకుని వల్క సమ్మతించి యట్లన నియమించె. ఎల్లవారలెఱుంగ నోడియుండెడుతఱి నివ్విధంబునం బలుకందగునె? రజస్వలయును, నేకవస్త్రయును నై యుండెడు వనితను సభకుం గొనితెచ్చుట యుక్తంబగునె యని యడిగి తేనిం జెప్పెద నాకర్ణింపుము. లోకంబున నొక్క కాంతకు నొక్క మగండని దైవంబు గల్పించె. ఇది యేవురకుం భార్యయై యున్నయది గాన దీని వేశ్యయని నిశ్చయించితి. అట్లగుట నెట్లుండెనేనియును సభకుం దెచ్చుట యకృత్యంబుగాదు. ఈ పాండవేయుండు సకలధనంబును, రాజ్యంబును, సహోదరులను, ద్రౌపదిని ధర్మప్రకారంబున సౌబలునకు నోడుట యెఱింగియుండియును, బాల్యంబునం జేసి యీ వికర్ణుం డివ్విధంబున నెఱుంగక పలుకుచున్నవాండని, దుశ్శాసను నుద్దేశించి యీ కౌంతేయులు పాంచాలియు ధరించిన వస్త్రంబుల నపహరింపుమను నతని వాక్యంబులాకర్ణించి పాండవులు తాము కట్టియుండెడు వసనంబులు వీడక యుత్తరీయంబులు దిగిచి సభామధ్యంబున వైచి యూరకయుండిరి. అంత దుశ్శాసనుండు ద్రౌపది వస్త్రంబు లపహరింపవలయునని బలా

త్కారంబునం జేలాంచలంబు వట్టి యీడ్చుచుండెడు సమయంబున నద్దేవి మహత్తరంబగు నాపదం బ్రాపించిన యెడ జగదీశ్వరుండగు నారాయణుని సంస్మరింపవలయునని వసిష్ఠవచనంబులు గలవని విని యున్నదగుటం జేసిం గోవింద! కృష్ణ! అచ్యుత! యని పలుమారునుం బలుకుచు నాపన్నివారకుండును, లోకేశ్వరుండును, దేవదేవుండును నగు జనార్దనుని సంస్మరింపుచు, మఱియును శంఖచక్రగదాధర! నాశరహిత! గోవింద! పుండరీకాక్ష! ద్వారకాపురనివాస! యదునందనా! నీ వెందున్నవాండవు? అనాథతెఱంగున నిటి దురవస్థం జెంది శరణాగత యగు నన్ను రక్షింపక యుపేక్షింపందగునే! యని బహువిధంబులం బ్రార్థింప, నరనారాయణాత్మకుండును, విశ్వవ్యాపకుండును, ధర్మస్వరూపకుండునునగు నా కృష్ణుండు ప్రత్యక్షంబుగనిలిచి పతివ్రతా శిరోరత్నంబగు పాంచాలరాజనందనకు నానావిధంబులగు వస్త్రంబు లక్షయంబులగునట్లుగ ననుగ్రహించె. ఆసమయంబునం బాపచిత్తుండగు నాదుశ్శాసనుండు పాంచాలివసనంబపహరింపనట్టి యంశుకంబు వేఱొక్కటియుండ నదియునుం గ్రహించి మఱియు వస్త్రంబుగట్టినయట్ల నదియునుందోచి యుత్తెఱంగున నానావిధంబులగు నంబరంబులుగాంగ్రొనె. ఇవ్విధంబున నా దురాత్ముండు మఱియు నపహరింపుచునుండ బహువిధంబులగు చేలంబులు శరీరంబునంబుట్టినక్రైవడి నొక్కటం బ్రభవింపుచునుండె. ఆసమయంబున సభాసదులట్టి మహాద్భుతంబు గనుంగొని ద్రౌపదీదేవి పాతివ్రత్యంబు పలుదెఱంగులం బ్రశంసింపుచు వారును, దుర్యోధనాదులగు ధార్తరాష్ట్రులు దుష్టాత్ములని నిందించువారునునై యుండ, నా దుశ్శాసనుండు వస్త్రంబులు సభామధ్యంబున ననేకంబులగు రాసులుగా దిగిచివైచి లజ్జితుండై విశ్రాంతిజెంది చదికిలంబడియె. అంత భీమసేనుండు కోపాటోపంబున నౌడుగరచి కరపీడనంబు గావింపుచు

సభాసదులై యుండెడు మహీపాలకుల నుద్దేశించి, రాజవర్యులారా! మున్నొకండు వలుకనియదియును, నిటమీంద నొకండు వలుకుటకు నలవిగానిదియుననగు నొక్కప్రతిినం గావింపుచు నున్నవాండ, ఆకర్ణింపుండు, దుర్బుద్ధియును, బాపాత్ముండును, భరతకుల నికృష్టుం డుననగు నీ దుశ్శాసనుని వక్షఃస్థలంబు బలాత్కారంబునంబట్టి వ్రక్కలించి రుధిరంబుగ్రోలంగలవాండ. అట్లుసేయనైతినేని మా వంశకర్తలైన పూర్వరాజన్యులు పోయినగతికిం బోవంగలవాండం గానని బిట్టుగంబలుకు పవననందనుని ప్రతిజ్ఞాభాషణంబు లాలకించి ప్రమోదంబునం బొదలి యతనిం గొనియాడుచు సకల నరేంద్రులు కౌరవుల దూషించు శబ్దంబులు సభామధ్యంబున నొక్కటం బిక్క టిల్లె. అంతంగొందఱు సత్పురుషులు యాజ్ఞసేని యడిగిన ప్రశ్నంబు నకుం గటకటా యొక్కండేనియును నుత్తరంబొసంగండయ్యెనని వగచుచు నాంబికేయుని బహువిధంబులం దిట్టుచునున్న సమయం బున, నఖిలధర్మవిధిజ్ఞుండగు విదురుండు దిగ్గనలేచి బాహుదండంబు పొడవుగనెత్తి కలకలంబు నివారింపుచు, సభాసదులారా!యీ పాంచాలి యడిగిన ప్రశ్నంబు మీరెవ్వరును వివరింప నేరరైతిరి. కాన దురా త్ములగు నీ కౌరవులచే నిట్టిక్లేశంబు లనుభవింపుచు ననాథ తెఱంగున నేడ్చుచున్నయది. లోకంబునం బ్రశ్నంబనియెడు ననలజ్వాలిక సభా మధ్యంబునం బ్రవేశించి ధర్మంబనియెడు జలంబుల సజ్జనులచే నార్పం బడదేని యది యెల్లవారల దహించు. అట్లగుట మీకు నధర్మంబు వాటిల్లె. ప్రశ్నంబునంగల యర్థంబు న్యాయంబుగంబలుక సత్పురుష లకుంగాక కామక్రోధవశాత్ములగు వారలకుంగూడునె? ప్రాజ్ఞుండగు నీ వికర్ణుం డీద్రుపదరాజపుత్రియడిగిన వాక్యంబున్న దూపెఱింగించె. మీరలును దోచినవిధంబున వివరింపుండు. ధర్మసూక్ష్మం బెఱింగిన పురుషుండు తాందెలిసియును వివరింపండయ్యెనేని ననత్యంబువలనం

గలుగు దోషంబు సగంబనుభవించు. అదివిపరీతంబుగం బలికెనేని యనృత దోషంబంతయునుం జెందు. ఇది నిశ్చయంబు. ఈ యర్థం బున కొక్క యితిహాసంబెఱింగించెద. తొల్లి ప్రహ్లాద నందనుండగు విరోచనుండును నంగిరసునకుం బుత్రుండగు సుధన్వుండును నొక కన్యక నిమిత్తంబుగం దమప్రాణంబులకుం బన్నిదంబువైచికొని దైత్యేంద్రుండగు ప్రహ్లాదుని సమీపంబునకుంబోయి మాయిరువురి లోన శ్రేష్ఠుండెవ్వండు నిజంబుగం బలుకుమనిన, నతండెఱింగించుట కభిముఖుండగుటం గనుంగొని సుధన్వుండు బ్రహ్మాండంబునుబోలె మండుచు నతని నుద్దేశించి, నీవసత్యంబువలికిన నొండేమియుననక యూరకున్న మహేంద్రుని వజ్రాయుధంబు నీ తల పగుల్పంగలయది యని పలుకు నతని వాక్యంబు లాకర్ణించి, యశ్వత్థపత్రంబు చందం బునం జంచలించి తేజోవిరాజమానుండగు కాశ్యప మునీంద్రుని సన్ని ధానంబునకుంబోయి, నీవు దేవదానవుల ధర్మంబెఱింగిన విప్రవర్యుం డవుగాన నీ ధర్మరహస్యంబు వినిపింపుము, ఒకండడిగిన ప్రశ్నం బెఱింగియును వివరింపనియతండును, నది యసత్యంబుగం బలుకు నతండును నేలోకంబుం బ్రాపింపంగలవార లెఱింగింపుమనిన, నతం డెవ్వరేనియును దన్నడిగిన యర్థంబెఱింగియును గామ క్రోధ భయం బులవలనం దెలుపకయున్నవాండు వరుణపాశ సహస్రంబువలనం బీడి తుండగు, కూటసాక్షింబలికెడు నతండు గోకర్ణశిథిలంబను నరకంబున బహుదినంబులు బడియుండి యట్టివరుణపాశంబులవలన నావృతుం డగు, ఆ పాశంబులు సంవత్సరంబునకు నొకటిగ విడుచుచు నుండునట్లగుటం జేసి బుద్ధిసంపన్నుండగువాండు సత్యంబె పలుక వలయు. ఏ సభలో నధర్మంబువలన ధర్మంబు బాధింపంబడియుండు ఆ ధర్మంబునకు వచ్చిన హానిం దీర్పకయున్న సభ్యులకు ననర్థంబు వాటిల్లు. పాపకర్మంబు సేయుమని నియమించిన ప్రధానపురుషునకు

నాకలుషంబులోన సగంబును, సేయు నతనికి నొకభాగంబును, వారల నిందించుచుం జూచుచున్న వారలకు నొకభాగంబును సంభవించుం గాన నిందానర్హులగు వారల నిందించిరేని యాదుష్కృతంబు సభ్యులం జెందక కర్తయగు వానినిం బ్రాపించు. ఎవ్వం డేనియును వ్యవహారంబు సత్యంబు దప్పం బలికిన నతండు పదునాలుగు తరంబుల వారితోం గూడ నిష్టాపూర్తంబు విఘాతంబు జేసిన పాపం బనుభవించు. అపహృతధనుండగు వాండును, మృతపుత్రుండును, రాజపీడితుండును, బతిచేత విడువంబడినవనితయును, బంధువులవలనం బరిత్యజింపంబడిన యతండును, వివాహంబు లేని కన్యకయును, సాక్షులగు వారలచేత విడువంబడిన యతండును నను వీరలకెల్లను దుఃఖంబు సమంబై యుండునని దేవతలు వలుకుదురు. ఇన్ని దుఃఖంబులును నసత్యవాదియగు వాం డనుభవించు. కావున సాక్షియును, ధర్మంబును యథార్థంబుగం బలికెడు వారల యర్థధర్మంబులకు నొక్క నాం డేనియును హాని వాటిల్లదని కాశ్యపమునీంద్రుండు వలికిన వాక్యంబు లాలకించి, ప్రహ్లాదుండు తనకుమారుండగు విరోచను నాలోకించి, నీకంటె సుధన్వుండును, నితని జనకుండగు నంగిరసుండు నాకన్నను శ్రేష్ఠులు. ఈ సుధన్వుని జనని నీ జననికంటెను శ్రేష్ఠయగు. ఈ విప్రకుమారుండు నిన్ను గెలిచెం గావున నీ ప్రాణంబు లతని యధీనంబని పలుక, సుధన్వుండు ప్రహ్లాదునిం గనుంగొని నీవు ధర్మజ్ఞుండ వగుట పుత్రస్నేహం బేనియును బరిత్యజించి యథార్థంబె పలికితివి. కాన నీకుమారుం డాయుష్మంతుండై వర్ధిల్లుంగాక యని పలికి యతనికి నొసంగి యథేచ్ఛం జనియె. అట్లగుట యీ ధర్మరహస్యం బింతయును విచారించి యాజ్ఞసేని యడిగిన ప్రశ్నంబునకుం బ్రత్యుత్తరం బొసంగుండని పలుకు విదురుని వచనంబు లాకర్ణించి యా సభాసదులందఱును నూరక యుండు నెడ రాధేయుండు దుశ్శాసను నవలోకించి దాసి

యగు నీ పాంచాలిని గృహంబునకుం గొనిపోవుమనియె. అంత నతండు లజ్జాభరంబునం జలింపుచుం బలుమారును బాండవుల నిరీక్షింపుచు నుండెడు పాంచాలరాజకన్యం బట్టితిగిచె.

ఈ కథ సభాపర్వంబున నూటరెండవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 103

---

ఆ సమయంబున ద్రౌపదీ దేవి సభాసదుల నుద్దేశించి, యీ దురాత్ముండగు దుశ్శాసనుండు నన్ను బలాత్కారంబున నీడ్చికొని వచ్చునెడం గురువృద్ధులగు మీర లుపేక్ష సేయందగునేయని ధర్మంబు మున్న, మీరినట్టిదినైనను నిది నాయెడ కొంత గాదని పలుకునెడ, దుశ్శాసనుండు చెఱంగువట్టి యీడ్వ, దుఃఖార్తయగుచు సభామధ్యం బునం బడి, నన్ను స్వయంవరసమయంబున నిఖిలరాజన్యులు కనుంగొనుటయె కాని, సూర్యచంద్రులేనియు నెఱుంగకుండ నంతఃపురంబున వసియించియుండెడు నన్నిప్పు డీదురాత్ముం డీసభకుం గొనితెచ్చుట వలన నందఱుం గనుంగొన రాజమధ్యంబున నిలిచితి. నా మీంద వాయువు సోంకుటకైనను సైంపని పాండునందను లీదురాత్మునిచే నిట్టి దురవస్థంబడుట కనుంగొని యెట్లుసహించెదరో! ఈ కురువృద్ధులకుం గోడలనగు నేను సభామధ్యంబున నిట్లు క్లేశపడుటకు నుపేక్షించి యుండుటవలన నదికాంగల వైపరీత్యంబుగానోపు. సుకుమార దేహి యును, బతివ్రతయుననగు నేను సభామధ్యంబున వీనిచె యిన్ని పాటులువడుటకంటె దైన్యంబింక నేమియున్నయది? రాజులయెడ ధర్మంబుగలదె? అంతఃపురవధూజనంబుల సభకుందెచ్చుట యుక్తంబు గాదన వినియుండుదుము. అట్టి సనాతనంబగు ధర్మం బీకౌరవుల వలన

నేంటితోడన వినాశంబునొందె. దృష్టద్యుమ్నునకు సహోదరియును, పాండవేయులకు భార్యయును, వాసుదేవునకు సఖియును, సత్కుల ప్రసూతయును, బతివ్రతయునునగు నేను దాసినగుటయును గాక యుండుటయును నెఱింగింపుండు. ఈ పాపకర్మండును కౌరవులకీర్తి వినాశకుండగుచు నన్ను నెంతయును బాధింపుచు నున్నవాండు. ఇంక సైరింప నలవికాదు. పలునురుం బలుకుటకుం బ్రత్యుత్తరం బొసంగక యూరకుండ నేటికి? నన్ను వీరలు జయించుటయును, జయింపక యుండుటయును, ధర్మసూక్ష్మం బెఱింగి వివరించితిరేని యట్లన కావించెదనని శోకార్తయగుచు బహువిధం బులం బలువరింప, దేవవ్రతుండు ద్రౌపది నుద్దేశించి ధర్మ సూక్ష్మంబెఱింగి వివరింపుమని యడిగితివి గదా! ఇది మహానుభావులగు బ్రాహ్మణులకేనియును దెలుప నలవిగాదు. లోకంబున బుద్ధి సంపన్నుండగునతండు సకల ధర్మసూక్ష్మంబు లెఱుంగు. అతని నీతివచనంబు లపర్మంబు మిక్కుటంబై యుండెడు చోటం బనిగొనవు. ధర్మంబు సూక్ష్మంబును, గహనంబును, బ్రబలంబును నగుట నిది నా వలన నిశ్చయింపం గూడక యున్న యది. ఈ కౌరవులు లోభమోహపరాయణులగుటం జేసి వీరల వంశంబునకు శీఘ్రంబున వినాశనంబు రాంగలయది. లోకంబున మహా కులప్రసూతులగు వారలు మహావ్యసనంబును జెందియును ధర్మంబు వదలక ప్రవర్తిల్లుదురు. కావున నీ విప్పు డిట్టి దురవస్థలం బొందియును ధర్మంబవలంబించి యున్నదానవగుట నీ చరిత్రంబు ప్రశంసకుం దగియె. వృద్ధులును ధర్మవిధిజ్ఞులును, నగు నీ ద్రోణప్రభృతులెల్లను శిరంబులు వాంచి నిశ్చేష్టితులై యున్నవారలు. కాన సమస్తధర్మ విశారదుండగు యుధిష్ఠిరుండె నీ ప్రశ్నంబునకు నుత్తరంబొసంగం గలవాండని నిశ్చయించితి.

ఈ కథ సభాపర్వంబున నూటమూండవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 104

అనియొనని వైశంపాయనుండు జనమేజయు నుద్దేశించి మఱి యును నా సమయంబున నిఖిలసద్గుణసమేతయును నతిదుఃఖార్త యునునగు పాంచాలరాజనందన కురరిచందంబునం బలవరింపుచు నుండ, నయ్యెడంగల ధరావరులందఱును దుర్యోధనునకు భయంపడి యూరంగాదని పలుకకున్నయెడం బాపాత్ముండగు నా సుయోధ నుండు మానముద్రలు వహించియున్న మానవేంద్రులంగలయం గనుంగొని మందహాసంబు గావింపుచుం బాంచాలి నాలోకించి, నీ వడిగిన యర్థంబీనరపాలకులెల్లను భీమార్జున నకులసహదేవులకు నెఱింగింప వారలు మేమందఱము నుండ నీ ద్రౌపదిని బన్నిదంబు నకుం బూన్చుట కీ ధర్మనందనునకు స్వాతంత్ర్యంబు లేదని యెల్ల వార లెఱుంగ నితనియెడ నసత్యంబు మోపి రేని నిన్ను దాసింగానీక విడిపించెద. మహేంద్రసమానుండును, మహాత్మకుండును, ధర్మనిర తుండును నగు నీ యజాతశత్రుండేనియును నిన్ను నోడుటకుం దాను స్వతంత్రుండు గానని పలికినంజాలు, నిన్ను విడిపించెద. అల్ప భాగ్యులై సమస్తంబును నోడి దుఃఖింపుచు నుండెడు నీ పతుల నవ లోకించి యిచ్చటంగల యీ వృద్ధజనంబు లొండేమియుం బలుక దు రే యని పలుకు నతని వచనంబు లాకర్ణించి సకలమహీపతులు సుయోధను ననేక విధంబులం బ్రశంసింపుచు ధర్మాత్ముండగు నీ పాండవాగ్రజుండును భీమార్జున నకులసహదేవులును నేమి పలికెదరో వినవలయునను వేడుక వారలందప్పక నిరీక్షింపుచుంగలకలంబు మానియున్న సమయంబున భీమసేనుండు వర్తులంబును, జందనాలం కృతంబును నగు నిజభుజాదండంబున్నతంబుగా నెత్తి సభాసదుల నుద్దేశించి సత్యసంధుండును, సుకృతశాలియునునగు నీ ధర్మనంద

నుండు మాకును మావంశంబునకును గురుండగుటం జేసి మేము సైరించియున్నవారము. అతండు నిర్జితుండయ్యేనేని మేమందరము నిర్జితులమగుటకు సంశయంబు లేదు. ఇట్లు కాకుండెనేని యీ పాంచాలి కచంబులు వట్టితిగిచిన మానవుండు ప్రాణంబులతోడ మహీతలంబున నుండునే? పరిఘోపమానంబులగు నా భుజంబులిదె కనుంగొనుండు. ఈ బాహుమధ్యంబునం బడెనేని మహేంద్రుండైనను తప్పించుకొనుటకు సమర్థుండె? ధర్మజుని యెడంగల గౌరవంబునను, నీ యర్జునుండు పలుమారును నివారించుటవలనను నేను ధర్మపాశబద్ధుండనై యీ భంగంబు సైరించితింగాక యీ యజాత శత్రుండించుక యనుజ్ఞ యొసంగెనేని క్షుద్రమృగంబులంబోనీక పొదువు కంఠీరవంబు చాడ్పున నీ ధార్తరాష్ట్రులంజుట్టుముట్టి నా కరతలంబను ఖడ్గంబున నురుమాడెదనని రోషావేశంబునం బెదవులు గంపింపం బలుమారునుంబలుకుచు నుండెడుపవననంద నుద్దేశించి విదురభీష్మద్రోణులు, మహాబలనందనా! నీవు పలికినంతకంటెం జేయ సమర్థుండవు. అట్లైనను నీ విషయంబునం గోపంబు సైరింపవలయు నని పలికిరి.

ఈ కథ సభాపర్వంబున నూటనాలుగవ యధ్యాయము.

---

## అధ్యాయము. 105

---

ఆసమయంబునం గర్ణుండు యాజ్ఞసేనిం గనుంగొని లోకంబున దాసుండును, శిష్యుండును, వనితయునునను నీ ముగ్గురు నస్వతంత్రులుగాన కౌరవదాసులగు నీ పాండవేయుల పత్నివగుట నీకు స్వాతంత్ర్యంబు లేదు. నీకు నధిపతులీ ధార్తరాష్ట్రులు. వీరలగృహం

బుల దాసీకృత్యంబులు గావింపుచునుండుము. ఈ పాండు నందనులు జూదంబున నిన్ను నోడుటంజేసి వీరలు నీకు నధీశ్వరులుగారు. ఇంక నేనియును జూదంబుననోడి నీకు దాస్యంబు సంపాదింపని వానింగా నొక్కమగనివరింపుము. ఇన్ని దినంబులు నీవల్లభులయెడ భయ భక్తులుగలిగి నడచిన తెఱంగున దాస్యంబునందట్లప్రవర్తిల్లుము. వీరలకుంబ్రతాపంబును బౌరుషంబును గలుగుటకు ఫలంబుగదా నిన్ను దురోదరంబున నోడుట యను నతని వచనంబు లాకర్ణించి, కోపశీలుండును ధర్మపాశబద్ధుండునునగుంబవమాన సుతుండు మహాభుజంగంబు చందంబున నిట్టూరుపు నిగుడింపుచు నతనిదహించు తెఱంగున రోషారుణ వీక్షణంబులంజురచురం జూచుచు ధర్మనందను నుద్దేశించి, నీవుపన్నిదంబువైచి యోడుటవలన వారలకు దాసుల మైతిమి, కాన నీరాధేయుండు వలికిన పలుకులకు నా మనంబునకుం గోపంబులేదు. ఈ ద్రౌపదిని నీవు జూదంబునంబన్నిదంబునకుం బూన్పవైతేని వీరలిట్లాడుదురె యను వృకోదరుని వాక్యంబులు విని రారాజచేతనుని కైవడి మానముద్రతోనుండెడు ధర్మపుత్రు నుద్దేశించి, యీ భీమార్జున నకుల సహదేవులు నీయాజ్ఞలోన మెలంగెడువారలగుట యూరకెయున్నవారలు. ఇప్పాంచాలి మాచే జయింపంబడుటయును లేకయుండుటయును నీవెఱింగింపుమని పలికి కదళీకాస్తంభ సంకాశంబును, సర్వలక్షణ లక్షితంబును, గరికరోప మానంబును, వజ్రప్రతిమానంబునునగు తనయూరుతలంబును మంద హాస ముఖుండగుచు ద్రౌపదికింజూపు సమయంబున వాయునంద నుండు క్రోధతామ్రాక్షుండగుచు నెల్లవారలువిన నిప్పుడీ దురా త్ముండు యాజ్ఞసేనికింజూపిన యూరుకాండంబులు నా గదాప్రహా రంబున నుగ్గు నూచంబుసేయనైతినేని పితృలోకంబునకు వెలిగాంగల వాండనని యెల్లవారు నెఱుంగబిట్టుగాంబలుకు భీమసేనుని రోమ

కూపంబులవలన నుండియును విస్ఫులింగంబు లనలజ్వాలాదహ్యమానంబగు వృక్షకోటరంబులనుండి పడియెడు నగ్నికణంబుల తెఱంగున నొక్కమొగిరాలుచునుండె. ఆ సమయంబున విదురుండు సుయోధను నుద్దేశించి యీ పవనాత్మజుని దేహంబువలనందొలంగెడు మిణుంగురులు కనుంగొంటివె? ఇతనివలనం గౌరవాన్వయంబునకునెల్ల మహాభయంబు రాంగలదని యెఱుంగుము. దైవసంకల్పంబుచే నీభారత వంశంబునక నర్థంబువాటిల్లె. మీరలిప్పుడీ దురోదరం బాడి లోకంబున లేని యకృత్యంబుగ నింతభంగపరచుటవలన శ్రేయంబునకు హాని ప్రాపించంగలయది. జయింపంబడిన యదియని యీ కురువృద్ధులెల్లను చింతాక్రాంతులై యున్నవారలు. దుష్టాత్ములచే నీ సభదూషితంబయ్యె. ఈ ధర్మనందనుండు దన్నునోడక తొలుతం బాంచాలిని బన్నిదంబునకుంబూన్చెనేని యిది జయింపంబడినయది యగు. మున్ను తనోడి పదంపడియోడిన వాండగుట నియ్యాజ్ఞసేని గెలువంబడిన యదిగాదు. ఈ సౌబలుని దుర్నీతులువిని పాండవుల ధనంబెల్లపహరించితివి, అది స్వప్నలబ్ధంబగు ద్రవ్యంబు చందంబునం బోవుంగాక నిలువనేర్చునె? ఇంకనేనియు నావంచకుని వాక్యంబులాకర్ణించి యపకీర్తికిం బాలుపడకయుండుమనిన, సుయోధనుండు విదురునింగనుంగొని నీవాడినట్లన నీభీమార్జుననకులసహదేవులును బాంచాలినోడుటకు స్వాతంత్ర్యంబులేనని రేని విడిపించెదననిన, నర్జునుండు సభాసదులనుద్దేశించి యీ ధర్మనందనుండు జూదం బాడకమున్న మాకందఱకు నధీశ్వరుండు, తాను పరాజితుండైన యనంతరంబున ద్రౌపదికి నధీశ్వరుం డెట్లగు, కౌరవశ్రేష్ఠులెల్లను నీ యర్థంబు విచారించి తెలియుండనునెడ, సూతపుత్రుండు దుశ్శాసనును ద్దేశించి, వీరలతోడ వృథాలాపంబులాడనేటికి, నావచనప్రకారంబున ద్రౌపదింగొనిపోయి దాసింగా నేలుకొనుమని పలుకు కర్ణుం గను

గొని, గాంధార రాజనందనుండగు శకుని యుక్తంబు వలికితివని ప్రశం సించె. అంత దుశ్శాసనుండు పాంచాలిని దాసీగృహంబునకుం దోడ్కొని పోవుటకునై బలాత్కారంబునందిగువ, దేవకన్యకయు నుంబోని యా పాంచాలరాజనందన మహారవంబుగ నాక్రోశింపుచు, భీష్మద్రోణకృపవిదురాశ్వత్థామలారా! మీరు ధర్మాత్ములు గావున నా యాపదంబొలంగించి రక్షింపుండనియును, ధృతరాష్ట్రమహా రాజా! నీ కోడలనగు నా క్లేశంబు వాపవేటికనియును, గాంధారీ! నీవు సకలంబు నెఱింగినవివేకశాలియసియును, యాదవవీర జననియును, నీవు దుర్యోధనుని వలని భయంబు దీర్చి రక్షింపక యుపేక్షింపందగునె? ఈ దుర్జనులచేంబీడింపంబడుచుండెడు నన్నుం గోడలుగదా యని నీ మనంబున నించుకేనియును దయపుట్టదని యును నివ్విధంబునంబలికెడు నా మొరయాలకించు వాండిందులోన నొక్కండేనియునులేండయ్యె, నిటువంటి మందభాగ్యనై దుర్యోధనుని చేత నింత క్లేశంబనుభవింపుచున్న నన్నుం బాండుమహీపాలుం డేనియును, మహేంద్రుండును, వాయుదేవుండును, నశ్వినులును నను వీరలైనను దమ కోడలుగదా యని నన్ను సంరక్షింపకపోయిరనియును, నదృష్టహీనయును, బతివ్రతయునునగుతన జీవంబింక నేటికనియును బహువిధంబులంబ్రలాపించుచునుండెడు నయ్యాజ్ఞసేనినుద్దేశించి విదు రుండు, తల్లీ! నీ వాడిన వాక్యంబులన్నియు నాకర్ణించితి. ఈ కొం తేయు లొంగాదనక యూరకయున్నవారలు. నీ ప్రియంబు గోరి యుండెడు నా వాక్యంబులు విని యూరకయుండుము. పాపాత్ముం డును, గృతఘ్నుండును, దుర్జనసమేతుండునునగు నీ సుయోధనుం డును, బుత్రవంతుండగు నీ ధృతరాష్ట్రుండును, నా బుద్ధి విననైరని, యంత దుర్యోధను నుద్దేశించి మహాపతివ్రతయగు ద్రౌపదికి నింత మనఃఖేదంబు గావించి వినాశంబు నొందనేటికని, యాంబికేయునిం

గనుంగొని కౌరవేంద్రా! ఈ ద్రౌపదికి నింత యార్తింగావింపుచు నున్నవాండవు, ఇది నివారింపవైతివేని పాపాత్ముండును గులనాశకుండునునగు నీ సుయోధనుండు సహోదరామాత్యసమేతంబుగ ధర్మజ భీమార్జున నకులసహదేవులచే నల్పకాలంబున నశియించి పోయెడుననుఁ నతని వచనంబులకు మందబుద్ధియగు నాధృతరాష్ట్రుండు ప్రత్యుత్తరంబొసంగండయ్యె. అప్పుడు దేవమాయామోహితుండగు సుయోధనుండు విదురుని వాక్యంబుల దెస ననాదరంబు గావింపుచు ద్రౌపదీదేవికింబలుమారును దన యంకతలంబు చూపుచునుండ, బలధురంధరుండును నభిమానశాలియునునగు భీమసేనుండు రోషారుణలోచనుండగుచు గాంధారీనందనుండు చేసిన యవమానంబునకుంబొడమిన కోపంబంతయును దనుదానె యుపశమించుకొనుచు సభామధ్యంబున నుండి దిగ్గన లేచి రాజలోకంబు నాలోకించి యెల్లభంగుల నేను సుయోధనుని సంహరింపంగలవాండ. ఈ విజయుండు సూతపుత్రుండగు కర్ణునిందెగటార్చు. సహదేవుండు దుర్ద్యూతవిశారదుండగు నీ శకునిం బరిమార్చు. దేవతానుగ్రహంబునంజేసి నా ప్రతినకు ననుకూలంబగు నొక యుద్ధంబు వాటిల్లవలయు. ఇంక నొక్కటి తెలిపెద. రణరంగంబున నాదు గదా ప్రహారంబుచే దుర్యోధనుని యూరుభంగంబు గావించి ధరాతలంబునంబడియుండెడు నితని శిరంబు నాపాదంబునందన్నంగలవాండ. క్రూరకర్ముండును శూరుండునునగు నీ దుశ్శాసనుని యురంబు వ్రక్కలించి కంఠీరవంబు చందంబున రుధిరంబు గ్రోలంగలవాండనను సమయంబున నర్జునుండు భీమసేను నుద్దేశించి, మహాబలనందనా! నీతోడ వైరంబు గావించి తమకు రాంగల మహాభయంబెఱుంగక దుర్బుద్ధులగుచు గృహంబుల సుఖంబున నున్నవారమసి తలంపుచునుండెడు నీ సుయోధనాదులనందఱంబొలిసిన వారింగాండలంపుము. సత్పురుషుండు

తన శౌర్యాలోపంబులు కార్యముఖంబునం జూపుంగాని మాటలచే నెఱింగింపండు. ఈ దుర్యోధనదుశ్శాసనశకునికర్ణులు క్షత్రధర్మంబున రణరంగంబునకు వచ్చి నిలిచిరేని వీరల రుధిరంబు భూమిదేవి పానంబు సేయంగలయది. అనృతభాషణులును, దురాత్ములును నగు శాత్రవులకుం బేరకుండగు రాధాతనూభవుని నీ యనుమతి వలనంబుత్రిమిత్రసమేతంబుగా నిశితబాణపరలంజించి చెండాడుచు యమసదనంబునకుంబనుపంగలవాఁడ. హిమాచలంబు చలించినను, సూర్యబింబంబు మాసినను, జంద్రునియెడ శైత్యంబు లేదయ్యేనేని యును, నా ప్రతిజ్ఞకు నన్యధాత్వంబు గలుగునె? యని యివ్విధంబునం బార్థుండు పలుకుచున్న సమయంబున మహాప్రతాపశాలియును, సౌబలవధార్థియును, రోషారుణలోచనుండును నగు సహదేవుం డాశీవిషంబుచందంబున రోజుచు శకుని నుద్దేశించి నృపాధమా! కౌరవవంశకీర్తినాశకుండ వగుచు జూదంబునంగదా జయించితివి? ఇప్పుడు నీచేతనుండెడి యక్షంబులు సమరసమయంబున నిశితశిలీముఖంబులై తోఁడ్పడునె? ఇంకను జేయవలయు పనులెల్లనుం జేయుము. పూజనీయుండును, జ్యేష్ఠుండునునగు భీమసేనుండు నన్ను నియమించి నట్లన పుత్రమిత్రసమేతంబుగ నిన్నుం బ్రథనముఖంబున సంహరించితినని యెఱుంగుమను నెడ, నతిసౌందర్యశాలియగు నకులుండు సభామధ్యంబున నిలిచి సౌబలసుతుండును, దురాత్ముండును, నరాధముండును నగు నీయులూకుని నెల్లవారెఱుంగ, సంహరింపంగలవాఁడ. మఱియు నీయూజ్ఞ సేసినుల్లసంబులాడిన దుర్వృత్తులును గాలప్రేరితులు నగు నీధార్తరాష్ట్రుల ధర్మపుత్రుండనుజ్ఞ యొసంగం బాంచాలికిం బ్రియంబుగం దెగటార్పంగలవాఁడ ననునెడ, ద్రౌపది దుర్యోధనుని చురచురం జూచి, దురాత్మా! నీవూరుప్రదేశంబును జూపితివి గాన నీకు నయ్యెడ మృత్యువు ప్రాపించంగలయది. నాకు

నతిక్లేశంబు గావించిన నీసహోదరుండగు దుశ్శాసనుని రుధిరంబు భీమసేనుండు గ్రోలంగలవాండు, కలుషాత్ముండగు నీకర్ణుని బుత్ర మిత్రామాత్యసహితంబుగ ధనంజయుండు హింసించుంగాక! ధర్మనిరతుండును, గుపితాత్ముండునునగు నీసహదేవుండిట్టి క్రూరకర్మంబు నకుంగారణంబైన గాంధారవల్లభుని ద్రుళ్ళడంగించునని యిట్లు పతివ్రతాతిలకంబగు ద్రౌపదీదేవి పలుకుచునున్న సమయంబున నంతరిక్షంబుననుండి దేవతలు కుసుమవర్షంబు గురియుచుంబలు దెఱంగులంబాంచాలిని బ్రశంసించిరి. అంత నర్జునుండు ఈ ధార్త రాష్ట్రులెవ్వని బాహుబలంబును నమ్మి యిట్టి యకృత్యంబులు గావింపుచు నున్నవారలో ఆకర్ణుని బుత్రమిత్రసహితంబుగా సంహరింపక విడువంగలవాండనేయని సత్యంబుగ నాయుధంబువట్టుచుం దన ప్రతిజ్ఞ దృఢంబు గావించి సభాసదులంగనుంగొని, రాజవర్యులారా! యీ ద్రుపదరాజతనూజ నివ్విధంబున భంగపరచిన నికృష్టాత్ములగు నీ ధార్తరాష్ట్రుల నందఱ నొక ముహూర్తమాత్రంబున సంహరించి యమసదనంబునకుంబంపుదుంగాక. సహింపనేర్తునె? ఈ ధర్మనందనుండు దయాశాలియగుటవలన నాకు నేమియుంబలుకంగూడక యున్నయది యను నతని వచనంబులాకర్ణించి భయభ్రాంతులగుచు నెల్లవారలును నూరక వసియించియుండిరి. అంతమఱియును గోధఘూర్ణమాన హృదయుండును, శౌర్యరసోద్దీపితుండునునగు నమ్మహేంద్ర నందనుండు దిగ్గనలేచి గాండీవంబు కెంగేలనమర్చుచు విరోధిరాజవర్గంబులంజూరచురంజూచుచు దక్షాధ్వరధ్వంసంబు గావింపం దగిన ఫాలాక్షుని చందంబున నిఖిలలోకంబులు దహించుటకుందరి కొను ప్రళయకాలానలంబు పోలికె మహాకార్ముకహస్తుండై కట్టెదుట నిలిచి క్రోధావేశంబున నిట్టూర్పులు నిగుడించుచు నుండెడు విధంబు గనుంగొని, యతని శౌర్యాటోపంబులకు నిఖిలరాజన్యులు భయ

భ్రాంతులగుచుం గను రెప్పలార్చుటకునేనియును సామర్థ్యంబు లేక నిశ్చేష్టితులై తమప్రాణంబులదెస నిరాశులైయుండిరి. ఇవ్విధంబునం గ్రోధవివశుండగుంబార్థుని ప్రతాపంబునకుందలంకుచు మహీ చక్రంబు కులాచలంబులతోడ గడగడ వడంకె. ఖేచరంబులగు నిఖిల భూత సంచయంబులు భయంపడియె. దివాకరుండు తేజోవిహీనుం డయ్యె. వాయుదేవుండు విసరుటకు వెరచె. చంద్రగ్రహ తారకా గణంబులును, దశదిశాభాగంబులును, యెట్టిపనియేర్పరింపంబడ దయ్యె. చరాచరాత్మకంబగు నిఖిల ప్రపంచంబును గలంగంబారె. అట్టియెడ నభోమధ్యంబునం దేజరిల్లుమార్తాండుని తెఱంగునం గాలాం తక ప్రతిమానుండై కనుపట్టు నాఖండలనందనునింగనుంగొని భీమ సేనుండు ప్రమోదంబునంబొదలుచుందానును యుద్ధసన్నద్ధుండై నిలిచె. అట్టియెడ మహాభుజంగ భంజనంబునకుంగడంగు వినతానంద నునిచందంబునం దోచు ధనంజయుని నిరీక్షింపుచుం బాంచాలరాజ నందన ప్రమోదంబునంబొదలె. ఇట్లువిలయ కాలాగ్ని చందంబున మండుచుం జనుదెంచు పురందరతనూభవుని వీక్షించి పౌరజనంబు లెల్లను దల్లడిల్లిరి. అంత ధర్మాయత్తచిత్తుండును దయాశాలియును నగుపాండవాగ్రజుం డుపేంద్రుని నివారించు పాకశాసనుని చాట్పునం బురుహూత పుత్రినింబట్టి నిలిపి యర్జునా! యీ సమయంబున సాహ సంబు ప్రకటించిన యశోహాని వాటిల్లదె? దుర్జాతుండగు నీరాధే యుని నేన కోపానలంబున దహింపవలయునని దలంచితి. వీని పాదంబులు గనుంగొనినంగుంతీదేవి యడుగుల చందంబున నున్నది, గాన మన్నించితి. నీవును లోకహితార్థంబుగం గోపంబు సంహరింపుమని పలుకు న తని వచనంబు లాకర్ణించి పార్థుండు క్రోధంబడంప సకల జనంబులును ప్రమో దంబు నొందిరి. వృకోదరుండును విన్ననై యూరకుండె. అట్టియెడ

ధృతరాష్ట్రుని యగ్నిహోత్రగృహంబున సృగాలంబులును, రాసభం బులును, దుర్విహంగంబులును గూయుచుండెను. ఆ దుర్నిమిత్తంబు లాకర్ణించి బుద్ధిసంపన్నుండగు విదురుండును, గాంధారరాజాత్మజ యును, భీష్మద్రోణకృపాచార్యులును నత్యంతంబగు ఖేదంబు జెందిరి. అంత విదురుండును గాంధారియును శోకాక్రాంతు లగుచు నతిఘో రంబులగు దుశ్శకునంబులగుట ధృతరాష్ట్రునకు నెఱింగింపం బ్రజ్ఞాశాలి యగు నతండును దుర్యోధను నుద్దేశించి దురాత్మా! పాండవధర్మ పత్నియును, బతివ్రతాతిలకంబును నగు పాంచాలరాజతనూజ నీ సభామధ్యంబున నివ్విధంబున భంగపరచితివి గాన నేంటితోడ వినా శంబు నొందితివని పలికి దిగ్గన లేచి బంధుమధ్యంబు వాసి యొకప్రదే శంబునకుంజని యంతయునుం దన మనంబున విచారింపుచు ద్రౌపదిం బిలిచి, నాకోడండ్రలోన నీవు నిఖిలగుణసమేతవగుట నీవు కోరిన వరంబొసంగెద వేండుమనిన నద్దేవియును కౌరవోత్తమా! వరం బొసంగెదనని పలికితిరిగాన మిమ్ము నొక్కటి ప్రార్థించెద. మిగుల నభిమానశాలియును నుపలాలితుండునునగు ప్రతివింధ్యుని నీకుమార కులు దాసపుత్రుండని పిలిచిరేని యతండు దేహంబు దొఱంగు. కావున సర్వధర్మవిధిజ్ఞుండగు నీయజాతశత్రునకు దాసత్వంబు లేకుండ ననుగ్రహింపవలయు ననిన వైచిత్రవీర్యుం డట్లకాకయని నీకొక్క వరం బొసంగిన మాత్రంబున నామనంబు సంతుష్టి నొందదు. ఇంకను వలయు వరంబు లొసంగెద, వేండుమనినం బాంచాలి దివ్యకార్ముక హస్తులును రథారూఢులునునగు భీమార్జున నకులసహదేవులకును దాసభావంబు దొలంగించుట రెండవవరంబనిన నతం డిదియొసంగితి, నీవు పతివ్రతాశిరోమణియగుట నీదు కన్నీరెయ్యెడంబడియె నట్టి గృహంబునకు నాశంబు వాటిల్లుంగావున నీమనంబునకు సంతసంబు గావింపం దలంచినాండ. ఇంకను వరంబులు వేండుమనిన నయ్యాజ్ఞసేని

యతని నుద్దేశించి నరేంద్రా! వైశ్యులకు నొక్కవరంబును, క్షత్రియ కాంతలకు రెండువరంబులును, రాజునకు మూండు వరంబులును, బ్రాహ్మణులకు నూఱువరంబులను గోరవలయు. మిగుల నాసంబడి రేని ధర్మహాని వాటిల్లు. అట్లగుట నాకు నింతియె చాలు. ఇక వరంబు వలదు. నావల్లభులు దాసభావంబువలన విముక్తులై రేని సకల భాగ్యంబులును దనంతనె కలుగు ననిన.

ఈకథ సభాపర్వంబున నూటయైదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 106

---

ఆ సమయంబునంగర్ణుండు సభాసదుల నాలోకించి, లోకంబున నతిమనోహరంబులగు రూపసౌందర్యంబుగల వనితాజనంబుల యందు తాలిమిగలుగుట యరుదని విందుము గదా! ఈ రూపవతి యగు ద్రౌపది యిట్టి తాలిమిచే సముద్రమధ్యంబున మునింగెడు జనుల ద్వీపంబునకుం జేర్చు యానపాత్రంబు తెఱంగున నాపదయును నపకీర్తియును ననియెడి సాగరంబున మునుంగుచు ధార్తరాష్ట్రుల కృత్యంబున నతికుపితులై యుండెడు పాండునందనుల నుద్ధరించెం గావున నీ పాంచాలికి సమానంబగు వధూజనంబులు గలరే, యను నతని వచనంబు లాకర్ణించి కోపశీలుండును, నభిమానశాలియును, నగు భీమసేనుండర్జునుంగనుంగొని యీ దురాత్ముండగు రాధా పుత్రుండీ పాండవేయుల నియ్యంతి రక్షించెనని పలుకుచునున్న వాండు. లోకంబున రాజులకు సమరంబున వెనుదీయక యుండుటయు, యుద్ధంబునకుంబిలిచినంబోవుటయును, భార్యాసంరక్షణంబునుననునివి తేజస్త్ర్యయంబని దేవలుని వచనంబులు గలవు. హేయంబును, గత

ప్రాణంబును, శూన్యంబును, జ్ఞాతిజనపరిత్యక్తంబునునగు దేహంబు వోయిన సమయంబునంబురుషునకు సంతానంబును, విద్యయును, సత్కర్మంబునునను నివి తోడ్పడి సంరక్షించుంగావున నీ ద్రౌపదీ దేవిని బరులు భంగపరచుటం జేసి భార్యాసంరక్షణంబనియెడు తేజంబు నాశంబొందె. ఇట్టి వనిత గర్భంబున జనియించిన సంతానంబు మనకు శ్రేయంబు గావించునె యనిన ధనంజయుండు నతనిం గనుంగొని, పవననందనా, నీచజనుండాడెడు పరుషభాషణంబులు వ్యర్థంబుగందలంపవలయుంగాక దానికింగోపింపనగునె? ఆత్మజ్ఞానంబుగల ధన్యులోకండు గావించిన వైరంబు సంస్మరింపక మేలె తలంపుచు నుండుదురని పార్థుండు సాంత్వవచనంబులాడినను కోపంబుడించక వృకోదరుండు ధర్మజు నుద్దేశించి, రాజేంద్రా! మనకు నీ క్లేశంబును, నిట్టి యపవాదంబును నేటికి? ఇంచుక యనుజ్ఞయొసంగితివేని దురాత్ములగు నీ శాత్రవుల నొకనింబోనీక పొదివి పుత్రమిత్ర సమేతంబుగ నిమిషమాత్రంబున సందఱింబోరిగొనియెద. పదంపడి నీ వెప్పటి తెఱంగున నిఖిలధరావలయంబుంబరిపాలింపుమని పలుకుచు మృగసందోహంబుల నడుమం బరిభ్రమించు కంఠీరవంబు చందంబున రాజలోకమధ్యంబున గదాదండంబునరయుచునుండెడునతని పార్థుండు తన భుజాబలంబునను బ్రియభాషణంబుల నివారింప. నంతంగోపాంతర్దాహంబున స్వేదజలంబుప్పతిల్ల యుగాంతకాలాంతకుని చందంబున లలాటంబున భృకుటిపుటంబులు నటింప దుర్నిరీక్ష్యుండగుచు ముఖ కర్ణనాసికానేత్రంబులవలన ధూమాగ్నికణసమేతంబులగు పావక జ్వాలాజాలంబు లుద్భవిల్లనుండెడు మహాబలనందనుని దన భుజంబులం బొదివి పట్టి గోపంబు నివారించి కౌంతేయాగ్రజుం డంబికానందనుని సన్నిధానంబునకుం జని కృతాంజలియగుచు నిట్లను.

ఈ కథ సభాపర్వంబున నూటయాఱవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 107

కౌరవేంద్రా! మాకు నెల్లవారలకును నీవధీశ్వరుండవు. మేము నీశాసనంబునం బ్రవర్తిల్లెడువారముగాన సేయవలయు కృత్యం బెయ్యది, వివరింపుమనిన నయ్యాంబికేయుండు ధర్మనందను నుద్దేశించి, ధనకనకవాహనప్రముఖంబగు నీ యైశ్వర్యం బంతయును మగుడం గైకొని యనుజసమేతంబుగ నాచేత ననుజ్ఞాతుండ వగుచు మీపురం బునకుం జని సుఖంబునం బ్రవర్తిల్లుము. వృద్ధుండనగు నాశాసనంబు మీకు శ్రేయస్కరంబగుట, నింక నొక్కటి యెఱింగించెద, ఆకర్ణిం పుము. మహాప్రాజ్ఞుండగు నీవు వినీతుండ వగుచు వృద్ధోపదేశంబు గావించినవాండవు గావున ధర్మసూక్ష్మం బెఱింగిన మహానుభావుం డవు. లోకంబున దారువిచ్ఛేదంబు గావించుటకు సాధనంబగు నా యుధంబు శిలాతలంబుపై బ్రయోగించిన నయ్యాయుధంబునకె హాని వాటిల్లు తెఱంగున నిఖిలగుణగరిష్ఠులగు మీయట్టి మహానుభావులకు నపరాధంబు గావించుటం జేసి దుర్యోధనాదులకె కీడు వాటిల్లుంగాక మీకు నొక్కకొంతయును గలుగనేరదు. సత్పురుషుండగు జనుండు గుణంబు గైకొనుంగాక బరులు చేసిన యపకారంబు మనంబునం దలంపండు. నీవు బుద్ధిసంపన్నుండవు గావున నావాక్యంబు లాకర్ణించి శాంతిం బొందుము. వివాదంబు ప్రాప్తంబైన తఱి నరాధములగు వారలు దుర్భాషణంబులు ప్రథమంబుగాం బలుకుదురు. ఒకండు దన్ను నవమానించి పలుకం బదంపడి పరుషోక్తులాడుట మధ్యమ పురుషుల గుణంబు. ఎవ్వరెట్లాడినను సైరించి యూరకుండుటయె యుత్తమపురుషుల గుణంబులు. కావున సజ్జనులగువారలు పరులయెడ గుణంబులె గ్రహింతురుకాక వారలు తమయెడం గావించిన యప కారంబు దలంపరు. నీవు నిఖిలధర్మజ్ఞుండ వగుట నీదురాత్ములగు

దుర్యోధనాదు లొనరించిన క్రూరకృత్యంబులు మనంబునం దలంపక యంధుండును, వృద్ధుండును, నీయెడ ననుకూలుండును, జనకుండును నగు నన్నును, మాతల్లియగు గాంధారీదేవినిం జూచి మా యిరువుర కుంగా నీయపరాధంబు సైరింపుము. అన్నదమ్ములగు దుర్యోధనాదుల కును మాకునుం గలుగు మైత్రియును మా బలాబలంబును నెఱుంగ వలయునను కారణంబున జూదంబాడు సమయంబున నుపేక్షించి యుండితి. వీర లిందఱకును శిక్షకుండవగు నీవును, సకలశాస్త్రవిశార దుండవును బుద్ధిసంపన్నుండవును నగు విదురుండును, నీకౌరవుల దుర్న యంబులు మనంబులం దలంపక యుండవలయు. ఈయెడ ధర్మంబును భీమసేననియందుం బరాక్రమంబును, ధనంజయునియెడ శౌర్యంబును, బుధశ్రేష్ఠులగు నకులసహదేవులయందు భక్తిగురుశుశ్రూషణంబు లునుం గలిగియున్నవి గాన మాకు సకలశుభంబులును, ధర్మంబును, భ్రాతృస్నేహంబును గలిగెడు. ఇంక నింద్రప్రస్థపురంబునకుం జను మనిన భరతకులశ్రేష్ఠుండగు నా ధర్మనందనుండు నామనంబునంగల కళంకంబు దీరెనని పలుకుచు సహోదరులుం దానును సూర్యసంకా శంబులగు రథంబుల నధిరోహించి పాంచాలి సమేతంబుగ నింద్ర ప్రస్థపురంబునకుం జనియె.

ఈకథ సభాపర్వంబున నూటయేడవ యధ్యాయము.

---

## అధ్యాయము. 108

---

అనిన వైశంపాయనునుం గనుంగొని జనమేజయుండు, మునీంద్రా! ఇవ్విధంబునం బాండవులు నిఖిలైశ్వర్య సమేతులగుచు మగుడం దమపురంబునకుంజనిన వృత్తాంతంబువిని ధార్తరాష్ట్రు లెవ్విధంబున

ప్రవర్తిల్లిరనిన నతండు జనమేజయునకిట్లను. ప్రజ్ఞాశాలియగు ధృతరాష్ట్రుండు పాండవుల నిజపురంబునకుం బనుచుట యెఱింగి దుశ్శాసనుండు దుఃఖార్తుండగుచుం జనుదెంచి హితంబుగం గొలువుననుండెడు దుర్యోధనుని సన్నిధానంబునకునేఁగి, కౌరవేంద్రా! వృద్ధుండగు నీ ధృతరాష్ట్రుండు మనము నేసిన ప్రయత్నంబంతయును నిరర్థకంబుజేసి, తనకుమారులకు నెల్లను సంఘటింపంజేసె. ఇంతయును వింటిరే యని పలికిన, దుర్యోధన కర్ణసౌబలులు పాండవులనిమిత్తంబుగ నన్యోన్యంబు గొంతదడవు రహస్యంబుగ మంతనంబు గావించి, మహాబుద్ధి సంపన్నుండగు ధృతరాష్ట్రుని సమీపంబునకుం బోయిరి. అంతసుయోధనుండు నిజజనకునిపదంబులకు వందనంబుగావించిమృదుభాషణంబుల నిట్లను. శత్రువుల యుద్ధంబుననైనను, కపటమార్గంబుననైనను,బలత్కారంబుననైనను, నెల్లభంగుల శత్రుసంహారంబు గావింపవలయునని యమరగురుండగు బృహస్పతి నెరింగించిననీతినీవెరుంగని యదియె? పాండవులంగెలిచికైకొనినసకలధనంబునువ్యయంబుగావించిమహాసైన్యంబుల నేలి వారలం జయింపవలయునని దలంచియుండ, నీవు పంపితివి. బలపరాక్రమధుర్యులగు కౌంతేయులు రేపె మనకు నప్రియంబు గావింపక మానరు. తన్నుంగరచుటకై చనుదెంచిన విషజ్వాలాభీలంబగు నాశీవిషోరగంబుమీదనవైచికొనువారలుం గలరే? శస్త్రాస్త్రసమేతులును, దివ్యరథారూఢులును, గోపోద్దీపితులును నగు పాండవేయులు రోషభీషణంబు గలుగు మహాభుజంగంబుల తెఱంగున మనల నందఱ నిశ్శేషంబుగ సమయింపకపోవుదురె? అతికుపితుండును, గాండీవధరుండును, చాపవిద్యా విశారదుండును, నక్షయతూణీరధరుండును నగు ధనంజయుండు యుద్ధసన్నద్ధుండై యిప్పుడ యరుగుదెంచి కౌరవులనెల్ల సంహరింపకపోవునె? భీష్ముండును, ద్రోణుండును, నశ్వత్థామయును, మహారథుండగు కృపాచార్యుండును, వికర్ణుండును,

సైంధవుండును, బాహ్లికుండును, సోమదత్తుండును, భూరిశ్రవుండును, శల్యుండును, శకునియును, నులూకుండును, మఱియునుం దక్కిన కౌరవులును యుద్ధసన్నద్ధులై యొక్కపెట్టి నదరిరేనియును సమర దుర్జయుండగు నర్జునుని దేరిచూడం జాలుదురె? సహస్రబాహు సమేతుండగు కార్తవీర్యార్జునునకు సమానుండగు నీయర్జును నెదిరించుటకు సామర్థ్యంబుగల విలుకాండు లోకంబునంగలండె యనిన ధృతరాష్ట్రుండు దుర్యోధను నుద్దేశించి, పుత్రకా! ధనంజయ సమాన విక్రముండును మహావీరుండునునగు కార్తవీర్యార్జునుని మహాత్త్వంబు నా కెఱింగింపవలయుననిన, సుయోధనుండు చతురాననుని పదియేనవ తరంబున జనియించి, హైహాయ దేశాధీశ్వరుం డగుచు, శౌర్యంబును, బాహుసహస్రంబునుంగలిగి, చాపధరాగ్రేసరుండనం బ్రశంసార్హుండగు కార్తవీర్యార్జునుండను మహీపాలుండొకండు కలం డనిన, నాంబికేయుండు సుయోధనుని నుద్దేశించి కమలసంభవుండు మొదలుగం,బంచదశసంఖ్యగల కార్తవీర్యపితామహుల చరిత్రం బానుపూర్విగా నెఱింగించితివి. పదంపడి యావృత్తాంతంబు తెలుపుమనిన గాంధారీనందనుండు కార్తవీర్యార్జునుని మాహాత్మ్యంబంతయు సవిస్తరంబుగ నెఱింగించెద, ఆకర్ణింపుము. జగత్కారణభూతుండగు నారాయణుని వలన లోకపితామహుండగు పరమేష్ఠి జనియించె. అతని వలన నత్రిమహాముని సంభవించె. అతనికిం జంద్రుం డుద్భవించె. ఆచంద్రునకు బుధుండును, బుధునకుం బురూరవుండును, బురూరవునకు నాయువును, నాయువునకు నహుషుండును, నహుషునకు యయాతియును, యయాతికి యదుండును, యదునకు సహస్రిజుండును, సహస్రిజునకుం జక్రదాసుండును, జక్రదాసునకు హేహయుండును, హేహయునకు ధర్మనేత్రుండును, ధర్మనేత్రునకు గార్తుండును, గార్తునకుం గృతవీర్యుండును, గృతవీర్యునకు నర్జునుండును

సంభవించిరి. అంత నర్జునుండు త్రినందనుండగు దత్తాత్రేయమునీంద్రు నుద్దేశించి యతిఘోరంబగు తపంబు పదివేల సంవత్సరంబులు గావింప నమ్మునీంద్రుండు ప్రసన్నుండై బాహుసహస్రంబులు గలుగుటయును, సకల శత్రుసంహారంబుగావించి నీతిమార్గంబున నిఖిల మహీవలయం బేలుటయును, నధర్మప్రవర్తకులగు జనుల శిక్షించి ధర్మ ప్రవర్తకులం గావింప సామర్థ్యంబు గలుగుటయును, దనకంటెం బరాక్రమశాలియగు పురుషునిచే సమరముఖంబునం దెగుటయును ననియెడు నాలుగు వరంబులొసంగె. ఆకృతవీర్యనందనుండు యుద్ధసన్నద్ధుండై వెడలినయెడ దివ్యరథ ధ్వజంబులును బాహుసహస్రంబునుం గలుగునన వినియుందుము. అట్టిమహాబల సంపన్నుండగు కార్తవీర్యార్జునుండు సప్తద్వీప సహితంబును, జతుస్సముద్ర పరివేష్టితంబునునగు మహీమండలంబునంగల రాజన్యుల నిజభుజాబలంబునం జయించి యనేకాధ్వరంబులు గావించె.

ఈ కథ సభాపర్వంబున నూటయెనిమిదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 109

---

అనియెనని వైశంపాయనుండు జనమేజయుం గనుంగొని మఱియు నిట్లను. అంతనొక్కనాండు మాహిష్మతీ పురాధీశ్వరుండగు నయ్యర్జునుండు వనితాజన సమేతంబుగ నర్మదానదికింజని జలక్రీడాసక్తుండై యుండెడు సమయంబున, లంకాపురాధీశ్వరుండగు రావణుండు నిఖిలరాక్షససేనా సమేతంబుగ నయ్యెడకుంబోయి, నర్మదామధ్యంబున వారివిహారంబులు సలుపుచునుండెడు నమ్మహీవల్లభునిం గనుంగొని, వరదాన గర్వితుండగు నాదశముఖుండు క్రోధావేశంబున

మహేంద్రునిం బోదువు శంబరాసురునిచందంబున నతని నాక్రమింప, నయ్యర్జునుం డతని నిరీక్షించి యుద్ధంబునకుం దార్కొని వానితోడ నొక ముహూర్తమాత్రంబు సమరంబు గావించి నిజ భుజాబలంబున నయ్యమరారింజొచ్చి పట్టి ధనుర్గుణంబున నతని కరంబులు బంధించి నిజపురంబునకుంగొని చనియె. అంత వృత్తాంతంబంతయును నారదునిచే నెఱింగి పులస్త్యుండు మహిష్మతీ పురంబునకేంగి యర్జునునిం బ్రార్థించి తనమనుమనిం గారాగృహ విముక్తునింగావించె. మఱియు నొక్కనాండు ధనుర్విద్యా విశారదుండగు నయ్యర్జునుండు సముద్ర తీరంబునకుంబోయి నిశిత శరపరంపరల నయ్యంబునిధింగప్పిన, నాసాగరుండేగుదెంచి దండప్రణామం బొనర్చి యంజలిపుటంబు ఘటింపుచు, వీరాగ్రేసరా! నన్ను శరపీడితునిం గావింపనేటికి, నన్ను నుపాశ్రయించి యుండెడు నిఖిల భూతంబులును నీబాణానల జ్వాలలం దహింపంబడుచున్నయవి. కావున మాకు నభయంబొసంగి నేంగావింపవలయు నర్థంబెయ్యది వివరింపుమని యడిగిన, మాహిష్మతీవల్లభుండు నదీనాయకు నుద్దేశించి, యుద్ధార్థినై నీసమీపంబునకుం జనుదెంచితి, నాతోడ రణంబునకు నరుగుదెమ్ము. రావైతేని నిన్ను బాధింతుననిన నతండు భూలోకంబున మహాబల పరాక్రమ సమేతులగు రాజన్యులున్నవారలు, వారలలోన నొకనితో యుద్ధంబుగావింపుమనిన, నయ్యర్జునుండు దివ్యాయుధంబులు ధరియించి నాతోడ యుద్ధంబుగావించుటకుంగల పురుషుండు గలండేని యెఱింగింపుమని పలుక, నా సముద్రుండు, తేజోవిరాజమానుండగు జమదగ్నియను నొక మునీంద్రుండు గలండు, అతని కుమారుండు నీతో యుద్ధంబుగావించుటకు సమర్థుండు, అయ్యెడకుంజనుమని యెఱింగింప, నయ్యర్జునుండును దొలుత నారదునిచే నట్లనవినినవాండగుట రోషభీషణాకారుండగుచు నిఖిల సేనాసమేతంబుగ జమదగ్ని మునీంద్రుని యాశ్రమంబునకుంజని వార

లకుం గోపకారణంబులగు క్రూరకర్మంబు లాచరింపం బరశురాముం డును గోపావేశంబున నగ్నిదేవుని తెఱంగున భగ్గునం బెరుగుచు నతని సర్వసైన్యంబును దహింపవలయునను తలంపునం జనుదెంచు మార్తాండుని తెఱంగునవెడలి యర్జునునిం దోడ్కొనియె. ఇట్లయ్యో ధవరు లిరువురును వృత్రవాసవుల చందంబునం జూపరకు నాశ్చర్య కరంబగు దారుణ రణంబుగావించిరి. అంత జమదగ్ని నందనుండు కోపావేశంబునం బరశువుకరంబున నమర్చి బహుశాఖా సమేతం బగు వృక్షంబు నరికిన తెఱంగున బాహుసహస్ర సమేతుండగు నయ్యర్జునుని ఖండించివైచె. అంత నిర్విధంబునం బడియున్న నతనిం గనుంగొని వాని బంధుజనంబులెల్లను ఖడ్గశక్తితోమరప్రముఖంబు లగు నాయుధంబులు ధరియించి తనపై నొక్కపెట్టనడిరిన రాముం డును దివ్యరథారూఢుండై మహాకోదండంబు బాహుదండంబున నమర్చి తన దివ్యాస్త్రంబులు భూనభోంతరంబులు నిండారంగప్పిన రాజవరులందఱును రామునివలన భయభ్రాంతులగుచు సింహంబు నకు వెఱచిపాఱెడు క్షుద్రమృగంబుల తెఱంగునంబరుగిడి దుర్గంబులు బ్రవేశించిరి. ఆవిపిన భూముల బ్రాహ్మణుల లేకుండుటంజేసి యా రాజుల కుమారులకు నుపనయనాది కృత్యంబులు గావించుటకు నధీశ్వరులు లేకుండుట వలన నా సంతానంబు వారలు కర్మాధి కారులు గాకుండుటంజేసి, శబర, ద్రవిడ, కాశ, కుంద్రజాతులం గలసి క్షత్రకర్మ బహిష్కృతులై శూద్రత్వంబునొందిరి. మఱియును అంతంబరశురాముండు క్షత్రియులనెల్లను వెదకి వెదకియిరువదియొక్క మారు తెగటార్చుచునుండునంత నశరీరివచనంబు వినంబడె. భృగు నందనా, బ్రాహ్మణుండవగు నీవు యిట్టి క్రూరకర్మంబు చాలించి శమప్రధానుండవై యుండుము. ఇట్లు క్షత్రవధంబు మీరుగావించుట యుచితంబు కాదనిన నతని సన్నిధానంబునకు ఋచీక ప్రముఖ

లగుచుం బితృదేవత లరుగుదెంచి, భృగునందనా! నీవు మహానుభావుండవు, ఇంకం గోపంబుపసంహరింపుమనిన, నతండు నిజజనక మరణంబు మనః క్లేశంబు గావింపుచునుండ వారల నుద్దేశించి, నన్ను నివారించుట మీకు నర్హంబుగాదు, ఊరకయుండుండనినం బితృదేవతలు రాముసింగనుంగొని, నిఖిలక్షత్ర సంహారంబు గావింపనేటికి? బ్రాహ్మణుండవగు నీవు హింస గావించుట యర్హంబగునె, యనిన వారల వచనంబు లాకర్ణించి పరశురాముండు కోపంబుపసంహరించి యశ్వమేధసహస్రంబును, నరమేధశతంబును, మఱియునసేక యాగంబులొనర్చిచతుస్సముద్ర పరివేష్టితంబగు మహీవలయంబు గాశ్యపునకొసంగె. అట్టిభార్గవరామునకును, గార్తవీర్యార్జుననకును, సమానంబగు బలపరాక్రమంబుగల యా ధనంజయుని రణంబునం జయింప నిలింప పతికైనను శక్యంబుగాదు.

ఈ కథ సభాపర్వంబున నూటతొమ్మిదవ యధ్యాయము.

---

## అధ్యాయము. 110

---

అని దుర్యోధనుండు మఱియు నిట్లను. అధనుర్ధరవరుండగు నర్జునుండు తొలుతం గావించిన యత్యద్భుతంబులగు సాహసంబు నెఱింగించెద నాకర్ణింపుము. ద్రౌపదీ స్వయంవర సమయంబున నిఖిల మహీపతులెల్లను ద్రుపదపురంబునకుం జనుదెంచి యుండునెడ నితర మహీవల్లభులకు నసాధ్యంబగు కార్ముకంబు సజ్యంబుగావించి ఇలప్రదృశ్యమానంబగు యంత్రమత్స్యంబు నిమిషార్ధంబునం దెగవైచి ద్రౌపదికరంబున నుండెడు బుష్పమాలికచే నలంకృతుండైన యతనింగనుంగొని రోషాక్రాంత హృదయులగుచు నానా దేశాగతులగు రాజన్యు

లందఱును వివిధాయుధ హస్తులగుచు రాధేయపురస్సరంబుగ సంగ్రామంబునకుం దొడరినం దననిశిత శరపరంపరల వెంపరలాడి కర్ణ ప్రభృతులగు రాజవరులం జయించి సకల క్షత్రసమూహంబుల నిర్జించి, యంబ నపహరించికొని తెచ్చిన భీష్మునితెఱంగున, నతిసౌందర్యశాలి యునగు యాజ్ఞసేనినివరియించె. మఱియు నతండు తీర్థయాత్రకు జనిన సమయంబున రూపరేఖా సమన్వితయగు నులూపియను నాగ కన్యకను నాగేంద్రు లెల్లను బ్రార్థించి యొసంగినం గైకొని, గోదావరి యును, బెన్నయును, గావేరియునునను నదుల స్నానంబు గావించి, యచ్చోటువెడలి పాండ్యదేశంబునకుంజని పాండ్యరాజకన్యయగు చిత్రాంగదం బరిణయంబై ప్రమోదంబునం బొదలుచు, దక్షిణ సముద్రతీరంబునం బంచాప్సర స్సరోవరంబుల నవగాహనంబుగావించి, కుమార తీర్థంబునకుం జని యందు మకరరూపంబులనుండెడు నప్సరో వనితలకు శాపమోక్షంబుగావించి, కన్యాతీర్థంబునకు నేంగి యచ్చట నుండియును ద్వారకాపురంబుబ్రవేశించి కృష్ణానుమతంబున సుభద్రను రథంబుననిడికొనివచ్చు సమయంబున బహుకోటి సంఖ్యలంగలయాదవ ప్రవరులు చతురంగబలసమేతంబుగ, గంభీరవంబు వెనుకొను వ్యాఘ్రంబుల తెఱంగున, బ్రద్యుమ్నుండును, గృతవర్మయును, గదుండును, సారణుండును, సాత్యకియును, సాహుకుండును, సాంబుండును, జారు ధేష్ణుండును, విదూరథుండును మొదలగు యదువీరులు బలదేవ పుర స్సరంబుగం గృష్ణుండొక్కరుండును దక్క౦ దక్కినవార లెల్లరును జుట్టుముట్టిన ఇగదేకవీరుండగు నయ్యర్జునుండు నందఱకు నత్యా శ్చర్యకరంబును, నతిదారుణంబును నగు రణంబొక్క ముహూర్త మాత్రంబునలిపి తననిశిత బాణజాలంబుల నందఱ నోడించి సుభద్రా సమేతుండై యింద్రప్రస్థపురంబునకుం జనుదెంచె.

ఈ కథ సభాపర్వంబున నూటపదియవ యధ్యాయము.

---

## అధ్యాయము.111

అని దుర్యోధనుండు ఫల్గునుండు గావించిన నతిమానుషంబులగు సాహసంబులు మఱియు నిట్లను. వైశ్వానరునివలనం బ్రార్థితుండగుచు ఖాండవవనంబు హవ్యవాహనునకు నాహుతిగ నొసంగిన, నాహవ్యవాహనుండు మహోజ్వాలాభీలుం డగుచు నద్దేవతావనంబు దహింపుచునున్న సమయంబున, దివ్యరథారూఢుండై మహాకార్ముకంబును శస్త్రాస్త్రంబులును ధరియించి తనపరాక్రమంబువలన నతనిం బరిపాలింపుచు నుండునంత,నింతయును నెఱింగి యాఖండలుండు మేఘంబులం బనుప, నవియును జనుదెంచి నిబిడంబులగు వర్షధారలొక్క మొగిం గురియుచు నుండ నమ్మహేంద్రనకదనుండు నిశితసాయకంబుల నాశ్చర్యంబుగం గప్పి జలధరంబుల న్వారియించె.అంత సంక్రందననందనుండు రోషభీషణమూర్తియగుచు నైరావత దంతి నధిరోహించి నిఖిల దిక్పాలకులును, రుద్రులును, వసువులును, నాశ్వినేయులును, మరుత్తులును, నాదిత్యులును, విశ్వేదేవతలును, గంధర్వులును, మఱియునుం దక్కుంగల బృందారకబృందంబులును, నిజతేజోవిరాజమానులగు శస్త్రాస్త్రప్రముఖంబులగు యుద్ధసాధనంబులు ధరియించి తన్నుం బరివేష్టించి నడువం బార్థుని సమరంబున నోర్చి ఖాండవవనసంరక్షణంబు గావింపవలయునను తలంపునం జనుదేర, నా సమయంబునం బ్రళయకాలంబునం దోచు దుర్నిమిత్తంబు లనేకంబులు దోంచిన, యవియెల్లను సరకుసేయక యయ్యమరనాయకుని సైన్యంబు శౌర్యధుర్యుండగు నర్జునునిం దాంకిన నతం డించుకయును జలింపక నిజచాపవిముక్తంబులగు ప్రచండకాండంబుల నాఖండల ప్రభృతి బృందారకసందోహంబులం గప్పిన, వారలందఱును ననేక విధంబులగు శస్త్రవర్షంబులం గురిసిన నతండు గాండీవనిర్ముక్తంబులగు శితశరవ్రాతంబుల వారల

బాణంబులన్నియును నివారించిన, మించిన కోపంబున, నయ్యమర వరులు నానావిధహేతివ్రాతంబులు నిబిడంబుగం బరపినం జూచి, యాసవ్యసాచి వానినెల్లను దన నిశితశిలీముఖంబులం దునుమాడి మండలీకృతగాండీవుండగుచు నతి తీక్ష్ణంబులగు బాణసమూహంబులు దైవతాసైన్యంబుల దైన్యంబు నొందింప సమరదుర్జయుండగునర్జునుని కోల్తలకు సైరింపంజాలక యతిశ్రాంతంబులగుచు నైరావతాధి రూఢుండై నిలిచియుండెడు నమరేంద్రుని దూలంగి యేకాదశరుద్రులును గంధర్వులును బ్రాఙ్ముఖంబుగం బరచిరి. మరుద్గణంబు దక్షిణాభిముఖంబుగం జెదరె. వసుదేవులును, నాశ్వినేయులును బశ్చిమదిగ్భాగంబునకుం బోయిరి. ఆదిత్యులును, విశ్వేదేవతలును, భయభ్రాంతులగుచునుత్తరపుదిశకుం జనిరి. మాటిమాటికి నక్కిరీటి బాణంబుల వేడిమి మనంబునం దలంపుచు నతని దిక్కునుం దేరిచూడక సాధ్యులు పరిలోకంబులకుం బారిరి. ఇవ్విధంబున నిర్జరసేన దీనత్వంబు నొంది యొండెండు నిరీక్షించినను మహాకార్ముకహస్తుండగు సంక్రందననందనుండై దోంప నేపుమాలికకావికలై నలుదిక్కులకుం బరచె. అంత నా జంభాసురాంతకుం డత్యంతకోపోద్దీపితుండగుచు నపారశరాసారంబుల విరాగేసరుండగు నా ఫల్గునునిం బొదువ, నతండును నిశితశిలీముఖంబులతని యంగంబునం గీలుకొలుపినం పాకశాసనుండు దుర్ధర్షంబగు శిలావర్షంబు గురియింప నప్పాండవేయుండు క్రొవ్వాడి మెఱుంగు తూపుల శిలాజాలంబు లెల్లను. జూర్ణంబు గావింప, నిర్జరవల్లభుండతని శౌర్యంబు గనుంగొనవలయునను తలంపున భువనభీషణంబులగు పాషాణవర్షంబులు మరియు నతిసాంద్రంబుగ గురియించిన నించుకయునుచలింపక యవ్విజయుండు తన దివ్యబాణంబుల నాశిలాసంఘంబులనుగ్గునూచంబుగావించినం గ్రోధావిష్టహృదయుండగుచుం బాకశాసనుండు మహాకాననసమేతంబగు నంగదంబనియెడునొక పర్వతంబు పాహుద్వ

యంబునం జెకలించి యతనిం డెగటార్చవలయునను తలంపునం బడ వైచిన, నప్పార్థుండు వజ్రసంకాశంబులును వహ్నిజ్వాలోపమానంబులునునగు సాయకంబుల దాని సహస్రశకలంబులై మహిం దొఱుంగనేసి యా వాసవుని బహుప్రదరంబులం బొదివిన నయ్యమరేంద్రుం డతిలోకపరాక్రమశాలియగు నయ్యర్జునుని సమరంబున నిర్జించుటకు నశక్యంబని తలంచి తన కుమారకుండగు నతని శౌర్యంబునకు నెంతయును సంతసించె. ఇవ్విధంబున నాఖండలుని నోడించి వనంబులోన నుండియును దప్పిపోయెడు రాక్షసోరగప్రముఖుల ఖండించి యనలంబునం బడవైచుచు నుండెడు నతని క్రొత్తలకు సైరించిన వీరుండగు వాండొక్కరుండును లేండయ్యె. తొలుత నమృతాపహారణ సమయంబున వైనతేయుండు పురందరముఖ్యబృందారకుల నోడించిన తెఱంగున నిర్జరుల నిర్జించి ఖాండవవనంబు వీతిహోత్రునకు నాహుతి గనొసంగి యతని ప్రతాపంబువలన నప్రతిహతంబగు రథంబును, ధ్వజంబును, శ్వేతాశ్వంబులును, గాండీవంబును, నక్షయ తూణీరయుగళంబును, మఱియు ననేక దివ్యాస్త్రంబులును గైకొని మయునివలన దివ్యసభయునుం బడసి శాశ్వతంబగు కీర్తి వహించి యయ్యర్జునుండు జగత్ప్రసిద్ధుండయ్యె.

ఈ కథ సభాపర్వంబున నూటపదునొకండవ యధ్యాయము.

---

## అధ్యాయము. 112

---

అని దుర్యోధనుండు వైచిత్రవీర్యునకు నప్పార్థుని మహత్త్వంబు మఱియు నిట్లనుః ఆ ధనంజయుం డుత్తరదిశాభిముఖంబుగ బోయి నానాపురపర్వతసమేతంబులగు నవవర్షంబులం జయించి జంబూద్వీపం

బును స్వవశంబు గావించుకొని నిఖిలమహీపాలకులచే ననేక ధనరత్న కాంచనంబులు కప్పంబులు గైకొని యింద్రప్రస్థపురంబునకు నేంగి జ్యేష్ఠుండును మహానుభావుండును నగు ధర్మనందనునకుం దాను గైకొని తెచ్చిన కానుకలన్నియు నొసంగి రాజసూయాధ్వరంబు నిర్విఘ్నంబుగ నెరవేర్చె. ఇవ్విధంబున నత్యద్భుతంబులును, నతిమానుషంబులుననగు నతని చరిత్రంబు లెన్నియని వివరించెద! దేవదానవయక్షపిశాచోరగరాక్షసులును, భీష్మద్రోణ కర్ణాదులగు మహారథికులును, మఱియును దక్కంగల ధనుర్ధరవర్యులగు సకలరాజన్యులును నొక్కసవ్యసాచి కట్టెదుట సంగరాంగణంబున నిలువరింపం జాలరు గావున భువనత్రయంబునందును నాపార్థునకు సమానుండగు వీరుండు గలండె? ఇట్టి పురుషశ్రేష్ఠుండగు నర్జునుని మనంబున నేప్రొద్దును జింతింపుచు భయభ్రాంతుండనైన తనకు గాండీవంబును శరంబులుం బూని సన్నద్ధుండై ప్రళయకాలానలంబునం బాశహస్తుండగు కృతాంతుని చాడ్పున నయ్యింద్రనందనుం డెందుజూచినం గన్పట్టుచునున్నవాండు. ఈనగరం బంతయును బార్థుని మయంబుగం దోచుట వలన నామనంబు కలంకంబు తీరకయున్నయది. స్వప్నంబునం దేనియును నతని యాకృతియె కనుపట్టునంతన యుద్భ్రాంతుండనై నిదురం దొఱంగి భయంబు జెందుచున్నవాండ. అశ్వంబులును, నర్థంబులును, నజంబులుననను నివి మొదలుగాంగల యకారాది నామంబులు వినిన యర్జున నామధేయంబు డెందంబున నాకు మహాభీతిం గల్పింపుచున్నయది. ఒక్క యర్జునునివలనంగాక తక్కినవారల వలన నాకు భయలేశంబులేదు. ఆవిజయుండు, ప్రహ్లాదు నేనియును, యెట్టివారినైనను గెలువంజాలు. అట్టి కిరీటితోడ సంగరంబునకుం దారొక్కనుటవలన జన సంక్షయంబును బరాజయంబునుం గలుగు. నేనిత్తెఱంగున సవ్యసాచి మహత్త్వంబు కరతలామలకంబుగ నెఱింగిన

వాండ నగుటంజేసి, పూర్వంబున దండకారణ్యంబునందు కోదండ దీక్షాగురుండగు రామభద్రుని శౌర్యంబునకు భయంపడి పరిభ్రమించుచున్న మారీచుని కైవడి దుఃఖార్తుండనై మీందు తోంచకయున్న వాండననిన, వైచిత్రవీర్యుండు సుయోధను నుద్దేశించి, యిట్లు త్రైలోక్యంబునందును ననివార్యంబులైన పార్థుని ధైర్యస్థైర్యంబులు నీవెఱింగి యుండుదువు గావున నేండు మొదలుగ ద్యూతంబును, శస్త్రయుద్ధంబును, బరుషాభాషణంబులును బరిహరించి కపటరహితహృదయుండగు నా గాండీవితోడ మైత్రి వాటింపుము. అయ్యర్జునునితో జెలిమి వాటించు నతండు ముల్లోకంబులం దేనియును నిర్భయుండై యుండు. కావున నీవును నావాక్యంబు మన్నించి యతనితోడ సఖ్యంబునం బ్రవర్తిల్లుమనిన దుర్యోధనుండు జనకు నుద్దేశించి, కౌరవేంద్రా! ద్యూతంబువలన వారల నెంతయునుం బరాభవించితి. అట్లగుట నింక మాకును వారలకును మైత్రి గలుగనేరదు. ఇంక నుపాయాంతరంబున నతనికి దేశత్యాగంబు గల్పించి మనము శ్రేయంబు నొందవలయు ననిన నతండు కొడుకు నుద్దేశించి, మున్ను నీవు వారలయెడం గావించిన కృత్రిమోపాయంబులన్నియును నిష్ఫలంబు లయ్యెం గావున వారలయెడ నీకపటోపాయంబులు బనింగొనవు. నీకును నీవంశంబునకును మేలు గోరెదవేని యెల్ల భంగుల నాధనంజయునితోడ ననుజబంధుసమేతంబుగ నేప్రొద్దును మైత్రి వాటింపుమను నతని వచనంబులు విని, యారా జొకముహూర్తమాత్రంబు తన మనంబున విచారించి విధిప్రేరితుండగుచు నాంబికేయు నాలోకించి యెన్నియుపాయంబులు గావించి యైనను శాత్రవుల సంహరింపవలయునని బృహస్పతి మహేంద్రునకుం దెలిపిన నీతివాక్యంబులు నీవెఱుంగమిం జేసి యివ్విధంబునం బలికెదవు. పాండవేయులు నిఖిలసైన్యసమేతులై మనపై దడరకమున్న మనము వారల ధనంబంతయును నుపాయంబున నప

హరించి దానివలన నిఖిలరాజన్యులస్వవశులం గావించుకొని పదంపడి సమరంబునకు నెదిరించితిమేని లోకంబునం బొగడొందుదుము. కోపంబునం దన్నుం గరచుటకై చనుదెంచిన దుష్టభుజంగంబుల సంహరింపక దానిం గంఠంబునం జుట్టుకొను మూఢులుం గలరె? కావున శస్త్రాస్త్రసంపన్నులగుచు దివ్యరథారూఢులై మహాశరగంబుల చందంబునం గుపితులగుచు యుద్ధసన్నద్ధులై చనుదెంచిన కౌంతేయులు నిశ్శేషంబుగ మనల సంహరింపకపోదురె? పాండునందనులు నీచే నియుక్తులై తమపురంబునకుం బోయెడు సమయంబునం బార్థుండు కవదొనలు బిగించి గాండీవంబు కరంబున నమర్చుచు సారెసారెకు మమ్ము నిరీక్షించి నిట్టూర్పులు నిగుడింపుచుం జనియె. మహాబలశాలియగు భీమసేనుండు మేరు శిఖరంబుం బోని గదాదండంబు బాహుదండంబున నెత్తి యాడుకరచుచు గుపితుండై యేంగె. నకుల సహదేవులును యష్టచంద్రకభూషితంబులగు ఖేటకంబుల నమర్చి ఖడ్గంబులు ఝుళిపింపుచు బాహుముడిపాటుతోడం గారవులం జుర చుర చూచుచుం బోయిరి. ఇవ్విధంబునం గుపితాత్ములగు పాండవులు సైన్యసమేతంబుగ మఱలి మనపై నడరుతలంపున నేంగిరి. ఇది నిశ్చయంబు. ద్రౌపదియెడ యపగాధంబు భుజాబలధురంధరులగు పాండవు లెవ్విధంబున సైరింతురు? ఇందుకే నొకయుపాయంబు దలంచియున్నవాండ. అది యాకర్ణింపుము. పాండవుల రావించి క్రమ్మఱ జూదంబు సంఘటింపుదము. అట్టియెడం బన్నిదంబు బూన్చు తెఱంగు వినుము. దురోదరంబాడి యెవ్వరోడిరేనియును కృష్ణాజినంబులు ధరియించి, మహారణ్యంబుల కేంగి యచ్చోటం బండ్రెండు సంవత్సరంబులు మెలంగి, పదంపడి యొక్క సంవత్సరం బజ్ఞాతవాసంబు గావింపవలయు. ఆసమయంబున వీర లిట్టివారలని యెవ్వ రెఱింగిరేనియును క్రమ్మఱం బండ్రెండు సంవత్సరంబులు వనవాసంబునకుం

బోవంగలవారలని పన్నిదంబు బూని దురోదరం బాడెదము. అతం విద్యావిశారదుండగు నీశకుని గలిగియుండ నెల్లభంగుల మేము గెలుచుట నిశ్చయంబు. ఇవ్విధంబున ద్యూతపరాజితులగు పాండునందనులు విపినభూమికిం జని మెలంగుచు నుండెదరు పదమూండు సంవత్సరంబుల లోనం జతురంగబలంబులును మిత్రవర్గంబునుం జేర్చి వారల కనేక విధంబులగు సత్కారంబులు గావింపుచు మనము పరులకు నజేయులును బలవంతులునై యుండెదుం బాండవులు త్రయోదశవర్షంబులు వ్రతసమాప్తిం గావించి క్రమ్మఱ నరుగుదెంచిరేని మేము జయించెదము. ఇదియె కాక వేఱొండుపాయంబు లేదనిన ధృతరాష్ట్రుండు సుయోధనుం గనుంగొని, కుంతీపుత్రు లింద్రప్రస్థపురంబు జేరిరేనియును గ్రమ్మఱ రావించి పునర్ద్యూతంబు గావింపుండనిన, నతని వచనంబులాకర్ణించి ద్రోణుండును, భీష్ముండును, సోమదత్తుండును, బాహ్లికుండును, విదురుండును, నశ్వత్థామయును, వైశ్యాపుత్రుండగుయుయుత్సుండును, భూరిశ్రవుండును, వికర్ణుండును, జూదంబువలదు ఇంక నేనియు నుపశాంతి వహింపుండనినం గైకొనక పుత్రస్నేహమోహితుండగు వైచిత్రవీర్యుండు ధర్మనిరతులును ద్యూతవిముఖులునునగు కౌంతేయులం దోడితెమ్మనిన సమయంబున, ధర్మశీలయును శోకాకులమానసయును నగు గాంధారీదేవి తన కుమారులకు నాపదలు రాకయుండవలయునను తలంపున నాంబికేయు నుద్దేశించి, ఈ దుర్యోధనుండు జనియించిన సమయంబు నసృగాలంబు చందంబునం గూసె. కావున నితనివలన వంశక్షయంబు రాంగలయది. వీనిం బరిమార్చుమని సంపన్నుండగు విదురుండప్పుడె యెఱింగించె. అట్లగుటం బూజ్యులును బ్రజ్ఞాశాలులునునగు వారల వాక్యంబుల యెడ ననాదరంబు గావించి కులంబునకు హానిం గావింపకుము. జలంబులు నిలువ బంధించినను భగ్నంబు సేసిన

తెఱంగున, నుపశాంతంబగు నగ్నిం గ్రమ్మఱం బ్రజ్వలింపంజేసిన చాట్పున, మనంబునంగల కలంకంబు దేరి యుపశాంతులై చనిన పాండవేయులకుం గ్రమ్మఱ గోపంబు గలిగించె దేటికి? నీ వెఱుంగని యర్థంబునుం గలదె? శాస్త్రంబు దుర్బుద్ధియగు జనునకు హితాహితంబులు దెలుప నేర్చునే? నీవు వృద్ధుండవయ్యును బాలకులబుద్ధి నంగీకరించి పదంపడి నీ పుత్రులం జెరిచె దేటికి? నీవు వృద్ధుండవని వీరు నిన్ను నవమానింపక యుండునట్లుగ నీవుస్వతంత్రుండవై కార్య తంత్రంబులు నడపుము. శమంబును ధర్మంబునుం గలిగి యిన్ని దినంబులునున్న నీ హృదయంబు వారల వాక్యంబుల వలన నిప్పు డేల విపరీతంబగుచున్నయది? లోకంబున సత్పురుషులతోడ మైత్రి పాటించుటయె యుక్తంబగుట, వారల తోడంగలహించుట వలన బ్రాప్తంబగు ఫలంబు ఫలంబుగాదు. కావున ధర్మంబు సహాయంబని తలంపుము. ధర్మమార్గంబున నార్జితంబగు నైశ్వర్యంబు పుత్రపౌత్రాదు లనుభవించునట్లుగ క్రూరకృత్యంబునం జేర్చిన శ్రేయంబు నిలువంజాలునె, యనినసంబికానందనుండు ధర్మదర్శనియగు గాంధారరాజనందను నుద్దేశించి, ఈ భరతవంశంబునకు వినాశంబు గలిగినం గలుగుంగాక, నేంగొడుకుల నివారింపంజాల, వారలు దమకుం దోంచిన తెఱంగునం బ్రవర్తిల్లెదరని ప్రాతిగామిం బిలిచి పునర్ద్యూతంబునకుం బాండుపుత్రుల నియ్యోడకుందోడి తెమ్మనిపనిచె.

ఈ కథ సభాపర్వంబున నూటపండ్రెండవ యధ్యాయము.

---

## అధ్యాయము. 113

---

అని వైశంపాయనుండు మఱియు నిట్లను. ఇవ్విధంబున ధృతరాష్ట్రునియుక్తుండై ప్రాతిగామి నిజపురంబునకుం బోవుచునుండెడు

పాండవేయుల సన్నిధానంబున కేంగి ధర్మనందను నుద్దేశించి, మీ తండ్రియగు నాంబికేయుండు ద్యూతంబాడుటకు భ్రాతృసహాయుండగు నిన్నుం బిలుచుచున్నవాఁడు సభాసదులెల్లను వచ్చియున్నవారనిన, యుధిష్ఠిరుండు లోకంబున సకలజనంబులును దైవాధీనులగుటం జేసి యనివార్యంబులగు శుభాశుభంబులం బొందుచుండుదురు గావున వైచిత్రవీర్యుండు పునర్ద్యూతంబునకుం బిలువం బనిచె. ఈ దురోదరంబు సకలజన వినాశకారణంబని యెఱుంగుదు. అయినను బరిహరింపంగూడక యున్నయది యని పలుమారుం దలంపుచు ననుజ సమేతంబుగ శకుని మాయాబలం బెఱింగి యుండియును ద్యూతనిమిత్తంబుగం గరిపురంబునకుంబోయి సభాస్థలంబుఁబ్రవేశించి సభాసదులం గనుంగొని, సభాసదులగు సుహృజ్జనంబులెల్లను, క్రమ్మఱ జూదంబుగలుగునె, దీనివలన బహుప్రజా క్షయంబు వాటిల్లుచున్నది గదా, యని దుఃఖించి జూదంబునకుం జనుదెంచిన కౌంతేయుల నాలోకించి, వారల నిఖిలైశ్వర్యంబపహరింప వలయునను తలంపున గాంధార వల్లభుండు పాండవేయుల నుద్దేశించి, మున్ను మేముజయించిన వాంటి నెల్లవస్తువులను ధృతరాష్ట్రుండుక్రమ్మఱ మీకు నొసంగె, ఇంక నొక్కపన్నిదంబు వివరించెద నాకర్ణింపుము, మన యిరుదెఱంగుల వారలలోన నెవ్వరోడిరేనియును సకలైశ్వర్యంబు విసర్జించి కృష్ణాజినంబులు ధరించి వనభూములకుంజని ద్వాదశ సంవత్సరంబులువసి యించి మఱియు నొకసంవత్సరంబెవ్వరు నెఱుంగకుండం బురంబున వసియింప వలయు, అట్టియెడ నొరులెఱింగిరేని క్రమ్మఱ బంగ్రెండు వత్సరంబులు వనవాసంబు సలుపంగలవారు, ఇట్టివ్రతంబు సమాప్తిగావించి వచ్చినం దమతమ రాజ్యంబులు గైకొని సుఖంబుననుండంగలవారలు, ఇది పన్నిదంబునకు నొడంబడి, పునర్ద్యూతంబుం గావింపుమని పలుకు సమయంబున, సభాసదులు దుఃఖాక్రాంత హృదయులగుచుం గరం

బులుసాచి, యీ పాండవేయు లింతయెఱింగియు జూదంబాడ నారంభంబు గావించిరి, వీరలవివేకంబులెంత నిందింపంగలవారమని పలుతెఱంగులం బలుకుచునుండ నట్టి జనవాదంబువిని లజ్జింపుచుం బ్రతిజ్ఞాధర్మంబువిడువంజాలక యది కౌరవులకు క్షయకారణంబని యెఱింగియును ద్యూతాభిముఖుండగుచు ధర్మనందనుండు శకుని నుద్దేశించి, నీవు జూదంబాడుటకుం బిలచిన ధర్మశీలుండును దృఢవ్రతుండును నగు నావంటి వాండెట్లు రాకుండనేర్చు? కావున దివనం బారంభింపుమనిన, దురాత్ముండగు నాసౌబలుండు రథగజతురగధేనుగణంబులును నజావికంబులును ధనరత్నరాసులును దాసదాసీజనంబులును మొదలగు నిఖిలవస్తువు లొసంగి వనవాసంబునకుం బోవుటయె పన్నిదంబుగా నొక్కపరి మనమిరువురును జూదంబాడుదమను నాసమయంబునం బాండవాగ్రజుండు దేవకార్యార్థంబుగ గలిపురుషుండొక మహూర్తమాత్రంబు దనయందు వసియించి యుండుటంజేసి, భీష్మద్రోణవిదురకృపాశ్వత్థామలును, యుయుత్సుసంజయవికర్ణులును, భీమార్జుననకులసహదేవులును, బాహ్లికసోమదత్తులును, గుంతీ గాంధారీ ద్రౌపదులును, దురోదరంబు వలదువలదని బహువిధంబుల నివారించినం గైకొనక శకుని నుద్దేశించి యొక్కపన్నిదంబుగ సకలవస్తువుల నొసంగి వనవాసంబునకుం బోవుటయె పన్నిదంబుగ నాడుమనిన, మాయోపాయనిపుణుండును గాలప్రేరితుండునునగు శకుని పాచికలువైచి యిదె జయించితినని పలికె.

ఈ కథ సభాపర్వంబున నూటపదమూండవ యధ్యాయము.

---

## అధ్యాయము. 114

అని వైశంపాయనుండు జనమేజయునకు మఱియు నిట్లను. ఇవ్విధంబున జూదంబువలనం బరాజితులగు పాండునందనులు వనవాసంబునకునకుగం గృతనిశ్చయులై యథాక్రమంబునం గృష్ణాజినంబులుధరియించి రాజ్యంబును సమస్తవస్తువులునుదొఱంగి చనువారలం గనుంగొనుచు దుశ్శాసనుండు కౌంతేయులు నిఖిలైశ్వర్యహీనులై వనవాసంబునకుం బోయెదరు గాన మహాత్ముండును గౌరవశ్రేష్ఠుండునునగు దుర్యోధనునకు రాజ్యంబు నేండుగదా సుస్థిరంబయ్యె. నిఖిలసుఖంబులును, రాజ్యంబును దొఱంగి కుంతీనందనులు బహుకాలంబు వనంబున దుఃఖంబు లనుభవింపుచు నుండుటకునయ్యె. కావున సద్గుణసమేతులును, జ్యేష్ఠులును, నైశ్వర్యసమన్వితులును నగు మాయెడ దైవానుగ్రహంబుగలుగుటకు నిప్పు డెఱుంగనయ్యె. లోకంబున నిట్టిమహాత్మకులు లేరన నిన్నిదినంబులును బ్రసిద్ధికెక్కి యైశ్వర్యమదమత్తులగుచు ధార్తరాష్ట్రుల నుల్లసంబులాడుచునుండెడు నీ పాండవేయులు సొబలుచేం బరాజితులగుచు దివ్యభూషణాంబరంబులును మహారాజచిహ్నంబులును మాని మృగచర్మంబులు ధరియించి వనంబునకుం బోయెదరు గాన నిట్టిదుఃఖంబు కౌరవులకు నొక్కనాంటికిం గలుగకుండవలయునునని పాంచాలి నుద్దేశించి ప్రతిష్ఠాహీనులును నిర్ధనులును నైన యీ పాండునందనులపట్ల నింక నేమిబ్రతుకున్నయది? తిలతుషంబులకైవడిం జర్మనిర్మితంబులగు మృగంబులపోలికె, శవాకయవధాన్యంబుల తెఱంగున నిస్సారులైన వీరలవలన నీకు నేసౌఖ్యంబుగలిగెడు? వీరిం బరిహరించి యైశ్వర్యసంపన్నులును శమదమాది గుణగరిష్ఠులునునగు నీకౌరవులలోన నొకనిం బ్రియునింగా వరియింపుము, ఇంక మహారణ్యమధ్యంబున

గ్లేశంబులనుభవించునప్పుడు దుశ్శాసనుని బుద్ధి వినకుంటివని పశ్చా
త్తాపంబు నొందవలదని సభామధ్యంబునం బరుషభాషణంబులాడెడు నా
దురాత్ముని వీక్షించి యతికోపశీలుండగు భీమసేనుండు హిమవత్పర్వ
తంబునం బొడమిన సింహంబు గోమాయువు నదలించుచందంబున
దుశ్శాసనుని ధిక్కరింపుచు పాపాత్మా! దుష్టజనసమేతుండవగు నీవు
శకుని మాయాద్యూతంబున జయించినమాత్రంబున నచరితార్థుండగు
పురుషుని తెలియంగున రాజలోకమధ్యంబుననిలిచి వృథావాక్యంబులాడె
దవు. నీవిప్పుడు వచనాశల్యంబులంగదా మర్మంబులు నాటనాడెదవు,
ఇంకరణరంగంబున నీకుం దోడుగం జనుదెంచిన నిఖిలమహీపతుల జము
సదనంబునకుంబనిచి నీవక్షఃస్థలంబుభేదించి రుధిరంబు గ్రోలునప్పుడు
నీవనినవాక్యంబు లన్నియును దలంపంజేసెదనని యివ్విధంబునం
బలుకుచు, ధర్మపాశబద్ధుండును మృగచర్మధరుండును దుఃఖాభి
భూతుండునునగు వృకోదరునిం గనుంగొని దుష్టాత్ముండగు నా
దుశ్శాసనుండు ఇదె పశువుపశువని పలుమాఱునుం బిలుచుచు లజ్జా
విహీనుండై సభామధ్యంబున నటింపుచునుండ పవననందనుం డా
దురాత్మునిం గోపవీక్షణంబుల నిరీక్షించి, పురుషాధమా! కపటం
బున రాజ్యం బపహరించుకొనినమాత్రంబున నవ్యర్థాలాపంబు లాడె
దవు, దీనికి ఫలంబుగ రణరంగంబున నీహృదయంబు వ్రక్కలించి
రక్తపానంబు గావింపనైతినేని తనకుం బరలోకసౌఖ్యంబు లేకయుండు
గాక! ఎల్లభంగుల ధార్తరాష్ట్రుల రణంబునవధియించి శాంతిం
బొందంగలవాండ. ఇది నిశ్చయం బని పలుకుచునుండునంత సింహ
గమనుండగు దుర్యోధనుండు భీమసేనునకుం గోపంబు జనియింప
సేయవలయుననుతలంపున నతనిగమనంబు దా ననుకరించి హాస్యంబు
గావించిన, నతని మఱలిగనుంగొని మహాబలనందనుండు మూఢాత్మా!
ఇట్టి పరిహాసగమనంబువలనం బ్రయోజనం బేమియున్నయది? ఇట

మీఁద సంగ్రామరంగంబున నిన్నుం బుత్రమిత్రసహితంబుగం బరిమార్చి నీవు గావించిన యకృత్యంబు లప్పుడు దలంచునట్లు కావించెద నని, మఱియును బలశాలియును నభిమానవంతుండునునగు నతండు కోపం బడంపుచు సభాసదుల నుద్దేశించి, నేను దుర్యోధనుని జంపంగలవాఁడ, ధనంజయుండు కర్ణునింబరిమార్చు, సహదేవుండు కపటద్యూతవిశారదుండగు సౌబలునిం దెగటార్చు. ఇంకనొక్కవాక్యంబు వినుండు. కలుషాత్ముండగు నీ సుయోధనుని నాగదాప్రహారంబునం దొడలు విరిచి పుడమిం బడవైచి వీనిశిరంబు పాదంబునఁద్రొక్కి నిలుచునప్పుడుగదా యీవాక్యంబు లన్నియును మఱుఁగుడింతుననునెడ నర్జునుండతని నుద్దేశించి, మహాబలనందనా! నీ తలంపునకు దైవంబనుకూలంబగుచు సంగ్రామంబు గలిగింపవలయు. నీతోడవిరోధించిన వైరులం బొలిసినవారింగాం దలంపుము. ఇక్కౌరవులు దమకు రాంగల మహాభీతి యెఱుంగక దుర్బుద్ధులగుచు గృహంబున సుఖంబుననున్నవారమని దలంచెదరు. ఇంకం బదమూఁడు సంవత్సరంబుల పర్యంతంబును వీరలు బ్రతికియుండిరేని నావాక్యంబు లప్పుడెఱింగెదరు. ఇప్పుడిట్టిమాటలవలనం బ్రయోజనం బేమి? దుర్యోధన దుశ్శాసన శకుని కర్ణుల రుధిరంబు భూమిపానంబు సేయంగలయది. ఈ దురాత్ములగు కౌరవులం బ్రేరేచు నీకర్ణుని నిశ్చయ మనంబువలనం బుత్రమిత్రామాత్యసమేతంబుగ సంహరించెద. మఱియునుంగల మహీపాలకులు ధార్తరాష్ట్రప్రియులగుచు బుద్ధిమోహంబున నన్ను సమరంబునం దార్కొనిరేని రూపుమాయించెద. హిమవంతంబు చలించెనేనియును, సూర్యుని తేజంబు మాసెనేనియును, జంద్రునియెడ శైత్యంబులేదయ్యెనేనియును, నా ప్రతిజ్ఞకు దప్పుగలుగునె? పదమూఁడు సంవత్సరంబులును బ్రతిజ్ఞాపరిపాలనంబు గావించి క్రమ్మఱ నరుగుదెంచినమాకు మారాజ్యంబొసంగి వేఁడుకొనినం

బోవుగాక వేఱొండుగావించిరేని నా వాక్యంబులన్నియును నప్పుడు నిజంబుగాంగలయవి యనునెడ, సహదేవుండు క్రోధారుణ లోచనుం డగుచు బాహుదండం బున్నతంబుగనెత్తి గాంధారరాజు నుద్దేశించి, దురాత్మా! నీచే నుండెడు నీయక్షంబులు సమరముఖంబున నిన్ను నేసమయించు సమయంబున బాణంబులై నీకుం దోడ్పడంజాలునె? భీమసేనుండు నిన్నుం దెగటార్చుటకు నన్ను నియమించినవాండగుట యుద్ధముఖంబున బంధుమిత్ర సమేతంబుగ క్షత్రధర్మంబు వదలక నాకట్టెదుట నిలువంజాలుదువేని నిన్ను సంహారించితినని నిశ్చయం బుగ నెఱుంగుమను సమయంబున, నకులుండు నీకపట ద్యూతం బున దుర్యోధనునకుం బ్రియంబుగ నీయాజ్ఞ సేనిని దురాలాపంబు లాడిన సర్వ్రత్తులును దైవప్రేరితులునునగు ధార్తరాష్ట్రులను, బురుషాధముండును నీ సౌబల సుతుండునునగు నులూకుని ధర్మ రాజాను మతంబున ద్రౌపదికిం బ్రియంబుగం బరిమార్పంగలవాండ. మఱియు నీ లోకంబుధార్తరాష్ట్ర రహితంబు గావించెదననియె. ఇవ్విధంబునం బురుష కంఠీరవులగు పాండునందనులు బహువిధంబు లగు ప్రతినలు గావించి ధృతరాష్ట్రుని సమీపంబునకుం జనిరి.

ఈ కథ సభాపర్వంబున నూటపదునాలవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 115

---

అంత న య్యుధిష్ఠిరుండు, వృద్ధుండగు భీష్ముండును, వైచిత్ర వీర్యుండును, సోమదత్తుండును, బాహ్లీకుండును, ద్రోణకృపాశ్వత్థాము లును, విదురుడును, ధృతరాష్ట్రకుమారకులును, భూరిశ్రవుండును, వికర్ణుండును, యుయుత్సుండును, సంజయుండును, మఱియును దక్కుం

గల మహీపాలకులును, నమాత్యప్రభృతులగు సభాసదులును, ధర్మశీలయగు గాంధారియును, దమతల్లియగు కుంతీదేవియును మొదలగువారి నందఱ నుద్దేశించి, మేము వనవాసంబునకుం బోయి మగుడి వచ్చుటకు మీర లనుజ్ఞ యొసంగవలయుననిన, వారలతని ముఖంబుం గనుంగొనుటకు లజ్జింపుచు నీ పాండవేయులకు శుభంబులు గలుగుం గాక యని మనంబునం దలంపుచు నూరకయుండ, విదురుండు ధర్మనందనా! అతిసుకుమార దేహయును, వయోవృద్ధయును, సుఖోచితయును నగు నీ కుంతీదేవి వనవాసాయాసంబులకు నోర్వంజాలదు. మీరు సుఖంబునం గ్రమ్మఱి చనుదెంచునంతకును నీదేవిని నాగృహంబున నిడి పోషించెద. మీరలును నాయమ నిందు నిలుచుటకు నియమింపుడు. ధర్మవిధిజ్ఞుండగుపురుషుం డెప్పట్టునను ఖేదంబునొందండు గావున మీరలును పరాజయంబు నొందితిమిగదా యని దుఃఖింపవలదు. ధర్మనిరతుండగు నీవును, భుజాబలధురంధరుండగు ధౌమ్యుండును, ధర్మార్థంబుల యెడం గౌశలంబుగల ద్రౌపదీదేవియును ననుమీర లన్యోన్యంబును సహాయంబు గావింపుచుం బరులకు నజేయులును సంతుష్టులును నగు మీ కెవ్వరైనను శుభంబుం గావింపరె? నిఖిలగుణసంపన్నులగు మిమ్ము మహేంద్రు నంతటివిరోధియైనం దేరిచూడంజాలండు. హిమవత్పర్వతప్రాంతంబునందు మేరుసావర్ణియను మునీంద్రునివలనను, వారణావతంబునం గృష్ణద్వైపాయనులవలనను, భృగుతుందశైలంబునం బరశురామునివలనను, దృషద్వతియను నదీప్రాంతంబు నశంభుఋషివలనను, మఱియును నసితమునీంద్రునివలనను, బ్రహ్మకుమారుండగు నారదునివలనను, మీపురోహితుండగు ధౌమ్యునివలనను నఖిలధర్మంబు లెఱింగిన మహానుభావుండవగుట నీకు సకలశ్రేయంబులుం గలిగెడు. ఐళుండగు పురూరవుని గెలువంజాలిన బుద్ధిసంపన్నుండవు. భుజా

శౌర్యంబున నిఖిలమహీపతులను ధర్మసేవవలన ఋషీశ్వరులను జయించి, శత్రువిజయంబునం బాకశాసనప్రతిమానుండును, కోపంబున నంతకోపమానుండును, త్యాగంబునం గుబేరతుల్యుండును, ప్రసన్నభావంబున జంద్రసంకాశుండును, దాలిమివలన ధరణీసమానుండును, దేజంబున మార్తాండసదృశుండును, బలంబున వాయుసన్నిభుండును నగు నీవు దేవతాసంభవుండవును, బరిశుద్ధవర్తనుండును గావున మీకు నారోగ్యభాగ్యంబులు గలిగెడు. ఒక్కయాపద వాటిల్లినసమయంబున యథోచితప్రకారంబున బుద్ధిసంపన్నులై మెలంగుండు. వనవాసంబునకుంజనివ్రతసమాప్తింగావించి సహోదరసహితంబుగం గ్రమ్మఱ నరుగుదెంచిన నిన్నుం గనుంగొని సంతుష్టినొందంగలవాండనను నతనివచనంబు లాకర్ణించి సత్యప్రతిజ్ఞుండగు నయ్యుధిష్ఠిరుం డట్లకాక యని పలుకుచు, భీష్మద్రోణాదులకు వందనం బాచరించి వనవాసగమనోన్ముఖుండయ్యె.

ఈకథ సభాపర్వంబున నూటపదునేనవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 116

---

ఇవ్విధంబునం బాండునందనులు భూషణాంబరంబులును ఛత్రచామరాది రాజచిహ్నంబులునుమాని వల్కలాజినంబులు ధరియించి పాదచారులై బహుప్రజానిబిడంబగు రాజమార్గంబునం బోవు సమయంబున దీనులగుచుం బురజనంబులెల్లను వారల నాలోకింపవలయుననుతలంపునం బ్రాసాదంబులును, విమానశిఖరంబులును, మహోన్నతంబులగు గోపురంబులును, వృక్షాగ్రంబులును నధిరోహించి నిరీక్షింపుచుం జతురంగబలసమేతంబుగ రాజమార్గంబునం జనురాజ

నందనులు ద్రౌపదీసమన్వితులై దీనులచందంబునం బోవుచున్న వారు. బాహుబల ధురంధరులగు నీభీమార్జునులును గపటాత్మకులగు కౌరవులసంహరింపంగడంగిన ధర్మతనూజుండగు నీధర్మనందనుండు వారల నివారించి రాజ్యంబును నైశ్వర్యంబును గౌరవులకు నొసంగి ధౌమ్యసహోదరసమేతంబుగ వనవాసంబునకునేఁగుచున్నవాండు. మున్ను నభోగమనంబుగల పక్షులకేనియుం జూడంగూడని యంతఃపురంబున వసియించి, దివ్యభూషణాంబరంబులును, ప్రసూనదామంబులును, నంగరాగంబులును ధరియింపుచు నతిసుకుమారదేహయై యుండెడు నీపాంచాలరాజనందన యిప్పు డెల్లవారలు గనుంగొనుచుండం జనుచున్నయది. శీతోష్ణవర్షాదులు దీనికి నెంతవైవర్ణ్యంబు గల్పింపుచున్నయదియో ? లోకంబున గుణహీనుండగుపుత్రునిం దొఱంగియుండుటకేనియును దల్లిదండ్రులు ఖేదంబునొందుదురు. ఇప్పుడు సూనృతభాషణంబును, దయయును, ధైర్యంబును, నాచారంబును, మనోనిగ్రహంబును శమంబును ననునివి మొదలగు నిఖిల సద్గుణంబులుగల ధర్మనందనప్రభృతులును, బతివ్రతాతిలకంబగు ద్రౌపదీదేవినింబాసి యీ కుంతీదేవి యెవ్విధంబున నిర్వహింపంగల యది? ధర్మనందనుండు వృక్షమూలంబు, సకలజనంబులు శాఖాపుష్పఫలంబులు, అట్లగుట నిట్టి యుధిష్ఠిరుండు వనవాసంబునకుం బోవుట వలన నఖిలభూప్రజలును, జలంబివురంబారిన మడువులోని జలజంతువులచందంబున దల్లడిల్లుచు నున్నవారు. వాహనంబులును, క్షేత్రంబులును, గృహంబులునుం బరిహరించి సమస్తబంధుసమేతంబుగ మనము సుఖదుఃఖంబులకు వారితోడివారమగుచు మహారణ్యభూములకుం జనియెడు ధార్మికులగు పాండవేయులవెంబడిం బోయితిమేని, యపహృతంబులగు ధనధాన్యంబులును, నలంకారరహితంబులగు నంగణంబులును గలిగి, హృతసాగరంబులును, రజోదూషితంబులును, దేవ

తారరహితంబులును, మూషికావృతంబులును, బలసమేతంబులును, ధూపమోదకహీనంబులును, బలికర్మ మంత్ర హోమ జపాధ్వరరహితంబులును, భిన్నభాండంబులును, జనశూన్యంబులును నగు గృహంబులుగలపురం బీశకుని యేలుంగాక! పాండవులే వనంబునకుం జనివసియించి రయ్యెడంగల సింహాదిదుష్టమృగంబులు దలంగిపోవుంగావున నదియె నగరంబు. వారు లేనినగరంబు వనంబు. అట్లగుట నెల్లభంగులం బాండవసమేతంబుగ వనంబునకుం బోయితిమేని యదియె మనకు సౌఖ్యంబని బహువిధంబులుగం బలుకు జనులవచనంబులాకర్ణింపుచు, మనంబున వదనంబున నించుకేనియును వివర్ణభావంబు దోంపనీక నరిగెడుసమయంబున, నేకవస్త్రయును, రజస్వలయును, విశీర్ణకుంతలయును, నతిశోకాక్రాంతయును, వివర్ణముఖియును, పాదచారిణియును నగు పాంచాలరాజనందనం గనుంగొని బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్ర జనంబులు బాష్పాకులలోచనులగుచు హాహాకారంబులతోడ ధార్తరాష్ట్రుల దుర్నయంబునిందించి బాష్పాకులలోచనులై యుండిరి. అంత నాధర్మనందనుం డివ్విధంబునంబలుకు జనులవచనంబు లాకర్ణింపుచు వనవాసంబునకు నిశ్చయించి సహోదరసమేతంబుగనడచు ఆసమయంబున ద్రౌపదీదేవి యశస్వినియగు కుంతీమహాదేవికిని నతి శోకపీడితలగు నితర రాజకాంతలకును యథోచితంబుగవందనంబులును నాలింగనంబులును గావించి వనవాసగమనంబునకు నిశ్చయించునెడం బాండవాంతఃపురంబుల నార్తనినాదంబు నిబిడంబయ్యె. అప్పుడతి దుఃఖార్తయగుచుం గుంతీదేవి గద్గదస్వరంబుతో యాజ్ఞసే నినుద్దేశించి, యిట్టియాపద వాటిల్లెంగదాయని శోకింపందగను. శీలంబును, నాచారంబునుగలిగి పతివ్రతా ధర్మంబు నెఱింగిన నీకుం బతులయెడ నిత్తెఱంగున నడువుమని నేనెఱింగింపందగిన యర్థంబేమియున్నయది? నిఖిలగుణంబులవలన నుభయకులంబులు పవిత్రంబు గావించిన పతి

వ్రతారత్నంబవగు నీకోపంబునం గౌరవులెల్లను దగ్ధులై పోకుండుటం జేసి వారలింకం గొంతకాలంబు బ్రతుకంగలవారని యెఱింగితి. లోకంబునం బతివ్రతాజనంబులకు శుభంబులెగలుగుం గావున సకల ధర్మజ్ఞయును బరిశుద్ధ హృదయయునునగు నీకు నింక సకల శ్రేయంబులుం గలిగెడు. మహామనస్వియును సుకుమార దేహయుండునునగు నీ సహదేవుని వనవాసాయాసంబు లొందకుండం బోషింపుము. నా వాక్యంబులన్నియును మనంబున నిలిపి సుఖంబునంబోయి రమ్మనిన నట్లకాకయని బాష్పాకులలోచనయును బుష్పిణియుననగు పాంచాలి చనుచుండ, నా దేవిపిఱుందన మహాదుఃఖంబునరోదనంబుగావింపుచుం గుంతీదేవి చనుదెంచి దివ్యభూషణంబులును వస్త్రంబులునుమాని వల్కలాజినంబులు ధరియించి లజ్జావినమ్రముఖులై శత్రుమధ్యంబున శోకాక్రాంతహృదయులగుచు సుహృజ్జనంబులు క్లేశంబుజెంద దుర్దశం బ్రాపించియున్న తన కుమారకులంజూచి వారల నందఱం గౌంగిలింపుచు శోకార్తయై మహీతలంబునం జదికిలంబడి, స్వధర్మం బును, జరిత్రంబును, సద్వర్తనంబును భూషణంబులుగాం గలిగి మహాత్ములును, దైవసహాయశక్తులును, యజ్ఞశీలులును నగు మీయట్టి వారలకు నిట్టి యాపదలు వాటిల్లె. ఇది యెక్కడికాలవైపరీత్యంబు? తనవంటి భాగ్యహీనురాలి యుదరంబున జనియించుటంజేసి లోకం బున నెవ్వరికిలేని యీయాపద మీకుం బ్రాప్తంబయ్యె. నిఖిలసద్గు ణంబులు గలిగిన మీరలైశ్వర్యహీనులై దుర్గమంబులగు వనస్థలంబుల దుఃఖాయాసంబు లెవ్విధంబున సైరించెదరు? భుజాశౌర్యంబులును, సత్వబలంబులును, మహోత్సాహంబులును, దేజంబులునునను నీ గుణంబులం బరిపూర్ణులైయుండెడు మీకుం గటకటా! యిట్టి క్లేశంబు రాంగలయదియని మునుపే యెఱింగితినేని శతశృంగ పర్వతంబునం బాండు మహీపాలుండు ననిసపిమ్మట నెందైన వసియింతుంగాని

ఈకరిపురంబునకు వత్తునె? సంతానంబు లేదను విచారంబున బహు దినంబులు దపోనిష్ఠుండై యుండి పదంపడి కుమారులు కలిగినంతనె దుఃఖంబునం జూడక త్రిదివంబు బ్రాపించిన మీతండ్రి భాగ్యంబు తనకుం గలుగదయ్యె. కళ్యాణియును, సకలధర్మజ్ఞయునునగు మాద్రి రాంగల యర్థంబెఱింగి తొలుత తన పరమంబగు గతిం బొందెం గావున నదియె ధన్యురాలని మనంబునం దలంచెద. మతి యును, వినయంబును, సద్గతియునుం గల మాద్రీదేవిచేత వంచింపం బడి ప్రాణంబులయెడం బ్రియంబుగలిగి శరీరంబు దాంచుక యిప్పు డింత దుఃఖభాజనంబనైతిం గావునం దన జన్మంబు వ్యర్థంబయ్యె. పలునోములు నోచి కాంచిన యీసత్పుత్రులనెడంబాసి నిలువరింపం జాల. వెంబడిం జనుదెంచెద. పాంచాలరాజనందనా! నన్ను విడిచి పోవుటకు నీకుయుక్తంబగునె? ఇట్టి దుఃఖసంచయంబునను దన శరీ రంబు వోకయున్నయది గాన నొక్కనాంటికిం దనకు నాశనంబు గలు గదు. హా! పాండుమహీపాలా! ఎందున్నవాండవు? శత్రువుల ద్యూతంబుచే వంచితులై వనంబులకుం బోవ సమకట్టియుండెడు నీసత్పుత్రులయెడ నుపేక్షుంగావించెదేటికి? అని పలికి సహదేవు నుద్దేశించి, తండ్రీ, నీవు నా దేహంబునకంటెం బ్రియంబగు సుతుం డవు, దయగలవాండవును నగుట నిన్ను విడిచిపోవందగునె? సత్య సంధులగు ధర్మనందనాదులు వనంబులకుం బోనిమ్ము. నీవు నా చెంతనె యుండి నన్నుం బోషించి యీధర్మంబువలన శ్రేయంబు నొందు మని యిట్లుపలుతెఱంగుల విలపింపుచున్న కుంతీదేవి నూరా ర్పుచు వందనంబులుగావించి శోకపీడితులై చనుచునుండ, విదురుండు దుఃఖార్తుండైయుండెడు కుంతీదేవి నాలోకించి తానును దుఃఖంబునొం దుచు బహువిధంబులగు వచనంబుల నాదేవినూరార్పుచుం దనగృహం బునకుంబనిచిన, యనంతరంబ పాండవులు దీనులైవనంబునకుం బోవుట

యును, బుత్రస్నేహాలాలసయగు కుంతీదేవి పలవరించుటయును, సభామధ్యంబున ద్రౌపది విభంగపడుటయును గనుంగొని కరంబులు ముఖంబునం జేర్చి కౌరవాంతఃపురవధూ జనంబులెల్లను మహారవంబులుగ రోదనంబులు గావించిరి.

ఈకథ సభాపర్వంబున నూటపదునాఱవ యధ్యాయము.

---

## అధ్యాయము. 117.

---

అని వైశంపాయనుండు జనమేజయుం గనుంగొని మఱియు నిట్లను. ఇవ్విధంబున ధర్మనందనుండు కుంతీదేవిని గృహంబునకుం బనిచి సహోదరసమేతంబుగ వనవాసంబునకు నిశ్చయించి భూషణాంబరాదులు బరిత్యజించి చనుచున్న సమయంబున నతనినిరీక్షించి, కరినగరంబున నున్న పౌరజనంబులును గౌరవభృత్యవర్గంబును స్త్రీబాలవృద్ధసమన్వితంబుగ హాహాకారంబు సేయుచునుండ, మహానుభావుండగు పాండవాగ్రజుం డరణ్యంబునకుం బోవుట విలోకించి చాతుర్వర్ణ్యవధూజనంబులును కరివిహంగంబుల తెఱంగురోదనంబులు గావింపుచునుండం, దొలుత రాఘవుండు రాజ్యంబుదక్కి విపినంబునకుం బోవుసమయంబున నయోధ్యానగరంబునం గల పౌరజనంబులతని ననుసరించిపోవు చందంబునం గరిపురంబునంగల స్త్రీబాలవృద్ధజనంబులు శోకాకులమానసులగుచు రాజమార్గంబులను ప్రాసాదంబులను సభాభవనంబులను వసియించి యార్తనాదంబుల శోకింపుచునుండిరి. అంత కౌంతేయాగ్రజుండు పురోహితసహితుండై యనుజులును బాంచాలరాజతనూజయును తనవెంబడిం జనుదేర ధైర్యంబవలంబించి రాజమార్గంబునం జని వర్ధమానద్వారంబున నిర్గమించి

దుఃఖంబునం బరితపింపుచుం దన వెంబడి నరుగుదెంచు పౌరజనంబుల మగుడం బురంబునకుం బోవంబనిచినం బోవక, తనయందలి ప్రేమాతిశయంబున మగుడిపోవక యనుసరించి వచ్చువారల నవలోకించి ప్రియపూర్వకంబుగ గద్గదస్వరంబున నిట్లను. మీరలు మాయెడం దాత్పర్యంబు గలవారలగుటంజేసి మాకుం బ్రదక్షిణంబుగ నులలి స్త్రీబాల వృద్ధసమన్వితులై నగర బునకుం జనుండు. ఏనును బట్టణంబును వెలువడి ఖేదంబుదక్కి సహోదరులును బాంచాలియును వెంబడిం జనుదేర వనంబునం బండ్రెండు సంవత్సరంబులు వసియించిపదంపడి యొక సంవత్సరంబజ్ఞాతవాసంబుగ మెలంగి మగుడివచ్చి మమ్ముం గనుంగొనుసట్టుగననుగ్రహింపవలయు నని పలుకు నతని దీనాలాపంబులాకర్ణించి, స్త్రీబాల వృద్ధ సమేతులగు పౌరజనంబు లుత్తరీయంబులను గరంబులను ముఖంబులు గప్పికొనుచు, దల్లిదండ్రులను సుహృజ్జనంబులను నెడబాయువారల చందంబున విన్ననగుమనంబుతోడ, ధర్మతనయుండు వనంబునకుం జనుచున్న వాండుగదా యనిశోకంబునముహూర్తమాత్రంబు నిశ్చేష్టితులై యుండి యంతం గొంతధైర్యంబవలంబించి, యుధిష్ఠిరుండు విపినవాసంబునకుం బోవుచున్న వాండుగదా? ఇంక మనకు దిక్కెవ్వరని మందమందంబుగ నొండొరులకుం దెలుపుచునుండునంత, నక్కౌంతేయులు పౌరజనంబులు వీడ్కొని వనంబు బ్రవేశించినం గనుంగొని వారలును శాండవేయులయెడం గలిగిన స్నేహాతిశయంబున నలుదెఱంగులం జూచుచు క్రమ్మఱ వారల వెంబడిం జనుచు,ధర్మప్రధానులగు పాండుతనూభవులు రాజ్యహీనులై వనంబునకుం బోయెదరు కాన ధర్మంబుకంటె నధర్మంబు మిక్కుటంబని పలుకువారును, ధార్మికశ్రేష్ఠుండగు ధర్మపుత్రుం డెవ్విధంబునం గాననంబున నుండునని ఖేదంబునం బలుకువారును, బలపరాక్రమధురీణుండగు నీ పవమానసూనుండు కాంతారంబున నెత్తెఱం

గున నిలువరించునో యని ప్రలాపించువారును, ధనుర్ధరాగ్రేసరుండగు నీ ధనంజయుండు విపినభూముల వసియింపనోపునే యని పరితపించు వారును, బాలురును నతిసుకుమారదేహులును నగు నీ నకులసహదేవు లరణ్యసంచారంబుల కర్హులై యని శోకించువారును, గోమలాంగియును ద్రుపదరాజపుత్రియు నగు నీ యాజ్ఞసేనికి వనవాసంబుచితంబె యని మిగులం బొగులువారును నగుచు వారలగుణంబులు వేమరు నుగ్గడించి పొగడుచునుండెడు పౌరజనంబుల దుఃఖప్రలాపంబులు విని, లజ్జాభరంబున శిరంబులు వాంచి సుహృద్గణసమేతంబుగ గాంగేయుండును, కుంభసంభవుండును, శారద్వతుండును, నశ్వత్థామయును, విదురుండును, సంజయుండును, వికర్ణుండును, మఱియును దక్కంగల కురువృద్ధులును, పౌరజనంబులును, బ్రాహ్మణోత్తములును శోకంబున మునుంగుచు దుర్యోధనభయంబునం జేసి యొండేమియును నక యూరకయున్న సమయంబున, సందుంగొందలు భూసురోత్తములును నిర్భయులై పాండునందనులకుం బ్రాపించిన క్లేశంబులు మనంబు కలంగింప దుర్బుద్ధియగు ధృతరాష్ట్రుం డజ్ఞానాంధుండగుచు ధర్మం బెఱుంగలేక యధర్మంబు గావించె. ధర్మాత్ముండగు ధర్మనందనుండును, బాహుబలశాలియగు భీమసేనుండును, నతిరథశ్రేష్ఠుండగు నర్జునుండును, మహాప్రాజ్ఞులగు మాద్రినందనులును పాపంబునకుం జొరరు. ఈ వైచిత్రవీర్యుండు వారి పితృధనంబగు రాజ్యంబు పాండవులు పరిపాలించుటకు సైరింపంజాలండు. భీష్మద్రోణకృపాదులును బాండవులకు నరణ్యవాసంబు గలిగెడు కపటద్యూతంబు నివారించుటకు సామర్థ్యంబు గలిగియును నూరకుండుటవలన వారల నధర్మంబు ప్రాపింపకయుండునె? తొలుత శంతనునందనుండగు విచిత్రవీర్యుండు పరమధార్మికుండును రాజఋషియును, నగు పాండుమహీపాలుండును బ్రజలం దల్లిదండ్రుల తెఱంగునం బోషించిరి. ఈ ధృత

రాష్ట్రుండు పుత్రమోహాలాలసుండగుచు ధర్మశీలులును, ప్రజ్ఞావంతు లునునగు పాండునందనుల తేజంబు సహింపలేక వనంబులకుం బనిచెం గాన నిట్టి పాపకర్ముని నగరంబున నుండక మనమందరము నీ కౌరవులం బరిహరించి కౌంతేయులతోడం గూడంజని యరణ్య భూముల వసియింతము. అని దుఃఖార్తులై పలికెడు బ్రాహ్మణోత్త ముల వచనంబు లాకర్ణించి దానును శోకాక్రాంతుండయ్యును, ధర్మ నందనుండు ప్రమోదంబునం బొదలుచు, భూసురుల నుద్దేశించి మహాత్ములారా! వృద్ధుండును, గురుండును, గౌరవశ్రేష్ఠుండును, జన కుండును నగు నాంబికేయునకు మనఃప్రియంబు గావించుటయె మాకు సహజవ్రతంబు. మీరలు మాకుం బ్రాణబంధువులగుటం బుత్రమిత్ర కళత్రసమేతంబుగ మాకుం బ్రదక్షిణంబుగం దిరిగి పురంబునకుం జనుండు. త్రయోదశసంవత్సరంబులు జనినయనంతరంబ మేమును జనుదెంచి మిమ్మునుం గనుంగొనియెద మనిపలికి యటం జనుచుండె.

ఈకథ సభాపర్వంబున నూటపదునేడవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 118

---

అని జనమేజయుండు వైశంపాయనుం గనుంగొని,పాండునంద నులు ధార్తరాష్ట్రుల కపటద్యూతంబుచే నిర్జితులై కపటద్యూతం బుననుండియును గాననవాసంబునకుం బోయినవిధంబు సవిస్తరంబుగ దెలుపుమనిన, నతండు పాండవేయులు వనంబునకుం జనినతెఱం గెఱింగించెద నాకర్ణింపుము. పూర్వంబున సత్యసంధుండగు రామ భద్రుండు సీతాలక్ష్మణసమేతంబుగ నయోధ్యానగరంబు వెడలి,తమ తండ్రియగు దశరథునివలనను, కైకేయీకుబ్జలవలనను, రాజ్యభ్రం

శంబు నొంది, యితర జనదుర్లభంబగు నైశ్వర్యంబు పరిహరించి, దండ కారణ్యంబున కరిగినచందంబున, ధర్మాత్ముండగు పాండవాగ్రజుండు నీచుండగు సుయోధనునివలనను, మాయాబలశాలియగు శకునివలనను, దండ్రియగు ధృతరాష్ట్రునివలనను, గపటద్యూతంబునం బరాజితులగుచు, సత్పురుషధర్మం బవలంబించి, యపారంబగు నైశ్వర్యంబును దొఱంగి, రాజ్యహీనుండై హస్తిపురంబు నిర్గమించి, భార్యాసోదరసహితంబుగ విపినభూములకుం జనియె. అంతం గుమారుల దుర్ణయంబువలన శోకాకులితమానసుండును భయభ్రాంతుండును నగునంబికానందనుండు తనమనంబునం బెద్దయుం బ్రొద్దుచింతించి శాంతింబొందంజాలక విదురుని శీఘ్రంబునం దోడితెమ్మనిపనిచిన, నతండు ధృతరాష్ట్రుని మందిరంబుం బ్రవేశించి, యిట్లువచ్చిన విదురు నుద్దేశించి, భీతుండగు వైచిత్రవీర్యుండు ధర్మనందనుండు వనంబునకుం బోవుసమయంబున నెవ్విధంబునం జనియె? భీమార్జున నకులసహదేవులును, మహాతపస్వియగు ద్రౌపదియును, బురోహితుండగు ధౌమ్యుండును నెత్తెఱంగున నరిగిరి? వారల యింగితచేష్టితంబులు నా కెఱింగింపుమనిన విదురుండు, కౌంతేయాగ్రజుండు వస్త్రంబున ముఖంబు బొదివికొని యరిగె, వృకోదరుండు బాహుదండంబులు వీచుచుంజనియె, విజయుం డిసుకం జల్లుచు యుధిష్ఠిరునికిం బిఱుందదెస నడిచె, చిత్తవిహ్వలుండును సౌందర్యశాలియును వీరాగ్రేసరుండునునగు నకులుండు ధూళిధూసరితగాత్రుం డగుచు వెడలె, సహదేవుండు రేణువు వదనంబుననలందుకొని వెలువడియె. అతిమనోహరాకారయును విశాలలోచనయునునగు పాంచాలి రోదనంబుగావింపుచుం గుంతలంబుల ముఖంబుగప్పికొని యజాతశత్రుని పిఱుందననరిగె, ధౌమ్యుండును గరంబునం గుశముష్టిగీలించి యమదేవతాకంబులును, రుద్రదేవతాకంబులునునగు సామంబులు మార్గం

బున గానంబుగావింపుచు నరిగె ననిన నతండువిదురు నుద్దేశించి, వార లరణ్యంబునకుం బోవునప్పు డిట్లు నానాచేష్టితంబులతోడం జనుటకుం గారణంబేమి? అది వివరింపుమనిన నతండు వైచిత్రవీర్యు నాలోకించి యజాతశత్రుండు నీపుత్రుల మాయోపాయంబున రాజ్యంబును ధనంబును గోల్పడుటవలనం గ్రోధోద్దీపితుండయ్యును హృదయంబున ధర్మంబె నెలకొలిపి తన యుగ్రదృష్టింజూచిన నెల్లవారును భస్మంబై పోయెదరని ధార్తరాష్ట్రులయెడం దయగలిగినవాండగుట వస్త్రంబున ముఖాచ్ఛాదంబు గావించికొనిచనియె, దోర్బలదర్పితుండగు పవననందనుండు భుజాటోపంబునం దనకు సమానుండగువాండు లేండని బాహువులు వీచుచు నీభుజంబులచే శత్రుసంహారంబు గావింపం గలవాండనని యెఱింగింపుచు నేంగె, నర్జునుండిసుకచల్లినచాట్పున నతి నిబిడంబులగు శరసందోహంబులు తంజోపతండంబులుగాం బ్రయోగింపం గలవాండనని సూచింపుచుం బోయె, అతిసౌందర్యశాలి యగు నకులుండు స్త్రీజనంబులకుం దనయెడ మోహంబు గలుగకుండ రజోదూషితాంగుండై ధర్మజుననుసరించె, సహదేవుండు తనయాననసౌందర్యంబు గనుంగొని వధూజనంబులు మోహింపక యుండవలయునను తలంపున ముఖంబున ధరణీపరాగంబునలందుకొని యరిగె రజోదూషితంబగు నేకవస్త్రంబు ధరియించు వికీర్ణకుంతలంబులతోడ రోదనంబులు గావింపుచు నెవ్వరివలనం దనకు నిట్టిదురవస్థం బ్రాపించె నట్టికౌరవుల వనితాజనంబులెల్లను సమరనిహతులగు పతిసుత మిత్రులుంగలిగి బంధుశోణిత దిగ్ధాంగులును విస్రస్తచికుర భారులునునగుచు సింకం బదునాలవ సంవత్సరంబున స్నానంబు లాచరించి యీకరినగరంబు బ్రవేశింతురు గాక యనుచుం జనియె, ధౌమ్యుండీ పాండవుల నిట్లుపురంబు వెలువరించిన ధార్తరాష్ట్రులెల్లను సంగ్రామరంగంబున సంహరింపంబడిన యనంతరంబ యిట్లన సామగానంబు గావింతునుగాకయని మనంబునం

దలంచి కుశలు దక్షిణాగ్రంబులుగం గరంబునం గీలించి చనియె ననిన ధృతరాష్ట్రుండు విదురు నుద్దేశించి, పౌరులును జానపదులును నగు జనంబులేమేమి పలుకుచున్నవారలు అంతయు యథార్థంబుగ నెఱింగింపుమనిన విదురుం డతనిం గనుంగొని, బ్రహ్మ క్షత్ర వైశ్య శూద్ర జనంబులు కటకటా మనకు రక్షకులగు పాండవేయులు వైచిత్రవీర్యుండు గావించిన కపటోపాయంబులచే నతిదుఃఖార్త లగుచు వనంబునకుం జనిరని శోకాకులమానసులై నిన్ను నిందించి పలికెదరు. ఇవ్విధంబునం బురుషశ్రేష్ఠులగు కౌంతేయులు కరిపురంబు వెడలి మహారణ్యంబునకు బోవునెడ మేఘోదయంబులేకనె మెఱుపులుబుట్టుటయును, బర్వంబుగాని సమయంబున రాహువు భానుమండలంబు కబళించుటయును, మహీవలయంబు చలియించుటయును, నెల్లెడ నపసవ్యంబుగనుల్కలువడుటయును, మాంసంబులు భక్షింపుచునుండు గృధ్రజంబుక దేవతాగృహంబులం జైత్యవృక్షంబుల యెడం బ్రాకారాట్టాలక ప్రదేశంబులయ్యందు నతిక్రూరంబుగం గూయుటయునుననునివి మొదలగు మహోత్పాదంబులు దోంచుట వలన నీదుర్మంత్రంబునం జేసి కౌరవులకు నెల్లను వినాశంబువాటిల్లంగలయది యని పలికి యూరకయున్న యవసరంబున, ననేకఋషిగణపరివృతుం డగుచు నారదమహామునీంద్రుండు సభామధ్యంబునం గౌరవులసన్నిధానంబుజేరి వారలనుద్దేశించి, యింకం బదునాలవ సంవత్సరంబున నీదుర్యోధనుం డొనర్చిన దుర్నయంబునం జేసి భీమార్జునుల భుజాబలంబునవలన ధార్తరాష్ట్రులెల్లను వినాశనంబు నొందెదరని బటుషంబుగం బలికి బ్రహ్మతేజోవిరాజమానుం డగు నతం డంతర్హితుండయ్యె. అంతం బౌరజనంబు లెల్లను ధర్మనందనాదులు వనంబునకుం జనిన యనంతరంబ వత్సంబులంబాసిన ధేనుగణంబుల చందంబున దుఃఖింపుచు దీనులై హస్తిపురంబు ప్రవేశించిరి.

స్త్రీబాల వృద్ధసహితంబగు హస్తిపురంబు నిశ్శబ్దంబును నిరుత్సవంబును నైదోంచె. మహారోగపీడితులచందంబున పౌరజనంబులును బ్రమోదరహితులై పాండవులం దలంచి శోకింపుచునుండిరి. మఱియునంబౌరజనంబులయ్యెడల గుములుగూడి దుఃఖార్తయగు కుంతీదేవి పుత్రహీనయగుటం జేసి వత్సంబు నెడంబాసిన ధేనువుచాడ్పున విలపించునాన్నయది యనియును, ధర్మతనయుం డరణ్యంబునకుం బోవుట వలనం గురువృద్ధులెల్లను దుఃఖశోకపరాయణులై యున్నవారని యును, నీధృతరాష్ట్రుం డింత సేసెంగదా యనియునుం బలుకుచుం గ్లేశంబు నొందుచుండిరి. ఆసమయంబున బ్రాహ్మణులెల్లను బాండవేయులం దలంచి, ధర్మశాలియగు యుధిష్ఠిరుండు నిర్జనంబగు వనంబున నెవ్విధంబున వసియించునో యనియును, భీమసేనాదులగు నితని సహోదరులును, మహాసుఖోచితయును దుఃఖానుభవంబునకు నయోగ్యయును నగు ద్రుపదరాజనందనయును నెవ్విధంబునం బ్రవర్తిల్లం గలవారనియును, బహువిధంబులం బలువరింపుచునే ప్రొద్దును మహానుభావులగు కౌంతేయుల సంస్మరింపుచు శస్త్రఘాతంబు లొందిన వారలతెఱంగున సహోదరాత్రంబును నిద్రాహారంబులును మాని తదేకపరవశులగుచు తమతోడ సంభాషించువారలకుం బ్రత్యుత్తరం బొసంగుటకు నెఱుంగక శోకోపహతహృదయులగుచు నిశ్చేష్టితుల విధంబున సీతాలక్ష్మణసమేతంబుగ రఘునందనుండు దండకారణ్యంబునకుం బోయినసమయంబున సాకేతపురనివాసులగు జనంబులు ఖేదంబు నొందుచందంబున దుఃఖింపుచునుండిరి.

ఈకథ సభాపర్వంబున నూటపదునెనిమిదవ యధ్యాయము.



## అధ్యాయము. 119

అని వైశంపాయనుండు జనమేజయుం గనుంగొని మఱియు నిట్లను. ఇవ్విధంబునం బలుకు విదురునివలనం బౌరజనంబుల వాక్యంబుల నాకర్ణించి ధృతరాష్ట్రుండు సకలబంధుసహితంబుగ భయభ్రాంతుండును శోకమోహితుండునునై యుండునంతం గర్ణశకునిసమేతుండగు సుయోధనుండు ద్రోణునిం దమకు నాధారంబగు మహాద్వీపంబుగం దలంపుచు నిఖిలరాజ్యం బతనివశంబుగ నొసంగి శరణంబు నొందిన, నతండు దురభిమానశాలియగు రారాజును గర్ణదుశ్శాసనసౌబలులను దక్కనుంగల కురువృద్ధులను నుద్దేశించి, దేవకుమారులగు పాండవేయుల వధ్యులని భూసురశ్రేష్ఠులు పలుకుదురు, మీరు నన్ను శరణుచొచ్చుటవలన నాచేతనగునంతయు నాంబికేయప్రభృతులగు కౌరవులం బరిపాలించెద. పదంపడి దైవంబెగలండు. మీ కపటద్యూతంబువలన నిర్జితులైన కౌంతేయులు ధర్మపరిపాలనార్థంబుగం బండ్రెండుసంవత్సరంబులు వనంబున వసియించి తమపూనిక నెరవేర్చినవారగుచుం దనకు మహాభయంబుగలుగ వైరం బవలంబించి రాంగలరు. అదియునుంగాక ద్రుపదమహీపాలునకుం జెలికాండనై యుండియును రణరంగంబున నతనిరాజ్యభ్రంశంబు నొందించుటచే నతికుపితుండగుచుం గుంభసంభవుని వధింప సామర్థ్యంబు గలుగు తనియునిం బడయుదునని యగ్నినారాధింప నా వైశ్వానరుండు పావకజ్వాలాసమానదేహుండును, దేవప్రసాదలబ్ధుండును, మహాకార్ముకహస్తుండును, గవచధారియును, దివ్యాస్త్రవిదుండునునగు దృష్టద్యుమ్నుని, కృష్ణయనియెడు కుమారిని నొసంగె. అట్టి పురుషశ్రేష్ఠుండగు దృష్టద్యుమ్నుండు పాండవేయులకుం బరమమిత్రుండై యున్నవాండు. అతని ద్రోణహంత నీవేయని యెల్లవారునుం బలు

కుదురు. నేను మర్త్యుండ నగుట నామనంబున మహాభీతి జని యించి యున్నయది. ఈ ప్రాణంబు నీ యధీనంబు గావున నీవిరోధు లందారొ్ఁని యోపినమాత్రంబు పెనంగెద. నీకు నశుభసూచకం బగుకాలంబు వచ్చుచున్నయది. తొలుత విచారించినకార్య మటుండ నిండు. నీ యైశ్వర్యసుఖం బభ్రచ్ఛాయంగా దలంపుచు నింక నేనియును శ్రేయంబు రాంగలకార్యం బొనరింపుము. పాండవుల రావించి వారలతోడ మైత్రిసేసికొనుము. ఇది నీకు సమ్మతంబుగాదేని యనే కాధ్వరంబులుగావింపుచు వలయుసుఖంబులం బ్రవర్తిల్లుచు నుండుము. ఇంకం బదునాలవ సంవత్సరంబున నవశ్యంబును నీకు మహత్తరంబగు యుద్ధంబు రాంగలయది. నీకుం దోంచినతెఱంగున నుండుమని యి వ్విధంబునం బలుకు ధనురాచార్యునివచనంబు లాకర్ణించి ధృతరా ష్ట్రుం డీద్రోణునివాక్యంబు లెంతయొప్పిదంబులై యున్నయవి యని, నీవు శీఘ్రంబునంజని కౌంతేయులం దోడితెమ్మని, వారలు మఱలి రామని పలికిరేని రథంబులును, శస్త్రాస్త్రంబులును, వలయు ధన ధాన్యంబులును, భృత్యవర్గంబులును నొసంగి వారల సంతుష్టులం గావించిరమ్మని.

ఈకథ సభాపర్వంబున నూటపందొమ్మిదవ యధ్యాయము.

---

## అ ధ్యా య ము. 120

---

అనిన వైశంపాయనుండు, జనమేజయుం గనుంగొని మఱియు నిట్లను. అత్తెఱంగున ద్యూతపరాజితులైన కౌంతేయులు వనంబున కుం జనినయనంతరంబ చింతాక్రాంతుండై నిట్టూర్పులు నిగుడిం పుచుం జంచలహృదయుండై యుండెడు ధృతరాష్ట్రు నుద్దేశించి, సం

జయుండు, కౌరవేంద్రా, పాండవేయుల మహారణ్యంబునకుం బనిచి నిఖిలైశ్వర్యసమేతంబగు రాజ్యంబు గైకొనియును నీకుం జింతింపనేటి కనిన, నతండు సమరదుర్జయులును, సుహృత్సమేతులును, నతిరథ శ్రేష్ఠులును నగు పాండవులతోడ విరోధంబుగలిగియును దుఃఖింపక యుండ వశంబగునె యనిన, నతం డాంబికేయుచిం గనుంగొని, భీష్మ ద్రోణవిదురాదులు వలదు వలదని నివారించినను నీ నందనుండగు దుర్యోధనుండు లజ్జావిహీనుండగుచు సూతపుత్రుండగు ప్రాతిగామిం బనిచి ధర్మచారిణియును బాండవప్రియభార్యయునునగు ద్రౌపదీ దేవిని సభామధ్యంబునకుం గొనితెచ్చి యవ్విధంబున భంగపరచెం గాన నింక సకలజనవినాశనకారణంబగు సమరంబు రాకమానునె యని మఱియును దైవంబెవ్వని జెరుపవలయునని తలంచె నతనికి బుద్ధివైపరీత్యంబు గల్పించు, అతం డకృత్యంబులె యాచరించు, తనబుద్ధి కలంగినయప్పుడ వినాశంను వాటిల్లు. అట్టి వినాశకాలంబున ననీతి నీతియనియును, ననర్థం బర్థంబనియునుదోచు. వేఱొండుదోపదు. కాలుం డివ్విధంబున విపరీతబుద్ధిం బుట్టించుటయె కాక యెవ్వరినేనియు దానె దండపాణియై యరుగుదెంచి సంహరించునె! అయోనిజయును, సౌందర్యవతియును, మహాకులప్రసూతయును, గంభీరహృదయయును, సర్వధర్మవిధిజ్ఞయును, యశస్వినియును, వనితారత్నంబును, నేకవస్త్ర ధారిణియునునగు పాంచాలి ఋతుమతియై యుండెడు సమయం బునం గచబంధంబువట్టి కురరీవిహంగంబు చందంబున మొఱయిడుచు నుండ సభామధ్యంబునకు నీడ్చికొనితెచ్చె. దుర్ద్యూతవిశారదుండగు నీకుమారుండు దక్క వేఱొక్కరిట్టి కృత్యంబులాచరింతురె? ఐశ్వ ర్యంబును, రాజ్యంబును, భోగంబులును, వస్త్రంబులును, బరిజనంబు లును, నపహరించి కౌంతేయుల దాసులం గావించికొనిన, వారు పరా క్రమవంతులయ్యును ధర్మపాశబద్ధులై యశక్తుల విధంబున నూరక

యున్న సమయంబున, దుఃఖా_ర్తయగు యాజ్ఞసేనిని నీక్షణము శ్వాసను లందఱును వినుచునుండ ననేకపరుషభాషణంబు లాడిరి. పతివ్రతా రత్నం బగు నా పాంచాల రాజనందనకోపదృష్టిం గనుంగొనెనేని మెల్ల వారలును భస్మంబై పోవరె? ఇట్టియనర్థం బొనర్చుటవలన నతి భయంకరంబగు సంకులసమరంబు వాటిల్లంగలయది. యనిన, ధృత రాష్ట్రుం డతని నాలోకించి సంజయా! మాకుం బాండవేయులని యును దుర్యోధనాదులనియును భేదంబున్నదియె? ద్రుపదరాజ తనూజ నీసభామధ్యంబునకుం దెచ్చినప్పుడు గాంధారియును గోడం డ్రును మహాదుఃఖంబున రోదనంబుగావించిరి. అయ్యవసరంబున వినా శసూచకంబులగు నిర్ఘాతంబులును, నుల్కలునుం బడుటయును, బర్వ కాలంబుగాని సమయంబున రాహువు మార్తాండమండలంబుగ్రసిం చుటయును, రథశాలలు తెసంతనెసకల ప్రాణిభయకారణంబుగ మండు టయును, గౌరవులకు నశుభంబుగ ధ్వజంబులు వడుటయును, దుర్యో ధనుని యగ్నిహోత్రగృహంబున జంబుకంబులు గూయుటయును, నానాదిగంతరంబుల రాసభారావంబులెసంగుటయును, మొదలగు మహోత్పాతంబులు జనించినయెడ భీష్మద్రోణవిదురకృపసంజయ సోమదత్తబాహ్లీకప్రభృతులు నా సన్నిధానంబున కరుగుదెంచినతటి నింతయును విదురుండు నాకెఱింగింప నేను ద్రౌపదిం బిలిచి నీమనో భీష్టంబగు వరంబొసంగెద, కైకొను మనినం దేజోవిరాజమానులును, రథాదిసాధనసమేతులును నగు తనవల్లభులకు దాసభావంబు లేకుండ వలయునని వేండిన నేనును నట్లనెయనుజ్ఞనొసంగితి. ధర్మజ్ఞుండును మహా ప్రాజ్ఞుండునునగు విదురుండు నన్ను నుద్దేశించి లక్ష్మీసమానయును బాంచాలరాజనందనయునునగు ద్రౌపదీదేవిని సభకు నీడ్చికొని వచ్చుటవలన నింతటితోన మీాయైశ్వర్యప్రాణంబులకు హానివాటిల్లె. ఈయాజ్ఞసేనిని భంగపరచుటకుం గోపోద్దీపితులగు పాండవేయులును,

ధనుర్ధరాగ్రగణ్యులగు వృష్ణివరులును, తేజోధురంధరులగు పాంచాలులును, సత్యసంధుండగు కృష్ణదేవుండును, సహింపంజాలుదురె? కావున వాసుదేవరక్షితుండై పాంచాలరాజసమేతంబుగ నర్జునుండును, వారల మధ్యంబునం గృతాంతుండు కాలదండంబు ద్రిప్పు చందంబున గదాదండంబు ద్రిప్పుచు మహాబలశాలియగు భీమసేనుండును, నవశ్యంబు రాంగలరు. బలపరాక్రమ శౌర్యశాలి యగు ధనంజయుని గాండీవ నిర్ఘోషంబు వినియును బవననందనుండగు భీముని గదావేగంబునుం గనుంగొనియును నీకౌరవరాజులెల్లను నిలువగలరే? కావున బలవంతులగు పాండునందనులతోడ నింకనేనియును విరోధింపక సంధి వాటించుటయె మేలు. తొలుత మహాప్రతాపశాలియగు జరాసంధునిమారుతాత్మజుండు బాహుయుద్ధంబునం బరిమార్చుటయు నీవెఱుంగవె? కావున నట్టిపాండవేయులతోడ మైత్రిగావించుట యుభయపక్షంబులకును మేలగు నని యివ్విధంబున ధర్మార్థసహితంబుగం బల్కక నేను పుత్రస్నేహమోహితుండనై విననైతిననియెనని వైశంపాయనుండు జనమేజయున కెఱింగించె.

ఈకథ సభాపర్వంబున నూటయిరువదవయధ్యాయము.



ఖాండవదహనానంతరంబున మయుండు కృష్ణార్జునుల సన్నిధానంబునకు వచ్చుటయును, గృష్ణుండు ద్వారకకుం బోవుటయును, మయుండు దివ్యసభ నిర్మించి కౌంతేయులకుం గొనితెచ్చి యిచ్చుటయును, సభాభవనంబునం గొలువున్న కౌంతేయుల సమీపంబునకు నిఖిలమహీపతులును ఋషీశ్వరులును జనుదెంచుటయును, నారదా

గమనంబును, రాజనీతి ప్రశంసయును, లోకపాలక సభావర్ణనంబును, హరిశ్చంద్ర మాహాత్మ్యకథనంబును, రాజసూయాభినివేశనంబును, కృష్ణాగమనంబును, రాజవంశోత్పత్తియు, జరాసంధవైభవంబును, నతనిపరాక్రమ వర్ణనంబును, నర్జునుండు తనశౌర్యంబు ధర్మజున కెఱింగించుటయును, జరాసంధోత్పత్తిప్రకారంబును, జండకౌశికుం డతనికి వరంబొసంగుటయును, హంసడింభక నిధనంబును, కృష్ణభీమార్జునులు జరాసంధ వధార్థంబుగ వెడలుటయును, గౌతమోపాఖ్యానంబును, మగధపుర ప్రవేశంబును, భీమజరాసంధుల మల్లయుద్ధారంభంబును, కృష్ణజరాసంధులకు విరోధంబు వాటిల్లిన తెఱంగును, గంసవృత్తాంతంబును, కృష్ణచరిత్రంబును, భీమజరాసంధుల బాహాయుద్ధంబును, జరాసంధ మరణంబును, నతని కుమారునకు బట్టంబు గట్టుటయును, రాజమోక్షణంబును, నింద్రప్రస్థపుర ప్రవేశంబును, కృష్ణుండు ద్వారవతికిం బోవుటయును, రాజసూయారంభంబును, భీమార్జున నకుల సహదేవుల దిగ్విజయంబును, నిఖిలధనరత్న కాంచన ప్రాప్తియును, కృష్ణాగమనంబును, రాజసూయాధ్వరంబును, నానమయంబున నానా మహీపాలకులు కానుకలు దెచ్చి యొసంగుటయును, కృష్ణునకు నగ్రపూజ గావించుటయును, శిశుపాలుండు నిందించుటయును, సహదేవకోపంబును, భీష్ముండు ధర్మనందనునకు నారాయణుని మహత్త్వం బెఱింగించుటయును, బౌష్కరావతారంబును, జగదుత్పత్తిప్రకారంబును, మధుకైటభ సంహారంబును, వరాహావతారంబును నృసింహావిర్భావంబును, వామనావతారంబును, దత్తాత్రేయావిర్భావంబును, గార్తవీర్యార్జున చరిత్రంబును, బరశురాము ప్రాదుర్భావంబును, రామావతారవర్ణనంబును, దారకాసురయుద్ధంబును, బ్రజాభార పీడితయగు భూమినారాయణుని సన్నిధానంబునకేంగి తనయార్తియెఱింగించుటయును, బల

రామావిర్భావంబును, కృష్ణావతారంబును, దేవతలెల్ల రాజులై మహీతలంబునం బుట్టుటయును, కృష్ణుని దివ్యచరిత్రంబులును, కంస సంహారంబును, దేవేంద్రాగమనంబును, నరకాసుర వధయును, కృష్ణుం డుబదియాఱువేవురుకన్యకలం బరిణయంబగుటయును, ద్వారకావర్ణ నంబును, కృష్ణవైభవ ప్రశంసనంబును, బాణాసురుని గర్వభంగంబు గావించుటయును, భీష్మునిపై శిశుపాల ప్రముఖులగు రాజన్యులు కోపించుటయును, శిశుపాలుండు రాజహంసోపాఖ్యానం బెఱింగించుట యును, భీమసేనుని కోపంబును, శిశుపాలునిజన్మప్రకారంబును, కృష్ణుండు కోపించుటయును, యుద్ధనిపుణంబులును, కృష్ణశిశుపాలుల ద్వంద్వ యుద్ధంబును, శిశుపాలవధయును, రాజసూయ సమాప్తియును, నిఖిల మహీపాలకులు స్వదేశంబునకుం దరలుటయు, కృష్ణుండు ద్వారకకుం బోవుటయును, సభాభవనంబున దుర్యోధనుండు భంగపడుటకు భీమ సేనాదులు హాస్యంబు గావించుటయును, వారలవైభవంబులయందు విషాదంబు జెందుటయును, శకుని సాంత్వవాదంబు గావించుటయును, ద్యూతం బాడవలయునని ధృతరాష్ట్రున కెఱింగించుటయును, మరి యును దుర్యోధనుండు రాజసూయ మహాత్త్వంబును బాండవుల మహావైభవంబును ధృతరాష్ట్రునకుం దెలుపుటయును, నతండు జూదంబాడ ధర్మజు పిలువుమని విదురునకుం జెప్పుటయు, విదురు నీతియును, విధిప్రేరితుండగు ధృతరాష్ట్రుండు విదురునిం బనిచి పాండవుల రావించుటయును, ద్యూతారంభంబును, నా సమయంబున ధర్మంబెఱింగించుటయును, ద్యూతసమాప్తియును, ద్రౌపదీ భంగం బును, వస్త్రాపహరణంబును, భీమార్జునుల కోపంబున కౌరవులయందలి ప్రతిగృహంబున దుశ్శకునంబులగుటయును, ధృతరాష్ట్రుండు ద్రౌప దికి వరంబొసంగుటయును, బాండవులు దాసభావవిముక్తులై నిజ

పురంబునకుం బ్రయాణంబుజేయుటయు, దుర్యోధనుండు ధృతరాష్ట్రునితోడ నర్జునుని ప్రతాపంబు సవిస్తరంబుగ నెఱింగించుటయును, బునర్ద్యూతంబును, పాండవులకు జూదంబునందు జెప్పిన వాక్యంబు లెఱింగించుటయును, గౌంతేయుల వనవాస గమనంబును, పౌరజనులు దుఃఖించుటయును, నారదుండు కౌరవ వినాశంబెఱింగి సభయందు జెప్పుటయు, ధార్తరాష్ట్రులు భయంపడి ద్రోణుని శరణుచొచ్చుటయును, నతండర్జున ప్రతాపంబెఱింగించుటయును, సంజయునీతియును నను కథలవలనం బొలుపారుచు నూటయిరువదధ్యాయంబులుగల సభాపర్వంబువినినట్టి మహానుభావు లాయురారోగ్యైశ్వర్యంబులును, నపరిమితభోగానుభవంబును, బుత్రపౌత్రాభివృద్ధియునుం గలిగి భూతలంబునం బెక్కుహాయనంబులు సుఖంబున నుండుదురనుటయు.

*　*　*　*

సీ. వెయ్యిన్నియాఱు నూటమేంబదియు రెంటి
　మీఁదటి శకవర్ష మొలమినడుచు
వరుస సాధారణ వత్సరంబున మాఖ
　శుద్ధపంచమియందు శుభదినం
బునం దనరి దళవాయి దొడ్డేంద్రు
　సుతుండు వీరేంద్రుండు సుకవినుతుండు
వచనభారతమందు వైఖరిని సభా
　పర్వంబు రచియించె నింపుమీర॥

గీ. ధరణిమీఁదను చంద్రార్కతారకముగ
　వెలయుంగావుత లోకవిఖ్యాతిగాను

సరసు లెల్లను వేడుకం జదువు వేళం
దప్పు లున్నను దిద్దండి దయనుమీర॥

మ. వివిధక్రీడానిరూఢాలస న్మానస
పద్మపద్మహిత వేణీహల్లకేంద్రాది ది
క్పతిచూడామణి జాలజాల వర రాడ్గంధర్వసం
స్తుత మీనాద్యవతార తారకవిధుర్యోరత్న నేత్రద్వయా॥

క. నందకుమారక మునిరాట్
బృందారక విమలహృదయ పీఠనివాసా
నంద ధురంధర వాసవ
నందన సారధ్యకల్పనాసితరథ్యా॥

స్రగ్విణి. మిత్రవిందాకుచామేయకస్తూరికా
పత్రచిహ్నద్విరేఫ స్ఫురత్కౌస్తుభా
కృత్రిమాంభోరుహాక్ష ప్తిభా భాగుర
శ్చిత్రకాసారకా సేవకోద్ధారకా ॥

గద్య: ఇది శ్రీరామ చంద్రచరణారవింద సేవాభినందనవరప్రసాదాసాదిత గీర్వాణాంధ్రకర్ణాటకాది నానాభాషాకావ్యరచనాచతుర, శ్రీమన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర రాజ మార్తాండ ప్రౌఢప్రతాపాప్రతిమ వీరనరపతిబిరుదెంతెంబరగండబిరుదాంకిత శంఖచక్రమకరమత్స్యహనూమద్గరుడగండభేరుండ సింహశరభశార్దూలాది నానావిధ దేవార్హధ్వజాంకిత, యాదవవంశాబ్ధితిలక, అంగవంగకళింగకాశ్మీరలాటమరాటద్రావిడాది నానాదేశాధీశ్వర కిరీటకోటిసంఘటనప్రస్తరత్నపరాగపరాగితనిజభవనద్వారాసక్తానేక భూపాలఫాలతలఘటి

తాంజలి పుంజరంజితారవిందాకరాయమాణ సభాస్థానస్థరత్నసింహాసనాధిరూఢ నానాదివిద్వదభీష్టవరప్రదాన రాజచిక దేవరాజకరుణాప్రాప్త కర్ణాట రాజ్యలక్ష్మీనృత్యరంగాయమాన, శ్రీరంగపట్టణపరిపాలనార్థాదృతసైన్యాధిపత్యనిర్వాహక, మహారాష్ట్రిమదేభ పంచానన, కెళదివంశదావాహాస, మధురానాథమర్దన, జయజయ ఘాటీశిరఃకంతుకక్రీడన, వసంతరాయనాసాకృంతన, నిమ్మోజీసమూలోన్మూలన, దాదోజీదండనప్రతాపశీలశిఖరలపాలెరాయవిదళన, అంతర్బాహ్యాదిశత్రుసంఘస్యమేఘజంఝానిల, పరరాజాంధకారవిదళన, దినరాజదళవాయిదొడ్డరాజతనూజ, యాచకసురభూజ, భుజబలాటోపపరాజితాతిరాజన్యసమర్పితానేకరత్నరాశీకృతధనకనకవస్తువాహనసంతోషితాఖిలభూసురాశీర్వాదానువర్ధిత పుత్రపౌత్రాదివంశాభివృద్ధి విరాజమాన, కళువెవంశాబ్ధిరాకానిశాకరాశ్వలాయన సూత్రపరమపవిత్రభారద్వాజగోత్రపరిపాలన, ఆసేతుసితాచలమధ్యవర్తికాశీప్రభృతిపుణ్యక్షేత్రనిత్యాన్నదానవినోదదానశూరత్రాధీశ్వరపబిన్నక్షేత్రగ్రహారామాది సంతోషిత కవిరాజ వీరరాజ ప్రణీతంబైన శ్రీమన్మహాభారతవచనకావ్యంబునందు సభాపర్వము సంపూర్ణము.

గద్య: ఇది శ్రీనందనందన చరణారవిందసేవానుభావభావితసార సారస్వతశాశ్వతైశ్వర్యధుర్య, మేరునగసమానధైర్య, సమాసాదితవిమత వాహినీ సమాక్రాంత దక్షిణసింహాసనసముద్ధారణాధురంధర, విరోధి నృపతిరాజధానీసమానీతగంధసింధుర, గోసహస్రకనకతులాది మహాదాన, నానావిధమాననిస్తంద్రకీర్తిచంద్రికాధవళిత దిశాంతరాళగడి మన్నియపిఫాల, సేతుసితాచలమధ్యభూతలాయాతక, విబుధచాతక వ్రాతకౌతుకహేతు కనకధారాభిషేక, వినపర్జన్యవినుతసౌజన్య నిఖిల

పురాణేతిహాసకథానుసంధాన, సమింధాన నిరుపమాన విజ్ఞాన,సాంద్ర వచనమాధురీగరిమాధరీకృతసమాన,కవేర కన్యానదతీర ప్రతిష్ఠాపిత, నిస్తులదస్తుసమగ్రానేకాగ్రహారసంతోషిత, మనీషి జనసంతతాశీర్వాది ముదిత సముదగ్రవైభవ, చంద్రగిరి కృష్ణనృపతనూభవ, హనుమద్ధ్వజ బిరుదప్రకాశిత, నిజభుజాబల భాగమాంబాగర్భ శుక్తిముక్తాఫల సౌందర్యనిర్జితనలకూబరనలజయంత, తుపాకుల యనంతవసుమతీకాంత ప్రణీతంబైన శ్రీ మహాభారత వచనకావ్యంబునందు సభాపర్వము

సంపూర్ణము

శ్రీ శ్రీ శ్రీ

---

# తప్పొప్పులు

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 14 | కాక | గాక |
| 2 | 17 | ప్రసా | ప్రాసా |
| 5 | 18 | పస్థ | ప్రస్థ |
| 7 | 3 | విదం | విధం |
| 7 | 11 | లాన | లాస |
| 7 | 14 | బాస | బాన |
| 10 | 18 | సావర్లి | సావర్ణి |
| 19 | 25 | సిద్థి | సిద్ధి |
| 20 | 8 | మనహాః | మనః |
| 20 | 21 | విశారు | విశార |
| 20 | 22 | మోహా | మోహో |
| 24 | 8 | ధైర్ఘ్య | దైర్ఘ్య |
| 26 | 9 | యాహ్ణో | యాహ్లో |
| 27 | 12 | నగరుం | సగరుం |
| 27 | 16 | వృష్ఠు | పృష్ఠు |
| 30 | 1 | వేష్ఠి | వేష్టి |
| 30 | 20 | వసు | వను |
| 33 | 19 | భావ | బావ |
| 38 | 3 | బితామ | బితా |
| 40 | 13 | వీరలిద్దఱికంటె విశేషంబగు | విశేషంబగు |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 42 | 11 | బృథ | భృథ |
| 43 | 24 | లబుం | బులం |
| 44 | 4 | బంథు | బంధు |
| 47 | 18 | సస్త్రా | శస్త్రా |
| 48 | 9 | గిరిప్ర | గిరివ్ర |
| 49 | 9 | సనా | ననా |
| 51 | 21 | మాంథా | మాంధా |
| 52 | 2 | షిక్కులై | షిక్తులై |
| 52 | 3 | మహామా | మహిమా |
| 64 | 17 | నుండు, | నుండు. |
| 66 | 13 | వాండను | వాండును |
| 69 | 19 | శ్రంబు | శ్రమంబు |
| 75 | 15 | నీవలె | నీవు |
| 76 | 11 | బుంనం | బునం |
| 76 | 13 | స్దాణు | స్థాణు |
| 77 | 17 | నిరువృ | నిర్వృ |
| 77 | 22 | పాయు | టాయు |
| 78 | 6 | గ్రేసు | గ్రేస |
| 78 | 7 | తోర్లు | తోలు |
| 82 | 23 | ప్రిస్థ | ప్రస్థ |
| 33 | 2 | ధ్యాంము | ధ్యాంబు |
| 83 | 4 | స్వర్ల | స్వర్గ |
| 87 | 19 | నాథుఅగు | నాథులగు |
| 89 | 11 | మహీ | మహి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 90 | 4 | ద్రప్వా | ద్రత్వా |
| 90 | 6 | సుభో | సుఖో |
| 92 | 4 | సిద్ధి | సిది |
| 96 | 11 | రాప్రా | రాష్ట్రా |
| 98 | 24 | యారం | నీయారం |
| 99 | 18 | గావింపఁ | గావింపం |
| 104 | 7 | దక్షిణ | దక్షిణ |
| 106 | 3 | చున్నా | చున్న |
| 108 | 19 | సిద్ధు | సిద్ధు |
| 111 | 3 | పశ్చిమ | పశ్చిమ |
| 112 | 6 | రాధ్య | రాధ్య |
| 113 | 1 | కరే | కక |
| 115 | 12 | రథం | రధం |
| 115 | 14 | సిది | సిద్ధి |
| 124 | 4 | పుందీం | పుదీం |
| 126 | 7 | వృ | వృద్ధు |
| 128 | 10 | నన్వ్వం | నన్నుం |
| 128 | 12 | రించె | సించె |
| 128 | 17 | బంధున | బంధున |
| 130 | 18 | మేఱు | మేరు |
| 135 | 13 | లేకి | లేకీ |
| 138 | 3 | వేద్రు | వేంద్రు |

# తప్పొప్పులు

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 138 | 4 | గధ | గంధ |
| 138 | 23 | లగు | లగుచు |
| 139 | 6 | లునుఁ న | లును న |
| 139 | 7 | నై న | నేన |
| 140 | 5 | సుద | సంద |
| 140 | 12 | ణాయం | ణామం |
| 141 | 3 | లొక్కి | లొక్క |
| 142 | 14 | బువ | బున |
| 146 | 16 | వంతు | హంతు |
| 147 | 21 | మర్ధు | మర్థు |
| 149 | 7 | రావణ | రావణా |
| 151 | 1 | రణంబొ | రణంబు |
| 151 | 12 | గదాం | గదా |
| 153 | 9 | చరని | చరచి |
| 156 | 2 | హార్ధం | హార్థం |
| 157 | 25 | లూఖ్య | లూఖ |
| 158 | 6 | గ్రీవు | గ్రేవు |
| 159 | 22 | తార్ధ | తార్థ |
| 160 | 3 | శేష్మ | శ్లేష్మ |
| 160 | 4 | గీడం | గ్రీడం |
| 160 | 5 | గంణం | గణం |
| 160 | 10 | స్నా నం | సాన్నం |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 162 | 14 | రథం | రథం |
| 164 | 12 | మొన | లోన |
| 165 | 16 | ప్రాగో | ప్రాగ్జ్యో |
| 167 | 18 | మోహి | లోహి |
| 168 | 18 | భావ | భవ |
| 169 | 14 | వంతా | దంతా |
| 169 | 19 | వైడుక | వేడుక |
| 171 | 8 | రాగాచిత్త | రాగాయత్తచిత్త |
| 174 | 7 | నగాథ | నగాధ |
| 175 | 17 | నర్వ | సర్వ |
| 177 | 24 | బిల్వ క | బిల్వక |
| 178 | 1 | వాలు కా | వాలుకా |
| 180 | 22 | ధ్వర్యం | ధ్వరం |
| 181 | 5 | కుధాస్త | కుధాస్త్రీ |
| 184 | 1 | రాగ్బ | రాగ్ర |
| 184 | 2 | ఖార్ణ | ఖార్వా |
| 186 | 3 | నిశూభ | నిశుంభ |
| 189 | 20 | గావింపుచు | గావించు |
| 194 | 8 | చే నీకు హః | చే హః |
| 195 | 1 | నధర్మంబు | ధర్మంబు |
| 197 | 16 | దమ ఘోషు | దమఘోషు |
| 198 | 11 | దమ ఘోష | దమఘోష |

# తప్పొప్పులు

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 199 | 15 | తిమి | తివి |
| 200 | 18 | కంబు | కంబులు |
| 201 | 18 | ప్ర  రీ | ప్రతాపధురీ |
| 202 | 8 | రధం | రథం |
| 202 | 9 | దేజం | తేజం |
| 202 | 9 | నవెళ | నవళ |
| 202 | 10 | లాకర్ణి | లాచరి |
| 203 | 18 | నిచ్ఛయుం | నిచ్ఛయిం |
| 205 | 22 | గనుగా | గనుంగా |
| 206 | 22 | ఆకాల | అకాల |
| 210 | 14 | ద్వంద | ద్వంద్వ |
| 211 | 15 | జర్ఘ | జర్ఝ |
| 215 | 5 | సమర్ధు | సమర్థు |
| 215 | 22 | సంజంద్రు | సయింద్రు |
| 217 | 1 | బూచింజి | బూజించి |
| 218 | 5 | రకుల ఖిన్న | రకు లఖిన్న |
| 218 | 6 | సుబ | సుభ |
| 218 | 13 | నులుకై దం | నులు కైదం |
| 218 | 16 | వాస | వాసు |
| 221 | 18 | యం దప్ర | యంద ప్ర |
| 222 | 12 | మహి | మహీ |
| 224 | 20 | ధన్వ దును | ధన్వందును. |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 228 | 22 | కులై | కుల |
| 228 | 25 | టంబులం | టంకంబులం |
| 231 | 15 | గులం | గుల |
| 239 | 19 | వ్వాఘ్ర | వ్యాఘ్ర |
| 243 | 3 | యెసంగె | యొసంగె |
| 244 | 18 | బృధ | బృథ |
| 265 | 9 | డగు నీ | డగు, నీ |
| 268 | 14 | కర్మంబు కు | కర్మంబులకు |
| 268 | 15 | యోగ్య డు | యోగ్యుండు |
| 268 | 21 | హితుండుగాక | హితుండు, గాక |
| 277 | 5 | వేచు | వెరచు |
| 278 | 17 | వారు | వారు. |
| 284 | 8 | నిటి | నిట్టి |
| 284 | 8 | రవ థ ం | రవ స్థం |
| 288 | 8 | నేయని | నేయని, |
| 288 | 9 | మున్న, | మున్న |
| 290 | 24 | సత్యసధు | సత్యసంధు |
| 291 | 15 | పిమ | సమ |
| 292 | 19 | కదళీ | కదళి |
| 296 | 1 | శార్యాలో | శౌర్యాటో |
| 297 | 25 | ర్యామో | ర్యాటో |
| 303 | 9 | ఈ | నీ |

| పుట. | పం_క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 305 | 3 | పెట్టి | పెట్ట |
| 305 | 15 | నెఱింగించితివి | నెఱింగించి, |
| 308 | 16 | ణుల | ణులు |
| 309 | 15 | నుర్థ | నఃర్ధ |
| 311 | 3 | వైశ్యా | వైశ్వా |
| 311 | 10 | నకద | నంద |
| 311 | 15 | లగు | లగుచు |
| 312 | 12 | ఘ్యులు పరి | ఘ్యులుపరి |
| 312 | 15 | మాలికకా | మాలి కకా |
| 312 | 17 | విరా | వీరా |
| 314 | 23 | యొట్ట | యొట్టి |
| 316 | 5 | మహూ | మహో |
| 316 | 14 | ఝుళి | ఝుళి |
| 318 | 16 | నంద | నందన |
| 319 | 3 | వాడుసభా | వాండు, సభా |
| 320 | 7 | దివనం | దేవనం |
| 320 | 20 | జయింని | జయించి |
| 322 | 8 | వచనా | వచన |
| 328 | 13 | జనంబులు బాష్పాకుల లోచనులగుచుహాహా | జనంబులు హాహా |
| 332 | 7 | భేదం | ఖేదం |
| 333 | 4 | కర్షూలె | కర్షూలే |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 333 | 6 | తంబె | తంబే |
| 336 | 17 | యరిగె రజో | యరిగె. పాంచాలి రజో |
| 336 | 22 | తురు | తును |
| 338 | 6 | పించునా | పించుచు |
| 339 | 10 | వేయుల వధ్యు | వేయు లవధ్యు |
| 339 | 19 | తని | తన |
| 341 | 13 | శంను | శంబు |
| 342 | 1 | నీక ర్ణదు | నీకర్ణదు |

# SUPPLEMENTAL NOTE.

Since writing my introduction, the following letter has been received by me, from the Director of Archaeological Researches, Mysore, through the Mysore Government Palace Office:—

* * *

Letter No. 41 dated the 13th July 1928 from the Director of Archæological Researches in Mysore, Mysore.

With reference to your letter No. 99 dated the 11th instant, I have the honour to furnish the following information concerning Viraraja referred to in the enclosure of your letter:—

The information has been gathered from the following works:—

(1) Nanjarâjayaśassamullâsa—a champu work in Sanskrit by poet Nilakantha.

(2) Nanjarâjayaśobhûshana—a work on rhetoric in Sanskrit by the same author.

(3) Epigraphica Carnataka Vol. 3.

(4) History of Mysore Kings in Kannada by Mr. Ramakrishna Rao, Part I etc.

We learn from the above that Viraraja belonged to a family of chiefs who ruled over Kalale, a village about 4 miles from Nanjangud in Mysore District. Viraraja's parents were Doddaya and Gauramma. Doddaya was also the *Dalavay* or Commander-in-Chief of Chikkadevaraja Vodeyar, King of Mysore (1673–1704). Viraraja also became *Dalavay* in the reign of Kanthirava Vodeyar II (1704–1714). He had two sons Devaraja and Nanjaraja, the former of whom succeeded his

father as dalavay in 1724 A.D., during the reign of Dodda Krishnaraja Vodeyar (1714-1732) and the latter became the Sarvadhikari in the same reign.

The village Kalale of which Vîraraja was ruler is called in Sanskrit Works *Karîra* which means 'tender sprout of bamboo' called Kalale in Kannada language. The word Kaluve mentioned by Mr. N. K. Venkatesam in his letter seems to be a mistake for Kalale as no other Viraraja at the period is heard of as having been a general of the Mysore King.

The Dalavays named above are described as remarkable for their bravery, patronage of learning, and for literary skill and devotion to their king and country. Viraraja is the author of two extensive works on medicine in Kannada, Sakalasamhitāsāra Samgraha and Vidyasamhitâsârârnava, and of a commentary or tika in Kannada on the Bhagavadgitha, and in the name of his son Nanjaraja there are numerous works both in Sanskrit and Kannada. Both father and son seem to have taken great interest both in medical and other sciences.

* * *

I had, therefore, to look into the matter more carefully and on perusing Palm Leaf No. 93 of the Bhishma Parva manuscript in my possession, I found that in the Gadya at the end of the Bhagavad Gita Asvāsa, the house name of the author read more like *Kalule* (ಕಲುಲೆ) than *Kaluve* (ಕಲುವೆ). Thereupon I made a reference to the Librarian of the Government Oriental Manuscripts Library, Madras, regarding the point and he states in his R. C. No. 440/28 dated 7th August 1928:—

* * *

In the original manuscript the name of the author is written as Vîrarāja of Kalule, and it may be read as Kaluve also. Accordingly the scribe who transcribed the work on paper has written the family name as Kaluve. But the correct

family name might be Kalule. As it is stated in the colophon of the paper manuscript in the library that the house name of the author is Kaluve, this name is given in the Descriptive Catalogue. (Triennial Catalogue for 1910—13. Part 3. Telugu. R. 115, P. 349—353).

* * *

I also understand that in the village called *Kalule* in the manuscripts and known as *Kalale* at present, there is a temple dedicated to Sri Krishna, the Flute-Lord (the Kanarese word for flute being కొళలు) and that a beautiful image of Venugopala is at Seringapatam, which is said to be the exact likeness of the image at Kalale. It is quite in the fitness of things that the author of the Andhra Vachana Bharata, Kalule Veeraraja should have addressed all his dedicatory songs, of which I have now been able to collect eight from the Adi, Sabha and Bhishma Parva manuscripts to God Gopāla, the tutelary Deity of the village and the Deity most near the heart of the author, who was himself a Yadava by birth.

I, therefore, request the readers to read the name of the author as *Kalule Veeraraja* and not as Kaluve Veeraraja.

* * *

I feel proud for the privilege given to me to associate the revered name of His Highness the Maharaja of Mysore, Sir Sri Krishna Raja Wadiyar Bahadur, G. C. S. I., G. B. E., with this master-piece Telugu Prose work of a former Commander-in-chief of Mysore, Kalule Veeraraja.

RAJAHMUNDRY,
8—8—1928.

N. K. VENKATESAM.